# ఆత్మ సాక్షాత్కారము



డా॥ గన్ను వెంకటేశ్వర్లు
M.D.



# ఆత్మ సాక్షాత్కారము

నా గురుదేవులు, సర్వస్వము అయిన
ఏడుకొండల శ్రీ వేంకటేశ్వర స్వామి,
నా ఇష్టదైవము అయిన ఆదిదైవము శ్రీ పరమేశ్వరుడు
మరియు శ్రీ వీరభద్రస్వామి ప్రేరణ,
కరుణా కటాక్షములచే ఈ పుస్తకమును వ్రాయగలిగిన నేను,
నా స్వాములందరికి పాదాభివందనములు
సమర్పించుచున్నాను.

మాయ, అజ్ఞానాంధకారములలో పడి,
అసహాయ స్థితిలో కొట్టుకులాడుచున్న నన్ను ప్రేరేపించి,
ఆశీర్వదించి, ఆత్మజ్ఞానమును బోధించి అడుగడుగున
ఆయన కరుణా కటాక్షములతో నన్ను ఉత్తేజపరచి,
ఈ ఆత్మ సాక్షాత్కారమనబడు గ్రంథమును వ్రాయు స్థితికి
ఎదిగేలా తీర్చిదిద్దిన నా గురుదేవులు అయిన

**శ్రీ శ్రీనివాసులు యొక్క**
**పాద పద్మములకే**

ఈ గ్రంథము అంకితము చేయుచున్నాను.

ఆ హరిహరుల కృపచే సకల జీవకోటి తరించుదురుగాక.

**మనుష్యాణం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే**
**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః**

వేలమంది మనుష్యులలో ఏ ఒక్కడో సిద్ధికొరకు యత్నించును. అలా యత్నించెడి వేలమందిలో ఎవడో ఒకడు నన్ను యదార్థముగా తెలిసికొనుచున్నాడు అని స్వయముగా శ్రీ గీతాచార్యుడే అర్జునునకు గీతయందు బోధించిరి.

స్వయముగా ఈశ్వరుడే వచ్చి నీకేమి కావలయును, నేను కావలయునా లేక పేరు ప్రతిష్ఠలు, ఆయురారోగ్య భోగభాగ్యములు కలిగి, కళత్ర–పుత్ర, పౌత్రులతోడి నూరేండ్ల సుఖజీవనము కావలెనా అని అడిగిన– కోటికెవడో ఒకడు తప్ప అందరును రెండవ వరమునే మరియే విచారణ లేకుండ పరమాసక్తితో ప్రార్థింతురు.

ఆహా! ఇదియే కదా మానవుని అజ్ఞానము. ఇది అంతయు అవిద్యా ప్రభావము. నారాయణుడు సృష్టిలో ఇంద్రియములను లోపభూయిష్టముగా సృష్టించెను. ఆ మాయా ప్రభావము చేత మానవుడు చర్మ చక్షువులకు కనిపించు, ఇంద్రియభోగములలోనే సర్వము కలదని, అదియే తన గమ్యమని తలంచి, చివరకు భ్రష్టుడై జనన మరణ చక్రములలో బడి పతనమగుచున్నాడు. ఇదియే ఇంద్రియ జీవనము, దాని పర్యవసానము.

ఇంద్రియ జీవనములో గల ఇంద్రియ భోగములు నీచ నికృష్టమై మోక్షమార్గమునకు అడ్డు తలుగుచున్నవి.

పూర్వ జన్మార్జిత పుణ్యవశముననను, దైవానుగ్రహము వలనను దుర్లభమగు మనుష్య జన్మము ప్రాప్తించి, పురుష శరీరమును దాల్చి, సాంగ వేదాసారంగుండయ్యును, ఏ మూఢుడు తన ముక్తి కొరకు ప్రయత్నింపక, అనిత్యమగు పుత్రకళత్ర విత్తాది సంగ్రహాలోలుండగు

చుండునో, వాడు దేహాభిమానముచే తనను తానే చంపుకొనునట్టి ఆత్మఘాతకుడగును. అనగా మోక్షము కొరకు యత్నించని మానవుడు ద్విపాద పశువు అనబడును.

శిష్యా! ఈ శరీరము తల్లిదండ్రుల యొక్క శుక్ర శోణితము వల్ల ఉత్పన్నమై, మలమాంస మయమై మిక్కిలి హేయమైనది. కనుక దీనిని అపవిత్రుడగు ఛండాలుని వలె త్యజించి, అనగా దానియందాసక్తిని వదలి, బ్రహ్మరూపమును పొంది కృతకృత్యుడవు అగుమని శ్రీ ఆదిశంకరుల వారు వివేకచూడామణిలో వచించిరి.

ఇట్టి ఈ నీచమైన ఇంద్రియ సుఖముల లక్షణములు ఈ క్రింది విధముగా గలవు.

1. మద్య మద్య తెగిపోవునవి
2. కర్మను అభివృద్ధిపరచి అంతులేని జన్మలను కలుగజేయును.
3. కొద్ది సుఖము తరువాత కొండంత దుఃఖమును తెచ్చిపెట్టును.
4. ఎంత అనుభవించినను సంతృప్తి పడదు. ఇంకను అనుభవించ వలెనని కోరిక కలుగుచుండును.
5. కోరికలను దినదినము పెంచుచుండును.
6. ఇది దృష్య వస్తువులపై ఆధారపడియున్నది.
7. ఇంద్రియ సుఖములు కర్మబంధములను దృఢపరుచుచున్నవి.
8. ప్రతిబింబ రూపమైయున్నది.
9. సముద్రములో ఒక నీటిబొట్టు వంటిది - అనగా బ్రహ్మానంద సాగరములో ఒక నీటిబొట్టు వంటిది.
10. అజ్ఞానులు ఆపేక్షించునవి.
11. జడమైనవి.

ఇన్ని అవలక్షణములు గల ఇంద్రియ జీవనమును కోరుకొను జీవుడు ఎంతటి అజ్ఞానియో ఎవరికివారే ఆలోచించుకొనవలయును.

ఇంద్రియ సుఖము ఎంత నీచ నికృష్టమో, ఎంత హేయమో కైవల్య సుఖము లేక మోక్షము సృష్టిలో అంత ఉత్కృష్టమై యున్నది. నిజమునకు మానవునికిదియే గమ్యమైయున్నది. ఇందు జీవుడు పొందునది బ్రహ్మానందము.

అనాది కాలము నుండి జీవుడు సంసార బంధము నందు తగుల్కొని, అజ్ఞాన శృంకలములచే బద్ధుడై తన స్వస్వరూపమును మరచి, తానే దేహమని భ్రమించుచు, నానా యాతనలు పడుచు, నానా పాప సంకల్పములు చేయుచు, జనన మరణ రూపమగు సంసార చక్రమందు భ్రమించుచున్నాడు.

కాని మోక్షస్థితి యందు జీవుడు శివుడుగా మారుచున్నాడు. నరుడు నారాయణుడై విలసిల్లు చున్నాడు.

భక్తుడు భగవంతుడై భాసించుచున్నాడు.

మానవుడు మాధవుడుగా పరిణమించుచున్నాడు.

**జీవుడు మానవత్వమును వదలి దైవత్వమును పొందుచున్నాడు.**

అది యొక అపూర్వ ఆనందస్థితి. దుఃఖము లవలేషమైనను అచట కాన్పించదు. ప్రపంచములోని అన్ని లాభముల కంటెను అది గొప్ప లాభకరమైన స్థితియని శ్రీ గీతాచార్యులు పేర్కొన్నారు.

అచ్చోట జనులకు కలుగు ఆనందము వర్ణనాతీతము. కావున అట్టి స్థితియందు జీవత్వము అదృశ్యమై దైవత్వమే శేషించుచున్నది.

ఆనందసాగరమే యగు అట్టి దివ్యానుభూతి కొరకై మహనీయులెందరో తమ భౌతిక సంపదలకు తిలాంజలినొసగి, ప్రాపంచిక సుఖములకు

దూరముగా విడచి వైచి రాజ్యాదులను గూడ తిరస్కరించి, అఖండ వైరాగ్యమును చేబట్టి, అమోఘమగు కృషి సలిపి తుట్టతుదకు విజయమును గాంచిరి.

అట్టి బ్రహ్మానందముతో భౌతిక సుఖములు పోల్చతగినవి కావు. ఒకటి నిత్యమైనది మరియొకటి అనిత్యమైనది. బింబసుఖము చెంత ప్రతిబింబ సుఖమేపాటిది.

జాగృతుని చెంత స్వప్న వస్తువునకేమైనా విలువయుండునా? కనుకనే శ్రీ శంకరులవారు బ్రహ్మానందము ఈ విధంగా వర్ణించినారు.

ఆ బ్రహ్మానంద సముద్రము యొక్క లవలేషముతో సమానమైన కొద్ది సుఖమును పొంది ఇంద్రాదులు ఎంతయో సంతుష్టి పొందుచున్నారు. మునీశ్వరులు తమ చిత్తములను అట్టి పరబ్రహ్మమునందే లయింపచేసి బ్రహ్మానందమును బడయుచున్నారు.

ఏ బ్రహ్మము యొక్క భయము వలన, అనుగ్రహము వలన సృష్టి నడుపబడుచున్నదో అట్టి బ్రహ్మస్వరూపమైన బ్రహ్మానందమును ఈ క్రింది విధముగా తెలియబడినది.

మంచి యౌవనములో ఉన్నవాడు, సాధు స్వభావము కలిగినవాడు, అధ్యాయుడు, అశిష్టుడు, మనోదార్ఢ్యము, దేహారోగ్యము కలవాడు అయి ఉండెడి విద్వాంసుడు ప్రపంచమునంతటిని ఏకచ్ఛత్రాదిపత్యముగా ఏలునట్టి సార్వభౌమునకు గల ఆనందమును **"మనుష్యానందముగా"** పేర్కొనబడినది.

బ్రహ్మానందమునకు కొలతబద్దగా క్రమములో మొదటిదైన మనుష్యానందము నిర్వచింపబడినది.

**"ప్రపంచములో సుఖమును కలుగజేయు ప్రతీ విషయము బ్రహ్మానంద సముద్రములోని లవలేషమే"**

బ్రహ్మానందము ఆనందమునకు పరాకాష్ట.

అవిద్య, కామము, కర్మలు వీనియొక్క ప్రాబల్యము తగ్గిన కొలది, ఆ ఆనందము మనుష్య, గంధర్వ, దేవ, హిరణ్యగర్భ ఆనందములుగా వృద్ధిచెందును.

## బ్రహ్మానందము యొక్క వివరణ :-

100 గురి మనుష్యుల ఆనందము........... **ఒక మనుష్య గంధర్వానందము**

100 గురి మనుష్య గంధర్వుల ఆనందము. **ఒక దేవ గంధర్వానందము**

100 గురి దేవగంధర్వాదుల ఆనందము.... **ఒక పితృదేవతానందము**

100 గురి పితృదేవతల ఆనందము ......... **ఒక అజాన జానదేవతానందము**

100 గురి అజాన జానదేవతల ఆనందము. **ఒక కర్మదేవతానందము**

100 గురి కర్మదేవతల ఆనందము .......... **ఒక సురలోక దేవతానందము**

100 గురి సురలోక దేవతల ఆనందము ... **ఒక ఇంద్రుని ఆనందము**

100 గురి ఇంద్రుల ఆనందము ............. **ఒక బృహస్పతి ఆనందము**

100 గురి బ్రహ్పస్పతుల ఆనందము ........ **ఒక ప్రజాపతి ఆనందము**

100 గురి ప్రజాపతుల ఆనందము .......... **"బ్రహ్మానందము"**

అందువలన, దీని నుండి అర్థమగుచున్నదేమనగా మహారాజాది చక్రవర్తి అనుభవించు ఆనందము కంటె కోటానుకోట్ల రెట్ల ఆనందమే **"బ్రహ్మానందము"**

అట్టి ఆనందధామమును బడయుటకై, జీవుడు శక్తివంచన లేక పాటుపడవలసియున్నది.

మానవుడు జన్మించినది క్షణికముల కొరకు కాదు – శాశ్వత సుఖముల కొరకు.

దానవుడగుటకు కాదు – దేవుడగుట కొరకు.

పశుత్వమును పొందుట కొరకు కాదు – పశుపతిగా మారుటకొరకు

**"అట్టిచో ఎండమావుల వంటి ఈ క్షణిక సుఖములయందే జీవిత మంతయు ఆహుతి చేయనేల"**

సున్నపు ముద్దలను జూచి వెన్నముద్దలని పరిగిడుట విజ్ఞుడు చేయవలసిన పనికాదు. తినుట, త్రాగుట, గంతులు వేయుట ఇదియేనా మానవత్వము.

వాస్తవముగా సుఖము బాహ్యమున లేదు. పదార్థములయందు సుఖమున్నదనుకొనుట వట్టి భ్రమయే యగును.

నిజముగా సుఖము పదార్థమందున్నచో అది అందరికిని ఎల్లవేళల యందును సుఖకరముగా తోచవలయును. అట్లు జరుగుట లేదు. ఒకే వస్తువు కొందరికి ప్రీతికరముగను మరికొందరికి అప్రీతికరముగను, ఒక కాలమున సుఖవంతముగను మరియొక కాలమున జుగుప్సాకరముగను స్ఫురించుచున్నది. వస్తువుననే నిజమైన ఆనందమున్నచో ఇట్లెన్నటికి సంభవించదు.

భోజనమునకు పూర్వము ఎంతయో రుచికరముగ తోచిన గారెలు, పాయసము, కడుపునిండ భుజించిన తరువాత, ఇక తినబుద్ధిగాక, ఇంకను, ఎవరైన బలవంతముగ వడ్డించినచో విషప్రాయముగా భావించి పారవేయుదురు. "కడుపు నిండిన గారెలు చేదు" అను ఆర్యోక్తి సత్యమే కదా!

చేదు తనము గారెలలో లేదు. కమ్మదనము అంతకంటే లేదు. వారివారి ఆకలి, మనస్తత్వము, ఆయా రుచులను కల్పించుకొనుచున్నవి.

కాబట్టి సుఖము బాహ్యపదార్థముల యందు లేదు. జీవుని అవిద్యయే ఆ ప్రకారముగా వస్తువు సుఖభ్రాంతిని కలుగజేయుచున్నది.

ఒక కుక్క ఎచ్చటనో ఒక ఎముకను సంపాదించి దానిని కొరుకుచుండును. ఎముక గట్టిగా యున్నందున విరుగలేదు. కాని బలవంతముగా కొరుకుట వలన ఒక పన్ను ఊడిపోగా దాని నోటిగుండా నెత్తురు ఎముకపైబడి కారుచుండెను.

అమాయకమగు ఆ కుక్క, ఆ ఎముకలోనుండి రక్తము కారుచున్నదని తలంచి, తన భాగ్యము పండెనని ఊహించి నిర్విరామముగా ఆ నెత్తురును నాకసాగెను. అట్టిదియే జీవుని అజ్ఞాన పరిస్థితి.

కావున బ్రహ్మమును తెలుసుకొన్నవాడు బ్రహ్మమేయగును అను వాక్యమును సదా జ్ఞప్తికి యుంచుకొని బ్రహ్మజ్ఞాన సముపార్జన ద్వారా, బ్రహ్మనిష్ఠ ద్వారా, సాక్షాత్ బ్రహ్మస్వరూపులే అయి తమ తమ జీవితములను సార్ధకమొనర్చు కొనవలయును.

ప్రతీ మానవుని యందును దైవత్వము గర్భితముగా యున్నది. బాహ్యాంతర ప్రకృతినంతయు నిరోధించి, అంతర్గతమగు నీ దైవత్వమును వ్యక్తము చేయుటయే జీవుని జీవిత పరమావధియైయున్నది.

ఇందులకై జీవుడు సద్గురువునాశ్రయించి గురువు పర్యవేక్షణలో కర్మ, భక్తి, జ్ఞాన, యోగ మార్గములలో, ఒక్కటి గాని, కొన్నిటిని గాని అన్నిటిని గాని అవలంబించి ముక్తుడు కావలెను. ఇదియే మతసారము, తత్వసారము.

మతమనగా దైవసాక్షాత్కారమే. మీరెప్పుడు దేవుని సాక్షాత్కారము చేసుకొనెదరో అప్పుడే నేను మిమ్ములను దైవ భక్తుడని పిలిచెదనని శ్రీరామకృష్ణుల వారి ప్రవచనము. అట్టి లక్ష్యమును సాధించిన తరువాత మతమనునది నోటి మాటగానే మిగిలిపోవును.

భక్తుడు జగత్ప్రభువు యొక్క బిడ్డ. అతడు భగవంతుని కొరకై వదులు కన్నీటి బిందువులే అతని బలము. భగవన్నామము ఒక్కటియైనను వినినంతనే రోమములు గగుర్పాటు చెందుటయు, ఆనందాశ్రులు చెక్కిల్ల వెంట పొరలుటయు భక్తుని లక్షణములు. నీయందీ లక్షణములు గోచరించునపుడు, మోక్షము దగ్గరలో యున్నదని గ్రహింపుము. దీనిని సంకేతముగా గ్రహించి సాధకుడు తన తత్వసాధనను తీవ్రతరము చేయవలయును.

సాధన చతుష్టయ సంపత్తి సంపూర్ణముగా గల శిష్యుడును, శృతిసార మెరిగిన బ్రహ్మనిష్టుడగు గురువు ఉండిన యెడల మాత్రమే ఈ బ్రహ్మవిద్య ప్రకాశించును. కాని ఉభయులలో ఎవరైనను పూర్తిగా లేనియెడల ఇది రాణించదు. అనగా ఇచ్చుకొనువారును త్రెచ్చుకొనువారును, ఉభయులును సమర్థులు కావలయును.

రోగము తెలిసిన వైద్యుని వద్ద సరియైన ఔషధము ఉండిన రోగము కుదురును. అటులనే ఔషధులు ఇచ్చినను, ఆహార పథ్యములు సరిగా చేయని యెడల ఆ మందు ఫలమీయజాలదు. ఆహారాదది పథ్యముల యందు జాగురూకుడైనను, ఔషధము సరిగా లేని యెడల ఆరోగ్యము కలుగదు కదా!

శిష్యుడు శాంతుడై ఆత్మజ్ఞానము కొరకు పూజార్హ వస్తువులను కరమందు ధరించి, శృతిసారమెరిగినవాడై బ్రహ్మనిష్ఠుడైన గురువును ఆశ్రయింపవలయునని ముండకోపనిషత్తు తెలుపుచున్నది. దీనిచే గురుశిష్యులిరువురును యోగ్యులుగా ఉండవలయునని తేటతెల్లమగుచున్నది.

ఏ మహానుభావునిచే అవిద్యా హృదయగ్రంధి ఛేదింపబడి, మోక్షము కలుగునో వారినే గురువని గురుశబ్దార్థమెరిగిన పెద్దలు చెప్పుచున్నారు.

'గు' అను శబ్దము అంధకారమునకు పేరు. 'రు' అను శబ్దము దానిని నాశనము చేయు తేజస్సు అని అర్థము. అనగా బ్రహ్మోపదేశముతో అజ్ఞానాంధ కారమును నాశము చేసి పరబ్రహ్మమును కరతలామలకము వలె చేయువారు గురు శబ్దమునకర్థమని **"అద్వయతారకోపనిషత్తు"** చెప్పుచున్నది.

గు కారము అనగా గుణాతీతము - రు కారము అనగా రూపాతీతము. అనగా నామమరూప రహిత అవస్థయగు బ్రహ్మమును తెలుపువాడే గురువని పెద్దలచే చెప్పబడుచున్నది.

చాతుర్యము కలవాడై, వివేకియై, ఆధ్యాత్మజ్ఞాన సంపన్నుడై, బహి అంతరశుద్ధికలవాడై ఎవని మనస్సు పవిత్రమై యుండునో వానికి మాత్రమే గురు శబ్దము శోభిల్లును. కాని ఉదరపోషణ పరాయణులైన శుష్కవేదాంతులకు ఆ పదమందదు.

అత్యంత నిర్మల హృదయము కలవారై పరమశాంతులై సాధన చతుష్టయ సంపత్తి గుణములతో కూడిన సాధుస్వభావము కలవాడై మితభాషణము గలవారై, కామ క్రోధమను అరిషడ్వర్గములను జయించినవారై, సదా సన్మార్గ ప్రవర్తకులై, చక్షుశ్రవణాది దశేంద్రియములను జయించినవారు మాత్రము గురువుల కర్హులు గాని ఇంద్రియలోలుర కధికారము లేదని సాక్షాత్తు పరమేశ్వరుడు గురుగీత యందు బోధించుచున్నాడు.

మరియు గురు లక్షణములు ఈ విధముగా వర్ణింపబడినవి.

1. త్రికరణముచే హింస చేయనివాడును
2. సత్యశౌచాదులు కలవాడును.
3. సమస్త జీవరాసుల యందు అపారమైన దయగలవాడును.

4. క్షమమతో కూడినవాడును
5. శాంతమైన చిత్తము కలవాడును
6. నిగ్రహానుగ్రహ శక్తులు కలవాడును
7. సదదాచారుడును
8. సమస్త విషయములయందు సమర్థుడును
9. జపధ్యాన పరాయణుడును
10. జ్ఞాన దీక్ష గలవాడును
11. గురుభక్తియందు ప్రాణము త్యజించువాడును
12. కర్మ, భక్తి, జ్ఞాన, యోగములను క్షుణ్ణముగా ఎరింగినవాడును
13. డంబాచారము లేనివాడును
14. క్షుద్రోపాసన లేనివాడును
15. సరేంద్రియ నిగ్రహము కలవాడును
16. శిష్యులయందలి గుణదోషములలో విశేష జ్ఞానము కలవాడును
17. రాగద్వేషములు లేనివాడును
18. కృపాసాగరుడును
19. సర్వదా జ్ఞాన సారమును గ్రహించు స్వభావము కలవాడును
20. పరబ్రహ్మ స్వానుభవము కలవాడును
21. సర్వ సంశయములను ఛేదించినవాడును
22. క్షయ, కుష్టాది రోగములు లేనివాడును
23. వైరాగ్యముతో కూడినవాడును
24. సుందరుడును మమకారము నశించినవాడును

25. అహంకారము పోయినవాడును

26. శంకయుండనివాడును

27. వికల్ప శూన్యుడును

28. అజ్ఞానము నాశము పొందినవాడును

29. శాస్త్రసారమెరింగినవాడును

30. పరమార్ధతత్వమైన బ్రహ్మమును విశేషముగా చింతజేయువాడును.

ఈలాంటి అనేక సుగుణములు కలవాడే సద్గురువు అని గ్రహించ వలయును.

ఇప్పుడు మనము అదేవిధముగా మోక్షసాధనకై తపించు శిష్యుని లక్షణములు గ్రహించవలయును.

ఓ శ్రీరాముడా! ఉపదేశము వ్యవస్థాపాలనము గురించి కాని, జ్ఞానసిద్ధికి గాని శుద్ధమైన ప్రజ్ఞాబలమే ముఖ్య కారణమైయున్నది.

కనుక శిష్యునకు 1) విషయ వైరాగ్యము, 2) మహా ప్రజ్ఞయు యుండవలయునని యోగవశిష్టము తెలుపుచున్నది.

ఎవని శిరమందు శ్రీరాముని పాదోదకము పడలేదో వాని తాపత్రయాగ్ని చల్లారదు.

ఎవరు గురోరుచ్ఛిష్టము భుజింపలేదో వారికి సంసార శాంతి లభించదు.

ఎవని శరీరముపై శ్రీశ్రీనివాసుని పాదధూళి పడలేదో వారి సంసార దుఃఖ వ్రణము మానుటకు మార్గములేదు.

ఎవడు పరమేశ్వరుని కృప కొరకై శరీరముతో పాటుపడడో వానికి ఇంద్రియనిగ్రహము సాధ్యము కాదు. అనాధియైన అజ్ఞానమును మూలముగా నాశము చేయునదియు, జనన మరణములకు కారణమైన

కర్మమును నివారణ చేయదగినదియు యగు గురుపాదోదకము - జ్ఞాన వైరాగ్యసిద్ధి కొరకు, గురోరుచ్ఛిష్ట భోజనము శిష్యులకు మోక్షప్రాప్తికరమై యున్నది.

బాగుగా పరిపక్వమైన చిత్తము కలవాడును, విధి ప్రకారము శరణాగతిని పొందినవాడును అగు శిష్యునకు ఏ జ్ఞానము చేత సత్యమగు అక్షర పురుషుని కనుగొనునో ఆ బ్రహ్మవిద్యను గురువు శిష్యునకు సత్యముగా బోధించును.

చతుర్వర్ణముల యందు జన్మించిన వారెవరైనను సరె, శాస్త్రజ్ఞాన నిరూపకుండును, భక్తి జ్ఞాన, విరాగములచే సూక్ష్మబుద్ధి కలవాడును, నీతిమంతుడును, పురుషార్ధమైన మోక్షమునకు సర్వదా ప్రయత్నశీలుడును సదా స్థిర బుద్ధి కలవాడును, గురు శుశ్రూషయందాసక్తి కలవాడు, సర్వదా గురుకార్యము కొరకు పాటుపడువాడును గురు వచనోల్లంఘము నందు భయము కలవాడు, ఈలాంటి లక్షణములు కలవాడు శిష్యుడని చెప్పుదురు.

ఈశ్వరభక్తి యందు నిపుణులై, మద్య మాంసాది భోజనము లేనివారును, శూద్రులైనను, బ్రహ్మవిద్యా దీక్షను చేపట్టవచ్చును.

ఇక శిష్యులందరికి నూరు గుణములకన్నను అధికమైనవేవో వినుము– భక్తి, విశ్వాసము, అద్రోహము, శ్రద్ధ, పరమశాంతము, భూమివలె క్షమ, సత్యము, బహి అంతరశుద్ధి, తపస్సు, శాస్త్ర శ్రవణము ఈ ద్వాదశ గుణములెవరికి గలవో వారు ప్రధానులని చెప్పవలెను.

- **అహింస**
- **సత్యము**
- **అస్తేయము**
- **బ్రహ్మచర్యము**
- **దయ**

- **ఆర్జనము**
- **క్షమ**
- **దృతి**
- **మితాహారము**
- **శౌచము**

అను ఈ 10 విషయములు దమమనబడును.

**తపస్సు** — **వేదాంత శ్రవణము**
**సంతోషము** — **లజ్జ**
**ఆస్తిక్యము** — **మతి**
**దానము** — **జపము**
**ఈశ్వరోపాసము** — **వ్రతము**

అను ఈ 10 విషయములు నియమమనబడును.

1) విధి ప్రకారము కర్మలు చేయువాడును
2) కామ సంకల్పము లేనివాడును
3) సంసార సంఘ విసర్జియుడును
4) కామ క్రోధములను జయించినవాడును
5) సత్య ధర్మ పరాయణుడును
6) గురుసేవ యందు ఆసక్తి కలవాడును
7) తల్లిదండ్రులను పూజించువాడును
8) సదాచారము కలవాడుగా శిష్యుడు ఉండవలయును.

మోక్షమునకు మొట్టమొదట అభ్యసించవలసినవి.

1) మితభాషణము
2) పరిగ్రహ విసర్జితము
3) ఆశ లేకుండుట
4) కోరికలను నాశము చేయుట
5) ఏకాంతమునందుండుట

అని వివేకచూడామణి చెప్పుచున్నది.

మనస్సు నశించి పరబ్రహ్మస్థితి కలుగుటకై నాలుగు సాధనములు సాధకునకు అత్యావశ్యకమైయున్నవి.

అవి




**I.** కొందరు ఆగమశాస్త్రమను వలయందు చిక్కియు

**II.** కొందరు వేదశాస్త్రములను చదవి చదివియు కాలము వ్యర్థపుచ్చును

**III.** మరికొందరు పరమానువాదమైన తర్కశాస్త్రమునవలబించియు

**IV.** మరికొందరు ఆత్మచితన లేక సంసార సాగర తరుణోపాయము తెలియక దుఃఖమునకు పాత్రులై నాశము పొందుచున్నారు.

కనుక జీవుడు




**బ్రహ్మానంద నిర్వాణ సుఖమును పొందుగాక.**

# ౨.

## "బ్రహ్మ సత్యం జగత్ మిథ్య"

అను వేదశ్రుతిని సాధకుడు, దాని గూఢార్థమును బాగుగా ఆలోచించి గ్రహించవలయును.

ప్రతీ మానవుడు జనన మరణములు లేకుండ మోక్షము కొరకు ప్రయత్నించవలసియున్నది. జనన మరణముల నుండి విముక్తి పొందాలంటే, ఈ సృష్టిలో గల 84 లక్షల జీవరాసులతో ఒక మానవజన్మకే ఆ హక్కును భగవానుడు ప్రసాదించియున్నాడు. ఇతర జీవరాసులకు ఆ యోగము బహు దుర్లభమైయున్నది. ఇంద్రుడంతటివాడైనను, మోక్షసాధనకై నరజన్మమెత్తవలసినదే అని శ్రీ శంకరులవారు వచించిరి.

ఆత్మ సాక్షాత్కారము కలుగగానే ప్రపంచము శూన్యములోనికి అదృశ్యం అయిపోతుందని శ్రీ గౌడపాదుల వారు విశ్వసింపలేదు. అంతా అలాగే ఉంటుంది. అయితే అది సత్యమని మాత్రము భావించము. అందుచేత దానియందు ఆసక్తి ఉంచుకొనము. సాక్షాత్కారము యొక్క ఒక్కగానొక్క ఫలితము ఇదే. ఆసక్తి ఒక్కటే బంధ కారణము అవడము చేత సృష్టి అంతా ఆత్మయే అని సాక్షాత్కరించుకొన్న తరువాత జీవుడు ఇక బంధము పెంచుకొనడు. కనుక జీవన్ముక్తి మాత్రమే తత్వచింతనకు, ధార్మిక జీవనానికి పరాకాష్ట. అదే వాటికి ఒక్కగానొక్క ఋజువు, ఆలంబనము. దానిని సాక్షాత్కరించుకొన్నప్పుడే నిజమైన బ్రాహ్మన్యం సిద్ధిస్తుంది.

**అందుచేత సాధకుడు జగత్ మిథ్య అని, సాధనలన్ని అనావశ్యకమని తొందరపడకూడదు.**

జగత్తు గురించి

- **అజ్ఞాని**
- **సాధకుడు**
- **జీవన్ముకుడు (ఆత్మసాక్షాత్కారము తరువాత)**

ఈ క్రింది విధములుగా ఆలోచించుచు, 3 రకములుగ వేరు వేరు ఫలితములను పొందుచున్నారు.

**అజ్ఞాని :–** అవిద్యా ప్రభావము చేత సృష్టిలోని ఇంద్రియ సౌఖ్యాలే జీవుని అంతిమ గమ్యమని తలంచి వాటివెంట పరిగెడుచు, న్యాయాన్యాయ విచక్షణను కోల్పోయి ధర్మాధర్మ విచక్షణా జ్ఞానమును పరిత్యజించి, విషయముల యందు ప్రవర్తించి, పతనమై జనన మరణ చక్రములలో పరిభ్రమించుచున్నాడు.

**సాధకుడు :–** సద్గురువు, సాధకునకు మాత్రమే 'జగత్‌మిథ్య' అని బోధించుచున్నాడు. ఇదియు కూడ కేవలము ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము పొందించుటకు మాత్రమే, గురువు శిష్యునకు ఈ విధముగా బోధించుచున్నాడు.

సర్వకాల సర్వావస్థల యందు సాధకుడు "జగత్ మిథ్య" అను ఆలోచనా అభ్యాసముల చేత క్రమక్రమముగా, మనో నిగ్రహమును, ఆ తరువాత మనో వైరాగ్యమును సాధించుచున్నాడు. మరియు ఇంద్రియ జీవనమునకు దూరము కాగలుగుచున్నాడు.

మరియు సత్కర్మలు, నిష్కామ కర్మలు, పుణ్యకర్మలు ఆచరించుచు అంచెలంచెలుగా వృద్ధి చెందుచు చివరకు భక్తి, జ్ఞాన, వైరాగ్యములచే బ్రహ్మ సాక్షాత్కారమును పొందుచున్నాడు.

**కావున "జగత్ మిథ్య" అను శృతి సాధకునకు మనో వైరాగ్యమును పెంచుటకు ఆపైన బ్రహ్మసాక్షాత్కారమును త్వరితముగా సిద్ధించుకొనుటకు చేయబడిన ప్రక్రియ మాత్రమే.**

**ఆత్మజ్ఞాని, జీవన్ముక్తుడు :-** "సర్వం ఖతిదం బ్రహ్మ" అని తెలుసుకొన్న బ్రహ్మవిధుడు, పాంచభౌతికమగు ప్రపంచమును పరిహసింపడు, నిందింపడు. అంతియేగాక సృష్టిని భక్తి భావముతో, బ్రహ్మభావముతో చూచును. బంధము కలుగజేయునది మనస్సుగాని, వస్తువు కాదుగదా! అని గ్రహించి బంధ రహితుడై యుండును.

ఏ కర్మలనయినా, ఈశ్వరార్పణగా, ఫలాపేక్ష రహితముగా, సృష్టి చట్టమును అతిక్రమించక ఆచరించుటలో ఏమాత్రము దోషములేదు. నిజమునకు విషయాసక్తియే బంధము, అనాసక్తియే మోక్షము. శ్రోత్రియ బ్రహ్మనిష్టునకు సర్వ ప్రపంచములోని, భోగ్యవస్తుసామాగ్రి కరతలా మలకముగా యున్నది. అతడు దానిని అనుభవించుచున్నను, అతని ఆనందము అపారము అని బ్రహ్మానందవల్లిలో తెలుపబడినది. ఏలననగా అతడు ఎన్నడును సృష్టి చట్టమును అతిక్రమించడు. కనుక బ్రహ్మజ్ఞాని దేనిని నిందింపడు. అతడు

1) ప్రాప్తించిన లేషమునైనను బ్రహ్మభావముతో భుజించి, నిత్యతృప్తుడై, నిరాశ్రయుడై, ఆనంద స్వరూపుడై యుండును.

2) సర్వకర్మలను, అతడు

- **ఈశ్వరార్పణతో**
- **ఫలాపేక్ష రహితముగా**
- **లోకసంగ్రహార్ధము**
- **సృష్టియొక్క చట్టమును**

అతిక్రమించకుండ ఆచరించును.

ఇవియును గాక శ్రీగీతాచార్యుడు కర్మానుష్టాన విశేషములను ఈ క్రింది విధములుగా తెలిపెను.

**I.** కర్మసన్యాసమును, కర్మయోగమును రెండును మోక్ష దాయకములే కాని ఆ రెంటిలో కర్మయోగమే శ్రేష్ఠమైనది.

**II.** జ్ఞానయోగుల చేత ఏ స్థానము పొందబడుచున్నదో ఆ స్థానమే కర్మయోగులచేత కూడ పొందబడుచున్నది. జ్ఞాన కర్మలను రెంటిని ఒకటిగా ఎవడు చూచుచున్నాడో వాడే సృష్టిని నిజముగా చూచువాడై యున్నాడు.

**III.** అర్జునా! నాకు ముల్లోకములయందు చేయదగిన కార్యము ఏదియును లేదు. పొందబడనిదియును, పొందతగినదియును అగు వస్తువు ఏమియును లేదు. అయినను నేను కర్మలనాచ రించుచున్నాను.

నేను అప్రమత్తుడనై కర్మలనాచరింపకుందునేని, జనులు సర్వ విధముల నా మార్గమునే అనుసరించుచు ప్రవర్తించు చుందురు.

నేను కర్మలను చేయనియెడల, ఈ లోకములన్నియు నశించును. వర్ణ సంకరమునకు నేను కారణమగుదును. జనులను చెడిపినవాడనగుదును.

అర్జునా! అజ్ఞానులగు జనులు ఫలాసక్తి కలిగి ఏ విధముగా కర్మలనాచ రించుచున్నారో అలాగే జ్ఞానులు ఫలాపేక్ష లేకుండా, లోకసంగ్రహార్తము కర్మలనాచరింపవలెనని శ్రీకృష్ణపరమాత్మ శాసించెను. దీనినే **"దగ్ధపటన్యాయమని"** అందరు.

**IV.** అర్జునా! నీకు కర్మజేయుటయందే అధికారము కలదు కర్మఫలము నాశించుటకు అధికారము లేదు. కర్మ ఫలమునకు నీవు కారణభూతుడవు కారాదు అని కర్మలను చేయుట మానరాదు.

జీవుడు దేహమున్నంత పర్యంతము నిష్కామ కర్మలను, ఈశ్వరార్పనతో చేయుచునేయుండవలయును. ఇదియే శ్రేష్టమైన యోగము.

**V.** జన్మలకు కర్మఫలమే కారణమైయున్నది. అదే విధముగా మోక్షమునకు కర్మల "Clearance" కారణమైయున్నది. అనగా కర్మ–అకర్మముగా మారవలసియున్నది.




కర్మయోగముగా మారవలెనన్న పైన ఉదహరింపబడినటుల ఒక equation గా చెప్పుకొనవచ్చును.

జీవునకు కర్మలయందు Clearance లభించినచో, క్రమముగా భగవదనుగ్రహముచే ఆత్మజ్ఞానము పొంది పరమాత్మలో ఐక్యమగుచున్నాడు.

**VI.** ఆత్మ సాక్షాత్కారము లభించిన తరువాత కూడ బ్రహ్మజ్ఞాని ప్రారబ్ధ కర్మఫలము అనుభవించియే తీరవలెను. అందుచే జీవన్ముక్తుడు కూడా సృష్టిని ఈశ్వరభావముతో చూచుచు

నిష్కామ కర్మలను, సత్కర్మలను, పుణ్యకర్మలను లోక సంగ్రహార్ధము ఆచరించుచునే యున్నాడు.

**VII.** జీవుడు కొన్ని కల్పములయినను కర్మఫలము నుండి తప్పించుకొన లేడని వేదములు ఘోషించుచున్నవి.

**VIII.** బాగుగా నాచరింపబడిన పరధర్మము కంటెను, గుణము లేనిదైనను స్వధర్మమే శ్రేష్ఠమైనది. స్వధర్మము నందు మృత్యువు కలిగినను శ్రేష్ఠమే. పరధర్మము భయంకరమైనది.

కర్మలను త్యజించి సోమరిగా కూర్చొనుట భగవంతుని ఆశయము కాదు. కనుక కర్మలను విడుచుటకంటే చేయుటయే మేలని చెప్పియుండెను.

వారి వారి స్వకర్మలను ఆచరించుకొనుచు, దైవార్పణ బుద్ధి కలిగి వానిలో తగుల్కొనక, కర్తృత్వమును వహింపకయుండినచో ఆ కర్మలన్నియు పూజలు గాను, యజ్ఞములుగాను మారును.

అనగా

**పాకివాడు – పాకి పని చేసికొనుచు**

**వంటవాడు – వంటపని చేసికొనుచు**

**మాదిగవాడు – చెప్పులు కుట్టుకొనుచు**

**వర్తకుడు – వ్యాపారము చేసికొనుచు**

**ఆఫీసరు – ఉద్యోగము చేసికొనుచు**

**పురోహితుడు – పౌరోహిత్యము చేసికొనుచు**

తరించుటకు అవకాశములు కలవని గీత బోధించుచున్నది.

కాకున్నచో, ఏ కర్మనయినను ఫలాపేక్ష రహితముగా

- ఈశ్వరార్పణగా
- సృష్టి చట్టమునతిక్రమించకుండ చేయవలయును

అప్పుడు ఆ కర్మలన్నియు యజ్ఞములుగా యోగముగా మారును.

కనుకనే కాబోలు శ్రీకృష్ణుడు బండితోలు పదవి స్వీకరించి అదియును ఏమంత తక్కువైనది కాదని ఋజువు చేసెను. అంతియేకాదు, సంధ్యాకాలమున యుద్ధమును విరమించి అందరు అర్ఘ్యపాదములు ఇచ్చుచుండ, ఆ గుఱ్ఱములకు తగిలిన గాయములను నదిలో కడిగి పిమ్మట వానికి గుగ్గిళ్ళను తినుపించు చుండెనట శ్రీకృష్ణపరమాత్మ.

కావున ఫలాని కర్మ తక్కువని కాని, ఫలాని కర్మ ఎక్కువని కాని భావింప రాదు. అన్నియు పవిత్రములే. వాని నొనర్పు పద్ధతి యందు, మనోభావము నందు మార్పు రావలయును.

వేదాంతమును వ్యవహార స్థాయికి దింపుటయు, వ్యవహారమును వేదాంత స్థాయికి పెంచుటయు గీతయొక్క చాతుర్యము.

గీతయంతయు వినిన తరువాత అర్జునుడు జోలి ఎత్తుకొని బిక్షాటనము చేయుచు అరణ్యములకు పారిపోలేదు - సరికదా రణరంగమున నూతనోత్సాహముతో దుమికి క్షత్రియోచితమగు తన యుద్ధకార్యమును ఆనందముగా నెరవేర్చెను.

ముక్కుచు మూలుగుచు కూర్చున్నవానిని కర్తవ్య నిష్టునిగా నొనర్చిన ఘనత గీతకే చెల్లును

ఇట్లు ఒక్క అర్జునుడే కాదు, మరెందరో ఈ ధర్మ రహస్యమును గుర్తెరింగి నిష్కామ కర్మాచరణ రూపమగు దివ్యౌషధమును భుజించి వారి వారి వ్యవహారములను, గృహ కార్యములను, లోక కార్యములను, అనాసక్తముగా నాచరించి శాంతి సౌఖ్యములను బడిసిరి.

కావున గీతాశ్రవణముచే

**మాదిగవాడు - చెప్పులను ఇంకా బాగా కుట్టును**

**వంటవాడు - వంటను ఇంకను చక్కగా చేయగలడు**

**వ్యాపారి - ఇంకను శ్రేష్ఠముగా, న్యాయముగా, బాగుగా వ్యాపారము చేయును.**

ఈ ప్రకారముగా భగవద్గీత భౌతిక ఆధ్యాత్మిక రంగములు అని రెండు విధములుగా లేవనియు, మరియు ఒకటేననియు, భౌతికరంగమున ఆధ్యాత్మికతను వ్యాపింపచేయవచ్చునని సోపత్తిగా ఋజువు చేసి ఆ రెండిటి మధ్యనున్న అఘాతమునకు చక్కని వారధిని నిర్మించెను.

కర్మలు జడములే కాదనలేము. కాని మోక్ష సాధనలో ఇవి తొలిమెట్టులై యున్నవి. అనగా కర్మయోగమును - MBBS గా అనగా Under Graduation తో పోల్చవచ్చును.

కావున సాధకుడు విద్యుక్తధర్మములు, సత్కర్మలు, పుణ్యకర్మలు, నిష్కామ కర్మలు విరివిగా చేసికొన్నచో ఇందు ఉత్తీర్ణుడై రెండవమెట్టు యందు గల భక్తియోగము నందు ప్రవేశించుచున్నాడు. ఇది M.D. అనగా Post Graduation తో పోల్చవచ్చును.

ఇందు సాధకుడు పరాభక్తుడై సాకార ఇష్టదైవానుగ్రహము, దర్శనము పొంది, మూడువ అనగా ఆఖరు మెట్టుయందు గల జ్ఞానయోగము నందు ప్రవేశించుచున్నాడు. ఇది D.M. అనగా Super Specialization తో పోల్చవచ్చును.

ఇందు భగవదనుగ్రహముచే సృష్టియందు గల పంచ భ్రమలు తొలగి ఆత్మజ్ఞానమును సిద్ధింపచేసికొని పరమాత్మలో ఐక్యమగుచున్నాడు.

ఇదియే కర్మ, భక్తి, జ్ఞాన యోగముల సారాంశమని సంక్షిప్తముగా చెప్పవచ్చును.

# ౩.




**కృష్ణుడు :** ఆయా జీవులు చేయునట్టి పాపపుణ్యములు ఆత్మను అంటజాలవు. అవి ఆయా జీవులనే చేరుచున్నవి.

**అర్జునుడు :** ఇదియేమి అన్యాయము? ఆత్మ జీవులతో సంబంధించిన సకల కార్యములను తానే చేయించుచుండగా, ఆ ఆత్మకు అంటదనియు, జీవులకే అంటుననియు చెప్పుచున్నావు. అందులకు గల కారణమును వివరించుము.

**కృష్ణుడు :** జీవులు మాయచే కప్పబడియున్నందున తాను చేయుచున్న కార్యములను తానే చేయుచున్నానని అహంకారమును పొందుచున్నాడు. అందువలన ఆ కర్మమును వాడే అనుభవించవలసి యున్నది.

**అర్జునుడు :** ఏమియు తెలియని ఈ జీవుడు తాను చేయని కార్యములను నిర్నినిమిత్తముగా తనమీద మోపుకొని ఎందుకు పాపమును మూటకట్టుకొన వలయును.

**కృష్ణుడు :** తనకు తెలివిలేని తనమున అట్లు చేసుకొనుచున్నాడు. ఈ తెలివిలేని తనమే సమస్త జంతువులయొక్క జ్ఞానమును మూసివేయు చున్నది.

**"ధూమేనా వ్రియతే వహ్నిర్యథాధర్శోమలేనచ**
**యథోల్బే నావృతో గర్భస్థథా తేనేద మావృతమ్"**

పొగచేత నిప్పు, మురికి చేత అద్దము, మావిచేత శిశువు, కామము చేత జ్ఞానము కప్పబడియున్నవి.

**అర్జునుడు :** ప్రపంచోత్పత్తికి కారణకర్తగా నుండు ఈశ్వరుడు మాయను కలుగజేసి ఆ మాయవలన జీవులను మోహింపచేసి దానివలన కలిగెడు కర్మలను వారి నెత్తిన నుంచుకొనునట్లు చేసి, ఆత్మ తానేమి చేయనివానివలెయుండుట ధర్మమా?

**కృష్ణుడు :** పరమేశ్వరుడు మాయతో కూడ జీవులను సృష్టిచేసి పంపించినను ఆ మాయనుండి తప్పించుకొనుటకు బుద్ధియనెడి శక్తిని కూడ పంపించి యున్నాడు. ఆ బుద్ధిని వారు సరిగా ఉపయోగించు కొననందున, కర్మమనెడి మూటను తాను మోసుకొనవలసి వచ్చుచున్నది. కాని భగవంతుడు నిజముగా జీవులను కర్మకు లోబడునట్లు చేయలేదు.

ఒకని కడ ఇరువురు సేవకులుండిరి. యజమానుడు ఆ సేవకులను పిలిచి మీరు అర్ధరాత్రమున కటికచీకటి యందే లేచి నేను మీతో మునుపు చెప్పిన పనికి గాను చెరియొక ఊరు పోవలసియున్నది. కాని మీరు పోవు మార్గమధ్యమున అక్కడక్కడ దిగుడు బావులు కలవు. అవి పైకి కనపడవు. చీకటిలో తెలియక అడుగిడినచో వాటియందు పడి ప్రాణములను పోగొట్టుకొనగలరు.

కావున ఇదిగో! రెండు దీపములను మీకు చెరియొకటి ఇచ్చుచున్నాను. వాటిని మరువక తీసికొనిపోయి పనిని త్వరగా నెరవేర్చుకొని రండని చెప్పి పంపెను.

ఆ ఇరువురు సేవకులలో ఒకడు యజమానుడిచ్చిన దీపమును తీసికొని వెళ్ళి యజమానుని ఇష్టానుసారముగనె పనిని నెరవేర్చుకొని వచ్చెను.

కాని రెండవ సేవకుడు యజమానుడు చెప్పిన రీతిని చేయక దీపమును ఇంటియందే యుంచి కటిక చీకటిలో బయలుదేరెను. అట్లు వెల్లుచుండగా దానిలో గల ఒక నేలబారు బావిలో చూడక పడి, ఈత రానందున, ముమ్మారు మునిగి ప్రాణములను వదిలెను.

కావున ఇట్లే పరమేశ్వరుడిచ్చిన బుద్ధియను దీపమును సరిగా ఉపయోగించని జీవుడు బావి వంటి మాయలోపడి జననమరణాది దుఃఖములను పొందుచున్నాడు ఈ విధముగా బుద్ధిని సరిగా ఉపయోగించని మానవుడు మాయవలన కలిగెడి కర్మఫలములను తానే అనుభవించు చున్నాడు.

ప్రతీ వ్యక్తి చెడ్డపని చేయుటకు ఉపక్రమించుటకు ముందు, పరమాత్మ బుద్ధిరూపములో అది వలదని హెచ్చరించుచునే యున్నాడు. కాని జీవుడు మాయా ప్రభావము చేత అంతరాత్మ హెచ్చరికను పెడచెవిన పెట్టి – నేను చేయు పనిని ఎవడు చూచుచున్నాడులే అని భ్రష్టమైన ధైర్యములో అధర్మమైన పనులను చేసి – పతనమగుచున్నాడు. **ఎందుకనగా పరమాత్మ సృష్టిలోని ప్రతీ చర్యను అనుక్షణము గమనించుచునే యున్నది.**

కావున ఎవడైతే దైవాంశమైన బుద్ధియొక్క హెచ్చరికను ప్రమాణముగా తీసికొని దుష్కార్యములకు దూరముగా ఉండుచున్నాడో వాడే నిజముగా తరించు చున్నాడు.

ఎవడైతే చంచలమైన మనస్సు కోరుకొను విషయవాంఛలపై వ్యామోహముతో పరిగెడుచున్నాడో వాడు పతనమగుచున్నాడు.

# 4.

# ద్వైత అద్వైత విశిష్టాద్వైతములు

సంక్షిప్తముగా ద్వైత మనగా జగత్తు, ఆత్మ, పరమాత్మ అన్నియు సత్యములే విభిన్నములే.

అద్వైత మనగా అంతా ఒక్కటే. రెండూ లేవు. అహం బ్రహ్మ.

విశిష్టాద్వైతము అనగా ప్రకృతి, ఆత్మ, పరమాత్మ వేరు వేరు. ప్రకృతి, ఆత్మలు పరిణామశీలాలు. పరమాత్మ మారదు. సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములని చతుర్విధంగా ఆత్మ మోక్షమును పొందును. అదియే లీనమగుట, కలియుట, సాయుజ్యము పొందుట మోక్ష ప్రాప్తి.

శ్రీ శంకర భాగవత్పాదులు వేదాంత పరంగా, కఠినతరంగా, వేదాంత పరిభాషలో చెప్పగా, శ్రీమద్వాచార్యులు, భగవద్రామానుజా చార్యులు, లౌకిక పరంగా సులభంగా, సామాన్య పరిభాషలో విడదీసి చెప్పినారు.

నిజమునకు ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతముల యొక్క తాత్పర్యమును అర్థము చేసికొనవలెనని– ఆంజనేయుడు శ్రీరాముని ప్రార్థించుచు పల్కిన పలుకులను మననము చేసికొనవలయును.

దేవా!

1) దేవా బుద్ధితో నేను నీకు దాసుడను
(ద్వైతము)

2) జీవబుద్ధితో నీ అంశను
(విశిష్టాద్వైతము)

3) మరియు ఆత్మబుద్ధితో నీవే నేను.
(అద్వైతము)

ఇది ఆంజనేయుని నిశ్చయము.

నిజముగా దేని తత్త్వము దానిదే. ఏ సందర్భములో ఏ తత్త్వము దేనిని గురించి వివరించుచున్నదో ఆ తత్త్వమును సాధకుడు మననము చేయవలయును.

ఉదాహరణకు జ్ఞానాద్వైతము పనికివచ్చును గాని కర్మలాచరించు నపుడు కర్మాద్వైతము పనికిరాదు.

సర్వము బ్రహ్మమేయని ఒక శిష్యునకు గురువు బోధించెను. శిష్యుడు దానిని మక్కికి మక్కిగా అర్థము చేసుకొనెనేగాని దాని అంతర్యమును గ్రహింపడాయెను.

ఒకనాడతడు రాజవీధిన పోవుచుండగా ఏనుగెదురాయెను. పైనున్న మావటివాడు తొలగుడు, తొలగుడు అని అరచుచుండినను, బ్రహ్మచారి (శిష్యుడు) నేనేల తొలగిపోవలెను, నేనును బ్రహ్మమే ఏనుగూ బ్రహ్మమే కదా. బ్రహ్మమునకు తనవలెనే ఏల అపాయము కలుగును? అని తనలో తాను వితర్కించుకొనుచు కదలడాయెను. తుదకు ఏనుగు వానిని తొండముతో పట్టి ప్రక్కకు విసిరివేసెను. బ్రహ్మచారికి బలమైన గాయములు తగిలెను. కొంత వడికెట్లో గురువుగారి యొద్దకు పోయి జరిగిన వృత్తాంతమును అంతయు విశదీకరించెను. అప్పుడు గురువు శిష్యున్నిట్లు మందలించెను. మంచిది! నీవును బ్రహ్మమే ఆ ఏనుగు కూడ బ్రహ్మమే. కాని మావటి బ్రహ్మము తొలగిపొమ్మని పైనుండి నిన్ను హెచ్చరించెను గదా! ఆ బ్రహ్మము మాట నీవేల వినవైతివి.

ఈ విశ్వమంతయు బ్రహ్మమేయని ప్రకటించు అద్వైత సిద్ధాంతమును ఒక రాజుకు వాని గురువు బోధించెను. ఈ సిద్ధాంతము రాజునకు బాగుగా నచ్చెను.

అంతఃపురమునకు పోయి ఆతడు రాణితోనిట్లనెను. రాణికిని రాణి దాసికిని బేధమేమియు లేదు. కాబట్టి ఆ దాసియే ఇంతటి నుండి నారాణి యగును. తన భర్తయొక్క ఈ పిచ్చి ప్రసంగమును విని రాణి నిశ్చేష్టురాలయ్యెను. ఆమె యా గురువును పిలిచి– అయ్యా మీ బోధనలయొక్క దుష్ఫలితమెట్లున్నదో చూడుడు అని మొదలిడిచు జరిగిన వృత్తాంతమును వివరించెను. ఆ గురువు రాణినోదార్చుచు ఇట్లు పలికెను. నేడు రాజునకు నీవు భోజనమిడు సమయమున అన్నముతో పాటు ఆవు పేడను గూడ పల్లెమున వడ్డింపచేయుడు. మిగిలినది నేను చూసుకొనెదనని రాణికి తెలిపెను.

భోజన సమయమందు గురువును, రాజును కలిసి భోజనమునకు కూర్చుండిరి. అన్నముతో పాటు వడ్డింపబడిన ఆవుపేడను చూచినంతనే రాజునకు కలిగిన ఆగ్రహమెట్టిదో ఊహింపనగును. దీనిని కనిపెట్టిన గురువు మందహాసము చేయుచు మెల్లగానిట్లు ప్రశ్నించెను. దేవరవారు అద్వైత జ్ఞానము కలవారు కదా! అన్నమునకును ఆవుపేడకును బేధము నేల పాటింపవలెనో కదా? రాజంత పట్టరాని కోపముతో ఇట్లరిచెను– 'మహా ఆద్వైతి' నని చెప్పుకొను మీరే చేతనైనచో ఈ పేడ తినుడు. గురువంతట వెంటనే సూకరముగా మారి లొట్టలు వేయుచు ఆ పేడను భక్షించి మరల మానవరూపమును ధరించెను. రాజంతట సిగ్గు తెచ్చుకొని మరల ఎన్నడును రాణితో వట్టి పిచ్చి ప్రసంగము చేయలేదు.

విలీనమనగా కరుగుట, కలియునది అని ముఖ్యార్థము అనగా నామరూపాలు లేకుండగా నిజతత్వాన్ని వదలి ఇతర తత్వాలతో కలియుట

కాదు. మారుట కాదు. దేని తత్వము దానిదే. “మహాదాకాశంలో అల్పాకాశం కలసిపోతుంది. కాని అదే తిరిగి వలసి వచ్చినపుడు వేరౌతుంది”

ఒక మనిషి ఇంటిలో నుండి వెడలి గుంపులో నున్న మనుషులతో కలసినాడంటే అర్థమేమి? నామరూపాలు లేకపోయినాడని అర్థమా? కాదు గదా! కొంత దూరము గుంపులో వెడలినను తర్వాత తిరిగి వెడలినప్పుడు నిజనామ రూపాలు అగుపిస్తాయి. గుంపులో నుండగా గుర్తింపలేము అంతేగాని అతడు లేకుండా పోడు. అట్లె గాలి గాలిలో కలిసిపోయినను, గాలి కూడా మిశ్రమ పదార్థమే. అందులో ఆమ్లజని, నత్రజని, ఉదజని, $CO_2$ మొదలగునవి కలవు. వైదిక భాషలో ప్రాణ, పాన, వ్యానోదాన సమానములను వాయువులను, నాగ కూర్మ క్రూకర దేవదత్త ధనుంజయమును ఉపవాయువులు కలవు. ఇంకా ఇంకా మనకు తెలియని ఎన్నో తీరుల గాలులు కలవు.

అవన్నియు దేహము పోగానే అన్ని ఒకే గాలిలో అనగా బయటి గాలిలో కలిసినట్లు అగుపించును. కాని ప్రత్యేక ప్రక్రియ ద్వారా వేరు చేయవచ్చును. పాలు నీరు కలిసినచో హంస వేరుచేయుట లేదా? ఉప్పు శర్కర దాతులు నీటిలో కలుగు నామరూపాలు పైకి అగుపించకుండా పోయినట్లు తోచినను వేడిచేసి, ఆవిరిగా మరిగించి వేరుచేయటంలేదా?

**అవి నీటిలో కలిసినట్లుగా, లీనమైనట్లుగా స్థూలదృష్టికి అగుపించినను వాటి వ్యక్తిత్వం ఉనికి ఎక్కడికి పోవడం లేదు.**

కోట్లాది శబ్దాలు మన మాటలు ఇతర రణగొణ ధ్వనులన్నియు కలిసినను రేడియో ద్వారాను, వైర్‌లెస్ ద్వారాను, మరి ఇతరములైన పరికరములతో మనకు కావలసిన ధ్వనులను వేరుగా చేసుకొని వినటం లేదా? అట్లే టి.వి.లో కోట్లాది రూపాలు ప్రతిబింబాలు విశ్వమంతటా వ్యాపించగా అందులో నుండి రావలసిన రూపాన్ని తిరిగి గ్రహించటము

లేదా? మనము చేయు ధ్వనిని గాని, మన రూపం గాని కోట్లాది సంవత్సరములైనను అవి తరంగాల రూపాలలో ప్రవహిస్తూ పోతూనే ఉంటుందని శాస్త్రవేత్తలు ఋజువు చేయటం లేదా?

ఆకాశం, గాలి అతిసూక్ష్మాతి సూక్ష్మమైన పలుచని తేలికైన పరమాణువుల సముదాయాలు. అవి పరిశుద్ధమైన పారదర్శకాలు. గాలి కాని, ఆకాశం కాని అగుపించకపోవటానికి కారణము కాంతికిరణాలు పరావర్తనం చెందకపోవటమే. మన కాంతి కిరణము ఒక వస్తువుకు తాకి అది మనకు కన్పిస్తుంది.

ఆకాశం, గాలి, అపారమైన పారదర్శకాలగుటచే అగుపడవు. తెల్లని బాగుగా పాలిష్ చేసిన గాజు తలుపులలో నుండి ఆవలి వస్తువులు క్లియర్‌గా అగుపించును. కాని అద్దాలు లేనట్లుగానే తోచును. మన కంటి సులోచనంలోని అద్దాలు అగుపించవు కదా? అద్దాలకు ఆవలనున్నవి అగుపించును.

కావున లీనమగుట అంటే సృష్టి సమయాన పరమాత్మ గర్భము నుండి విడి విడిగా విస్తరించిన చరాచర ప్రకృతి, భూతాలు వగైరాలు ప్రళయకాలాన తిరిగి ఆ పొట్టలోనికి సూక్ష్మాతి సూక్ష్మ పరమాణురూపంలో ప్రవేశించును.

లేదా పుణ్యాతిశయమున పాపాది కర్మవాసనలు తొలగి జన్మ రాహిత్యము కలుగగా ఆత్మలు ప్రవేశించుచున్నవి.

ఒకడు చదువులో లీనమైనాడని అనగా వాడు చదువుగా మారినాడనా దాని అర్థము? అందు తన్మయత్వము పొందినాడని దాని అర్థము. అంతేకాని నామరూపాలు లేకుండా పోయినాడని దాని అర్థము కాదు గదా!

లీనమనగా ఒక మనిషి వేలాదిమంది గల గుంపులో కలసినట్లుగా ఆత్మ పరమాత్మలో కలియుట అని అర్థము.

పరమాత్మ యుండు స్థానము త్రిపాద విభూతి. సమస్తమైన అండపిండ బ్రహ్మాండాలు అన్నియు కలసి ఒక పాదము మాత్రమే. కావున ఒక భాగము పోయి మూడు భాగములలో కలసిపోయినచో ఒకభాగం విడిగా కనిపించదు.

మూడు పావుల పాలలో ఒక పావు నీళ్లు కలిపినచో నీళ్లు పాలు వేరువేరుగా తెలియవు కదా! అలాగే ఆత్మ పరమాత్మలో లీనమవునని భావము.

ఈ లీనమునే పదవ్యాఖ్యానముచే భిన్నించి, ద్వైత, అద్వైత విశిష్టా ద్వైతాలు ఏర్పడినవి.

**ద్వైతము – దేహతత్వము**

**విశిష్టాద్వైతము – జీవతత్వము**

**అద్వైతము – ఆత్మతత్వము**

అన్నీ ఒకటే అయినా ఏ స్థితిలో అవి ఉండనే ఉన్నవి. జీవుడు అన్ని దశలలో, అన్ని తత్వములలో తరించి తీరవలసినదే.

ఒక రంగు బుట్టలో అన్ని రంగుదారాలు కలసి ఎలానేయబడినవో ఈ సిద్ధాంతాలు అలాగుననే ఉన్నవి.

# 5.
# ఓంకారము

ఈ ఆత్మ 'ఓం' అన్నది ఒక శబ్దంగా చెప్పినప్పుడు దానితో తాదాత్మ్యం చెప్పుకోవాలి. అది భాగాలతో చెప్పినప్పుడు – ఆత్మయొక్క పాదాలు ఈ భాగాలు పాదాలలో ఒకటిగా చెప్పుకోవాలి.

**ఓం భాగాలు : అ – ఉ – మ – అర్ధమాత్ర లేక అమాత్ర**

పృథివి, అగ్ని, ఋగ్వేదము, భూలోకము, బ్రహ్మ అనునవి ఓంకారము లోని 'అ' కారం కరుగగా, కలియగా, లీనమవగా మొదటి అంశంలో పుట్టినవి.

అంతరిక్షం, యజుర్వేదం, భువర్లోకం, సనాతనుడైన విష్ణువు ఓంకారములోని 'ఉ' కారము లీనమవగా రెండవ అంశగా పుట్టినవి.

సువర్లోకము, సూర్యుడు, సామవేదము, స్వర్గలోకము, మహేశ్వరుడు, ఓంకారములోని 'మ'కారము కరుగగా మూడవ అంశలో పుట్టినవి.

'అ' కారము పసుపు వర్ణము కలది, రజోగుణము వలన పుట్టినది.

'ఉ' కారము తెల్లని వర్ణము కలది సత్వగుణం వలన పుట్టినది.

'మ' కారము నల్లని వర్ణము కలది. అది తమోగుణము వలన పుట్టినది.

ఓ ధనుంజయా! అకార, ఉకార, మకారాదులు ఒకదాని నుండే పుట్టినవి. అదియే ఓం. అదియే జ్యోతి స్వరూపమైనది.

ప్రణవము అంతటను వ్యాపించునది. కావున ఏకము చేసి అభ్యాసము చేయవలయును.

ఇట్టి ప్రణవము




**మూడు సూత్రాలు :**




**ముగ్గురు బ్రహ్మలు :**



**మూడు అక్షరాలు :**

- **అ**
- **ఉ**
- **మ**

**త్రిమాత్రలు :**

- **బిందువు**
- **నాధము**
- **కళలు**

**రెండు అర్ధమాత్రలు :**

- **కళాతీతము**
- **తత్పరము**

అష్టాంగాలను, నాలుగు పాదములను, మూడు స్థానాలను, ఐదుగురు దేవతలను, ఓంకారమును తెలుసుకొనని బ్రాహ్మణుడు బ్రాహ్మణుడు కాడు.

అష్టాంగగ చతుష్పాదాలు యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులు, 2 భుజాలు, 2 పాదాలు, 2 కరాలు, 1 ఛాతి, 1 నొసలు, ప్రణవార్ధలో 1 భగవంతుడు, 1 అతని స్థూల 1 అతని సూక్ష్మ, 1 మహాశరీరాలు, 1 జీవం, 1 జీవస్థూలత, 1 జీవ సూక్ష్మత, 1 జీవ మహారూపకత.

**పంచ దైవతములు :**

- **వర**
- **వ్యూహ**
- **విభవ**
- **అంతర్యామి**
- **అర్చాదైవములు**

ఓంకారమే శ్రేష్టమైన రూపము. అదియే పరమాత్మగా పరివర్తనము చెందును. నేను ఓంకారమునందే ప్రవేశించుచున్నానని శ్రీకృష్ణపరమాత్ముడు అర్జునునకు తెలిపెను. దీనివల్లనే పుట్టించుట, రక్షించుట, గిట్టించుట జరుగును. ఇట్లు సృష్టి, స్థితి, లయములు ఓంకారము వల్లనే జరుగుచున్నవి.

భూర్భువస్సువః మొదలగు వ్యాహృతులచే శరీరము పరిశుభ్రమగుచున్నది. అట్లే ఓంకార ధ్వనిచేత మనస్సు పరిశుభ్రమగుచున్నది.

సమస్తమైన మంత్రాలకు ఓంకారము ప్రాణమని చెప్పబడుచున్నది. అందుకే సమస్తమైన అజ్ఞానము తొలగుటకు ఓంకారమును ధ్యానింపవలయును.

ప్రణవము యొక్క శిరస్సుననే ఆత్మ యుంటున్నది. దాని లక్ష్యము బ్రహ్మమనబడును. బాణాన్ని ధనస్సుతో సంధించి గురిపెట్టి లక్ష్యం వైపు విడిచినట్లు జాగురూకతతో, ఏకాగ్రతతో ఓంకారమున ఆత్మను సంధించి పరమాత్ముని వైపు వదలవలయును. ఓంకారమాధారంగా భగవంతుని చేరవలయునని భావము. ఇచ్చట ధనస్సు అనగా ఓంకారము ఆత్మ అనగా బాణము.

ఈ విధముగా నడచినచో అనగా బాణాన్ని గురిపెట్టి కొట్టినట్లుగ చేసినచో ఇహపర దృష్టి పోయి అంతర్దృష్టి ఏర్పడును. ఓంకారము నుండే వేదాలు జనించినవి. ఓంకారమే సమస్తమనబడును.

ఓంకారములో నుండియే మూడు లోకాలలోని సమస్థ చరాచరములు పుట్టుచున్నవి. ఓంకారమే శ్రేష్టమైన రూపము. అదియు హృదయకమలము నందున్నది.

కావున సర్వశక్తి కలదియును అంతటను వ్యాపించినదియగు ఓంకారము ఒక్కదానినే అభ్యసించవలయును. ఆ ఓంకారమును పొట్టిగా పలికిన పాపములను నశింపచేయును. దీర్ఘముగా పల్కిన మోక్షము వచ్చును.

ప్రణవము యొక్క అర్థము చెప్పుటకు శక్యము కాదు. దానిని తెలిసికొనిన వాడే తెలిసినవాడు. ఓంకారము వల్లనే శ్రీవిష్ణువు, త్రినేత్రుడు, బ్రహ్మ జన్మించిరి.

'ఓంకారము' మరియు 'అధ' అను ఈ రెండు పూర్వము బ్రహ్మయొక్క కుతికను ఛేదించుకొని వచ్చినవి. కావున ఈ రెండు పదాలును మంగళ దాయకములు. కావుననే ఓంకారున్ని అధ అను శబ్దాన్ని కావ్యారంభమున వాడుట జరుగుచున్నది.

ఈ అన్ని శబ్దాలలో ఓంకారము పరమోత్తమమైనది.

ఓంకారమే పరబ్రహ్మము. కావున ఓంకారమే శ్రేష్టముగా స్మరించ తగినది. ఓంకారనాధమును వినుటచే, కీర్తించుటచే మరియు జపించుటచే గూడ పరమపద ప్రాప్తి కలుగుచున్నది. కావున ప్రతినిత్యము అనగా ఎల్లప్పుడు ఓంకారమునందాసక్తి కలవాడవు కమ్మని శ్రీకృష్ణుడు అర్జునునికి ఉపదేశించెను.

దానిని పల్కినంత మాత్రముననే పరమాత్మను పొందెదరు. అగ్నిమయమైన అనగా తేజోవంతమైన రూపము ఆ ప్రణవోచ్చారణ చేయువారి యందు అధిరోహించియుండును.

'ఓం' ఒక్కటే నాశనము కాని పరబ్రహ్మాత్మకము. దీనిని ఎల్లప్పుడు మనస్సులో ఎవరు స్మరించుచు దేహాన్ని విడుస్తారో వారికి పరమపదము లభించును.

ఓంకారము అనే పదాన్ని ధ్యానించటం వల్లనే శ్రీవిష్ణువునకు విష్ణుత్వము, బ్రహ్మకు బ్రహ్మత్వము, శివునకు శివత్వము కలిగెను.

**విష్ణుత్వమనగా – సర్వవ్యాపకత్వము**

**బ్రహ్మత్వమనగా – సర్వజ్ఞానము**

**శివత్వమనగా - మేలు కలిగించెడు శక్తి.**

బ్రహ్మకు సృష్టించే శక్తి, శ్రీవిష్ణువుకు రక్షించే శక్తి, శివునకు లయింపచేసే శక్తి ఓంకారము వల్లే వచ్చినవి.

ఓ భారతా! ఓంకారాన్ని మొదటగా నుంచి నాకు నమస్కారము చేయుము. నన్నే శరణు వేడుము. ఓ పార్థా! మోక్షము నిచ్చుచున్నానని గీతాచార్యుడు పలికెను.

ఈ అక్షరమే శ్రేష్టమైనది. ఈ అక్షరమును లెస్సగా గ్రహించి ఎవడు దేనిని కోరుచున్నాడో వానికి అది దొరకగలదు. ఓంకారమే వేదవేదాంత సారము మరియు



# ౬.
# సృష్టి - పంచభ్రమలు

అజ్ఞానమగు భ్రమ నుండి విముక్తినొందిన మాత్రమే జీవులు తరింప గలుగుదురు.

1) జీవేశ్వరులు భిన్న రూపులనబడు భ్రాంతి మొదటి భ్రాంతియగును.

సూర్యబింబమునకును ప్రతిబింబమునకును బేధము లేదని తెలుసు కొన్నచో మొదటి భ్రాంతి తొలగును.

**దీనినే "బింబ ప్రతిబింబ న్యాయము" అందురు.**

2) ఆత్మయందు కర్తృత్వము వాస్తవముగ కలదను భ్రాంతి రెండవ భ్రమ యగును.

స్ఫటికమణికిన్ని దాని సంబంధమగు మెరుపు పుష్పముచే కలిగెడు స్ఫటికమందుగల రక్తవర్ణమునకును గల తత్వము గ్రహించినచో ఆత్మయందు కల కర్తృత్వ భ్రమ తొలుగును.

3) శరీర త్రయముతో గూడినవాడే జీవుడని గల భ్రమ మూడవ భ్రమయగును.

ఘటమహాకాశము యొక్క నిజము తెలిసికొన్న ఆత్మ అసంగ స్వరూపమను బోధకలిగి సంగభ్రమ నివృత్తియగును.

4) జగత్కారణమగు బ్రహ్మమునకు వికారిత్వము కలదను భ్రాంతి నాల్గవ భ్రమయగును.

కనకకుండల కీరీట కంకణాదుల యొక్క తత్వము తెలిసికొనిన బ్రహ్మమునకు వికారిత్వము కలదను భ్రమ తొలుగును.

5) అట్టి కారణమగు బ్రహ్మము కన్న జగత్తు చిన్నయను సత్యబుద్ధి ఐదవ భ్రమ యగును.

రజ్జుసర్పదర్షనముచే కారణమునకు భిన్నముగా కార్యము లేదను చోదనము కలిగిన జగత్సత్యత్వబుద్ధి నివృత్తియగును.

# 7.
# భక్తి - జ్ఞాన సందర్శనములు

పరభక్తియు, పరజ్ఞానమును ఒక్కటియె.

ఎవనిని వేదాంతులు, బ్రహ్మమందురో వానినే యోగులు ఆత్మయనియు భక్తులు భగవంతుడనియు చెప్పుదురు. ఒకే బ్రాహ్మణుడు అర్చన చేయునప్పుడు అర్చకుడనియు వంటచేయుటకై వినియోగింపబడినపుడు వంటబ్రాహ్మణుడని చెప్పబడును కదా!

నిజమైన జ్ఞానమనగా ఎట్టిది? జ్ఞాని ఇట్లు పలుకును.

పరమేశ్వరా! లోకమున నీవొక్కడవే కర్తవు. నేను నీ చేతిలోని అత్యల్పమైన ఉపకరణ మాత్రమును, నాదేమియు లేదు అంతయు నీదే. నేను, నా కుటుంబము, నా సంపదలు, నా గుణగణములు సమస్తము నీవే.

**ఒక భక్తుడు :** ఒకానొకడు గృహస్థుడయ్యుండియు బ్రహ్మజ్ఞానము పొందెనని నీవెట్లు చెప్పగలవు.

**శ్రీగురుదేవుడు :** హరి నామము విన్నంతనే అశ్రువులును, గగుర్పాటును కలుగుటయే అందులకు గుతు. భగవన్నామ శ్రవణ మాత్రమున ఎవ్వని కన్నుల నుండి భాష్పములు వెల్లివిరియునో ఎవ్వరికి రోమాంచమగునో అతడే జ్ఞాన లాభమును పొందినవాడు.

జ్ఞానమును భక్తియును సమన్వయించు ఒకానొక పురాణకథ గలదు. భగవానుడగు శ్రీరామచంద్రుడు తన ప్రియభక్తుడగు హనుమంతునిట్లడిగెను– వత్సా! నీవునన్నెట్లు ధ్యానింతువో, భావింతువో చెప్పుము.

హనుమంతుడిట్లు విన్నవించెను. స్వామి దేహబుద్ధితో నేను నీ దాసుడను. జీవబుద్ధితో నేను నీ అంశను. ఆత్మబుద్ధితో నీవే నేను అనియు నాకు అనుభూత మగుచుండును.

చెరువులో నీటిపై తేలు చెత్తను పాచిని కొంచెము తొలగద్రోసిన ఎడల మరల వచ్చియవి నీటినావరించును. కాని వానిని బాగుగా తొలగించి ఎదురు కఱ్ఱలలను అడ్డముగా కట్టినెడదల అవి మరల క్రమ్ముకొనజాలవు. అటులనే మాయను ఎన్నడో ఒకసారి నిరోధించిన ఎడల మరల వచ్చి యది మనలను భావించుచుండును. కాని హృదయమున భక్తి, జ్ఞానములను ఆవరణములను నిర్మించుకొనిన యెడల మాయ ఇక మననావరింపజాలదు. అప్పుడది శాశ్వతముగా తొలగిపోవును.

**ఇదియే భగవత్సాక్షాత్కారము లభించు మార్గము.**

## భక్తిజ్ఞానముగా ఎట్లు పరిణమించును

అద్వైత జ్ఞానమే మహోత్తమము. కాని భగవంతుని మొదట సేవ్య సేవక భావముతో (అనగా భగవంతుడు ప్రభువనియు తాను సేవకుడనియు) ఉపాసింపవలయును. ఇదియే అత్యంత సులభమైన మార్గము. అచిరకాలములోనే అయ్యది మహోత్తమమగు అద్వైత జ్ఞానమును పొందించును.

అద్వైత జ్ఞానమే అత్యుత్తమయ్యును భక్తి క్రమమున నీవు మొట్టమొదట భగవంతుని ఉపాస్యునిగను నిన్ను ఉపాసకునిగను భావించుకొని భక్తి చేయ వలయును. అప్పుడు సులభముగా జ్ఞాన లాభము కలదు.

పంచభూతాత్మకమగు పంజరమున చిక్కి స్వయముగా బ్రహ్మమే రోధన చేయుచున్నది.

కన్నులు మూసుకొని నీవు ముల్లు లేదు, ముల్లు లేదు అనుకొందువు గాక. కాని నీవు ముల్లును తాకినంతనే అది గ్రుచ్చుకొనుటచే "అబ్బా!" అని చేతిని ఈవలకు లాగుకొందువు. అటులనే జనన మరణములు, పుణ్య పాపములు, మొదలగు ద్వంద్వములకు అతీతుడవని, అఖండ సచ్చిదానంద బ్రహ్మమనియు నీవెంతగా భావించుకొనినను – శరీరమునకు వ్యాధియో సంభవించినను – మనస్సు విషయాకర్షనకు లోనై కామిని కాంచనమున తగుల్కొని పాపకార్యములు చేయ నిన్ను ప్రేరేపించినపుడు నీవు మోహితుడవగుచున్నావు. దుఃఖాదీనుడవగు చున్నావు. తుదకు అవివేకియై సత్ప్రవర్తనమును వీడి మాయాజాలమున చిక్కుకొనుచున్నావు.

కావున భగవంతుడు స్వయముగా కరుణింపనిదే– మహామాయ నీకొరకు మోక్షద్వారము తెరవనిదే నీవెన్నటికిని "ఆత్మసాక్షాత్కారము"ను పొంది దుఃఖా తీతుడవు కాజాలవని గ్రహింపుము.

**ఆ వరప్రదాతయైన యా శ్రీ శ్రీనివాసుడే ప్రసన్నమైనప్పుడు నరులు సంసార బంధ విముక్తులగుచున్నారు.**

మహామాయ కరుణించి సాధకుని మార్గము నుండి ఒత్తిగిలిననే కాని బ్రహ్మసాక్షాత్కారము నీకెన్నటికిని కలుగదు.

ఆ భగవంతుడు తన కృపాకటాక్షమును వానిపై ఒరిపినంతనే అతడు ధన్యుడై భగవత్సాక్షాత్కారమును పొందును. సమస్త దుఃఖాతీతుడగును. లేనిచో నీవెంతటి వివేక వైరాగ్యాది సాధనలననుభవించినను అన్నియును నిష్ప్రయోజనములే.

ఒక్క ఓమము పాయ నూరు మెతుకుల నరిగించును. అని చెప్పుదురు కాని జీర్ణకోశము చెడిపోయిన పక్షమున నూరు ఓమము పాయలైనను ఒక్క మెతుకును అరిగింపలేవు.

నిర్గుణ సాక్షాత్కారవేు జ్ఞానయోగి అభీష్టము. కాని సర్వసాధారణముగా అట్టివాడే కలియుగమున భగవంతుని భజించుచు, ప్రార్థించుచు, వానికి ఆత్మార్పణమొనర్చుటయే శ్రేయస్కరమని చెప్పవలసియున్నది. భగవవానుడు తన భక్తిని రక్షించును. భక్తుడు తపించునేని బ్రహ్మజ్ఞానమును తప్పక యొసగును. జ్ఞానయోగి ఇట్లు భక్తి, జ్ఞానములను రెండింటిని కూడా పొందవచ్చును

భక్తుడు సర్వసాధారణముగా సగుణ బ్రహ్మసాక్షాత్కారముతో తృప్తి నొందును. కాని భగవానుడు వానిని తన అఖండ ఐశ్వర్యమునకు వారసునిగా నొనర్చి భక్తిజ్ఞానములను రెంటివని గూడా ప్రసాదించును. సగుణ బ్రహ్మ సాక్షాత్కారమే గాక, నిర్గుణ బ్రహ్మసాక్షాత్కారము కూడా కలుగును.

**ఎవ్వడైనను కలకత్తా చేరగల్గినచో అందలి మైదానమును, ఆక్టర్లోని స్తూపమును, మ్యూజియమును, చూడదగిన ఇతర వస్తువులను చూడజాలక పోవునా?**

భక్తుడెన్నడైనను భగవంతునితో పరిపూర్ణ ఐక్యము పొందునా? ఐనచో ఎట్లు పొందును.

జీవాత్మ భగవంతునితో పరిపూర్ణైక్యమును పొందును. అట్లు ఐక్యమును పొందునపుడే "నేనే బ్రహ్మమును" అని చెప్పకలుగును.

ఇంటియందలి వృద్ధ సేవకుడు కాలక్రమమున ఇంటిలో ఒకడుగా పరిగణింపబడును. గృహయజమాని వాని సేవాతత్పరతను జూసి చాలా సంతోషించి యొకానొక దినమున వానిని తాను కూర్చుండు గౌరవస్థానమున కూర్చుండబెట్టి, నాటినుండి తనకును, వానికిని భేదము లేదని తన చుట్టున్న వారికి చెప్పును. మరియు ఇతడును నేనును ఒక్కటియే.

నాయెడ మీరు విధేయులై ప్రవర్తించు రీతిని ఈతని యెడల కూడ ప్రవర్తించుడి. అటుల చేయనివారు శిక్షాపాత్రు లగుదురని చెప్పును.

ఇట్టి గౌరవమును వాడు పొందుటకు వినయముచే సంకోచించినను యజమానుడే బలవంతముగా వానిని ఉత్తమాసనమున కూర్చుండబెట్టును.

**చిరకాలము భగవంతుని సేవించి వానితో ఐక్యము నొందు భక్తుల విషయము కూడా ఇట్టిదే.**

భగవంతుడు కృపాపూర్ణుడై తన అఖండైశ్వర్యమును, అనంత కళ్యాణ గుణములను అట్టి భక్తునకు ఒసగి వానికి స్వయముగా తనలోకేశ్వర పదవి ననుగ్రహించును.

భక్తుడు సర్వసాధారణముగా బ్రహ్మజ్ఞానము లభిషాసింపడు, కాని యాతడు శ్రీకృష్ణుని, శ్రీ శ్రీనివాసుని, శ్రీ పరమేశ్వరుని, లేక యా జగజ్జనని దివ్యావతారములనో సాక్షాత్కారించుకొన్నంత మాత్రముననే సంతుష్టుడగును.

సమాధి స్థితిలో తన ప్రత్యేకత నిర్మూలము కారాదని ఆతడు భావించును. బ్రహ్మమును పురుషోత్తమునిగా గాంచి అట్టి దివ్యానుభవము పొందుటకు తగినంత వ్యక్తిత్వము తనకుండవలెనని అతని అభిలాష. **అతడు పంచదార కాగోరడు. అతడు పంచదారను రుచిచూడదలచును.**

శ్రీ శ్రీనివాసుడు తానే వేదాంతోక్తమగు బ్రహ్మమని వక్కాణించు చున్నాడు. అతడే అహంకారమును నిర్మూలించి బ్రహ్మజ్ఞానము నొసంగగలడు.

నిత్యమేది, అనిత్యమేది అను విచారణ మూలముసను నీవు ఇట్లు బ్రహ్మజ్ఞానమును పొందవచ్చును. మరియు భక్తిమూలమునను బ్రహ్మజ్ఞానమును బడయవచ్చును.

భక్తి కోసము - వికాసము కోసము - ఆత్మ సమర్పణకోసము నిరంతరము అతనిని ప్రార్థించుటయే భక్తియోగతత్వము.

వీని మూలమున మొదట అతని సాన్నిధ్యమును పొందుము. నీ ప్రార్థన హృదయపూర్వకమైనచో అతడు ఆలకించి తీరునని నామాటగా నమ్ముము అని శ్రీ గురుదేవులు వచించిరి. కాని నీవందులకై వేచియుండవలయును.

అతని నిర్గుణ తత్వమును సాక్షాత్కరించుకొనెదలచితివా- మరల అతనినే ప్రార్థింపుము. అతడు నీ ప్రార్థన ఆలకించెనేని - అతడు సర్వశక్తిమయుడు కదా - సమాధిస్థితిలో నీకాతని నిర్గుణ తత్వము అనుభూతమగును.

**ఇదియే ఆత్మ జ్ఞానము**
**ఇదియే బ్రహ్మ జ్ఞానము**

# జ్ఞానికి - భక్తునకు మనోభావమున గల బేధము

సాధకులు ఇరుతెగలుగా కన్పించుచున్నారు. ఒకరిది మర్కట కిషోర న్యాయము, రెండవ తెగవారిది మార్జాల కిశోరన్యాయము.

ఇట్లే జ్ఞానమార్గమును నిష్కామ కర్మమార్గమును అవలంబించువాడు మోక్షమునకు స్వప్రయత్నముపై ఆధారపడును. భక్తిమార్గము నవలంబించువాడు, సమస్తము ఈశ్వరేచ్ఛచే జరుగుచున్నదని గ్రహించి పరిపూర్ణ విశ్వాసముతో వాని అనుగ్రహముపై ఆధారపడి వానికి సంపూర్ణముగా ఆత్మార్పణ మొనర్చుకొనును.

అనగా జ్ఞానము-జ్ఞాన మార్గము - మర్కట కిషోరన్యాయము వంటిది, భక్తిమార్గము మార్జాల కిషోరన్యాయము వంటిది.

జ్ఞాని నేనే శుద్ధబ్రహ్మముననును. కాని భక్తుడు ఈ సర్వస్వము ఈశ్వరు విభూతియేయనును.

**1) ఈ సమస్త ప్రపంచము - నేనే**

**2) ఈ సమస్త ప్రపంచము - నీవే**

**3) నేనే సేవకుడను - నీవు ప్రభువువు.**

ఈ మూడు మనోభావములయందును ఏదేని ఒకదానియందు చక్కగా నెలకొని యుండువాడు మాత్రమే భగవత్సాక్షాత్కారము పొందగల్గును.

శివాంశముచే జన్మించునట్టివాడు జ్ఞానియగును. బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్య అను జ్ఞానము పొందుటయే వాని అదృష్టము.

కాని విష్ణువాంశముచే జన్మించినవానికి భక్తివిశ్వాసములెన్నడును కొరవడవు. నిత్యానిత్య వస్తు విచారణముచే, లేక తార్కిక జ్ఞానమహిమచే

తాత్కాలితముగా వాని భక్తి విశ్వాసము లొకప్పుడు క్షీణించినను సకాలమున అయ్యది యాదవకుల నాశనమైన ముసలము వలె విజృంభించును.

జ్ఞాని హృదయమున ప్రవహించు ప్రజ్ఞాన గంగ ఒకే దిశగా ప్రవహించును. వానికి సమస్త జగత్తును స్వప్నతుల్యముగా తోచును. అతడు సదా ఆత్మయందే నెలకొనియుండును.

కాని భక్తుని హృదయమందలి ప్రేమగంగ యో సదా ఒకే దిశగా ప్రవహింపదు. దానిలో పోటు పాటులుండును. భక్తుడు ఒకప్పుడు నవ్వును, ఒకప్పుడు ఏడ్చును. ఒకప్పుడు ఆడును, ఒకప్పుడు పాడును.

భక్తుడు ఎల్లప్పుడు భగవత్సాన్నిధ్యముచే కలుగు ఆనందమిననుభవింపగోరును. సముద్రమున తేలియాడు మంచుకొండవలె ఆయానంద సాగరమున ఒకానొకప్పుడు ఈదులాడుచు, ఒకప్పుడు మునుగుచు, ఒకప్పుడు తేలుచు అందే నెలకొనియుండ అభిలాషించును.

పురాణముల ప్రకారము భక్తుడు భగవంతునికంటె భిన్నుడు– భక్తుడు ఒక తత్వము – భగవంతుడు ఒక తత్వము.

**ఈ దేహము – ఒక ఘటము వంటిది**

**మనోబుద్ధి, చిత్త, అహంకారములే – అందలి నీరు**

**బ్రహ్మము – సూర్యుని వంటిది**

బ్రహ్మము అంతఃకరణమును నీటిలో ప్రతిబింబించుచున్నది. కావున భక్తుడు వివిధ దివ్యరూపములను దర్శించుచుండును.

కాని వేదాంత ప్రకారము బ్రహ్మయొక్కటియే సత్యము. మిగిలిన దంతయు మాయ – స్వప్నమువలె మిథ్య.

బ్రహ్మసాగరమున– నేను అను ఈ కట్ట పడియున్నది. ఈ కట్టను నీవు తొలగించితివా అఖండ జలము (ఒక్కటియే) గోచరించును. కాని

కట్టయున్నంత వరకు, జలము రెండు భాగములుగా విభజింపబడినట్లు కట్టకు ఇరువైపుల కన్పించును.

నరుడు సమాధి స్థితి పొందినంతనే బ్రహ్మజ్ఞానము ఉదయించును. అహంకారమపుడు నిర్మూలమగును. వేదాంత ప్రకారము జాగృతావస్థ కూడ మిథ్యయే.

నారదుడు మొదలగు ఆచార్యపురుషులు బ్రహ్మజ్ఞానమును పొందిన పిమ్మట కూడా లోకహితార్థము భక్తినవలంభించిరి.

జ్ఞానము పురుషుని వంటిది – భక్తి స్త్రీవంటిది. భగవంతుని కొలువు కూటము వరకే జ్ఞానమునకు ప్రవేశము లభించును. కాని భక్తి భగవంతుని అంతఃపురమున కూడ ప్రవేశించును.

ఒకప్పుడు ఒక జ్ఞాని ఒక భక్తుడు అరణ్యము గుండా పోవుచుండిరి. దారిలో వారికొక పెద్దపులి కన్పించెను.

మనము పారిపోవుటెందులకు? సర్వశక్తిమంతుడగు భగవంతుడు మనలను రక్షించును కదా? అన్నాడు జ్ఞాని.

కాదు అన్నా! మనము పరిగెత్తుదము. స్వప్రయత్నముచేతనే మనము నెరవేర్చగల పనికి భగవంతుని శ్రమపెట్టుటెందులకు అన్నాడు భక్తుడు.

**శ్రీ గురుదేవుడు :** భక్తి చంద్రుని వంటిది. జ్ఞానమో సూర్యుని వంటిది.

ఉత్తర దక్షిణ ధృవములకడ సముద్రములు కలవనియు అందలి నీరు చాలావరకు మంచుగడ్డలుగా నేర్పడుననియు వానియందు ఓడలు చిక్కుకొను ననియు వినియున్నాను.

**ఒక భక్తుడు :** భక్తిమార్గమున కూడా జనులిట్లా మార్గమధ్యమున చిక్కుకొందురా ఏమి?

**శ్రీ గురుదేవుడు :** ఔను చిక్కుకొందరు. కాని దాని వలన భయము లేదు. వారిని బంధించు మంచుగడ్డలు అఖండ సచ్చిదానంద సాగరమందలి జలమే కాని వేరొకటి కాదు కదా!

బ్రహ్మమే సత్యము. జగత్తు మిథ్య అని నీవు వివేచన చేయుదువేని ఆ మంచుగడ్డలు జ్ఞాన తేజమున కరిగిపోవును. అపుడిక మిగులునదేది.

**అఖండ సచ్చిదానందసాగరమందలి**
**నిరాకార బ్రహ్మమను జలము**

# పురుష ప్రయత్నము

ప్రపంచములో రాజకీయ జ్ఞానము, సంగీత జ్ఞానము, అస్త్రజ్ఞానము, శస్త్రజ్ఞానము, ఆయుర్వేదము, అలోపతి అనునవి ఎన్నియో జ్ఞానములు కలవు.

అయినను క్షేత్ర క్షేత్రజ్ఞులను గూర్చిన జ్ఞానమే తన సృష్టియందు వాస్తవమగు జ్ఞానమని భగవానుడు పలికెను. లౌకిక జ్ఞానములు నూరు బడయవచ్చును గాక, భౌతిక శాస్త్రముల వెయ్యిటియందు ప్రావీణ్యము పొందవచ్చును గాక కాని అవియన్నియును కలిసినప్పటికి మనుజుని మృత్యుముఖము నుండి తప్పించజాలవు కదా! సంసార బంధము నుండి విడిపించజాలవు. దుఃఖమును అంతము చేయజాలవు.

జీవితమందలి ప్రధాన సమస్య తన్నుతాను తరింపజేసికొనుట. తక్కిన సమస్యలన్నియును గౌణములే. ఏలయనగా అవి యన్నియు ఈ జన్మకు సంబంధించినవి. ఈ జన్మకు మాత్రము ఉపయోగపడునవి. రాబోవు జన్మను నివారించుటకు గాని, రాబోవు దుఃఖమును తొలగించుటకు గాని వాటికి శక్తి లేదు.

**జన్మ వచ్చిన తరువాత బాధలను నివారించుకొనుట సామాన్య పద్ధతి. అసలు జన్మమే రాకుండ చేసికొనుట ఉత్తమ పద్ధతి.**

"Prevention is better than cure" అను ఆంగ్ల సామెత కూడా దీనినే బోధించుచున్నది.

చెట్టుయొక్క కొమ్మలు నరికినను, ఆకులు త్రుంచివేసినను చెట్టు చావదు. తుదకు మొదలు ఛేదించినప్పటికి చావదు. మరల చిగురు వేసికొని పైకి వచ్చును.

**మూలము పెకిలించి వేయవలయును. దుంపను త్రెంపవలయును.** అపుడే ఆ వృక్షము సమూలముగా నశింపగలదు.

అట్లే ఈ సంసార వృక్షమునకు బీజము మూలము అజ్ఞానము. దానినట్లే యుంచి పై పూతలెన్ని పూసినను మానవుడు శోభింపనేరడు. అది తొలిగిననే మానవునకు దివ్యత్వము, అపునర్జీవము లభించును.

శరీరము పై భాగమున శిరస్సు గలదు అయినను శిరస్సు యొక్క ఉపరిభాగమున నల్లటి వస్తువు ఒకటి తిష్టవేసికొనియున్నది. అదియే జుట్టు. దాని వర్ణము కారునలుపు. నలుపుదనము తమ గుణసూచకము. అజ్ఞాన చిహ్నము.

నేను మానవులందరి శిరస్సుపైకెక్కి సవారి చేయుచున్నానని, ఆ అజ్ఞానము ఘోషించుచున్నదా అనిపించును.

**అందువలననే కాబోలు- తిరుపతి వేంకటేశ్వరుడు ముందు ఆ జుట్టు వదిలింపి తన సన్నిధికి వచ్చునటుల జనులకు ఏర్పాటు చేసెను.**

జుట్టును తొలగించుటయనగా తమోగుణమును నివారించుటయని అర్థము. అజ్ఞానమును బహిష్కరించుటయని అర్థము.

ఓ జీవులారా! మున్ముందు మీలోయున్న బహుజన్మార్జితమగు తమస్సును, అహంకారమును, అజ్ఞానమును పారద్రోలి ఆ పిదప దైవదర్శనమునకు రండు అని చెప్పుటయే యగును.

నిజముగా విచారించినచో వేలకొలది పురుషులు స్త్రీలు తమ బహుకాల సంవర్ధిత సుందర కేశపాశములను ఒక్కతృటిలో తిరుపతి కొండపై త్యజించివేసి తాత్కాలికముగనైనను దేహాబిమానమునకు తిలంజలి యొసగుట ఒక గొప్ప పరిణామమే!

కాని ఇంతటితో ఆగక తమ మనస్సునందలి వాసనలను, దుష్టగుణము లను, దుస్సంకల్పములను, అజ్ఞాన వృత్తులను కూడా గరిగించివేసి విశుద్ధ హృదయులై భగవద్దర్షనము చేసికొనవలయును. అత్తరి ఇక భగవద్దర్షనమను మాటేమి? తానే భగవంతుడై వెలయును.

కావున మానవుడై పుట్టినపిదప ప్రప్రథమ కర్తవ్యము తమ అజ్ఞానమును నశింపచేసికొనుటయే. ఈ సాధనలో నిభాగముగానే శ్రీగీతాచార్యుడు జీవునకు ఈ క్రింది నియమావళిని పొందుపరచినాడు.

క్షేత్రజ్ఞుడగు జీవుడు శరీరముతో అలవరచుకొను స్వభావ విశేషములు 20 కలవు (Twenty).

1) విద్యా, ధన, వంశముల గొప్పతనము తనకున్నను పెద్దలను అనాదరించరాదు.

2) లోకులు తనను కీర్తించవలయునను కాంక్షతో, మనస్సులో లేకున్నను పైపైకి నటించుట తగదు.

3) మనోవాక్కాయ కర్మలతో పరులను హింసించ కూడదు.

4) నరులు తనను హింసించిరని వారినేదో చేసి తీరవలెనను ఉద్రేకము లేకుండా యుండవలయును.

5) మనస్సును తలచినదే పలుకుట, అదే తను ఆచరించుట అనెడి ఋజుత్వము కలిగియుండవలయును.

6) ఆత్మజ్ఞాన జన్మనొసగు గురువే ఆచార్యుడు. వానియెడ దైవభావము కలిగి యుండవలయును.

7) శాస్త్ర నియమములకు తగినట్లుగా మనస్సును, మాటను, దేహమును సరిదిద్దుకొని ప్రవర్తించవలయును. అదియే శుచి.

8) ఆచార్యుడు తెలిపిన విషయము నాచరించుటలో ఎన్ని ఆటంకములు వచ్చినా చలింపకుండవలయును.

9) వివేకమును శుష్కింపచేయు విషయముల నుండి మనస్సును మరల్చి స్వాధీనమందుంచుకొనవలయును.

10) ఆత్మజ్ఞానము కోరువాడు కంటితో గ్రహించే బాహ్యారూపముల యందు, ముక్కు గ్రహించు పరిమళములయందు, చెవి గ్రహించు వివిధ శబ్దముల యందు నాలుక గ్రహించు రుచుల యందు, చర్మము గ్రహించు స్పర్శల యందు కోరిక లేకుండా, రుచి తగ్గించుకొనవలయును. వీటిని సాంస్పర్శికము లంటారు. వాటి దోషములను తలచుకొనవలయును.

**ఆర్జనలో దుఃఖము**
**కాపాడుటలో దుఃఖము**
**ఆర్జించినది పోతుంటే దుఃఖము**

**ఆర్జన అధికమైతే దుఃఖము**
**ఆర్జించినది అనుభవిస్తూ ఆరోగ్యం చెడితే దుఃఖము**

**ఇలా అన్నీ దుఃఖాలే కదా!**

11) శరీర భావాన్ని తృంచివేసి క్రమక్రమముగా ఆత్మభావనను పెంచుకొన వలయును.

12) పుట్టుట గిట్టుట, దుర్భరమైన వార్ధక్యం, మధ్యకాలంలో వ్యాధుల బాధ, ఇవన్ని కల్గించే దుఃఖమును మరువక శరీరమున్నంత వరకు అవి తప్పనిసరియని తలంచవలయును.

13) ఆత్మ పరమాత్మలయందు మనస్సుంచుటచే బాహ్యా విషయముల యందాశ త్రుంచవలయును.

14) వదలినా సంతానము, భార్య, ఆస్తిపాస్తులు, వ్యాపారాదులు, ఇవి వదల రాదుకదా! వీటిని అభిమానికములంటారు. శారీరక ధర్మవికాసపరమై నంతవరకు ఆచరించే కర్మలకు ఉపయోగించు నంతవరకు వాటిని స్వీకరించివలసిందే లేనిచో శరీరయాత్ర సాగదు. వాటిననుభవించే టప్పుడైనా హద్దుమీరి వాటిననుభవింపరాదు.

15) ఇష్టమైనవి దరిచేరితే హర్షము, అనిష్టమైనవి దరిచేరితే ఉద్వేగము కలుగరాదు. అలాగే ఇష్టమైనవి దూరమైతే ఉద్వేగము, అనిష్టమైనవి దూరమైతే హర్షము కలుగరాదు. మనసున పుట్టే ఇష్టానిష్టముల విషయముపై చలింపక మనస్సును అంతర్ముఖముగానే ఎల్లప్పుడు ఉంచవలయును.

16) సర్వకారణుడను, సర్వజ్ఞుడను, సర్వేశ్వరుడను అగునాయందు నిశ్చలమైన భక్తి కలిగియుండవలయును. నన్ను సేవించునపుడు క్షుద్ర బాహ్య కోరిక లుండరాదు. కోరకున్నా నేనే తెలిసికొని అవసరమైనవానిని నేనే అందిస్తాను. నన్ను ఇతర దేవతలతో చేర్చి ఇతరోపాయములతో గూర్చి సేవింపరాదు.

**ఆదిలేని నిర్మలమైన ప్రేమతో ఆరాధింపవలయును.**

17) మానసిక ఏకాగ్రతను భంగపరిచే స్థలములు కాక పవిత్ర స్థలముల యందు నివసింపవలయును.

18) రాజస, తామస జనులతో కూడుటయందు అసహ్యాము కలిగి యుండవలయును.

19) ఆత్మను గూర్చి తెలిసికొనుట యందు దానిని ధ్యానించుటయందు సదా నిష్ట కలిగి యుండవలయును.

20) ప్రకృతి, జీవ, పరమాత్మల తత్వజ్ఞానార్ధమును బాగుగా అనుభూత మొనర్చుకొనుట.

ఈ 20 లక్షణములు జ్ఞానమనబడును. వీనికి విరుద్ధమైనవి అజ్ఞాన మనబడును. కావున విజ్ఞుడగు వాడు ఒక్కొక్క గుణమును బాగుగా వివేచించి అభ్యసించి, దానిని తన సొత్తుగా చేసికొనవలయును.

పుస్తకమందున్న ఈ గుణములు మస్తకమునకెక్కవలయును. వాచగా యున్న ఈ జ్ఞాన సంపద అనుష్టానరూపముగా మారవలయును.

ఇల్లు కట్టుటకు ముందుగా, ఇంజనీరు వానికి సంబంధించిన మ్యాపులు, చార్టులు తయారుచేయుదురు. వానినే బ్లూప్రింట్లు అందురు.

వారి పని ఆ మ్యాపులతో పూర్తికాదు. ఆ మ్యాపును చూచుకొని దాని ప్రకారము నిర్మాణము గావించెదరు. **అట్లే గ్రంథస్థమగు విషయములను మున్ముందు బాగుగా చదివి తెలిసికొని తదుపరి ఆచరణయందు వానిని లెస్సగా జీర్ణించుకొనవలయును.**

దీనినే

- **శ్రవణము**
- **మననము**
- **నిది ధ్యానము అందురు**

అనగా ఈ గుణములన్నియు జీవుని రక్త మాంసములలో ఒక భాగముగా మారిపోవలయును. దీనిని ఆంగ్లమున

- **Mastication**
- **Digestion**
- **Assimilation** అందురు.

అంతవరకు సాధకుడు తన ప్రయత్నమును విరమింపరాదు. నిదురపోరాదు.

# శరణాగతి

హే శ్రీనివాసా! అన్యాయాలకు అపరాధాలకు అలవాటు పడినవాన్ని. క్షమాపనలే నా ప్రార్థనలు. నీవు తప్ప నాకు మరో శరణ్యం శూన్యం. నిన్ను గాక మరొకరిని ఆశ్రయించలేను. స్మరించగానే ఎందరో దీనులను, అదృష్టహీనులను నీవు కరుణించావు. ఓ పరమపురుషా! నా మొర ఆలకించుము. నన్ను కరుణించి మోక్ష మార్గములో నడిపించి మోక్షమును అనుగ్రహించుము, ఇలలోనైనా కలలోనైనా నీవు నాకు దూరం కావద్దు. నేను నీకు భారం కావద్దు.

సాధన కర్మరూపంగా తెలిసినను వాస్తవమునకు అది భావరూపమే. కర్మకు పూర్ణాహుతి ఉంది. కాని భావానికి పూర్ణాహుతెక్కడిది? భావరూపమైన సాధనకు శరణాగతే పూర్ణాహుతి. పూర్ణాహుతి జరిగిన పిమ్మట ఇక కర్మలేదు. శరణాగతి జరిగితే ఆ తరువాత ఇక కర్త లేడు.

**"మరణగతి తెలియని స్మరణ స్థితియే శరణాగతి"**

సాధనా సౌలభ్యం తెలిసినవారికి సాధ్యవస్తువులభిస్తుంది. చరించే నేర్పు ఏర్పడితే తరించే మార్పు అగుపిస్తుంది.

**సాధనా ప్రగతి వేదముల వలనరాదు, వేడుకుంటే రాదు.** కాలప్రమేయంతో కదలదు. కనికరిస్తే కలుగుతుంది. దైవము చూపితే మిగులుతుంది.

మన ఆచరణయే మనకు ఆవేదనలను అందించుచున్నది. పరమాత్మ తన అపార కృపతో ఆవేధనలను ఆరాధనలుగా మార్చుతున్నాడు.

**నీవు భక్తుడివైనచో ప్రతీ సన్నివేశములో పరమాత్మ హస్తమును ధర్శించగలవు.**

పరమాత్మ పవిత్ర కరమును మనము పట్టుకొనగలమా? ఆ దివ్యాత్ముని పవిత్ర సంకల్పమును మనము కనిపెట్టగలమా? పరిమిత మనస్సుకు అపరిమితమైన శక్తి ఎలా అవగతమవుతుంది. కనుక బుద్ధిని పరమాత్మకు సమర్పించి అలా సమర్పించినట్లు కూడా తెలియని దివ్యానందములో మైమరచి పోవాలి. అదియే నిజమైన శరణాగతి.

భగవానుడికి నీవు శరణాగతుడువైతివి. ఆ తరువాత నీలో నేను–నాది అనేది ఎలా మిగులుతుంది? ఆలోచించు! నేను భగవానునకు శరణాగతుడను అని పలికే మనస్సు ఎచట నిలిచి ఆ మాట అంటున్నది. శరణాగతి జరిగిన తరువాత ప్రత్యేకమైన ఉనికి ఎలా నిలుస్తుంది. శరణాగతిని గూర్చి ప్రవచించే అహం మిగిలియున్నంత వరకు శరణాగతి ఎక్కడ జరిగింది.

నేను పరమాత్మకు శరణాగతుడను అయినను నాకు బాధలు తీరుట లేదు అని సాధకులు పలుకుతుంటారు. ఇదియేనా శరణాగతి?

నీవు భగవానునకు పూర్ణ శరణాగతుడవైనచో ఆ తరువాత ఈ బాధలను గుర్తించుచున్నదెవరు?

**ద్వైతము తెలిసినంతవరకు, పూర్ణ శరణాగతి జరుగలేదనే తెలుసుకోవాలి.**

నిజమైన శరణాగతి జరిగిందంటే మనస్సు ఆశించదు. ఇంద్రియాలు ఆక్రోశించవు. బుద్ధి ప్రశ్నించదు, చిత్తము చలించదు, అహంకారము అగుపించదు, హృదయము తపింపదు, ద్వంద్వములు తెలియని ఆ స్థితిలో విషమ గతులు అర్థంకావు.

**కనుక శరణాగతి మార్గమే కాదు–గమ్యం కూడా.**

శరణాగతిలో ముఖ్యంగా మూడు విషయాలను జ్ఞాపకం ఉంచుకోవాలి.

**1) పరమాత్మ సత్యము-అన్యమైనదంతయు అశాశ్వతము**

**2) పరమాత్మ కరుణాసముద్రుడు-సరియైన సమయంలో భక్తుల బాధలను నివృత్తి చేసి ఉద్ధరిస్తాడు.**

**3) సర్వకర్మములు ఆయన దివ్య కృప వలననే సాగిపోతున్నాయి.**

మొదటి లక్షణము శరణాగతిని ధృవపరుచుతుంది.

రెండవ లక్షణము ఆందోళనలను, ఆవేదనలను అంతమొదించి చిత్తమును శివునియందే నిలుపును.

మూడవ లక్షణము వ్యక్తిని నిరంతరము పూర్ణశాంతిలో ఒలలాడునట్లు చేయును.

శరణాగతియే సర్వులకు గతి లేక గమ్యము. సమస్త యోగముల యొక్క గతి కూడా శరణాగతియే.

**గతి తెలిసి**
**మతి నిలిపి** — **పతిని దర్శించు**
**చితి రగిలే లోపుగా**

కరుణను విస్మరించకు - తరుణము మించనీకు - ప్రయత్నించుము.

శరణాగతియే జీవునకు పూర్ణాహుతి.

హే శ్రీనివాసా! కళ్లముందే నిత్యం ఆయువు క్షీణిస్తుంది. యౌవనం నానాటికి గతిస్తుంది. పోయిన రోజులు తిరిగి రావు. కాలం లోకాన్నే మ్రింగుతుంది. జలతరంగం వలె సంపద చపలమైనది. మెరుపుతీగవలె

జీవితం క్షణికమైనది కనుక ఓ దేవా! నీవే నాకు శరణ్యం. నిన్నే ఆశ్రయించితిని నన్ను దయతో రక్షించు!

రాత్రి గడిచింది. ఉదయం తెలిసింది. సూర్యుని కిరణజాలం దేహాన్ని ఉడికిస్తుంది. బడబాగ్ని వలె ఒకనాడు చితిలో రగిలే శరీరానికి కలిగే స్థితికి మచ్చుతునక అన్నట్లు ఎండ దేహాన్ని శోషింపజేస్తుంది. ప్రతిరోజు – చీకటిలో లయించినట్లు మానవ జీవితం శ్మశానంలో అంతరిస్తుందని కదిలే కాలం సందేశం అందిస్తుంది. యౌవనం మూడునాళ్ళ ముచ్చట తీరేలోగా మూలచేరే మాయావి ఈ యౌవనం.

వెళ్ళిన రోజులు మళ్ళీ రావు. మరలిపోయిన మనుగడ తిరిగిరాదు. ప్రవాహం నీటిని సముద్రానికి చేర్చినట్లు కాలం బ్రతుకును వల్లకాటికి చేర్చుచున్నది. కాలరూప సుడిగుండంలో ప్రపంచమే తారుమారయి పోవుచున్నది, తల్లడిల్లిపోవుచున్నది, తిరిగి పోవుచున్నది, అంతరించి పోవుచున్నది.

**నీటిలోని తరంగం కదిలేదెంతసేపు? కనుమరుగయ్యేదెంతసేపు!**

చేతిలోని లచ్చి అచ్చిరాదు. మచ్చిక తెలియని లచ్చి పిచ్చిలో చచ్చేదాకా చరిస్తూనే ఉండాలా? అది గచ్చిపాదయని తెలియదా?

అదిగో పచ్చని పొలం – ఇదిగో చచ్చిన శవం.
కాలరూపమే సుడిగుండం – తప్పించుకో ఈ గండం

మరణం చేరేలోగా శరణంటూ శివుని చేరి తరించాలి. శవమయ్యే స్థితి రాకుండా శివమై వెలిగిపోవాలి.

భగవానుడు భక్తవత్సలుడు. భక్తసులభుడు. భక్తి తల్లివంటిది. భక్తుడు బిడ్డవంటివాడు. తల్లి ఒడిలో సమస్త దుఃఖాలను మరచి బిడ్డ నిద్రించునట్లు భక్తిలో భక్తుడు తన్మయుడై తరిస్తాడు. తల్లి బిడ్డ బాధలను తీర్చుతుంది.

భయాలను తొలగిస్తుంది. సుఖాలను కలిగిస్తుంది. శాంతిని అందిస్తుంది. అలాగే భక్తి జన్మలోని బాధలను రూపుమాపుతుంది. సంసార బంధాన్ని భయాన్ని అంతమొందిస్తుంది. ఆత్మ సుఖం ప్రసాదిస్తుంది. అమృతఫలం అందిస్తుంది.

భక్తి పరమపవిత్రమైనది. భక్తి సమస్త వాసనలను క్షయం చేస్తుంది. ప్రేమను వృద్ధిపొందిస్తుంది.

అగ్ని వస్తువులను దగ్ధమొనర్చినట్లు భక్తి సర్వపాపాలను పోగొట్టి దివ్యైశ్వర్యం ఇచ్చి రక్షిస్తుంది. భక్తిలో శరణాగతే కేంద్ర విషయం. శరణాగతి దైవకరుణ ఈ రెండును పరస్పరాదీనాలు. అన్యోన్య ఆశ్రయాలు.

శరణాగతి హృదయశుద్ధిని ఆరంభిస్తుంది. దైవకరుణ దానిని పూర్తిచేసి సిద్ధిని ప్రసాదిస్తుంది.

ఈ ప్రపంచం ఒక ఇంద్రజాలం. మహేంద్రజాలం. దీనిని సత్యమని భావించకూడదు. ఇంద్రజాలాన్ని వినోదంగా దర్శించినట్లు ఈ ప్రపంచాన్ని దర్శించాలి. సత్యమని భావిస్తే అనంతదుఃఖాలు తప్పవు సదా సత్యరూపుడైన పరమాత్మనే చింతిస్తూ ఉండాలి.

సమస్తమైన సంసారం అసత్యం. రసాభాసది దోషాలతో కూడినది. దీనిని ఉపేక్షించి బ్రహ్మమునే తెలిసికో అని వేదాంత డిండిమలో శ్రీశంకరాచార్యులు బోధించారు.

**నిచ్చెన ఎక్కేటప్పుడు ఎగబ్రాకాలే కాని క్రిందకు కూరకూడదు. వానరుడు నరుడైనాడు నరుడు నాగాభరుణుడు కావాలి.**

**ఇదే ప్రగతి మార్గము – పవిత్ర మార్గము.**

# భగవదనుగ్రహము

మనకు ఆహారము సమకూర్చుచున్నాడు కావున భగవంతుడు దయా మయుడని చెప్పజాలము. ఆలికి కూడుపెట్టుట ఏమైనా ఊరికి ఉపకారమా? అనునట్లు బిడ్డలకన్నమిడుట తండ్రి విధి కాదా?

కాని మనలకు దుష్ప్రేరణల నుండి కాపాడుచు, పెడత్రోవ త్రొక్కకుండా రక్షించుట వల్ల భగవంతుడు నిజముగా దయామయుడని చెప్పవలయును.

ఎట్టి కర్మముల నొనర్చుట వలన భగవంతుని పొందనగును?

సర్వము భగవదనుగ్రహముపై ఆధారపడి యున్నది. ఈ కర్మమొనర్చిన భగవంతుని పొందగలము ఆ కర్మమొనర్చిన పొందజాలము అని భావింపరాదు.

వాని అనుగ్రహము పొందకోరెదవా, నీవే కర్మమొనర్చినను మనః పూర్వకముగా, పవిత్రముగా నొనర్పుము.

భగవంతుని పొందవలెనను పరితాపముతో నొనర్పుము. వాని కృపవలన పరిస్థితులు అనుకూల పడగలవు. సాక్షాత్కారమునకు వలయు స్థితి గతులేర్పడగలవు. నీవు సన్యసించవలసి యుండ కుటుంబము నీపై ఆధారపడి యుండ బహుష నీ సోదరుడు ఆ భారమును వహించును. నీ భార్య నీకు అడ్డము వచ్చుటకు బదులు తోడ్పడవచ్చును. లేదా నీవు వివాహమే చేసికొనక పోవచ్చును. అపుడు నీకు సంసార బాధ్యతయే యుండదు. అంతయు దైవానుగ్రహము.

శతాబ్దాల కొలది గది నావరించియున్న చీకటి దీపము వెలిగించినంతనే మటుమాయమగుచున్నది. కోట్లకొలది జన్మములయందు

చేసిన పాపములు భగవంతుని కరుణా కటాక్షమొక్కటి ప్రాప్తించినంతనే పటాపంచలైపోవుచున్నది.

కొన్ని చేపలకు చాలా వరుసల ఎముకలుండును. అవి హెచ్చుగా యున్నను తక్కువగా యున్నను చేపలనరు తినువారు మాత్రమువాటినన్నిటిని తీసి పారవేయుదురు. అటులనే కొందరికి పాపములు విశేషముగా యుండును. కొందరివి కొలదిగా యుండును. **కాని ఈశ్వరానుగ్రహము ఏ కాలమున వాటినన్నిటిని తొలగించి నరులను పాప విముక్తులను చేయును.**

మలయమారుతము వీచునప్పుడు చేవగల చెట్లన్నియు మంచిగంధపు చెట్లుగా మారునందుమి చేవలేని బొప్పాయి, వెదురు, అరటి మున్నగునవి మాత్రము యధాప్రకారముగనే యుండును. అటులనే **ఈశ్వరానుగ్రహము లోకమునకు ప్రాప్తించునపుడు సౌజన్యపుణ్యాంకురము గలవారు శీఘ్రముగా మహనీయులగుదురు.**

విషయాసక్తులు మాత్రము ఎట్టి మార్పును చెందక ఎప్పటివలెనే యుందురు.

ఆమాటకొస్తే ఈశ్వరానుగ్రహము అను గాలి సర్వదా వీచుచునే యున్నది. సోమరులై సంసార సాగరమున బడియుండువారు దాని లాభమును ఎన్నటికిని పొందజాలరు.

కాని కార్యదీక్ష గలవారు తన మనస్సును తెరచాపను నిండార విప్పుకొని ఆ అనుకూల వాయువును గ్రహించి శీఘ్రముగా పరమావధిని పొందుదురు.

**ఆకస్మికముగా ఏమియు సిద్ధింపదా?**

ముక్తి నొందుటకు సర్వసాధారణముగా అందరును దీర్ఘకాలము సాధన చేయవలసి యున్నది. ద్వాకానాధ బాబు ఒక్కసారిగా హైకోర్టు జడ్జీ

కాలేదు. ఆ పదవి పొందుటకు ఆయన అనేక సంవత్సరములు కష్టపడి పనిచేసెను. కష్టపడి శ్రమపడి చదువుకొనెను.

అట్లు శ్రమకోర్వనిచ్ఛగించనివారు కుక్షిదారులై 'బల్లిదండుగ' ప్లీడరులై యుండుటకు సిద్ధపడవలసినదే.

ఐనను భగవానుగ్రహముచే అకస్మాత్తుగా అభ్యుదయము నొందుటయు కొన్ని సమయములలో కాన్పించును.

కాళీదాసు విషయమట్టిది. సరస్వతిదేవి యనుగ్రహమున పరమ పామర స్థితి నుంచి యాతడొక్కసారిగా భారతదేశపు కవీశ్వరుడనుపించు స్థితిని పొందెను.

**ఒక గృహస్థ భక్తుడు :** దేవా! మీరు భగవంతుని జూచితిరని వినియున్నాను. కావున మమ్మనుగ్రహించి మేముకూడా భగవంతుని జూచునట్లు చేయుము. ఆ భగవంతుని చెలిమి సంపాదించుటెట్లు?

సర్వము ఈశ్వరేచ్ఛ ననుసరించి నడుచును. భగవద్దర్శనము పొందుటకై సాధన చేయవలయును. కేవలము చెరువుగట్టున కూర్చుండి, ఈ చెరువులో చేపలున్నవి, చేపలున్నవి అని అరచుటచే చేపలు చేతచిక్కునా?

వానిని పట్టుకొనుటకు వలయు పరికరములు సంపాదింపుము. గాలపు జువ్వ, దారము, ఎర – వీనినిదెచ్చి ముందు చేపలనాకర్షించు మందును నీటిపై జల్లుము. అంతట లోతులోనున్న చేపలు పైకివచ్చును. అప్పుడు నీవు వానిని పట్టుకొనవచ్చును.

ఏ ప్రయత్నము చేయక కూర్చుండియుండి నన్ను మీకు భగవంతుని చూపించుమని అడుగుచున్నారా?

పెరుగు తోడుబెట్టి వెన్నచిలికి మీ నోటికి అందీయవలయునా? చేపను పట్టుకొని మీ చేతికి అందీయవలయునా? ఎంత విపరీతముగా యున్నది మీ కోరిక.

ఉక్కగా మంటగా గాలి వీచనంతకాలము విసనకర్రతో విసురుకొందుము. ధనవంతులకును దరిద్రులకును ఎల్లరకును సమానముగా హాయినొసగు మలయమారుతము వీచినంతనే విసనకఱ్ఱ నావలనెట్టుదుము.

పరమావధిని పొందుటకై దైవసహాయము లేనంత వరకు స్వప్రయత్నమును సాగింపవలయును. కాని అదృష్టమున ఆ తోడ్పాటు లభించినపుడు ఇక శ్రమపడుట, సాధన చేయుట అనావశ్యము. అంతవరకు మాత్రము శ్రమపడక తప్పదు.

మలయమారుతము వీచునపుడు విసనకర్ర ఎందులకు. భగవత్కృపఏ లభించినపుడు జపతపములెందులకు?

భగవంతుని యొక్కయు గురుని యొక్కయు, సద్భక్తుని యొక్కయు అనుగ్రహము లభించినను ఒక్క వాని అనుగ్రహము లభించకపోయినా - అంతయు నిష్ప్రయోజనమే! ఈ మూడు విధములైన అనుగ్రహమును అదృష్ట వశమున పొందినను- అంతఃకరణము యొక్క అనుగ్రహము లేకపోయెనా- అనగా తరుణోపాయమునకై పరితపింపని యెడల అన్నియు నిష్ఫలములే.

తనకు ఎప్పుడు కృపకలుగునో అపుడే భగవంతుడు సాక్షాత్కరించును.

అతడు పరమజ్యోతి-జ్ఞానభాస్కరుడు. వాని కిరణమొక్కటి ప్రసరించిన లోకమునంతటికి ధీశక్తి నొసగుచున్నది. తన్మూలముననే బండొరులను తెలిసికొను చున్నాము. బహువిధములైన జ్ఞానమును పొందగలుగుచున్నాము.

తన దివ్య తేజమును తనపై ప్రసారింపచేసికొనినపుడే మనము వానిని చూడగల్గుదుము.

నీవెంతగా ప్రయత్నించినను భగవదనుగ్రహము లేనిదే ఏమియు లభింపదు. వాని కృపలేనిదే నీవు వాని సాక్షాత్కారమును పొందజాలవు. కాని భగవత్కృప సులభముగా చేజిక్కునది కాదు.

హృదయము నుండి అహంకారమును నిర్మూలనము చేయ వలయును.

నేను కర్తను అను అహంకారము మాత్రమున్నను నీవు భగవంతుని కానజాలవు.

ఇంటి సామాగ్రిని పెట్టుకొను గది (Store Room)లో ఎవరో ఒకరుండగా ఇంటి యజమానుని మరొక్కరు ఏదియో ఒక వస్తువును అందుండి తెమ్మనిన యెడల – వెంటనే ఆతడు గదిలో ఎవరో ఉన్నట్లున్నారు. చూడుము వానినడిగి పుచ్చుకొనుము అని చెప్పును కదా!

**నేను కర్తను అనుభావము కలవానికి భగవంతుడు ప్రసన్నుడు కాడు.**

ఓం నమో శ్రీనివాసాయనమః

ఓం నమశ్శివాయనమః

# ఆత్మ సాక్షాత్కారము

**I.** సకల స్థావర జంగమ రూప భూతములలో మనుష్య జన్మ దుర్లభము.

**II.** ఆ నరజన్మమందు పురుష శరీర ప్రాప్తి దుర్లభము

**III.** పురుష శరీరము కల్గినను బ్రాహ్మణత్వ విశిష్ట పురుష శరీరము దుర్లభము

**IV.** బ్రాహ్మణత్వ విశిష్ట పురుష శరీరము కల్గినను వేద ప్రతి పాద్యాధ్యయ నాద్యాది షట్కర్మ సనాతన ధర్మపరాయణత కల్గుట దుర్లభము.

**V.** వైదిక ధర్మాచరణము కల్గియున్నను పరోక్ష జ్ఞానము కల్గుట దుర్లభము.

**VI.** పరోక్ష జ్ఞానము కల్గినను నిత్యానిత్య వస్తు వివేకము కల్గుట కష్టము.

**VII.** అట్టి వివేకము కల్గినను పరోక్షజ్ఞానము అనగా ఆత్మానుభవము కల్గుట దుర్లభము.

**VIII.** ఆత్మానుభవము కల్గినను బ్రహ్మరూపమును పొంది నిరంతరము నిరంతరాయముగ ఆత్మస్థితుడై సంపూర్ణ జీవన్ముక్త్యవస్థ నుండుట అత్యంత దుర్లభము.

**నూరు కోట్ల జన్మములందు చేసికొనిన పుణ్యపరిపాక వశాన గాని మోక్షము లభింపదు కదా!**

శ్రీ పరమేశ్వర సృష్టిలోని ప్రాణికోటియు సుఖమునే కోరుచుండును. ఆ సుఖము

- **ఐహికము**
- **ఆముష్మికము**
- **కైవల్యము**

} **అని త్రివిధములు**

**ఈ లోకమందు ధనవనితాది విషయబోఘముల వలన కలుగు సుఖము ఐహికము.**

**పరలోకమందు స్వర్గాది భోగముల వలన కలుగు సుఖము ఆముష్మికము.**

**ఆత్మ తత్వజ్ఞానము వలన కలుగు సుఖము కైవల్యము.**

ఐహికాముష్మిక సుఖములు విష సంస్పృష్టాన్నమువలె సుఖ దుఃఖ మిశ్రమములు.

కైవల్యము దుఃఖలేశరహితమై శాశ్వతమైన సుఖమును కూర్చును కనుక ఆవశ్యము కోరదగినది.

జీవుడు తత్వజ్ఞానము వలన తన నిజస్వరూపమును తెలిసికొనెనేని అహంబ్రహ్మోస్మి యనెడి నిశ్చయము కలవాడై సంసారబంధ నిర్ముక్తుడై, తానే సచ్చిదానంద పరబ్రహ్మమై విలసిల్లును. సదా ఆనందమునే అనుభవించును.

ప్రచండమార్తాండుని యందు అంధకారమెట్లుండదో అట్లే ఆత్మ సుఖమునందు దుఃఖావేశమే లేదు. ఇట్టి పరమావస్థయే నిత్యసుఖము. ఇదియే జీవన్ముక్తి.

ఈ ఆత్మసాక్షాత్కారాన్ని సాధకుడు 4 దశలలో చేరుకుంటాడు.

- **బ్రహ్మజ్ఞానార్జనము లేక ఆత్మజానార్జనము**
- **బ్రహ్మనిష్ట**
- **బ్రహ్మానందము**
- **ఆత్మ సాక్షాత్కారము లేక బ్రహ్మ సాక్షాత్కారము**

ఆత్మజ్ఞానార్జనము వేదాధ్యయనం ద్వారా లభిస్తుంది. వేదాధ్యయనము సద్గురువు పర్యవేక్షణలో మాత్రమే సంపూర్ణఫలితాలను ఇవ్వవగలదు.

ఊరికే వాద ప్రతివాదాలు చేయడం వలన కంఠశోష మాత్రమే ఫలితము. వేదము పురాణము చెపేది విని జీవితంలో పాటించాలి. ఎంతటి క్లిష్ట సమయములోనైనను సృష్టిక్రమమును, సృష్టి చట్టమును తు.చ. తప్పకుండా పాటించడమే బ్రహ్మనిష్ట అనబడును.

బ్రహ్మనిష్టలోనే సాధకుడు క్రమముగా బ్రహ్మానందము, ఆత్మ సాక్షాత్కారమును, ఆ భగవంతుని అనుగ్రహముతో పొందగలుగుతాడు. ఇదియే జీవుని చివరి గమ్యమైయున్నది.

బ్రతికినంతకాలము ఏదో ఒక బాదరబంది ఉంటుంది. అన్నీ తీరాకనే ఆత్మ విచారణ చేస్తానంటే– కెరటాలు ఆగాక సముద్రస్నానము చేస్తానన్న ట్లవుతుంది.

కాలము విలువైనది మరియు గడిచిపోతూనే ఉంటుంది. దాన్ని ఆపనూ లేము. తిరిగి జరిగిన కాలాన్ని సంపాదించటము కూడా దుర్లభము. అందుచే ఉన్న కాలంలోనే ఉన్నతికి, ఊర్ధ్వగతులకు కృషి చేయండి.

వయసు పెరుగుతుంది ఆయువు తరుగుతుంది. కామ్యాన్ని సాధించితే అహంకారిగా మారి వివేకాన్ని కోల్పోతున్నాడు. కామ్యాన్ని పొందలేకపోతే దుఃఖితుడై మతి పోగొట్టుకుంటున్నాడు.

అందువలన కామ్యాన్ని తీర్చుకొని వదులుకోలేము. తృంచివేయడమే మంచిది. అందుచే ఆత్మజ్ఞానము వైపు శ్రద్ధ చూపించుతూ మనల్ని అల్లరి పెడుతున్న కోరికల్ని దండించడి. అప్పుడే శ్రద్ధ చూపగల్గుతాము.

ఎవ్వడు దుర్మార్గమును వీడడో, ఎవ్వడు ఇంద్రియములను నిగ్రహింపడో, ఎవ్వడు ఏకాగ్రచిత్తుడు కాకుండునో చిత్త శాంతిని

పొందకుండునో, అట్టివాడు విశేష జ్ఞానముచే సహితము ఆత్మను పొందజాలడు.

ఓ సౌమ్యుడా! (ఓంకారమున నెలకొనియున్న) ఉపనిషద్విజ్ఞాన రూపమగు వింటిని చేబూని, ఉపాసనచే వాడియైన (ఆత్మరూపమును) బాణమును సంధించి బ్రహ్మాభావమున లయించిన మనస్సుచే లాగి ఆ అక్షర (పరబ్రహ్మ) స్వరూపమను లక్ష్యమును ఛేదింపుము (బ్రహ్మమును తెలిసికొనుము).

ప్రతీ జీవియందు దేవత్వము గర్భితముగా యున్నది.

బాహ్యాంతర ప్రకృతి నంతయు నిరోధించి, యంతర్గతమగు నీ దేవత్వమును వ్యక్తము చేయుటయే జీవిత పరమావధి.

ఇందులకై కర్మ, భక్తి, యోగ, జ్ఞాన మార్గములలో ఒక్కటిని గాని, కొన్నిటిని గాని లేక అన్నిటిని గాని అవలంభించి ముక్తుడవు కమ్ము.

**ఇదియే**
**మత సారము**
**తత్వసారము**
**ఆత్మ సాక్షాత్కారమునకు మూల ధనము.**

కష్టకాలమందు, దుఃఖ సమయమందు, ఏ మనిషియును – అధర్మమును, అసత్యమును, అక్రమ మార్గముననుసరింపక సత్యాన్ని ధర్మాన్ని భగవదనుగ్రహము నాశ్రయించి భూతదయనే సృష్టియొక్క ధర్మమని నమ్ముకొని జీవించువాడే నిజమైన జీవన్ముక్తుడు.

కఠోపనిషత్తుయందు, సాక్షాత్తు యమధర్మరాజు నచకేతునకు ఆత్మజ్ఞానాన్ని బోధించడము జరుగుతుంది.

దాన్ని ఆధారంగా, మూలముగా గ్రహించి ఆత్మసాక్షాత్కారమును, ఈ గ్రంథమందు సవివరముగా సోదాహరణములతో విపులీకరించబడినది.

నచకేతుడి తండ్రి వాజశ్రవణుడు. వాజశ్రవణుడనగా (వాజ) ఆహారము (శ్రవణ) ద్వారా కీర్తిని పొందినవాడని అర్థము. ఇతడు గొప్ప వరాలు కోరినవాడై తన ఆస్తినంతటిని "విశ్వజిద్యాగము"లో దానం చేస్తాడు.

విశ్వజిత్యాగము ఒక్కరోజులో పూర్తి కావలసిన యాగము. ఇందులో యజమాని తన యావదాస్తిని దానము చేయవలసియుంటుంది.

ఋత్విజులకు దక్షణగా ఆవులు మొదలైనవి కానుకలుగా తీసుకురాబడు తుండగా పసివాడే అయినా నచకేతుడు "శ్రద్ధ"తో గమనిస్తాడు.

## -: శ్రద్ధ :-

**Q: శ్రద్ధ అనగానేమి? శ్రద్ధాకీ దృశ?**

**A: గురు వేదాంత వాక్యాదిషు విశ్వాసః శ్రద్ధా!**

గురువాక్యము నందును, శాస్త్ర విషయమునందును సంపూర్ణ విశ్వాసము కలిగియుండుటయే శ్రద్ధ అనబడును.

వేదాంత శాస్త్రమును అభ్యసించుటయందు శ్రద్ధ అతి ముఖ్యమైయున్నది. శ్రద్ధలేనివానికి శాస్త్రము అవగాహనమునకు అందదు.

**"శ్రద్ధవాన్ లభతే జ్ఞానం"**

శ్రద్ధ గలవానికే జ్ఞానము లభించును అని గీత కూడా ప్రబోధించినది.

**"శ్రద్ధ భక్తి ధ్యాన యోగాదవైహి"**

శ్రద్ధ, భక్తి, ధ్యాన యోగాదుల ద్వారా పొందును అని కైవల్యోపనిషత్తు తెలిపియున్నది.

వేదాంత శాస్త్రము ఆత్మసంబంధమైనది. శాస్త్రమును గ్రహించవలసిన అంతఃకరణ సదా బహిర్ముఖమైయుండును. బహిర్ముఖమైయున్న అంతః కరణము ద్వారా ఆత్మతత్వమును గ్రహింపలేము. అంతఃకరణమును అంతర్ముఖము చేసినపుడే అది సాధ్యమగును. ఇది శ్రద్ధ వలననే లభించును. అదియును గాక వేదాంత శాస్త్రము గుహ్యమైనది. కేవలము వాచ్యార్ధమును గ్రహించినంత మాత్రాన సత్యము అవగతము కాదు. అక్ష్యార్ధమును గ్రహించుట వలననే అది లభ్యమగును. లక్ష్యార్థమును స్వతంత్రముగా అధ్యయనము చేసి గ్రహించలేము.

**"శాస్త్రజ్ఞోసి స్వతంత్రేణ బ్రహ్మాన్వేషణం నకుర్యాత్"**

శాస్త్రము తెలిసినవాడైనను స్వయముగా బ్రహ్మాణ్వేషణ చేయరాదని ఆచార్యులవారి ఆదేశము.

శాస్త్రలోతులను గురువు చెంతనే తెలుసుకోవాలి. అట్టి గురువుపై సంపూర్ణ విశ్వాసముండాలి. కాలానికి బెదరని, కష్టాలకు కదలని అచంచల విశ్వాసము గురుదేవునిపై యుండాలి.

నీ కుటుంబముపై ఎంత గాఢమైన ప్రేమ నీకుండునో అట్టి ప్రేమ గురుదేవునిపై యుండవలయును అంటారు భక్త కబీర్‌దాసు.

స్వార్థపూరితమైన జీవనముతో తనువును, మనస్సును, పుణ్యమును హరించే కుటుంబ సభ్యుల మీదనే నీకు అంత ప్రేమ యున్నది కదా! ప్రేమను పంచి, ప్రేమలో ముంచి, ప్రేమతీరమునకు నిన్ను చేర్చి తరింపజేయు సద్గురునిపై ఇక నీకు ఎంత ప్రేమ ఉండాలి. గురు రుణము తీరేది లేదు. తీర్చేది కాదు. గురుపాదాల చెంత ఆశాజీవివై బ్రతుకు. **గురుదేవునిలో నిరాశను దింపకు**.

అపౌరుషేయమైన వేదము సాంప్రదాయమునందించినది. సంప్రదాయము సద్గురువును ప్రసాదించినది. సత్యరూపమైన శాస్త్రమందును, నిత్యరూపుడైన గురుదేవుని వాక్యమందును విశ్వాసము కలిగియుండుటయే 'శ్రద్ధ'. శ్రద్ధ గలవాడు గురువుచెంత వినికిడి గాక శ్రవణము జేసి ఉత్తమ శ్రోతయగును. పరిపక్వస్థితి రాగానే ఉత్తమ 'వక్త' యగును.

శృతి ప్రారంభంలోనే నచకేతునికి ఆ శ్రద్ధ ఉన్నదని, తర్వాత చెప్పబడినట్లు, దానివలన అతడు యముని వద్దకు పోయి ఆద్యాత్మిక జీవన రహస్యాలల్లో ఉపదేశము పొందగలిగాడని చెపుతున్నది.

ముసలితనంలో ఈనే వయసుదాటిపోయి ఇక గడ్డితినటానికి, నీళ్లు తాగటానికి కూడా శక్తిలేకుండా ఉన్నవి, వట్టిపోయి ఎందుకు పనికి రానివి అయిన ఈ ఆవులను దానం చేసేవాడు చేరుకునే లోకాలు బొత్తిగా ఆనంద రహితమైనవి.

తండ్రి పనికిమాలిన ఆవులను దానం చేస్తుండటం చూసి నచకేతునికి ఆయనకు యజ్ఞవిదులను నిష్టతో పాటించి తన సర్వస్వాన్ని దానం చేసే ఉద్దేశ్యం లేదని గ్రహిస్తాడు. కుమారుడుగా, తన తండ్రిని ఈ అనృత దోషాన్నుండి తప్పించటం తన బాధ్యత అని భావిస్తాడు. యజ్ఞవిధి ప్రకారము తన తండ్రి తన సర్వస్వాన్ని దానం చేయవలసియున్నది. కుమారుడుగా తాను కూడా ఆస్తిలో ఒక భాగమే కనుక తనను కూడా ఎవరికో ఒకరికి ఇవ్వవలసి ఉన్నది. తన తండ్రి విధిని పరోక్షంగా గుర్తుచేస్తూ తనని ఎవరికిస్తావు అని తండ్రిని పదేపదే ప్రశ్నించాడు. ఇచట నచకేతుని మనస్సులోగల శ్రద్ధ, సత్యతత్పరత ప్రస్ఫుటముగ కనిపించుచున్నవి.

తండ్రి మొదట ఏమి బదులీయలేదు. కాని నచకేతుడు మళ్ళీమళ్ళీ అడిగేటప్పటికి, ఈ అల్పవయస్కు అవిధేయతకు కోపము వచ్చి, నిన్ను

మృత్యువు కిస్తానని కసురుకుంటాడు. "నిన్ను యముడెత్తుకుపోను" అనేది సామాన్యమైన తిట్టే.

తండ్రి అలా అన్నాక నచకేతుడు తనలో తాను ఇలా అనుకున్నాడు. చాలామంది శిష్యులలో నేను మొదటివానిగా వస్తున్నాను. మరికొందరు శిష్యులలో (బుద్ధి తీక్షణత, సుగుణాలు, బంధువులలో, బంధువుల పట్ల, జననీ జనకుల పట్ల విధులను నెరవేర్చేవారిలో) మధ్యముడను. కాని నేను చివరివానిగా ఎప్పుడు రాలేదు.

తండ్రి తనను మృత్యువుకివ్వాలని ఎందుకు ముచ్చటపడ్డాడో నచకేతుని కేమి కారణము కన్పించలేదు. అందుచేత కేవలము కోపములోనే అలా అన్నాడని ఒక నిర్ణయానికి వచ్చాడు. అయినప్పటికి తండ్రి మాట మీరకూడదు కదా, అందుచేత తండ్రి తండ్రి వద్దకు వచ్చి ఈ విధంగా చెబుతున్నాడు.

కాలగతిలో ఎలాగు నశించిపోయే ఈ క్షణిక జీవితం కోసం, సత్యపాలన నుండి తొలగవద్దని, అన్నమాట ప్రకారము తనను మృత్యువు వద్దకు నిజంగా పంపించవలసిందని తండ్రికి ఉద్భోదిస్తున్నాడు.

**"జతస్యహి ధృవో మృత్యువు-దృవం జన్మ మృతస్యచ**
**తస్మాద పరిహార్యేర్దే నత్వం శోచి తుమర్హసి"**

"జన్మించినవానికి మరణము తప్పదు. మరణించినవానికి జన్మము తప్పదు. అనివార్యమగు ఈ విషయమున నీవు శోకించుట తగదు"

ఎన్ని కష్టాలు వచ్చినా సరే ప్రాచీనులైన పితృపితామహులు సత్యవ్రతాన్ని ఎలా కాపాడుకున్నారో అలా వర్తించమని తండ్రికి ఉద్భోదిస్తున్నాడు.

ధాన్యానికి ఖచ్చితంగా నాట్ల సమయము, కోత సమయము ఉన్నదో, ఎలాగా అది మొలచి, పండి, రాలిపోతుందో సరిగ్గా మానవుడు కూడా జనన మరణ చక్రాన్ని అనుసరిస్తాడు. మానవుడి జన్మయే మరణాన్ని సూచిస్తుంది. మృత్యువే అతనికి పునర్జన్మను సూచిస్తుంది. చావు గురించి శోకించవలసిన అవసరము లేదు. ఇందులో కర్మ సిద్ధాంతము, పునర్జన్మ సిద్ధాంతము స్పష్టంగా సూచించబడినవి.

సత్య మహిమను గుర్తించినవాడై నచకేతుని తండ్రి తన కుమారుని యముని వద్దకు పంపుతాడు కాని ఆ సమయములో యముడు ఇంటలేడు.

నచకేతుడు ఆకాశవాణి ప్రేరణతో మృత్యువు ఇంటలేనప్పుడు అక్కడికి వెళ్ళి అతని ఇంటియందు మూడు రాత్రులు నిరాహారిగా ఉంటాడు.

నాల్గవరోజు యముడు తిరిగి వచ్చి నాయనా ఎన్నిరాత్రులిక్కడ ఉన్నావు అని అడుగుతాడు. నచకేతుడు మూడు అని చెపుతాడు.

ఇంకా, ఆ ఆకాశవాణి ఆదేశంతోనే నచకేతుడు యమునికి, మొదటిరాత్రి ఏమి భుజించావని అడుగగా సంతానం అని– రెండవ రాత్రి ఏమి భుజించావని అడుగగా పశుసంపద యని– మూడవరాత్రి– నీ పుణ్యకర్మలు అని సమాధానం చెపుతాడు.

బ్రాహ్మణుడైన అతిథి అగ్నిలాగా ఇంట్లో ప్రవేశిస్తాడు. అతనిని సద్గృహస్థులు శాంతింపచేస్తారు. ఇంటికి వచ్చిన అతిథిని భగవత్స్వరూపునిగా భావించి పూజించడం హిందువుల ఆచారము. అతిధికి మొదట కాళ్ళు కడుగుకొన డానికి నీళ్ళు, కూర్చోవడానికి ఆసనము ఇచ్చి అర్ఘ్యం సమర్పించి తరువాత అన్నపానాదులతో తృప్తిపరచాలి.

బ్రాహ్మణుడు ఏ ఇంట్లో నిరాహారుడుగా ఉంటాడో, ఆ బుద్ధిహీనుడి ఆశలు, ఆకాంక్షలు, సత్సాంగత్య ఫలము, సత్యమధురభాషణల వలన

ఫలము, సర్వ పుణ్యకర్మల ఫలము, పుత్రులు, పశుసంపద అంతా కూడా నశించిపోతుంది.

అతిథి సత్కార విశేష ఫలములను గూర్చి పురాణాలలో అనేక సందర్భాలలో విపులీకరించబడినది.

చిఱుతొండడు కాంచీ నగరముననొక వైశ్యుడు. ఇతడు పూర్వ జన్మమందు దుంబురుడనెడివాడు. దుర్వాసుని శాపవశమున ఇట్లు జన్మించెను. ఇతని భార్య తిరువెంగనాంబి. వీరికి శిరియాళుడను ఒక్క కుమారుడు కలడు. వీరు అఖండ శివభక్తులు. జంగములకు బెట్టినగాని భుజింపరు. అతిథులకు బెట్టక వారెప్పుడు తినరు. ఒకనాడెవరును వారి ఇంటికి రాలేదు. చిరుతొండడు నాలుగు వీధుల మొగలకును వెళ్ళెను. జంగములెచ్చటను కనపడలేదు. తిరుగగా తిరుగగా నొక్కచోట వృద్ధులు, రోగులు అగు దంపతులు కనబడిరి.

చిఱుతొండడు వారిని తన ఇంటికి రమ్మనెను. వారు శివభక్తుల మనియు శివవ్రతము చేసిరనియును, అది ఉద్వాసన కావలయుననియు దానికై తాము కోరినదీయవలయుననియు నాదంపతులు చెప్పిరి. చిఱుతొండడు సంతోషముతో నిత్తునని పలికెను. నీ కుమారుని మాంసము వండిపెట్టవలయును. దీనికి నీ భార్య ఇష్టపడనిచో మా వ్రతభంగమగును. నీవు పోయి నీ భార్యను అడిగి రమ్మని పంపిరి. చిరుతొండడు ఇంటికివచ్చి భార్యతో అట్లు చెప్పెను. మన మాసంము కూడా నిచ్చుటకు సిద్ధముగా యుంటిమని చెప్పుమని తిరువెంగనాంబి పలికెను.

చిఱుతొండడు వారు తనను పరీక్షచేయుటకు వచ్చిన పార్వతీ పరమేశ్వరులని యెఱుగకయే వారిని తన భుజములపై నెక్కించుకొని తన ఇంటికి తీసుకొనివచ్చెను. సిరియాళున కభ్యంగనము చేసి తల్లి తన కాళ్ళపై

బరుండపెట్టుకొనెను. తండ్రి వానిని చంపెను. కుమారుని మాంసము వంట చేసిరి. దానిని వృద్ధ దంపతులకు వడ్డించిరి. అప్పుడా అతిథి నీ ఇంట బాలుడెవ్వడును లేడా? పుత్రుడు లేని ఇంట నేను భుజింపను అని పలికెను. చిఱుతొండడు దీనుడై తమ సెలవుచొప్పున నా పుత్రుని చంపి వంట చేయించితిని ఇక నాకు కుమారుడు లేని చెప్పెను.

నీవు నీ పుత్రుని పేరుపెట్టి గట్టిగా పిలువుమని యాయతిథి ఆజ్ఞాపించెను. చిఱుతొండడు సిరియాళా! అని బిగ్గరగా పిలిచెను. అపుడు వీధిలో నుండి సిరియాళుడు వచ్చి వారికి నమస్కరించెను.

అంతట పార్వతీ పరమేశ్వరులు తమ నిజరూపమును చూపి వారి అతిథి పూజకు, శివభక్తికి మెచ్చుకొని వారి పూర్వజన్మ వృత్తాంత మెరిగించి సిరియాళుడు కుమారస్వామి యగుటయు చెప్పిరి. చిఱుతొండడు శాప విమోచనము కాగా పూర్వరూపము పొందెను.

## ఒక శేరు పిండి కథ

కురుక్షేత్ర సంగ్రామం పూర్తి అయిన తరువాత, విజయం సాధించిన యుదిష్ఠిరుడు ఒక అశ్వమేధ యాగం చేశాడు. ఆ యాగానికి దేశం నలుమూలల నుండి రాజులు వచ్చి యాగం చూసి ఆనందించారు. యాగం మహావైభవంగా జరిగింది. అష్టదిక్కుల నుండి అనేక మంది బ్రాహ్మణులు వచ్చి ఆ యాగంలో పాల్గొన్నారు. బ్రాహ్మణులకు, పేదలకు దిక్కులేనవారికి దానాలు జరిగాయి. సంతర్పణలు సాగాయి. శాస్త్రాలలో చెప్పిన ప్రకారంగా అన్ని విధాల చక్కగా జరిగింది యాగం.

ఆ సమయంలో ఎక్కడినుంచి వచ్చిందో ఒక ముంగీస వచ్చింది. తటాలున వచ్చి యాగశాలలో ప్రవేశించింది. సభామధ్యలో నిలిచి ధైర్యంగా అందరిని చూసి పెద్దగా నవ్వటం ప్రారంభించింది. మనిషిలాగా ఒక ప్రాణి

ఇలా నవ్వటం చూసి అందరూ ఆశ్చర్యపోయారు. ఇదేదో యాగం ధ్వంసం చేయడానికి వచ్చిన పిశాచమో, భూతమో అని యాగకార్యాలన్నీ పూర్తిచేసి కూర్చున్న ఋత్విక్కులు ఆందోళన చెందారు.

ఆ ముంగీస శరీరము ఒక ప్రక్క పూర్తిగా బంగారం లాగా ప్రకాశిస్తుంది. నానా దేశాల నుండి వచ్చిన రాజులను, వివిధ ప్రాంతాల నుండి వచ్చిన బ్రాహ్మణులను చూసి ఆ ముంగీస మానవ భాషలో ఇలా మాట్లాడసాగింది.

రాజాధిరాజులారా ఈ యాగం గొప్ప వైభవంగా జరిగిందని మీరు మురిసిపోతున్నారు. కాని ఒకానొక కాలంలో కురుక్షేత్రంలో నివసించిన ఒక బ్రాహ్మణుడు ఒక శేరు పిండి దానం చేశాడు. ఆ దానం చేసిన ధర్మఫలానికి మీ యాగం మొత్తము కూడా సాటిరాదు. మీరు అశ్వమేధాది యాగాలు చేసి అన్ని సొత్తులు దానంగా ఇచ్చినా దాంతో తులతూగలేదు. ఈ మాత్రం దానికి ఈ యాగం గూర్చి మీరందరూ అనవసరంగా ఎందుకింత గర్వపడుతున్నారు? అని అడిగింది ఆ ముంగీస.

ఈ విధంగా అడిగిన ప్రశ్నకు బదులు చెప్పలేక సభవారంతా ఆశ్చర్య పోయారు. యాగం చేసిన బ్రాహ్మనులు ఆ ముంగీసను చూసి, సాధువులు కూడియున్న ఈ యాగసభకు నీవు ఎక్కడి నుంచి వచ్చావు? అసలు నీవెవరు? ఎందుకు మా యాగాన్ని నిందిస్తున్నావు. శాస్త్ర ప్రకారం ఏది తప్పకుండా అన్ని సామాగ్రులు తెచ్చి, క్రమాన్ని అనుసరించి నడిపిన అశ్వమేధ యాగంలో నీవు తప్పులెన్నడం సరిగాలేదు. యాగానికి వచ్చిన వారందరికి తగిన పద్ధతిలో పూజలు జరిగాయి. గౌరవ మర్యాదలకు ఏలోటు లేదు. అందరికి తృప్తి కలిగేటట్లు దానధర్మాలు జరిగాయి. మంత్రతంత్రాలు కొనసాగాయి. అగ్నిలో హవిస్సులిచ్చి యధావిధిగా హోమం జరిగింది. నాలుగు వర్ణాలకు చెందిన నానా జాతుల వారు ఎంతో సంతృప్తి చెందారు. మీరి నీవెందుకు

ఇలా అంటున్నావు. మాకు విషయం సవిస్తరంగా చెప్పవలసి ఉంటుంది. లేనిచో సరియైన శిక్షకు పాత్రురాలు కాగలవు అన్నారు.

అది విని ముంగీస మళ్ళీ నవ్వుతూ ఆక్షేపనగా ఈ విధంగా చెప్పింది.

బ్రాహ్మణోత్తములారా నేను చెప్పి మాటలో పొరపాటు లేదు. మీరన్నా మీ ధర్మరాజన్నా నాకు అసూయలేదు. కాని కురుక్షేత్రంలో నివసించియున్న ఒక పేద బ్రాహ్మణుడు చేసిన దానంతో ఈ యాగం సరిసమానం కాదని నేను చెప్పింది మాత్రము అక్షరాల నిజము, ముమ్మాటికి నిజము. ఆ బ్రాహ్మణుడు చేసిన దానం ఫలితంగా అతడు తన భార్యతో, కొడుకుతో, కోడలితో స్వర్గలోకం చేరుకున్నారు. అదంతా నేను స్వయంగా చూశాను కనుక చెపుతున్నాను. వినండి అని చెప్పడం ప్రారంభించింది.

మీ యుద్ధం జరగటానికి ముందు కురుక్షేత్రంలో ఒక పేద బ్రాహ్మణుడు ఉంఛ వృత్తి చేసుకుంటూ జీవించేవాడు. నేలమీద రాలిపోయిన ధాన్యం ఏరుకుంటూ, దాంతో అన్నం వండుకొని, అతడి భార్యా, అతడి కొడుకు, కోడలు ఈ నలుగురూ ప్రతిరోజూ తింటుండేవారు. ప్రతీరోజు మధ్యాన్నం– అనగా ఒంటిగంటన్నరకు అందరు కలిసి కూర్చొని భోజనం చేసేవారు. ఒక్కోరోజు కావలసిన ధాన్యం దొరికేది కాదు. ఆనాటికి వారందరూ పస్తే. మర్నాటి మధ్యాన్నమే తిరిగి అందరికీ భోజనం. అంతేకాని ఒకనాడు తెచ్చింది మరునాటి వరకు దాచుకునేవారు కాదు. అది వారి వ్రతం.

ఈ విధంగా వ్రతంపట్టి నడుపుకుంటూ వస్తూ ఉండగా ఒకప్పుడు వర్షం లేక దేశంలో పంటలు పండలేదు. పెద్ద కరువు వచ్చింది. ఎక్కడ చూసినా జనం తిండిలేక అల్లాడిపోతున్నారు. వర్షంలేని కారణం వల్ల వ్యవసాయమే నిలిచిపోయింది. పంట వేయడమే లేకపోవటం వల్ల పొలాలన్నీ బీళ్ళు అయ్యాయి. ధాన్యం గింజ దొరకడంలేదు. ఆ బ్రాహ్మణ

కుటుంబం ఎన్నో రోజులు ఏవి దొరికితే అవి తింటూ ఉండవలసి వచ్చింది. బిచ్చమెత్తుకున్నా ఏమీ దొరికేది కాదు. ఒక్కొక్కనాడు వచ్చి మంచినీళ్ళు పుచ్చుకొని అలాగే ఉండిపోవలసి వచ్చేది. ఒకనాడు ఎర్రని ఎండలో తిరిగి తిరిగి అలసిపోయిన ఆ బ్రాహ్మణుడు ఎట్టకేలకు ఒక శేరు జొన్నలు సంపాదించుకొని ఇల్లు చేరాడు. ఆ శేరు జొన్నలు పిండి చేసికొని, ఆ పిండి ఇంట్లో నలుగురు సమానంగా పంచుకొని తిందామను కున్నారు. జపతపాదులు ముగించుకొని దేవున్ని ధ్యానించుకొని ఆనందంగా ఆరగించాలనే ఆశతో కూర్చున్నారు.

సరిగ్గా ఆ సమయానికి ఒక బ్రాహ్మణుడు ఎండలో తిరిగి తిరిగి ఆకలితో అక్కడికి వచ్చాడు. అతిథి ఎవరో వచ్చారని ఇంటి బ్రాహ్మణుడు ఎదురువెళ్ళి ఆయన్ను లోపలికి రమ్మని తీసుకువచ్చాడు. కళంకంలేని ఆ బ్రాహ్మణ అతిథికి– తాను తన కొడుకు, తన భార్య, తన కోడలు కలిసి సంతోషంగా ఉపచారం చేశారు. బ్రాహ్మణోత్తమా! నేను పేదవాన్ని. అది మీరేమి పట్టించుకోకుండ నేను పెట్టింది ఆరగించి, నన్ను ధన్యున్ని చేయండి అని చెప్పి గృహయజమాని భాగం జొన్నపిండి ఆయనకు పెట్టాడు. అది ఆ బ్రాహ్మణుడు భుజించాడు.

కాని దాంతో అతడి ఆకలి తీరలేదు. పెట్టిన పిండితో తృప్తిపడక ఆకలికి నకనకలాడుతున్న ముఖంతో బ్రాహ్మణుడి వంక చూశాడు. ఆ బ్రాహ్మణుడికి ఏమీ చెయ్యడానికి పాలుపోక భార్యవంక చూశాడు. వెంటనే ఆమె నా భాగం కూడా అతిథికి పెట్టండి. ఆయన తృప్తిపడితే అదేచాలు. అని భర్తతో చెప్పి సంతోషంగా ఆ ఇల్లాలు తన భాగం పిండి కూడా అతనికి వడ్డించమని ఇచ్చింది.

సాధ్వీ! చీమలు, ఈగలు కూడా సంపాదించి తెచ్చి తమ భార్యలకు పెట్టి పోషిస్తాయి. అలాంటప్పుడు నేను నిన్ను పోషించలేని స్థితిలో

ఉన్నానంటే ఏమనాలి? అది చాలక నీకున్న తిండి లేకుండా చేసి నిన్ను ఆకలిమంటలకు బలిచేసి నీవు లేకుండా చేసుకుంటే నాకేం లాభం? భార్య పొట్టగొట్టి అతిథి పూజ చేయడం వల్ల నాకేం ప్రయోజనం? అని చెప్పాడు. బ్రాహ్మణుడు కాని భార్య ఒప్పుకోలేదు.

బ్రాహ్మణోత్తమా! ధర్మం, అర్థం మొదలైన అన్ని పురుషార్థాలు మనిద్దరం కలిసి పాటించవలసిన నియమాలు కదా? మీరు మీ ధర్మం నిర్వహించండి. దయచేసి నావంతుకు వచ్చిన నాలుగోభాగం పిండి కూడా ఆ అతిథికి పెట్టండి.  నాలాగే మీరు కూడా ఆకలితో బాధపడుచున్నారు కదా! కనుక నేను చెప్పినట్లు చెయ్యండి. వద్దనకండి అని ఆ బ్రాహ్మణుడి భార్య బ్రతిమిలాడింది.

ఎలాగో ఆయన ఒప్పుకొని ఆమె భాగం కూడా అతిథికి పెట్టాడు. అతిథి అదికూడా భుజించాడు. అయినా ఆయన ఆకలి తీరినట్లు లేదు. ఆ పేద బ్రాహ్మణుడది చూసి మనస్సులో చాలా కలవరపాటు చెందాడు.

ఇదంతా చూస్తున్న బ్రాహ్మణ పుత్రుడు నాన్నగారు నా భాగం కూడ అతిథి దేవునికిచ్చి తృప్తిపరచండి అన్నాడు.

ఇది విని తండ్రి ఎంతో దుఃఖించాడు. నాయనా పెద్దవాళ్ళు, వయసు ముదిరినవాళ్ళు ఆకలి సహించుకోగలరు. పిల్లవాళ్ళు ఆకలి భరించలేరు. నీ భాగం తీసికొని అతడికివ్వడానికి నా మనస్సు అంగీకరించడం లేదు.

కుమారుడది పాటించలేదు. ముసలితనంలో ఉన్న తండ్రిని కాపాడటం కొడుకు చేయవలసిన విధి. తండ్రి వేరు, కొడుకు వేరు కాదు. పుత్రుడే తండ్రిలోని భాగం కదా? కాబట్టి నా భాగం కూడా మీదే. మీరు నా భాగం పిండి తీసికొని ఆకలి తీరకుండా ఉన్న అతిథికి పెట్టి తృప్తిపరచండి అన్నాడు కుమారుడు.

అబ్బాయి! గుణశీలాలలోను, ఇంద్రియ నిగ్రహంలోను అన్నివిధాల నిన్ను చూసి గర్వపడేటట్లు నీవు నడుచుకున్నావు. నాయనా నీ ప్రవర్తన నాకెంతో నచ్చింది. నీకెప్పుడు దేవుడు మేలుచేయాలి చివరకు నీ భాగం కూడా తీసుకుంటున్నాను అని చెప్పి ఆ బ్రాహ్మణుడు కుమారుడి భాగం పిండి తీసుకొని, సంతోషంగా అది కూడా అతిధికిచ్చాడు.

అతిధి అది కూడా తిన్నాడు కాని ఇంకా తృప్తి కానట్లే కనిపించాడు. ఉంఛ వృత్తి బ్రాహ్మణుడికి ఎంతో అవమానంగా ఉంది. ఏం చెయ్యడానికి కూడా పాలుపోవడం లేదు. అప్పుడతడి కోడలు చూసి మామగారు! నా భాగం కూడా సంతోషపూర్వకంగా ఇస్తాను. తీసికొని అదికూడా అతిధికే పెట్టండి. మీ ఆశీర్వాదం వళ్ళ నాకు అక్షయమైన సంపదలు కలుగుతాయి అని చెప్పింది.

ఇది విని మామగారు కోడలితో ఏనాడు తప్పుచెయ్యని తల్లివి. నిన్ను ఆకలితో మాడ్చి నీకున్న భాగాన్ని తీసుకొని అదికూడ అతిధికి పెట్టినట్లయితే ధర్మం తప్పినట్లే కదా! అమ్మాయీ నీవు చిన్నదానివి! నీవు ఆకలితో అలమటించి పోతుంటే నేను చూసి ఎలా ఊరుకోను? అన్నాడు. కాని కోడలు అంతటితో విడిచిపెట్టలేదు.

స్వామీ! మీరు నా ప్రభువుకు ప్రభువులు. గురువుకు గురువులు. దైవానికి దైవం. నా భాగం పిండి కూడా తీసికొని ఆ అతిధికి పెట్టండి. ఈ శరీరం ఉంది గురునాధుల సేవకోసమే కదా! మీరు నాకు మంచి గతులు కలిగేటట్లు చేయండి. నా భాగం పిండి కూడా తీసుకోమన్ని వేడు కొంటున్నాను. అని కోడలు బ్రతిమిలాడి మామగారిని ఒప్పించింది.

ఆ బ్రాహ్మణుడు బిడ్డా! నీవు పతివ్రతవు. నీకు సకల భాగ్యాలు కలుగుతాయి అని ఆశీర్వదించి ఆమె భాగం పిండి కూడా అతిధికి వడ్డించాడు.

అది కూడా భుజించిన తరువాత అతిగా వచ్చిన బ్రాహ్మణుని ఆకలి తీరింది. తృప్తి కలిగింది. మీరు చేసిన దానం అద్భుతమైన దానం. దేవతలు కూడా పుష్పవర్షం కురిపిస్తున్నారు. అదుగో! ఆకాశ మధ్యంలో దేవర్షులు, దేవతలు, గంధర్వులు మిమ్మల్ని దర్శించడానికి విమానాల మీద వచ్చి నిల్చున్నారు. మీరు, మీ భార్య, మీ కుమారుడు, మీ కోడలు స్వర్గలోకం చేరుకుంటారు. మీరు చేసిన ఈ దానం వల్ల మీ పితృదేవతలందరికి కూడా స్వర్గలోకప్రాప్తి సంపాదించిపెట్టారు.

సామాన్యమైన ఆకలి బుద్ధిని చెరుస్తుంది. ఆకలి వల్ల మనిషి దేనికైనా పాల్పడతాడు. ఆకలి ధర్మచింతన పోగొడుతుంది. జ్ఞానవంతులయిన వాళ్ళు కూడా ఆకలి వల్ల వాళ్ళ వివేకం కోల్పోతారు. అయినప్పటికి మీరు ఆకలితో ఉన్నా ఎంతగానో ఔదార్యం చూపించారు. మీరు–మీభార్య, పుత్రుడు, కోడలు వీరిమీద ప్రేమకూడా లెక్కచేయకుండా ధర్మదీక్షనే అధికంగా భావించుకున్నారు.

అనేక రాజసూయాలు, అశ్వమేద యాగాలు చేసిన ఫలం కూడా మీరు చేసిన ఈ ఒక్క దానఫలానికి సరిరావు. అదిగో! మీకోసం దివ్యవిమానం వచ్చి మీకోసం కాచుకుంది. వెళ్ళి ఎక్కండి. స్వర్గానికి పయనం కండి. అని చెప్పి ఆ అతిథిగా వచ్చిన బ్రాహ్మణుడు అంతర్ధానమైపోయాడు.

ఈ విధంగా ఆ ఉంఛవృత్తి బ్రాహ్మణుడి కథ చెప్పి ఆ ముంగీస ఇంకా ఇలా అంది– ఆ బ్రాహ్మణుడు జొన్నపిండి పెట్టిన స్థలానికి చేరువుగా ఉన్న కారణం చేత, ఆ వాసన వల్ల నాతల అంతా బంగారం అయిపోయింది. అప్పుడు నేను ఆ పిండి పెట్టిన చోటికి వెళ్ళి అక్కడ పొర్లాడాను. ఆ పిండి తగిలిన చోటల్లా నా ఒళ్లు బంగారం అయిపోయింది. అలా నా శరీరంలో సగభాగం బంగారం అయింది. తక్కిన సగం కూడా బంగారం కావాలన్న కోరికతో అనేక యాగశాలలో పొర్లివచ్చాను. కాని ఎక్కడా నా ఒళ్ళు బంగారం కాలేదు. అలాగే ఇక్కడికి వచ్చాను. కాని ఇక్కడా కూడా అంతే.

అందుచేతనే యుధిష్ఠిరుడు చేసిన ఈ గొప్ప అశ్వమేధ యాగం, ఒక శేరు జొన్నపిండి దానం చేసిన ఆ బ్రాహ్మణుడి దానఫలంతో సరికాదని చెప్పాను అని పలికి ఆ ముంగీస మాయమైపోయింది.

******

అందుచేత నచికేతుని వద్దకు వచ్చి యముడిలా అన్నాడు– ఓ బ్రాహ్మణుడా గౌరవనీయుడైన నీవు అతిథివై నా ఇంట్లో నిరాహారిగా మూడు రాత్రులు గడిపావు. కనుక వాటి పరిహారంగా మూడు వరాలు కోరుకో! ఓ బ్రాహ్మణుడా! నీకు శుభమగుగాక. నీకు నమస్కారము. నాకు శుభమగునుగాక.

నచకేతుడు ఇలా బదులు చెప్పాడు– ఓ మృత్యువా! నా తండ్రియైన గౌతముడు నాగురించిన ఆతృత తీరినవాడై, కోపము శాంతిచినవాడై సంతోషము నిండిన మనస్సుతో నీచేత తిరిగి పంపబడిన నన్ను గుర్తించి ఆదరించుగాక, మూడు వరాలలో మొదటిదిగా నేను కోరే వరం ఇదే!

యముడిలా అన్నాడు– నా ఆజ్ఞచేత ఔద్దాలకియైన నీ తండ్రి నిన్ను గుర్తిస్తాడు. నీతో పూర్వం లాగానే ఉంటాడు. మృత్యుముఖం నుండి తప్పించుకున్న నిన్ను చూసి కోపము పోయి రాత్రులందు సుఖంగా నిద్రించగలడు.

నచకేతుడంటున్నాడు– స్వర్గలోకంలో ఎటువంటి భయంలేదు. స్వర్గవాసులైన దేవతలకు జీవితంలో మూడుదశలు మాత్రమే ఉంటాయి అని సామాన్యుని విశ్వాసము. అం దుచేతనే వారికి త్రిదశులని పేరు. వారికి ఉండేవి జన్మ, బాల్య, ఔవనంలు మాత్రమే. మానవులకున్నట్లు ఆపైన వార్ధక్యము, మరణము దేవతలకు లేవు. అంతేగాక వారు సోమలోకంలోని అమృతము సేవించుతారు కనుక ఆకలిదప్పుల బాధల కూడా లేదు.

యజ్ఞయాగాదులు చేసి సోమలోకానికి పోయే మానవులు వారికి ఆహారమవుతారు.

యమధర్మరాజా! స్వర్గానికి తీసుకుపోయే ఆ యజ్ఞం నీకు తెలుసు. నేను శ్రద్ధావంతుడను. అందుచేత ఉపదేశానికి అర్హుడను. నాకా యజ్ఞవిద్యను ఉపదేశించు. ఆ యజ్ఞం చేత స్వర్గ కాములు అమరత్వం పొందుతారు. ఇది నేను రెండవ వరంగా కోరుకుంటున్నాను.

**స్వర్గకాములు:** ఈ అమరత్వం బ్రహ్మసాక్షాత్కారం పొందినవారికి కలిగే అసలైన అమరత్వం కాదు. ఈ అమరత్వం సాపేక్షికము. కల్పాంతం వరకు దేవతలు జీవించి అనుభవించె పదవులను దీర్ఘజీవితాన్ని మాత్రమే ఇక్కడ అమరత్వం అనే పదవి సూచిస్తుంది.

మృత్యువు ఇలా బదులు చెప్పాడు– నచకేతా స్వర్గానికి తీసుకుపోయే ఆ అగ్ని, యజ్ఞం, నాకు బాగా తెలుసు. నీకు చెబుతాను, నేర్చుకో. ఆ విద్య శాశ్వత స్వర్గాన్ని పొందటానికి సాధనమని, సకల జగత్తుకు ఆధారమని, విద్వాంసుల హృదయంలో నివసిస్తుందని తెలుసుకో.

నచకేతునికి యముడు జగత్తుకు మూలమైన ఆ అగ్నిని వివరించాడు. కావలసిన ఇటుకలు ఎన్నో ఎటువంటివో ఏ విధంగా పేర్చాలో, ఎలా నిర్వహించాలో అంతా సాకల్యంగా చెప్పాడు.

శ్రద్ధగా విన్న నచకేతుడు అంతా మళ్ళీ యమునికి ఒప్పచెప్పాడు. దానికి యముడు ఎంతో సంతోషించి ఇలా అన్నాడు– నీకు మరో వరం కూడా ఇస్తున్నాను. ఇకమీదట ఈ అగ్ని నీపేరిటనే ప్రసిద్ధమవుతుంది. ఇదిగో! ఎన్నో రంగులు కల ఈ మాలను కూడా తీసుకో!

**రంగులు కల ఈ మాల :** శ్రీ శంకరుల అభిప్రాయంలో "అనేక రూపాం సృంకాం" అనే పదానికి సత్ఫలితాలనిచ్చే కర్మమార్గమని అర్థము.

అపుడు ఈ శ్లోకానికి అర్థము యముడు నచకేతునికి మరికొన్ని సత్ఫలితాలనిచ్చే యజ్ఞకర్మ రహస్యాలను ఇంకొన్నిటిని ఉపదేశించాడని చెప్పుకోవాలి.

ఈ నచకేత యజ్ఞాన్ని మూడుసార్లు చేసి, ఉపదేశం కొరకు ముగ్గురిని ఆశ్రయించి మూడు రకాల విధులను నిర్వర్తించినవాడు జన్మమృత్యువులను అతిక్రమిస్తాడు. బ్రహ్మము నుంచి జనించినవాడు దేదీప్యమానుడు, సర్వజ్ఞుడు, ఆరాద్యుడు అయిన అతనిని (అగ్నిని) గూర్చి తెలుసుకొని సాక్షాత్కారించుకొని పరమశాంతిని పొందుతాడు.

**మూడుసార్లు చేసి :** త్రినాచికేతః అనే పదానికి ఈ నచకేతాజ్ఞాని గూర్చి విని, అధ్యయనం చేసి, నిర్వర్తించిన వాడు అని కూడా అర్థం చెప్పుకోవచ్చును.

**ముగ్గురుని ఆశ్రయించి :** తల్లి, తండ్రి, గురువుల ద్వారా ఉపదేశాన్ని పొందినవాడు, లేదా వేదాలు, స్మృతులు, ఋషులనుండి ఉపదేశాన్ని పొందినవాడు లేదా ప్రత్యక్షము, అనుమానము, శబ్దము అనే మూడు ప్రమాణాల ద్వారా జ్ఞానాన్ని ఆర్జించినవాడు.

**మూడు రకాల విధులను :** వేదాధ్యయనము యజ్ఞ నిర్వాహణము, దానము అనే మూడు.

నచకేత యజ్ఞాన్ని మూడుసార్లు నిర్వర్తించిన ఆ ధీశాలి ఆ మూడింటిని తెలుసుకొని నిర్వర్తిస్తాడు. అతడు శరీర పతనానికి ముందే మృత్యు పాశాలను ఛేదించి శోకాన్ని అతిక్రమించి స్వర్గలోకంలో ఆనందిస్తాడు.

**మూడింటిని తెలుసుకొని :** యజ్ఞ కుండానికి ఏ రకమైన ఇటుకలు కావాలో, ఎన్ని ఇటుకలో, ఎలా హోమాగ్నిని రగిలించాలో అనే మూడింటిని తెలుసుకొని.

**మృత్యు పాశాలను :** దుర్మాదత, లోభము, ఆసక్తి, అజ్ఞానము, ద్వేషము మొదలైన రూపాలలో ఉన్న మృత్యు పాశాలను.

**స్వర్గలోకంలో :** తన ఆత్మయందే విరాట్టును సాక్షాత్కరించు కున్నవాడు కనుక విశ్వజీవనంలోని ఆనందాన్ని అనుభవిస్తాడు. చేతన జీవితంలో అదొక స్థాయి. అందుచేత లోకం అనబడింది.

స్వర్గానికి తీసుకుపోయే ఈ అగ్ని (యముడు నచకేతునికి చెప్పిన యజ్ఞం) రెండవ వరంగా నీవు కోరుకున్నది. ఈ యజ్ఞం ఇకమీదట నీపేరిటనే పిలువ బడుతుంది.

**నచకేతా! ఇక నీ మూడవ వరం కోరుకో!**

నచకేతుడిలా అన్నాడు– మానవుడు మరణించాక వచ్చే సందేహము ఇది. చనిపోయిన అతడు ఉన్నాడని కొందరంటారు. మరికొందరు లేడంటారు. నీవు నేర్పితే దీనిని తెలుసుకోవాలని నా కోరిక. నా వరాలలో ఇదే మూడవ వరం. మరణం తర్వాత ఆత్మ అనే నిజమైన సత్త ఏదైనా మిగిలి ఉంటుందా అని నచకేతుడు తెలుసుకోగురుతున్నాడు.

ఈ విషయంలో లొకసామాన్యంలో అభిప్రాయబేధం ఉండటం చేత మృత్యుదేవతనే నచకేతుడు ఈ ప్రశ్నను అడుగుతున్నాడు.

యముడిలా అన్నాడు– ఈ విషయంలో దేవతలకు కూడా మునుపు సందేహం వచ్చింది. ఇది చాలా సూక్ష్మమైన విషయము. అర్థం చేసుకోవడం కూడా చాలా కష్టము. అందుచేత ఓ నచకేతా! మరొక వరం కోరుకో! ఈ వరం మాత్రము నన్ను అర్థించకు. ఈ మాట నుండి నన్ను వదిలిపెట్టు.

నచకేతుడిలా అన్నాడు– ఈ విషయంలో మరి దేవతలకు కూడా సందేహం వచ్చింది కదా! దానికి తోడు ఈ విషయం సులభంగా అర్థం అయ్యేది కాదని నీవుకూడా చెబుతున్నావు.

యముడు మృత్యుదేవతయే అనడం చేతను, మరణం తరువాత మానవుడి స్థితినిన గురించి, ఉత్తరగతులను నిర్ణయించేవాడు అవడం చేతను, మరణం తర్వాత మానవుడి స్థితిని గురించి చెప్పగలిగే ఆచార్యశ్రేష్టులలో యముడు కూడా ఒకరు.

కథ సంగతి ఎలా ఉన్నా జీవిత రహస్యం మరణంలోనే ఉన్నది. నిష్పాక్షికంగా విచారిస్తే అతీంద్రియయుతమైన ఆత్మను అది సర్వదా ప్రకటించక మానదు. మృత్యువుని గూర్చి ధ్యానిస్తే భౌతిక జీవనపు క్షణబంగురత్వం మనకు విస్పష్టంగా గోచరిస్తుంది. మన నిజమైన సత్తా శాశ్వత చైతన్యము నుండి భౌతిక జీవితం ఎంత భిన్నమో తెలిసివస్తుంది. అంతేగాక మానవ చరిత్ర ఆది నుండి మతానికి మత జీవితానికి సంబంధించిన బలవత్తరమైన ప్రేరణా శక్తులతో మృత్యుభావన ఒకటిగా ఉంటూనే వచ్చింది. అందుచేత ముముక్షువులకు మృత్యువును గురించి ధ్యానించడం ఒక విధిగా ప్రత్యేకించి చెప్పబడినది. ప్రాపంచిక విషయాల నుండి వైరాగ్యం కలిగించడానికి ఆ ధ్యానం ఒక సాధనము.

యముడిలా అన్నాడు- నూరేండ్లు జీవించే కొడుకులను, మనుమలనూ కోరుకో!

పశువుల మందలనూ, ఏనుగులు, గుఱ్ఱాలను, బంగారాన్ని ఎంతైనా కోరుకో!

భూమి మీద సువిశాల సామ్రాజ్యాని వరించు

నీవు కూడా నీకు ఇష్టమైనంతకాలము జీవించు.

దీనితో సమానమైన వరమేదైనా నీకు తోస్తే అదే కోరుకో!

ఓ నచకేతా! సువిశాల సామ్రాజ్యానికి నీవు చక్రవర్తిగా ఉండు. నీకు కలిగే కోరికలన్నీ తీరేలాగా నేను చేస్తాను.

మనుష్యలోకంలో ఏఏ కోరికలు దుర్లభాలో వాటన్నిటిని నీ ఇష్టప్రకారంగా అడుగు.

సంగీత వాద్యాలతో, విహార రథాలతో ఉన్న అపురూప సుందరులైన కన్యలు మానవులకు లభ్యం కారు. వారందరిని నేను నీకు ప్రసాదిస్తాను. వారిచేత సేవలను పొందు.

**"కాని మరణాన్ని గురించి మాత్రము నన్నడగవద్దు".**

నచకేతుడిలా అన్నాడు– ఓ యమరాజా! నీవు చెప్పే ఇవన్నీ కూడా క్షణికాలే! మానవుడి ఇంద్రియాల శక్తిని క్షీణింపచేసేవే. ఎంత పొగిడించినా మానవ జీవితము అల్పము.

అందుచేత నీ గుఱ్ఱాలు, ఏనుగులు, ఆటపాటలు నీవే ఉంచుకో. మానవుడేనాటికి ధనముతో తృప్తిపడడు. అంతేగాక నిన్ను దర్శించాక మాకు ఎలాగు సంపద వస్తుంది. నీవు పాలించేంతవరకు ఎలాగు జీవిస్తాము.

**"కాని నాకు నేను అడిగినదే కోరదగిన వరము"**

సృష్టి అంటేనే పరిణామము కనుక సృష్టించబడినదేది శాశ్వతము కాదు. ఒక వస్తువు మరొక వస్తువుకంటె ఎక్కువ కాలం ఉన్నా, తక్కువ కాలం ఉన్నా అంతిమ పరిణామము పొందవలసినదే! జంతువులకంటె మానవుడు ఎక్కువ కాలం జీవించవచ్చు. దేవతల ఆయుష్య మానవుల ఆయుష్యకంటె అధికం కావచ్చు. కల్పాంతమైన బ్రహ్మ ఆయుః పరిమితి అందరి జీవితం కంటె దీర్ఘం కావచ్చు.

**"కాని అంతము లేని కాలంలో బ్రహ్మ జీవితకాలం కూడా క్షణమాత్రం కూడా రాదు"**

## -: కాలమానము :-

అనంతమైన కాలమును కొలుచుటకు, భగవదనుగ్రహముచే, సృష్టి రహస్యములను ఛేదించి, తెలుసుకొని, మనకందించిన ఇట్టి లెక్క ఈ క్రింద విధముగా యున్నది.

ఆరు ప్రాణముల కాలము = 1 విఘడియ

అరువది విఘడియలు = 1 ఘడియ

అరువది ఘడియలు = 1 అహోరాత్రము

ఈ అహోరాత్రము మానవులకు ఒక రోజు

15 రోజులు = ఒక పక్షము

2 పక్షములు = ఒక నెల

మానవుల ఒక నెల అనగా ముప్పది అహోరాత్రములు. పితృలోకములో ఒక అహోరాత్రమగును. మన శుక్లపక్షము పితృలోకవాసులకు ఒక పగలు. మన కృష్ణపక్షము వారికొక రాత్రియగును.

12 మానవుల నెలలు = దేవలోకములోని దేవతకొక అహోరాత్ర మగును. అనగా మన ఉత్తరాయణము ఆరు మాసములు వారికి పగలు, మన దక్షిణాయణము ఆరు మాసములు వారికి రాత్రి.

30 మానవ సంవత్సరములు = దేవతలకు ఒక నెల

360 మానవ సంవత్సరములు = దేవతలకు ఒక సంవత్సరము

కృతయుగము = 17,28,000 మానవ సంవత్సరములు

త్రేతాయుగము = 12,96,000 మానవ సంవత్సరములు

ద్వాపరయుగము = 8,64,000 మానవ సంవత్సరములు

కలియుగము = 4,32,000 మానవ సంవత్సరములు

పై నాలుగు యుగములు సంధి సంధ్యాంశములతో కలిసి 43,20,000 మానవ సంవత్సరములగును. దీనిని ఒక దివ్య యుగము లేక మహా యుగమందురు.

అట్టి 1000 దివ్యయుగములు లేక 432 కోట్ల మానవ సంవత్సరములు బ్రహ్మకాలమానమున ఒక పగలు యగును. దీనినే "ఉదయ కల్పమందురు"

అట్టి మరి 432 కోట్ల మానవ సంవత్సరములు బ్రహ్మ అనెడి కాలమున ఒక రాత్రియగును. దీనినే "క్షయకల్ప"మందురు.

ఉదయ కల్పము, క్షయ కల్పములు రెండు చేరి రెండు వేల మహా యగములు లేక దివ్యయుగములు లేక 864 కోట్ల మానవ సంవత్సరములు బ్రహ్మమానమున ఒక అహోరాత్రమగును. దీనిని మహాకల్పమందురు.

అట్టి 30 అహోరాత్రములు లేక మహాకల్పములు బ్రహ్మకు ఒక నెల.

అట్టి 12 నెలలు బ్రహ్మకు ఒక సంవత్సరము

అట్టి బ్రహ్మ సంవత్సరములు నూరైన బ్రహ్మమానము పూర్తియగును.

ఇట్టి బ్రహ్మకాలములు అనేకములిప్పటికి గడిచినవి.

ప్రస్తుత లెక్కలు చూచిన ఇప్పటి బ్రహ్మమానమున 50 సంవత్సరములు గడిచినవి.

51వ సంవత్సరమున మొదటిరోజు పగటికాలమున 195,58,85,050 మానవ సంవత్సరములు.

ఒక బ్రహ్మయొక్క పగటి కాలము 432 కోట్ల మానవ సంవత్సరములు, 14 మనువుల కాలముగా విభజింపబడినవి. ఒక్కొక్క మనువు యొక్క కాలము 71 మహాయుగములు అగును. అనగా 30,67,20,000 మానవ సంవత్సరము లగును.

ఇప్పుడు మనచే లెక్కింపబడిన బ్రహ్మమానములో 6 గురు మనువుల కాలము గడిచినది. ప్రస్థుతము 7వ మనువుయగు వైవస్వత మన్వంతరములో 12,05,83,050 మానవ సంవత్సరములు గడిచినది.

అనగా 27 మహాయుగములు గడిచి 28వ మహాయుగములో కృత, త్రేతా, ద్వాపర యుగములు గడిచి 28వ కలియుగములో 5095 సంవత్సరములు గడిచినవి.

7వ మనువు కాలమింకను 18,61,86,950 సంవత్సరములు జరుగ వలసియున్నది.

ఇప్పటి బ్రహ్మశకము – బ్రహ్మమానము ప్రకారము బ్రహ్మ వయస్సు 50 సంవత్సరములు – 51వ సంవత్సరములో, 195,58,85,050 సంవత్సరములు గడచినవి. (అనగా 18001వ కల్పము).

| | |
|---|---|
| **వైవస్వత మనువు శకము గడిచిన కాలము** | **12,05,33,050 సంవత్సరములు** |
| **వైవస్వత మనువులో 28వ మహాయుగములో గడచిన కాలము** | **38,93,050 సంవత్సరములు** |

**కలి శక ప్రారంభము**

| | | | |
|---|---|---|---|
| | శు గు కు<br>ర శు బ<br>చ | | |
| | | | |
| | | | |
| | | | |

కలి శకము ఖగోళములోని గ్రహ చలనాదుల మీద ఆధారపడి యున్నది.

**శ గు కు ర శు బు చ** = అనెడి 7 గ్రహులు మేషరాశి యందు కూడిన కాలము నుండి కలి శకము ప్రారంభిపబడి లెక్కింపబడుచున్నది. అట్టి సంఘటన క్రీ.పూ. 3102 సం॥ ఫిబ్రవరి 20వ తేది 2’-$22^0$-30 సెకండ్ల కాలమున ఏర్పడినది. ఆ క్షణము నుండి కలి ప్రవేశమగుటయు కలి శకము వాడుక లోనికి వచ్చుటయు జరిగినది.

**దీనిని కాదనుటకు ఎవరికిని వీలు లేదు.**

మేషములో సప్త గ్రహములుండుటయే గాక మందోచ్చలు మొదలగు ఇతర వివరములెన్నియో ఆకాశము నందేకకాలమున సంఘటితము కావలయును. అట్టి సమయముననే కలి ప్రవేశమగును.

ఇట్లు ప్రతి యుగ ప్రవేశకాలమునకు గ్రహకుండలి నిర్ణయింపబడినది.

ఇట్టి అనేక వివరములతో కూడిన గ్రహకుండలి పిమ్మట 43,20,000 సంవత్సరములకు తిరిగి వచ్చుచుండును.

**యోగములు :** క్రాంతి వృతము మీద గురుడు, బుధుడు - ఒకే యంశములోను - కుజుడు 8 అంశముల దూరములోను, శని 7 అంశముల దూరములో యుండెనని 'బెయిలీ' చెప్పుచున్నాడు.

పూర్వోక్తములైన 4 గ్రహములును వరుసగా ముందు శని తరువాత కుజుడు పిదప గురువు చివర బుధుడు సూర్యరశ్మిచే గుప్తపరుచబడినవి. అనగా ఇది యోగమందుండెను.

## అవతారములు

మత్స్యావతారము .................... 12,49,01,467 సంIIలు

కూర్మావతారము ..................... 12,07,00,469 సంIIలు

ఆది వరాహావతారము .............. 10,58,08,872 సంIIలు

శ్రీ నరసింహావతారము ............. 8,64,59,129 సంIIలు

శ్రీ వామనావతారము ................ 4,40,45,050 సంIIలు

శ్రీ పరుశురామావతారము........... 1,46,01,052 సంIIలు

శ్రీరామ మానవావతారము .......... 1,46,16,006 సంIIలు

శ్రీ బలరామావతారము ........................ 5,050 సంIIలు

కలికావతారము జరుగువలసిన కాలము 4,26,961 సంIIలు

## చక్రవర్తులు

హరిశ్చంద్రుడు....................... 11,98,24,282 సంIIలు

నలచక్రవర్తి ......................... 10,30,17,039 సంIIలు

పురుకుత్సుడు ........................ 7,36,17,039 సంIIలు

పురూరవుడు ......................... 8,10,12,011 సంIIలు

సగరుడు ............................ 5,10,28,458 సం॥లు

శిభి చక్రవర్తి ........................ 4,14,80,314 సం॥లు

**<u>గతించిన రాజుల కాలములు</u>**

అంగీరస ............................ 4,08,31,044 సం॥లు

గయరాజ ........................... 3,99,20,454 సం॥లు

పృధరాజు ........................... 3,22,08,880 సం॥లు

యయాతి ........................... 3,10,31,040 సం॥లు

నశిచిందు ........................... 2,70,28,807 సం॥లు

మాంధాత ........................... 2,34,40,177 సం॥లు

భగీరథుడు .......................... 2,15,05,987 సం॥లు

దుశ్యంతుడు ........................ 1,56,04,043 సం॥లు

దిలీపుడు ............................ 1,56,08,977 సం॥లు

కార్తవీర్యార్జునుడు .................... 1,25,47,159 సం॥లు

రంతిదేవుడు.......................... 1,20,37,314 సం॥లు

సహుశాబ్ద ........................... 1,12,25,500 సం॥లు

ఇంద్ర్యుమ్నుడు ............................... 49,894 సం॥లు

బ్రహ్మదేవునికి మునపు చెప్పిన దీర్ఘాయుర్భాగమున్నదని తలచి యెవరైనా నావలె ఇంతకాలము జీవించియున్నారాయని గర్వించి హంసవాహనమెక్కి వైకుంఠమున జేరి విష్ణుమూర్తిని దర్శించి పరమపురుషా! పరంధామ! పర్వాతరా! పరమపావనా! యని ఇట్లు పలు విధములు స్తుతించి అనాధరక్షకా! నావలె ఇంతకాలము వరకును జీవించియున్నవారెవరైనా యేలోకమందైనా యున్నారా యని అడిగెను.

నీవు సకల ప్రపంచమును సృష్టించిన మహానుభావుడవు గదా! నీకు సమానమైనవాడు త్రిలోకములందెవరును లేరు. నీవు యే వ్యాధులును లేక దీర్ఘకాలము జీవించినవాడవు. నీ మహామహిమ ఇట్టిదని నేను వర్ణించి చెప్పుట గొప్ప కాదు, మరికొందరి పెద్దలను విచారించిన ఇది తెల్లము కాగలదు యని భగవానుడగు విష్ణుమూర్తి సమాధానమిడ, అట్లయినచో అచ్చటకు వెళ్ళి విచారింతము అని బ్రహ్మ పలుకగా, అందుకు విష్ణుమూర్తి సమ్మతించి, గరుడ వాహనమెక్కి బ్రహ్మదేవుని పిలుచుకొని యొక గొప్ప అడవి మధ్య ఉన్న "రోమస" మహర్షి వద్దకు వెళ్ళి ఆ మహానుభావుని దర్శించిరి. అప్పుడు అకస్మాత్తుగా విష్ణుమూర్తి దర్శనము రోమసమహర్షికి కలుగ, అతడు పరమానందభరితుడై విష్ణుమూర్తిని పలువిధముల స్తుతించి స్వామి ఇంతదూరము వచ్చుటకు కారణమేమో తెలియకున్నాను. దయచేసి చెప్పవలయును అని అడిగెను.

అపుడు విష్ణుమూర్తి మునిపుంగవుని చూచి మహర్షీ! నీ ఆయుర్దాయము ఎంతయో బ్రహ్మదేవునికి తెలుపవలసినదని చెప్పెను.

అంత రోమసమహర్షి దేవా! సర్వజ్ఞుడవగు నీకు సృష్టిలో తెలియనిదేమి యున్నది. అయినను నాతో చెప్పింపవలెనని నీ సంకల్పము కావున చెప్పుచున్నాను వినుడు– ఈ బ్రహ్మమానము పూర్తి అయినచో నా శరీరమందు ఒక రోమము ఊడిపోవును. ఈ విధముగా నా శరీరమందు 3 కోట్ల 50 లక్షల రోమములు గలవు. ఇవన్నియు ఊడిపోగానే నేను నీలో ఐక్యమైపోవుదును అని పల్కెను.

అప్పుడు విష్ణుమూర్తి మహర్షిని చూచి ఓ మహర్షీ అంతకాలము జీవించుటకొక గృహమైనను కావలెను కదా ఏల వృక్షముపై నివసించుచుంటివి అని పల్కెను. అప్పుడు రోమసుడు దేహము ఈ నీటిబుగ్గ వంటిది. యదార్థము తెలిసిన తరువాత ఈ శరీరమును అంత భద్రముగా

దాచవలసిన అవసరమేమున్నది. తమ పాదసేవ చేయువారికి దేహాభిమానముండరాదు కదా! దేహాభి మానము వలన దుఃఖమే కాని సుఖము లేదు కదా అని పల్కెను.

అప్పుడు విష్ణుమూర్తి మిగుల సంతసించి తత్వోపదేశములలో కొన్నింటిని రోమస మహర్షికి బోధించి మేము ఇక వెళ్ళెదమని చెప్పిరి. అప్పుడు రోమస మహర్షి స్వామి మరల మీ దర్శనభాగ్యమెప్పుడో కదాయని వ్యసనపడుచు వారికి వీడ్కోలు ఇచ్చిరి.

మహావిష్ణువు రోమస మహర్షి వద్ద సెలవు పుచ్చుకొని బ్రహ్మతో గూడి మరియొక అరణ్యమధ్యమున గల అష్టావక్ర మహర్షి వద్దకేగిరి. అప్పుడు అష్టావక్రుడు విష్ణుమూర్తిని అనేక విధముల స్తుతించి వారి రాకకు కారణమడిగెను. అప్పుడు విష్ణుమూర్తి మిగుల సంతసించి ఓయి ఋషికులోత్తమా! నీ జీవిత కాలమెంతయో తెలిసికొనుటకై నీవద్దకు వచ్చితిమి. బ్రహ్మదేవునికి చెప్పమని పల్కెను.

అప్పుడు అష్టావక్రుడు పరమేశ్వరా! ఈ అనంతసృష్టిలో మీకు తెలియని దేమైనాయున్నదా! అయినను నీవు నాచే చెప్పించవలెనని మీ సంకలమూ కాన మీ దాసుడు చెప్పుచున్నాడు అని ఈ విధముగా పల్కెను.

నా శరీరములో ఎనిమిది వంకరలు గలవు. 3 కోట్ల 50 లక్షల బ్రహ్మ మానముల అనంతరము ఒక రోమసమహర్షి బ్రహ్మైక్యమగును. అట్టి రోమస మహర్షులు 7 గురు మృతి చెందిన పిమ్మట నేను మీలో ఐక్యమగును అని చెప్పెను.

బ్రహ్మదేవుడా వాక్యములు విన్నంతనే దేవదేవోత్తమా! నా హృదయా కాశమున గప్పియుండిన అహంకారవికార గాఢాంధకారమంతయు నీ కృపా కటాక్షముచే తొలగి జ్ఞానోదయమాయెను. లోకాభిమాన పాశమునుండి

విడివడి ముముక్షువునైతిని –అని విష్ణుమూర్తి వద్ద సెలవు తీసికొని తమ లోకమునకు వెళ్ళెను.

******

కాలాతీతమైన, నిత్యమైన చైతన్యంతో పోల్చిచూస్తే అనిత్యమైన శరీరములు, ఇంద్రియ సుఖములు ఏపాటివి.

ఈ నిత్య చైతన్యమే అమృతత్వము

కాని మానవుడు అజ్ఞానము వలన, పాంచభౌతికి మిళతమైన మాయ పిశాచము వెనుక పరిగెడుతుంటాడు.

అందుచేత నచకేతుడు

- **అసలైన సత్తను**
- **నిత్య చైతన్యాన్ని**
- **పరిణామం అంటనిదాన్ని**
- **మృత్యువుకు మించినదాన్ని**

వెదుకుతున్న కారణంగా ఎంత అద్భుతంగా, వైభవోపేతంగా కన్పించినా, క్షణికమైన, మలినమైన మనుష్యానందాన్ని అంగీకరించక పోవడము అతి సహజముగానే యున్నది.

అదియును గాక మృత్యుదేవతను దర్శించి తిరిగి వెళ్ళే అదృష్టం లభించాక ఇక సంపద లేకుండా ఉండదని నచకేతుడి అభిప్రాయము. అంతేగాక యముడే నచకేతాగ్నిని ఉపదేశించి అనుగ్రహించాడు కనుక ఆయన పాలనాకాలం అంతా తాను జీవించగలడు. అందుచేత తాను మళ్ళీ ధనంకోసం, దీర్ఘ జీవితం కోసం ప్రారబ్దించడము కోసము నిరర్ధకమని తలచాడు. కావాలనుకుంటే అవి ఎలాగు వస్తాయి.

మరణానంతరము మానవుడి జీవిత స్థితిని గూర్చి ఉపదేశించమని కోరిక కోరడం నచకేతుని దృష్టిలో **'అవసరమే'**.

అక్షయులు, అమరులు అయిన వారి వద్దకు చేరుకొని వారివద్ద పొంద గలిగే శ్రేష్టతరమైన వరాలను తెలిసి కూడా ఆటపాటల ఆనందాన్ని పరిశీలించిన

**ఏ మర్త్యుడు వాటిలో దీర్ఘకాలం ఆనందించాలని ఉత్సహిస్తాడు**
(ఎవడూ ఉత్సహించడు)

ఈ భావనలలో నచకేతుడి గాఢ వైరాఘ్యం ప్రస్ఫుటంగా గోచరిస్తుంది.

**మానవ జీవితం ఎంతకాలం పొడిగించినా సరే, అన్ని ఇంద్రియ భోగాలు అతి నికృష్టాలని, ఆ జీవితమే క్షణబంగురమని అతనికి ప్రగాఢంగా బోధపడింది.**

మతి స్థిరం ఉండి తన మరణ శీలత్వాన్ని గుర్తించిన మానవుడు అమరులైన దేవతల నుండి తాత్కాలిక ప్రపంచ సుఖాలను కోరడం అసంభవమని అతని భావన.

**తానుకూడా అమరుడయ్యే మార్గం తప్ప వేరే కోరదగదని నచకేతుడు గ్రహించాడు.**

అమరత్వం పొందడానికి ఈ ఆతృతయే ఉన్నత జీవితం పట్ల అతనికి గల వ్యాకులతను స్పష్టంగా తెలియజేస్తున్నది.

ఇలాంటి ఇంద్రియ సుఖాలన్నీ వట్టి ఇంద్రియ అనుభవాలె. క్షణికాలే అని అందుచేతనే అవి మానవుని జరామృత్యువుల నుండి రక్షించలేవని గుర్తించాడు నచకేతుడు.

**జీవితం ఎంత దీర్ఘమైనా జన్మ ఆరంభమైన న్యాయానుసారమే మరణంతో అంతం కావలసియున్నది. పరమాత్మలో తప్ప ఆ శాశ్వత జీవనం లేనేలేదు.**

ఓ యమరాజా! మరణానంతరం ఉండే ఆ పరమ జీవితాన్ని గూర్చి చెప్పు. దాన్ని గురించే అందరికి సందేహము. ఈ విషయం తప్ప నచకేతుడు మరొక వరం కోరడు.

అసలు ఉపనిషత్తు పరావిద్య రెండవ అధ్యాయము నుండి ఆరంభము అవుతుంది. అదే ఉత్కృష్ట జీవిత విధానాన్ని, సూత్రాన్ని గురించి యముని ఉపదేశం తన మూడవ వరంగా నచకేతుడు తెలుసుకోగోరినది ఈ సూత్రాన్నే.

అయితే ఈ విషయం అతీంద్రియము అయినది కనుక దానిని చక్కగా అర్థం చేసుకోవడానికి సుశిక్షితమైన స్వచ్ఛమైన మనస్సు అవసరము. అందుచేతనే

**సాధన చతుష్టయ సంపన్నుడు కానిదే ఎవడు ఆత్మ విద్యను పొందలేడని చెప్పబడుచున్నది.**

## సాధన చతుష్టయ సంపత్తి

1. నిత్యానిత్య వస్తు వివేకము
2. ఇహాముక్త ఫలభోగ విరాగము
3. శమాదిషట్క సంపత్తి



4. మముక్షుత్వము

ఎన్నో ఆశలు చూపుతూ యముడు నచకేతునికి సాధన చతుష్టయ సంపత్తి కలదా, పరావిద్య గ్రహించే అర్హత ఉన్నదా అని తేల్చుకున్నాడు.

మోక్షానికి కావలసిన ఈ అర్హతలన్నీ నచకేతునిలో ఉన్నాయని అతిసుందరంగా సూచించి నచకేతుడిలాగా ఉంటేనే తప్ప ఆత్మవిద్యను సరిగ్గా గ్రహించే సామర్థ్యం ఎవరికి ఉండదని పరోక్షంగా చెప్పుచున్నది శృతి.

**ఇంద్రియ సుఖాల కొరకు ఆశ, వాటిపట్ల ఆసక్తి అనే మాలిన్య మనస్సు నుండి పూర్తిగా ప్రక్షాళనమైతే తప్ప ఈ సత్య గ్రహణం అసంభవము. ఈ సత్యాన్నే సమవర్తి ఇంకా స్పష్టంగా ఘంటారావంగా చెపుతాడు.**

ఓం నమో శ్రీనివాసాయ నమః

ఓం నమశ్శివాయనమః

# సాధన చతుష్టయ సంపత్తి

1. నిత్యానిత్య వస్తు వివేకము
2. ఇహాముక్త ఫలభోగ విరాగము
3. శమాది షట్క సంపత్తి




4. ముముక్షుత్వము

## నిత్యానిత్య వస్తు వివేకము :-

త్రికాలాబాద్యము, దేశ కాల వస్తు కృత పరిచ్ఛేద రహితము, సర్వాదిష్ఠానము అగు బ్రహ్మము సత్యము. బ్రహ్మాతిరిక్తమగు సకల ప్రపంచము మిద్య యనెడి నిశ్చయ జ్ఞానమే.

**నిత్యానిత్య వస్తు వివేకము**

మారుతున్న వస్తువుల మధ్య మారని సత్యవస్తువు బ్రహ్మము. సత్యమైన వస్తువు నిత్యమైయుండట చేత అది మారేందుకు వీలు లేదు. నిత్యమైన వస్తువు అనంతమై యుండవలయును కాక అది తనలో తాను మారలేదు మరియొుక వస్తువులో దూరలేదు. దూరము తెలియని తాను ఎలా దూరుతుంది? కాలము తెలియని తాను ఎలా కదులుతుంది?

సత్య వస్తువునకు రూపం లేదు? కనుక దానికి నామము ఉండదు. నామరూపాలు లేని సత్యవస్తువు నశించేదుండదు. దానికి సమమైనది ఉండదు. విషమమైనది కూడా ఉండదు. అద్వయమైన తనలో ఈ బేధాలు దర్శించను వీలు ఉండదు. ఉన్నది అదియే అదియే **బ్రహ్మము**.

చర్మము, మాంసము, రక్తము, నరములు, మెదడు, మజ్జు, ఎమ్ముల తోడను గూడి మూత్ర పురీశములతో నిండియుండు ఈ స్థూల శరీరము మిక్కిలి హేయమైనది.

జీవాత్మ ఈ స్థూల శరీరముతో తాదాత్మ్యము పొంది చక్షురాది బాహ్యేంద్రియముల ద్వారా పుష్పమాలలు, స్త్రీ చందనము మొదలగు అనేక స్థూల పదార్థములను సేవించుచుండును. అందువలన ఈ స్థూల శరీరమునకు జాగ్రతావస్థ యనెడి ప్రసిద్ధి కలిగినది.

శిష్యా గృహస్థుడు గృహములో నివసించుచు బాహ్య సంసారము నెట్లు నిర్వర్తించునో యట్లే జీవుడీ స్థూల శరీరమునాశ్రయించి, నేను చూచుచున్నాను, వినుచున్నాను అను మొదలగు బాహ్య వ్యవహారమును జరుపుచుండును.

జన్మ జరామరణములు, పెరుగుట, చిక్కుట, మొదలగునవియు, బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యావస్థలును, వర్ణాశ్రమాది నియమములును, నానా విధ రోగానుభవము, ఇతరులచే పూజింప బడుట, అవమానింపబడుట యీ మొదలగు విశేషములన్నియు స్థూల శరీర ధర్మములు.

## సూక్ష్మ శరీరము

1. వాగాది కర్మేంద్రియ పంచకము
2. శ్రవణాది జ్ఞానేంద్రియ పంచకము.

3. ప్రాణాది వాయు పంచకము

4. ఆకాశాది భూత పంచకము

5. అంతఃకరణ చతుష్టయము

6. అవిద్య

7. కామము

8. కర్మము –అను నీ ఎనిమిది కూడి సూక్ష్మ శరీరమన బడుచున్నది (పూర్వ్యష్టకము)

జీవుని యొక్క ఈ విభక్త్యవస్థ స్వప్నమనబడును. ఈ స్వప్నావస్థ యందు సూక్ష్మశరీరము మాత్రమే శేషించియుండి ప్రకాశించుచుండును.

ఈ సూక్ష్మ శరీరము జీవునకు స్వరూపాజ్ఞానముచే కలుగు చున్నది. ఇది జీవాత్మకు అనాది యగు ఉపాది. అనగా ఈ సూక్ష్మ శరీరము జన్మజన్మల నుండి యెంతో కాలము నుండి వెంట వచ్చు చున్నది. దీనికి మొదలు లేదు మరియు నానావిధ సంస్కారరాశియై పాపపుణ్యకర్మములను ఫలింపచేయుచు వానిననుభవింపచేయుటకు వచ్చినది.

స్వప్నమనగా జాగ్రద్దశ యందు అనేక విధ వస్తువుల తోటి సుఖముననుభవించి తద్వాసనలతో కూడుకున్న బుద్ధి మాత్రమే మిగిలినదై స్వయంగా ప్రకాశించుచున్న స్వప్నావస్థ యందు జీవుడు బుద్ధితో కూడుకున్నవాడై జాగృద్దశయందు వలె అనేక వ్యవహారములను నడుపుచున్నాడు.

## అంతఃకరణ విజృంభణమే స్వప్నావస్థ

**మూల ప్రకృతి బ్రహ్మముతో గూడినపుడు మాయ యనబడే జీవునితో కూడినపుడు అవిద్యయనబడుచున్నది.**

స్థూల శరీరము, దశేంద్రియములు, పంచప్రాణములు, అహంకారము, మనస్సు, బుద్ధి, సుఖదుఃఖాది విషయములు అంతః కరణ పరిణామములు అగు రాగేచ్ఛాదులు, పృధివ్యాది పంచభూతములు, సమస్త వ్యష్ఠిరూప సకల ప్రపంచము, అవ్యక్తము, మొదలు స్థూలదేహ పర్యంతముగల సర్వదృశ్యవస్తువులును **'అనాత్మ'** వస్తువులు. అని తెలిసికొనవలెను.

**ఆత్మ : ఒకే ఆకాశము**




అను నాలుగు విధముల ఎటుల వ్యవహరింపబడుచున్నదో అలాగుననే ఒకే ఆత్మ




అను నాలుగు విధములుగా చెప్పబడుచున్నది.

ఘటాకాశము వలెయున్నవాడు– కూటస్థుడు; జలాకాశము వలె యున్నవాడు– జీవుడు; ఆకాశ ప్రతిబింబము మరియు ఘటాకాశము రెండును కూడ జలాకాశమగునటుల కూటస్థ ప్రతిబింబము కూటస్తుడును చేరి జీవుడందురు.

అలాగుననే ఈశ్వరుడు– శుద్ధ చైతన్య మాయ అందలి బ్రహ్మ ప్రతిబింబము చేరి అగుచున్నాడు.

మహాకాశమువలె యున్నది పరబ్రహ్మము.

జీవుడు అజ్ఞాన దశయందు అనన్యోద్యాసనము చేయుచున్నాడు అనగా ఆత్మను అనాత్మగా అనాత్మను ఆత్మగా చింత చేయుచున్నాడు.

విచక్షణగా జ్ఞానము అలవడినచో అసత్యమైనదేదియో తెలియును. తెలియుట జరుగగానే అసత్యమైన వస్తువును త్యజించును.

తన దేశమము మొదలు గోచరించు సమస్త ప్రపంచము అనిత్యమని తెలియును. అనిత్యమైన జగత్తుపై, జీవితముపై ఆశను వీడి, నిత్య వస్తు ప్రాప్తికి, ఈ స్థితిలో సాధకుడు ప్రయత్నించును. **కాని ఇక్కడ ఒక విషయము మరువరాదు.** ఈ స్థాయిలో శృతి, యుక్తి అనుభవము ద్వారా సాధకునకు ప్రపంచము అనిత్యమని తెలియును. అంతియే కాని నిత్య వస్తువును గూర్చిన జ్ఞానము ఉండదు.

సాధారణముగా

**ఈ నిత్యానిత్య వస్తు వివేకము పూర్వ పుణ్యవశమున కలుగును. బ్రతుకులోని బాధలు, శ్మశానంలోని చతిమంటలు దానిని వృద్ధి చేయును. ఈ వివేకాగ్నిని సత్సంగము ఆరిపోకుండా కాపాడును.**

## ఇహాముక్త ఫలభోగ విరాగము :

సాధనా చతుష్టయ సంపత్తిలో వైరాగ్యము రెండవ లక్షణము. విరాగమును కలిగి యుండుటయే వైరాగ్యము. విషయ సుఖములయెడ రాగము లేకుండుటయే విరాగమనబడును. వివేకము ద్వారా అనిత్యమైన వస్తువును గూర్చి సంపూర్ణముగా తెలియును. అట్టి వివేకము వలన కలిగిన ఉదాసీన వైఖరియే వైరాగ్యమనబడును.

**భయపడి వస్తు ప్రపంచమునకు దూరమగుట వైరాగ్యము కాదు.**

ఈశ్వర సృష్టిలో భోగములు 3 రకములుగా యున్నవి.

1. ఇహలోక భోగములు
2. పరలోక భోగములు
3. కైవల్య భోగము.

**1) ఇహలోక భోగములు :** ఈ లోకమందు ధన వనితాది విషయముల వలన కలుగు సుఖము ఐహికము.

ఇహమందు రాజ్యము కలవాడు రాజ్యచ్యుతుడగునేని దుఃఖము కలుగును. ధనికునకు ధననష్టము కలిగిన దుఃఖము కలుగును. రూపవతి యగు భార్యకలవానికి భార్య గయ్యాలియైనను, పరాభిలాషియైనను, మృతి చెందినను దుఃఖము కలుగును.

ఇట్లు ఇహ సంబంధమగు సమస్త విషయములు దుఃఖ భాజనములై అంతులేని జనన మరణ రూప సంసారమునకు కారణమగును.

**కావున ఐహిక సుఖములు శాశ్వతము కావు. కనుక కోరుకొన దగినవి కావు.**

**2) ఆముష్మిక భోగములు :** పరలోకమందు స్వర్గాధి భోగముల వలన కలుగు సుఖము ఆముష్మికమనబడును.

యజ్ఞాది పుణ్యకర్మల వలన లభించు స్వర్గాదిభోగములు– క్షీణే పుణ్యే మర్థ్యలోకం విషంతి అవునటుల పుణ్యము క్షీణింపగా మరల మర్త్యలోకమందు జన్మించి భవసాగరమున చిక్కి అనేక రకములగు దుఃఖములననుభవింప వలసియుండును.

**కావున ఆముష్మికము సయితము దుఃఖ భాజనమగుటచే కోరదగినది కాదు.**

**3) కైవల్యము :** కైవల్యము దుఃఖలేశ రహితమై శాశ్వత సుఖమును కూర్చును.

**కనుక అవశ్యము కోరదగినది.**

జీవుడు అజ్ఞాన వశమున దేహమే తానని భ్రమించి విషయముల యందు చిక్కి జనన మరణ చక్రములో బడి అనేక దుఃఖములననుభవించుచున్నాను.

తత్వజ్ఞానము వలన తన నిజరూపము తెలిసికొనినేని అహం బ్రహ్మాస్మి అనెడి నిశ్చయజ్ఞానము కలిగి, సంసార బంధ విముక్తుడై సచ్చిదానంద స్వరూపుడై భాసిల్లును.

**ప్రచండ మార్తాండుని యందు అంధకారమెట్లుండదో యట్లు ఆత్మ సుఖమందు దుఃఖలేశమే లేదు.**

**ఇదియే జీవన్ముక్తి,**

కావున సర్వ ప్రయత్నముల చేతను కైవల్యమే ప్రాపనీయము.

బాధల మధ్య చెదిరిపోయి జనజీవనమునకు దూరమగుట వైరాగ్యము కాలేదు. నిరాశావాది ఎప్పుడు విరాగి కాలేడు.

**వస్తు ప్రపంచమును గూర్చి వివేకముతో సాగించిన పరిశీలనలో సమస్తము అనిత్యము అని తెలియుట వలన కలిగెటి తటస్థ స్థితియే వైరాగ్యము, నిజమైన వైరాగ్యము.**

ఈ పరిశీలనలో ఐహికము, ఆముష్మికము రెండును అనిత్యమని తెలిపి వాటిని మానసికముగా త్యజించునట్లు చేయును.

బ్రహ్మలోకము వరకును గల సమస్త విషయములును, విషయ సుఖములను కాకిరెట్ట వలె భావించి త్యజించెడి నిశ్చల స్థితియే వైరాగ్యము అని శంకరులవారు తెలిపిరి.

సర్వవాంఛారాహిత్యమే వైరాగ్యము. కర్మఫలాసక్తి లేని జీవనము వైరాగ్యము వలన కలుగును. వివేకము గలవానికే వైరాగ్యము ఉదయించును.

చక్రవర్తి అయినను, సేవకుడైనను, ఫకీరైనను కనుపించువారంతా కనుమరుగయేవారే. సింహాసనముపై ఊరేగినా, పాడెపై నడిచినా చావు మాత్రము ఒక్కటే కదా అంటాడు సంత్ కబీర్‌దాసు. కనుక భోగ్యవిషయముల యెడ నైరాశ్య జీవనము విరాగికి అలవడును. ఇట్టి వైరాగ్యము వివేకము వలననే కలుగును.

కావున తీవ్ర వైరాగ్యము మోక్షప్రాప్తికి ఆవశ్యకమైయున్నదని తెలిపి నటులగుచున్నది. ఇది రెండు విధములు.

- **అపర వైరాగ్యము**
- **పర వైరాగ్యము**

అపర వైరాగ్యమనగా ఇహలోక, పరలోక సుఖముల యందు అనాసక్తి.

పర వైరాగ్యమనగా త్రిగుణాతీతుడగుట. త్రిగుణముల యందు ఇచ్ఛారాహిత్యములు కలుగట.

**శమాది షట్క సంపత్తి :**

- **శమము** — **మనో నిగ్రహము**
- **దమము** — **ఇంద్రియ నిగ్రహము**
- **ఉపరతి** — **స్వధర్మానుష్టానము**, **ధ్యానము**
- **తితిక్ష** — **ద్వంద్వములయందు సమభావము**
- **శ్రద్ధ** — **దేవుడు**, **గురువు**, **శాస్త్రము**
- **సమాధానము** — **తృప్తి**

ఈ ఆరును గూడి శమాదిషట్క సంపత్తి అగుచున్నది.

## -: మనోనిగ్రహము :-

శమదమాదులనునవి వైరాగ్యము యొక్క లక్షణములు. వీనిలో ఏది లోపించినను వైరాగ్యము కుంటుపడును. శమదమాదుల యందు మొదటిది శమము. శమమనగా మనోనిగ్రహము.

శరీరమును శుద్ధి పరుచుటయందు, ఆరోగ్యముగా ఉంచుట యందు మానవుడు అధిక శ్రద్ధను చూపును. స్నానము ద్వారా శరీరమును శుభ్ర పరుచుకొనును. ఆహారము ద్వార శరీరమును వృద్ధి పరచుకొనును. రోగములు సంభవించినచో చికిత్స ద్వారా నయము చేసికొనును.

**అయితే దేహముకన్న అత్యంత ముఖ్యమైన మనస్సును గూర్చి ఎప్పుడు మానవుడు ఆలోచించడు.**

**శరీరము బాహ్యతొడుగు మాత్రమే. మోక్షసాధనలో మనస్సే అత్యంత ప్రధాన పాత్రను వహించుచున్నది.**

మనస్సే అవిద్య. ఈ మనస్సుకన్న అవిద్య గాని మాయగాని వేరు లేదు. ఇట్టి మనస్సే సంసార కారణము. ఇది నశించిన సమస్త ప్రపంచము వలయమగుచున్నది. అది చలించిన సమస్త ప్రపంచము చలించుచున్నది. మనస్సుండిన ప్రపంచమున్నది. అది లేకపోయిన ప్రపంచము లేదను నవ్యయవ్యతిరేకములచే నదియే బంధ కారణము, ముక్తి హేతువు కూడా అగుచున్నది.

**మనయేవ మనుష్యానాం, కారణం బంధ మోక్ష యోః**

ఇత్యాది ఉపనిషత్తుల ప్రమాణములు.

## -: మనస్స్వభావము :-

మనస్సును మహర్షులు ఈ క్రింది వవిధములుగా వర్ణించి యున్నారు.

మనస్సు- అది అసలే కోతి. అది కల్లు త్రాగి మధించెను. మరియు తేలుచే కరువబడెను. దానికి పిశాచము కూడా ఆవహించినది. ఇట్లుండ దాని చలన స్వభావి విషయమై యేమి చెప్పవలయును? మనస్సు కూడా అట్టిదే. ఇట్టి చలనముడుగుటయే అచలస్థితి. ఇదియే సంసార శమము. ఇందులకు తరుణోపాయము.

దేనిని సంకల్పించకుండ యుండడమే ఈ మనస్సును ఛేదించుటలో శస్త్రమగును. అట్టి మనస్సు ఛేదింపబడగా సర్వవ్యాపక శాంతమగు బ్రహ్మము భాసించును. **కనుక సంకల్పించకయుండడమే మనోనిగ్రహోపాయము.**

మనః ప్రభావమును చెప్పుచున్నారు :

జాగృత్ దశయందు నానావిధ వస్తు సంతానములను భోక్తృ భోగ్యాది భావములచే అనుభవించుచున్నాడు.

స్వప్నములో ఏ వస్తువును యుండదు. ఈ బాహ్యప్రపంచమేదియు కాన్పించదు. కనుమూసినంత మాత్రమునకే ఈ ప్రపంచము కనుమగుగగు చున్నది. స్వప్నావస్థయు అట్టిదే.

అయినను స్వప్నావస్థలో ఇదివరకు అనేక విషయములందు ప్రవర్తించి సంస్కారరూపముగా మనస్సున నున్నది గాన, అది తానే కర్తృ రూపముగాను, కారణ కామ్యరూపముగాను నాలాగున భోక్త భోగ భాగ్య రూపముగను అగుచున్నదై ఏతద్రూప ప్రపంచమును సృష్టించుచున్నది. అనగా స్వప్నములో తానే సమస్తమును కారణమై సృష్టించుకొనుచున్నది. అనుభవించుచున్నది. వ్యవహరించుచున్నది. మనస్సుకన్న స్వప్నావస్థ వేరు కాదు.

**అంతఃకరణ విజృంభణమే స్వప్నావస్థ.**

విచారించిన జాగృద్దశయందును సమస్త వ్యవహారము పై చెప్పిన రీతిగా మనస్సునకు సంబంధించినదే. మనస్సు లేకపోయిన జాగృద్దశ యందును ఎవరు ఏమియును గ్రహించజాలరు.

**అది బ్రహ్మాకారమైన తానును బ్రహ్మయే**
**అది వ్యతిరిక్తమైన వ్యతిరిక్తమే**

స్వప్నమందు కన్పించిన వస్తువు ఎలాగున మేలుకొనిన తరువాత అసత్యములగుచున్నవో, జ్ఞానము కలిగిన తరువాత జాగృత్ పదార్థములు అసత్యములే.

**అసలు మనస్సు కల్పితము.**

**అట్టి కల్పనా ధురణయగు మనస్సుచే కల్పింపబడిన భ్రమింపబడిన వస్తువులు కల్పితములు కాకుండునా? కాన జాగృత్ స్వప్నావస్థల స్వరూపము మనస్పూర్తియే గాని వేరు కాదు.**

మనస్సే బందమోక్షములకు కారణమను విషయము చెప్పబడు చున్నది.

పశువు త్రాటిచే ఏలాగున కట్టబడుచున్నదో అలాగుననే మనస్సుచే కల్పింపబడిన దేహేంద్రియాది విషయ కామ రాగముచే పురుషుడు బంధింప బడుచున్నాడు. ఇట్టి బంధమునకు విషయాత్మకమగు మనస్సే కారణము.

తరువాత కొంచెము విచారణా జ్ఞానము కలవారికి నా మనస్సు విరక్తాత్మకమై దేహాది విషయములు విషతుల్యములను భావన కలుగజేసి సంసార బంధము నుండి విడిపించుచున్నది.

**అనగా సాను రాగ మనస్స సంసారహేతువు. విరక్త మనస్స సంసార బంధ చ్ఛేధకము.**

రజ్జు బంధములేని పశువు ఏ ప్రకారముగా ఆనందముగా స్వేచ్ఛగా తనకిష్టమగు ప్రదేశములయందు సంచరించునో అలాగునే వసద్వ వస్తువుల యందు ప్రీతినిడని రాగ రహిత విరక్త చిత్తుడు బంధితుడు కానివాడై వేదాంత మార్గమున అకుంఠిత బుద్ధియై అప్రతిహత ప్రజ్ఞావంతుడై విరాజిల్లును.

**అట్టి విరక్తుడే బ్రహ్మజ్ఞానమున కర్హుడు.**

గీతయందు అర్జునుడు శ్రీకృష్ణునితో- కృష్ణా మనస్సు చంచలమైనదియు, విక్షోభములు కలుగజేయునదియు, బలవంతమైనదియు, దృఢిమైనదియు కదా! అద్దానిని నిగ్రహించుట, గాలిని అణచి పెట్టువలె మిగుల కష్టసాధ్యమైనదని నేను తలంచుచున్నాను.

కావున ఏదైనా మార్గము నుపదేశించుమని అడిగెను.

అందులకు శ్రీకృష్ణుడు అర్జుననకు మనస్సను నిగ్రహించు ఉపాయము చెప్పుచున్నాడు.

**ఓ అర్జునా! మనస్సును నిగ్రహించుట కష్టమే. మరియు అది చంచలమైనదే ఇందు ఎలాంటి సంశయము లేదు. అయినను అది అభ్యాసము చేతను వైరాగ్యము చేతను నిగ్రహింపబడగలదు.**

మనస్సు చంచలమైనదని భగవానుడాప్రోదించెను. కాని అంత మాత్రమున భయపడవలసిన అవసరము లేదని అభ్యాసం వైరాగ్యములచే అది వశపడగలదని చెప్పిరి.

వస్తువుగాని, వ్యక్తిగాని బలశాలి యగుటచేత భయపడవలసిన పని లేదు. దానిననుచుటకు దగిన ఆయుధమును వెతుకుకొనిన చాలును.

ఏనుగు పెద్ద జంతువే! అయిననేమి ఒక అంకుశముతో దాని ఆట కట్టగుచున్నది. అట్లె పులి, సింహము మహాభయంకరమగు జంతువులే. అయిననేమి ఒక చిన్న తుపాకిగుండుచే వశీభూతములగుచున్నవి. ఎద్దు

బలిష్టమైనదే అయినను ముక్కుత్రాటిచే లొంగుచున్నది. అటులనే మనస్సు సామర్థ్యమును చూచి గాభరా పడవద్దని, దానిని జయించుట కష్టసాధ్యమే కాని అసాధ్యము గాదని, అది తగు ప్రయత్నముచే తప్పక నిగ్రహింపబడ గలదని ధైర్యము చెప్పుచున్నారు.

## అవియే అభ్యాస వైరాగ్యములు.

వైరాగ్యమనగా నశ్వరత్వాది దోషములను విచారించి వానియెడల ఏహ్యాభావము కలిగియుండుట. దానిచే మనస్సు బహిర్ముఖముగా పరిగెత్తక అంతర్ముఖముగ మరలును.

వైర్యాగము ఎందుకు కలిగియుండవలెననగా–

ఈ దృష్య ప్రపంచములోని సమస్త పదార్థములును కాలక్రమమున నశించునవై యున్నవి. తుదకు శరీరమున్న కొంతకాలమునకు నశించియే తీరును. అశాశ్వతమగు ఇట్టి వస్తువులపై వాంఛ ఏల? (శాశ్వత వస్తువు ఒక్క ఆత్మయే) కావున దాని యెడల మాత్రమే కోరిక కలిగి యుండ వలయును)

ఒకవేళ ప్రాపంచిక భోగములననుభవించినను తృప్తి కలుగదు. ఆశ తగ్గదు. మరల వానియందు ద్విగుణీకృతమైన వాంఛ ఉదయించును. దాని వలన వాసనలు బలపడి సంసారబంధము వృద్ధియగును మరియు మనస్స విషయానుభవమునకై, బహిర్ముఖమగుచున్నకొలది, అది ఆత్మకు అంతంత దూరమగును. ధ్యానమందు మనస్సు నిలుపకుండును కావున–

**మనస్సు నిశ్చలమగుటకై, స్వాధీనపడుటకై విషయ వైరాగ్యము అత్యవసరమైయున్నది.**

ఇక రెండవ అంశము అభ్యాసము.

సోమరులకు మనస్సు లొంగదు. ఏలయనగా వారులొంగదీయుటకు నిజమైన ప్రయత్నమే చేయరు. ప్రయత్నము గాని అభ్యాసము గాని లేనిచో లౌకిక రంగమున గాని, పారమార్ధిక రంగమున గాని ఏ కార్యమున్ను సాధింపబడదు. ఒక చిన్న పరీక్షయందు ఉత్తీర్ణులు కావలెననిన ఎన్ని రోజులో కష్టపడవలసి యుండును. ఇక ఎన్ని జన్మలనుండియో, గడ్డకట్టియున్న మనస్సును కరిగించుటకు ఎంత శ్రమ అభ్యాసము కావింపవలసి యుండునో యోచించుకొనుడు. కాబట్టి ప్రతీరోజున్ను మనస్సును విచార వైరాగ్యములచే బాహ్యనుండి మరలించి ఆత్మధ్యానమందు నియోగించవలయును.

అందుచే ప్రతీసారి విసుగుచెందక దీక్షతో– చపల స్వభావము గలదియు– నిలకడ లేనిదియును అగు మనస్సు ఎచ్చటెచ్చట సంచరించునో అచట నుండి దానిని బట్టితెచ్చి ఆత్మయందు ప్రాపితము చేయవలయును.

ఆత్మ కధీనముగా నొనర్పవలయును.

ఇట్టి అభ్యాసముచే అచిరకాలములోనే మనస్సు స్వాధీనపడి ఆత్మయందే నిరంతరము ప్రీతిని పొందుచుండగలదు.

## –: దమము :–

సాధకుడు ఎంతగా ప్రయత్నించినను టక్కరియగు మనస్సు నక్కజిత్తుల నభినయిస్తూ సాధకుని మోసము చేయుచునే యుండును. మనస్సు నిగ్రహింపబడని దశలో సాధకుడు జాగరూకుడై ఇంద్రియములను నిగ్రహించినచో తద్వారా మనస్స నిగ్రహింపబడును.

ఇంద్రియ విషయములయందలి దోషములను గుర్తించి గ్రహించుట ద్వారా సాధకుడు దమమును పొందగలడు. దమము కలగనిచో వ్యక్తి బలహీనుడగును. వైరాగ్యము క్షీణించును.

1) అసత్య భాషణము- అనర్ధదాయకమని తలచి సత్యమును భాషించుచుండవలయును. 2) మితిమీరి భుజించక సాత్వికాహారమునే గ్రహింపవలయును. ఇలా రసేంద్రియము నిగ్రహించవలయును.

3) అశ్లీల బొమ్మలను, చలనచిత్రములను చూడరాదు. 4) కామ దృష్టితో స్త్రీలు పురుషులను, పురుషులు స్త్రీలను వీక్షింపరాదు. 5) మహాత్ముల సందర్శనము, దైవదర్శనము, సద్గ్రంథ పఠనము ఇత్యాదుల ద్వారా ద్విగేంద్రియమును నిగ్రహించవలయును.

6) ప్రాపంచిక విషయములను ఎక్కువగా ముచ్చటించ రాదు. విననూ రాదు. అసభ్య గీతములను వినకూడదు. మహాత్ముల ప్రవచనములను సద్గ్రంథములను శ్రవణము చేయుటకు అలవాటు పడవలయును. సంకీర్తనములయందు మనస్సు లగ్నమగునట్లు చూడవలయును. ఈ విధముగా శ్రోతేంద్రియమును నిగ్రహింపవలయును.

7) సుగంధ లేపనములు, అత్తరు వాసనలు విసర్జించవలయును. ఈ విధముగా ఘ్రాణేంద్రియమును నిగ్రహింపవలయును.

8) మెత్తని సున్నితమైన వస్తువులను స్పృశించవలెననెడి కుతూహలమును విడనాడవలయును. మెత్తని పడకలపై పవళించడము, అవి మనకొరకు ఎదురుచూచునప్పుడు, చాపమీదనో నేలమీదనో పడుకునే అలవాటును కలిగియుండవలయును. తద్వారా త్వగింద్రియమును నిగ్రహించవలయును.

ఇంద్రియ విషయములు ఇంద్రియములను మోసము చేసి ఆకర్షించుచుండును. ఇంద్రియ నిగ్రహము లేక ఇంద్రియ విషయాలకు బానిసయై చరించు జీవుడు శాంతిని పొందలేడు.

**విషయములనునవి యదార్థమునకు విషమనే గ్రహించాలి.**

విషయముల వలన కలిగెడి దోషము విషముకన్నను తీవ్రమైనదిగా యున్నది. విషము శరీరములో ప్రవేశించిన తరువాత కాని మనిషిని చంపదు. కాని కన్నులతో గాంచినను ఇంద్రియ విషయములు మనస్సును చంపును.

## -: ఉపరతి :-

**ఉపరతి - స్వధర్మానుష్టానుము** < **సాంఖ్యులు - జ్ఞానయోగము** / **యోగులు-కర్మయోగము**

స్వధర్మమును విడువకుండా శాస్త్రవిహిత కర్మలను ఆచరించు చుండుటయే స్వధర్మానుష్టానమనెడి ఉపరమము.

కర్మ చేయకుండా ఏ వ్యక్తి కూడా క్షణకాలము మనలేడు. మరి మానవుడాచరించు కర్మలు వాసదా ప్రేరితములై యున్నట్లు తెలియు చున్నవి. సాధకుడైన వాడు శమము ద్వారా మనస్సును నిగ్రహించి దమము ద్వారా ఇంద్రియములను నిగ్రహించి, మనస్సును అంతర్ముఖము చేయుటకు ప్రయత్నించుచున్నను, సాధకుని అంతఃకరణములో చెలరేగుచున్న పూర్వ వాసనలు అతనిని బహిర్ముఖ మగునట్లు చేయును.

**అనివార్యమైన ఈ పరిస్థితులలో సాధకుడు ఉపరమమును కలిగియున్నచో ఏ విధమైన ప్రమాదమునకు లోను కాకుండా ప్రశాంతమగు జీవితము జీవించగలుగును.**

ధర్మమను పదమును విశాల దృక్పథముతో అవగతమొనర్చు కొనవలయును. దేహధర్మము ఒక విధముగా యుండును. మనోధర్మము ఒక విధముగా యుండును. కుటుంబ ధర్మము వేరొక విధముగా యుండును. వృత్తిధర్మము మరొక విధముగా యుండును.

అయితే అంతఃకరణములోని సూక్ష్మవాసనలు, మనస్సు బహిర్ముఖ మొనరించునపుడు అవగాహనముతో శాస్త్ర విహిత కర్మలను ఆచరించు నపుడు ధర్మాచరణము నందు త్యాము నిండియుండును.

**కర్మ స్వార్థరూపమై యుండును.**

**ధర్మ ప్రేరితమైన కర్మ కర్మయోగముగా మారును.**

గీతయందు శ్రీభగవానుడీ విధముగా పల్కుచున్నాడు–

అర్జునా ఈ లోకమందు సాంఖ్యులకు జ్ఞానయోగము యోగులకు కర్మయోగము తరించుటకై (జీవకోట్లు) సృష్టి ఆదియందు నాచే చెప్పబడినవి.

మనుజుడు కర్మలను చేయకపోవుట వలన నైష్కర్మ్యమును పొందజాలడు. కర్మలను విడిచినంత మాత్రమున మోక్షమును పొందజాలడు.

కర్మాచరణము లేకుండా ఎవడును క్షణకాలమైనను యుండజాలడు. ప్రకృతి వలన పుట్టిన గుణముచేత ప్రతీవాడును పరవశుడై కర్మలను చేయుచునేయున్నాడు.

ఎవడు కర్మేంద్రియములను బిగబట్టి మనస్సుచేత శబ్దాది ఇంద్రియముల విషయములను చింతించుచుండునో అట్టివాడు అవివేకియై కేవలము కపటనర్తకుడని పిలువబడుచున్నాడు.

ఎవడు జ్ఞానేంద్రియములను మనస్సుచేత అరికట్టి కర్మేంద్రియముల చేత ఫలాపేక్ష లేకుండా కర్మయోగమును చరించునో అట్టివాడు శ్రేష్టుడగు చున్నాడు.

**నీవు నియతకర్మను చేయుము. కర్మ చేయకపోవటకన్నా చేయుటయే మేలుకదా! కర్మ చేయనివానికి శరీరయాత్ర కూడా సిద్ధించదు.**

అర్జునా! యజ్ఞార్ధము కాని ఇతర కర్మములు లోక సంబంధమైన బంధములకు కారణమగుచున్నవి. కావున ఫలాపేక్షను వదిలి యజ్ఞము కొరకు కర్మము నాచరింపుము.

అర్జునా! యజ్ఞశేషమైన అమృతమును భుజించువాడు నిత్యమైన బ్రహ్మమును బడయును. యజ్ఞకర్మలాచరించనివానికి ఈ లోకమే లేదు ఇక పరలోకమెక్కడిది.

యజ్ఞశస్త్రసమును భుజించు సత్పురుషులు సర్వోపద్రవముల నుండి విడివడుచున్నాడు. అలాగాక కేవలము తన దేహ పోషనార్థమై ఎవరైతే భుజించుచున్నారో అట్టివారు పాపమునారగించువారైయున్నారు.

అందువలన నీవు ఫలాసక్తి లేనివాడవై నియతకర్మను సదా ఆచరించుచుండము.

**ఫలాపేక్ష లేక కర్మలాచరించువాడు మోక్షమును పొందుచున్నాడు.**

జనకుడు మున్నగువారు ఈ కర్మయోగమునాచరించియే మోక్షమును పొందిరి. లోకసంగ్రహమునకైనను నీవు కర్మలను చేయవలయును.

అర్జునా! నాకు ముల్లోకములందు చేయదగిన కార్యమేదియులేదు. పొందబడనదియు, పొందదగినదియు వస్తువును ఏమియును లేదు. అయినను నేను కర్మములను చేయుచున్నాను.

అర్జునా! నేను అప్రమత్తుడనై కర్మలనాచరించకుందునేని జనులు సర్వవిధముల నామార్గముననుసరించియే ప్రవర్తించుచుందురు.

నేను కర్మ చేయని యెడల లోకములన్నియు నశించును. వర్ణ సంకరమునకు కారణమగుదును. జనులను చెడిపినవానినగుదును.

బాగుగా నాచరింపబడిన పరధర్మముకంటెను గుణహీనమైనదైనను స్వధర్మమే మేలైనది. స్వధర్మమునందు మృత్యువు పొందినను శ్రేయమే.

## పరధర్మము భయంకరమైనది.

ఏ మనుజుడు కర్మఫలాపేక్షను వదిలినవాడై, సదా సంతృప్తి చెందినవాడై, నిరాశ్రయుడై యుండునో అట్టివాడు కర్మలయందు చరించుచున్నను కొంచమైనను చేయనివాడే అయి ఉన్నాడు.

ఆశ లేనివాడు, దేహ మనోబుద్ధులను జయించినవాడు అగు మనుజుడు కేవలము దేహము కొరకు కర్మలనాచరించినను పాపము నొందడు.

ప్రయత్నము లేకనే లభించిన దానితో సంతృప్తిని చెందినవాడు, మాత్సర్యము లేనివాడు, కార్యముల ఫలాఫలమందు సమబుద్ధి గలవాడు అగు మనుజుడు కర్మలు చేసినను బంధింపబడడు.

సంగము లేనివాడు, ముక్తుడును, మనస్సును జ్ఞానమందు నిలిపినవాడును, యజ్ఞార్ధమై కర్మలనాచరించువాడును అగు మనుజుని యొక్క కర్మ సంపూర్ణముగా నశించిపోవుచున్నది.

జ్ఞానయోగుల చేత ఏ స్థానము పొందబడుచున్నదో, ఆ స్థానమే కర్మయోగులచేత కూడ పొందబడుచున్నది.

జ్ఞాన కర్మములను రెంటిని ఒకటిగ ఎవడు చూచుచున్నాడో వాడె నిజముగా చూచువాడైయున్నాడు.

యోగులు ఆత్మశుద్ధికై ఫలాసక్తిని విడనాడి, భగవదర్పితముగ దేహేంద్రియ మనోబుద్ధుల ద్వారా కర్మలనాచరించుచున్నారు.

అర్జునా దేనిని సన్యాసమందురో దానినే యోగమందురు. సంకల్పత్యాగము చేయనివాడు యోగి కాజాలడు.

## –: పుణ్యకర్మలు :–

**మానసిక :** భక్తి, జ్ఞాన, వైరాగ్య, పరహిత, పరలోక విశిష్ట కార్యచింతాదులు.

**వాచిక :** వేదశాస్త్ర, గీత, సహస్ర నామాది పఠనములును, పరోపకార వార్తలును, సంకీర్తనములు, గాయత్రి మంత్రజపములు.

కాయికా : పుణ్యతీర్థ స్నానము, పరులను హింసింపకుండుట, శ్రీగురుదేవతాది పూజలు చేయుట.

## –: పాపకర్మలు :–

**మానసిక :** విషయ, పరాహిత, వేదశాస్త్ర విరుద్ధ కర్మలు.

**వాచికా :** పరబాధా, పరదూషణ, అసత్యాదులు.

**కాయికా :** పరపీడా, పరస్త్రీ కామన, పరద్రవ్యాపహరణములు

## –: మిశ్రమ కర్మలు :–

పరధనముతో పుణ్యకార్యములు చేయుట.

ధ్యానకాలములో అన్య విషయ చింతన.

వేదాధ్యయన, జప పూజాకాలములందు లౌకిక సంభాషణలు జరుపుట.

## –: తితీక్ష :–

శీతోష్ణ సుఖ దుఃఖముల యందు సమభావము కలిగి యుండుటయే తితీక్ష.

భగవానుని చట్టాలకు లోబడి ఈ జగత్తు వర్తించుచున్నది. ఈ విశ్వములోని చట్టములన్నియు విశ్వనాథుని ఆధీనమునందే యున్నవి.

ఎప్పుడు ఏది జరుగవలెనో అది అలా జరుగుటయే పరమాత్మ చట్టములయందలి విశిష్టత. ఇందులో తగిలింపులుండవు; తొలగింపులు కుదరవు. అవి తెగింపులు తెలియని దివ్యసూత్రములు. సవరణలు, సంప్రదింపులు అచ్చట పనికిరావు. ఇది తెలిసిన ముముక్షువు వైరుధ్య పరిస్థితుల మధ్య బెదరడు, కదలడు. ప్రసాద మనస్తత్వంతో ప్రశాంతముగా జీవించును. ఇదియే తితీక్ష.

## సాధకుడు తప్పక పొందగలిగిన సుగుణము

సమస్త దుఃఖములను సహించుటయే తితీక్ష యనబడును అని శంకరులవారు అభిప్రాయపడిరి.

శీతోష్ణములయందు, సుఖదుఃఖములయందు, మానావమానము లయందు, జయాపజయములయందు సహనము కలిగి యుండుటయే తితీక్ష.

తితీక్ష అలవడిన సాధకుడు ప్రశాంతచిత్తుడై యుండును. ఈ తితీక్షను సాధించుటకై అప్రయోజకపు మార్గములన్నియు అనుసరించు చుందురు. దుస్తులను విస్మరించి చలిలో వణుకుచుందురు. ఎండలో చెప్పులు లేకుండా నడుచుచుందురు. ఉపవాసాల పేరిట నీరసవంతులై, క్షుద్బాధను భరించుట ద్వారా తితీక్షను సాధించితిమని భ్రమపడుచు చుందురు. శాస్త్ర అవగాహన లేకపోవుటయే ఈ అనర్ధములన్నింటికి కారణము.

అర్జునా! ఇంద్రియములు, ఇంద్రియ విషయములతో సంయోగము చెందినపుడు శీతోష్ణ సుఖదుఃఖములు కలుగుచుండును. అవి క్షణభంగురములై అశాశ్వతములైయున్నవి. కనుక అట్టి ద్వంద్వములను సహింపుము అని పలికెను.

నిందాసత్క్రుతులు కలిగినపుడు కృంగుటయే పొంగుటయు జరుగుచుండును. ఈ వైరుధ్య అనుభూతులను కలిగించునది మనసే కారి వేరుకాదు, పైగా ఈ సుఖదుఃఖములన్నియు వచ్చిపోవునవే కాని శాశ్వతముగా నిలుచునవి కావు.

కనుక ఈ విషయములందు సాధకుడు చలింపకుండ జీవించ వలయును.

ఇదియే తితీక్ష.

## -: శ్రద్ధ :-

గురువాక్యమందును, శాస్త్ర విషయమందును, భగవంతుని యందును సంపూర్ణ విశ్వాసమును కలిగియుండుటయే శ్రద్ధయన బడును.

గీతయందు శ్రీ భగవానుడీ విధముగా పలికెను.

ఓ అర్జునా! సమస్త జీవులకును (పూర్వజన్మ సంస్కారము ననుసరించి) వారి వారి అంతఃకరణము ననుసరించి శ్రద్ధ (గుణము, సంస్కారము) కలుగుచున్నవి.

**ఈ జీవుడు శ్రద్ధయే స్వరూపము కలవాడైయున్నాడు.** ఎవడెట్టి శ్రద్ధ కలిగియుండునో అతడట్టి శ్రద్ధయే అడుగుచున్నాడు. (తద్రూపుడే అగుచున్నాడు).

మనస్సే (అంతఃకరణము) మనుజుడు (ప్రతిబింబ జీవరూపుడు). మనుజుడు మనస్సే. కావున మనస్సు శుద్ధముగా యున్నచో మనుజుడు శుద్ధరూపుడే యగుచున్నాడు.

ఎవడు ఏ శ్రద్ధ ఏ గుణము కలిగి యుండునో అతడు తద్రూపుడె అయి ఉండును. కాబట్టి మొట్టమొదట మనుజుడు తన అంతః కరణమును శుద్ధమొనర్చుకొని సాత్విక శ్రద్ధామయుడై యుండులాగున ప్రయత్నించి సాధనాభ్యాసముచే క్రమముగా నిర్గుణాత్మ రూపుడై చెన్నొందుటకు ప్రయత్నించవలయును.

కావున మనుజుడు క్రమక్రమముగా రాజస తామస ప్రవృత్తుల నుండి సాత్విక శ్రద్ధనవలంభించి క్రమముగా దానినిన్ని అధిరోహించి విశుద్ధ సత్వస్థితి (ఆత్మ)ని చేరుకొనవలయును.

**ఇదియే అతని యథార్థ స్వరూపము స్థానము.**

శ్రద్ధగలవానికే జ్ఞానము లభించును అని గీత కూడా ప్రబోధించినది.

"శ్రద్ధ, భక్తి, ధ్యానయోగాల ద్వారా పొందున"ని కైవల్యోపనిశత్తు తెలిపియున్నది.

వేదాంత శాస్త్రము ఆత్మసంబంధమైనది. అజ్ఞాన దశయందు అంతఃకరణము సదా బహిర్ముఖమైయుండును. బహిర్ముఖమైయున్న అంతఃకరణము ద్వారా ఆత్మతత్వమును గ్రహించలేము. అంతః కరణము అంతర్ముఖము చేసినపుడే అది సాధ్యమగును. ఇది శ్రద్ధ వలననే లభించును.

కేవలము వాచ్యార్థము గ్రహించినంతమాత్రమున సత్యము అవగతము కాదు. లక్ష్యార్థమును గ్రహించుట వలననే అది లభ్యమగును. లక్ష్యార్థమును స్వతంత్రముగా అధ్యయనము చేసి గ్రహించలేము.

శాస్త్రము తెలిసినవాడెవడైనను స్వయముగా బ్రహ్మాన్వేషణ చేయరాదని ఆచార్యులవారి యాదేశము.

అనగా సాధకుడు శాస్త్రమును గురువుచెంత శ్రద్ధతో అవలంభింప వలయును. అటుల అతడు 3 దశలలో అంచెలంచెలుగా పైకెగియుచు మూడు దశలలో కైవల్యప్రాప్తి నొందును.

అవియే

1) శ్రవణము

2) మననము

3) నిధిద్యాసము

4) సంకల్ప వికల్ప రహితముగా అద్వయానందరూపానుభవము.

శ్రవణము : గురుముఖమున వేదాంత శ్రవణము మరియు షడ్విత లింగముల ద్వారా ఉపనిషద్వాక్యములకు తాత్పర్య నిర్ణయము చేయుట. ఉపక్రమో సంసహారములు, అభ్యాసము, అపూర్వత్వము, ఫలము అర్ధవాదము, ఉపపత్తి అనునవి.

**మననము :** వీనిని దానియర్థమును శృతి అనుకూల యుక్తుల చేత పలుమారులు చింతించుట.

**నిది ధ్యాసనము :** శాస్త్రజ్ఞానమంతయు జీవుని రక్తమాంసములలో ఒక భాగముగా మారుట.

శాస్త్ర లోతులను గురువుచెంతనే తెలిసికొనవలయును. అట్టి గురువుపై సంపూర్ణ విశ్వాసముండవలయును. కాలానికి చెదరని, కష్టాలకు కదలని ప్రగాఢ, అచంచల విశ్వాసము గురుదేవునిపై యుండవలయును.

**నీ కుటుంబముపై ఎంత గాఢమైన ప్రేమ నీకుండునో, అట్టి ప్రేమ గురుదేవునిపై యుండలి** అంటారు భక్త కబీర్‌దాసు.

స్వార్థపూరిత జీవనములో తనువును, మనస్సును, పుణ్యమును, హరించే కుటుంబ సభ్యుల మీదనే నీకు ఇంత ప్రేమయున్నది కదా! ప్రేమను

పంచి, ప్రేమలో నిన్ను ముంచి, ప్రేమ తీరమునకు నిన్ను చేర్చి తరింపచేయు సద్గురువుపై నీకు ఎంత ప్రేమయుండాలి?

**గురు రుణము తీరేది కాదు.**

గురు పాదాల చెంత ఆశాజీవియై బ్రతుకు. గురుదేవునిలో నిరాశను దింపకు.

అపౌరుషేయమైన వేదము సాంప్రదాయము అందించినది. సాంప్రదాయము సద్గురువును ప్రసాదించినది. సత్యరూపమైన శాస్త్రము నందును నిత్యరూపమైన గురుదేవుని వ్యామందును అచంచల విశ్వాసము కలిగి యుండుటయే శ్రద్ధ.

శ్రద్ధ గలవాడు గురువు చెంత వినికిడి గాక శ్రవణము చేసి ఉత్తమ శ్రోతయగును. బ్రహ్మనిష్టచే పరిపక్వస్థితి రాగానే ఉత్తమ వక్తయగును.

భగవంతుని యందు భక్తుడు కనబరచు శ్రద్ధయే భక్తి యనబడును.

భక్తి యనునది పరమార్థ దృష్టికి ఏకరూపమైనను అది వ్యవహార మందు 11 రూపములు దాల్చుచున్నవి.

1) భగవత్కాళ్యాణ గుణాభి వర్ణనము

2) భగవద్దివ్యమంగళ విగ్రహారాధనము

3) భగవత్పూజ

4) భగవత్స్మరణము

5) భగవత్సేవ

6) భగవంతుని యెడ సఖ్య భావ ప్రేమ

7) భగవంతుని పుత్రునిగా భావించుట

8) భగవంతుని తండ్రిగా, లేదా తల్లిగా భావించి లీనమగుట

9) భగవంతునకు సర్వము సమర్పించుకొనుట

10) భగవన్మయుడైయుండడుట

11) భగవంతుని యెడబాసి యుండనేరదు

ఈ విధముగా భగవంతుని యెడ పరాభక్తి భావము నవలంభించి, గురవు యెడ అత్యంత భక్తిశ్రద్ధలతో వేదాంత శాస్త్రమును శ్రవణ మనన నిదిధ్యాసలను దశలలో అభ్యసించి మోక్ష ప్రాప్తిని జీవుడు పొందవలెను.

## -: సమాధానము :-

చిత్తమును ఏకాగ్రతతో నుంచుటయే సమాధానము. అవధానముతో కూడిన మనస్సు సమాధానమును కలిగియున్నది.

ప్రాపంచిక విషయముల వెంట పరుగులిడకుండా మనస్సును తధేకముగా బ్రహ్మమునందు నిలుపుటను సమాధానమందురు. యోగ మార్గమందు చెప్పబడే ధారణ ఇదియే కావచ్చును.

సమాధానము పొందిన చిత్తము ధ్యానానికి సరిపడును. చంచలత్వమును అరికట్టుటయే సమాధానము యొక్క కర్తవ్యము. సమాధానము అలవడిన వ్యక్తి సంతృప్తి నొంది యుండును. చిత్తైకాగ్రత కుంటుపడుతుందని తెలియగానే సాధకుడు జాగరూకుడై యుండవలయును. దమమును కలిగి యుండవలయును. భగవన్నామము ఉచ్చరించుచునో, జప ధ్యానాదులు కొనసాగించుచునో కొంతకాలము గడుపవలయును.

ఇటుల ఇంద్రియముల నిగ్రహింపబడి మనస్సు కుదుటపడును. మనస్సు కుదుట పడగానే చిత్తవృత్తులును, ఏకవృత్తిగా తీర్చి లక్షము వైపు నడుపవలయును. అపుడు చిత్తమునకు సమాధానము లభించును.

**"సమాధానము యొక్క ప్రారంభము ధ్యానము కాగా అంతము జ్ఞాననిష్టయనబడును"**

# -: ముముక్షత్వము :-

"నాకు మోక్షము కలుగు గాక" అనెడి నిత్య కోరికను కల్గి యుండుటయే ముముక్షత్వము.

పరిమిత జీవనమునకు స్వస్తి చెప్పి సర్వోపద్రవముల నుండి విడిబడి మోక్షరూపమై తరించవలననెడి తీవ్ర కాంక్షయే ముముక్షత్వమనబడును.

ముముక్షుత్వము మోక్షము కన్నా అన్యఫలమందు ఆసక్తి చూపదు.

ఈ ప్రపంచములో తన మనుగడ కేవలము మజిలియేనని నిజమైన స్వస్థానము ఆత్మయేనని గ్రహించినవాడు ముముక్షువు. ఇంద్రియ విషయాలన్ని విషతుల్యమని భావించి శ్రోత్రాది ఇంద్రియముల ద్వారా శబ్దాది విషయములను అనుభవించుటకు ఇష్టపడక ఆత్మానందము కొరకు తీవ్రముగా అన్వేషించువాడే ముముక్షువు. ముముక్షత్వము అలవడినచో సాధకుని యాత్ర సుగమమైనది అవిభాగము. మృత్యువు తనను కబలించేందుకు ఎలా పొంచియున్నదో తెలిసి జాగురూకతలో మెలుగువాడే ముముక్షువు.

**ఎవ్వరికి మోక్షేచ్ఛ, వైరాగ్యము ఇవి రెండు అతి తీవ్రములై యుండునో వానియందే శమాదులు ప్రయోజవంతములు గను ఫలవంతములు గను అగుచున్నవి.**

**ఏ పురుషునకు మోక్షేచ్ఛ, వైరాగ్యము మందముగా యుండునో వానికి శమాదులు మరుభూమి యందలి జలమువలె స్ఫురించుచుండును. అంతమాత్రమే గాని, శమాది గుణములు వాని వద్దకు చేరవు.**

చెకుముకి రాయి కోట్లకొలది సంవత్సరములు నీటి యడుగున పడియున్నను తనలోని అగ్నిని కోలుపోదు. నీ చిత్తము వచ్చినపుడు దానిని ఉక్కుతో గొట్టుము తళుక్కున నిప్పురవ్వలను గ్రక్కును. దృఢ విశ్వాసము గల భక్తుడు అటువంటివాడు. లోకమునందలి సమస్త దోషములు అతనిని ఆవరించినను భగవంతునియందలి భక్తి విశ్వాసములను కోల్పోవడు. భగవన్నామము చెవిన బడినంతనే మహోత్సాహపరవశుడై భక్తిపూరితుడగును.

**వివేకము లేనివానికి శాస్త్రము భారమే యగును.**

**వైరాగ్యము లేనివానికి జ్ఞానము భారమే యగును.**

**శాంతి లేనివానికి మనస్సు భారమే యగును.**

**తత్వజ్ఞానము లేనివానికి శరీరము భారమే యగును.**

ఎవ్వడు దుర్మార్గమును వీడడో, ఎవ్వడు ఇంద్రియములను నిగ్రహింపడో, ఎవ్వడు ఏకాగ్రచిత్తుడు కాకుండునో, చిత్తశుద్ధిని పొంద కుండునో, అట్టివాడు విశేషజ్ఞానము చేతనైనను ఆత్మను పొందజాలడు.

సాధకులు వారివారి స్థాయిని బట్టి తీవ్ర, మధ్యమ, మందములని మూడు రకములుగా యున్నారు.

తీవ్ర మనోస్థాయి కలవారిని మహర్షులు దూదిపింజతో పోల్చి యున్నారు. నిప్పురవ్వ తాకగానే దూది భగ్గున మండినట్లు వీరికి జ్ఞానోపార్జనము, నిష్ట అతితక్కువ కాలములో సిద్ధించును.

మధ్యమ స్థాయి కలవారిని ఎండిన కట్టెతో పోల్చబడిరి. దానిని మండించుటకు కొంత వ్యవధి పట్టును. అటులనే వీరిలో ఏకాగ్రత, చిత్తశద్ధి కలుగుటకు కొంతకాలము పట్టును.

మందస్థాయి కలవారిని నీటిలో తడిచిన కట్టెతో పోల్చియున్నారు. దానిని మండించవలెననిన, మొదట దానిని సూర్యరశ్మిలో ఆరబెట్ట వలయును. దాని తరువాతనే మండింపజేయు ప్రయత్నము.

వీరిలో జ్ఞానసిద్ధి అనుమానాస్పదమే.

విశేషమైన భగవదనుగ్రహము వలననో సద్గురు కటాక్షము వలననో గాని వీరికి సిద్ధించదు.

మరుక్షణమేమిజరుగునో ఊహించలేము. రూపులేని రేపు వస్తుందో రాదో? పావురము కొరకు డేగ పొంచి యున్నట్లు మానవుని కొరకు మృత్యువు పొంచియున్నది. ఎప్పుడు పైకి దుమికి మ్రింగివేయునో కదా! అంటాడు భక్త కబీరుదాసు.

రక్తమాంసాదులతో నింపబడి చర్మముచే కప్పబడియున్న ఈ దుర్గంధపూరిత మలిన దేహముపై ముముక్షువునకు రోత జనించవలెను. దేహభావము సాధకునిలో కలుగకూడదు. శరీరము నీది కాదు నీకు మిగులదు. ప్రాణమున్నంత వరకు నీకు దేహముపై హక్కు ఉంటుంది. ప్రాణము పోగానే నీ హక్కు కుక్కలకు, నక్కలకు సంక్రమిస్తుంది.

దేహముతో తనకు గల సంబంధము అనిత్యమని తెలిసినవాడే ముముక్షువు.

దేహమందు ఆత్మభావమును వీడి మనస్సును సచ్చిదానంద స్వరూపమైన స్వస్వరూపస్థితిలో నిలిపేందుకు నిరంతరకు తీవ్ర కృషి సల్పువాడే ముముక్షువు అనబడును.

ప్రమద, నూనె, వత్తి, అగ్ని, అనెడి నాలుగు వస్తువులతో తయారైన దీపము అంధకారము నేవిధముగా అదృశ్యము కావించుచున్నదో, కాంతిని ఎలా విస్తరింపచేయుచున్నదో, అలాగుననే వివేకము, వైరాగ్యము, శమాదులు, ముముక్షత్వము అనెడి నాలుగు లక్షణములు కలిగిన చిత్తము దురవగాహన అనెడి చీకటిని పోగొట్టి, సదవగాహన అనెడి కాంతి ద్వారా బ్రతుకునే ప్రకాశవంతము చేయును.

ఈ సాధన చతుష్టయ సంపత్తి ద్వారా సాధకుడు దేవేంద్రియ మనోబుద్ధుల స్థాయిలో శుద్ధిపడినవాడై ఆధ్యాత్మిక విషయములను గ్రహించుట, తత్వవివేకమును విచారణ ద్వారా పొందుటకు అర్హుడగును.

**కనుక ప్రతి సాధకుడు సాధన చతుష్టయ సంపత్తిని తప్పక పొంది యుండవలయును.**

ఓం నమో శ్రీనివాసాయనమః

ఓం నమశ్శివాయ నమః

సమవర్తి నచకేతునకు తన ఆత్మ విద్యాబోధన కర్మయోగముతో ఆరంభిస్తాడు.

వేదములు, గీత కూడ త్రయాత్మకముగా విభజింపబడినది.

వేదములలోని **మొదటి భాగము– సంహిత**

ఇది కర్మ ప్రతిపాదికము.

**రెండవ భాగము – బ్రహ్మము**

ఇది ఉపాసనా ప్రతిపాదికము

**మూడవ భాగము – ఉపనిషత్తులు**

అవి విజ్ఞాన ప్రతిపాదకములు

అట్లే వేదసారమగు భగవద్గీత త్రిభాగ రూపకముగ వెలయు చున్నది. అందు ప్రథమ శట్కము– కర్మయోగమును తెలుపును.

ద్వితీయ శట్కము – భక్తియోగమును ప్రతిపాదించును.

తృతీయ శట్కము – జ్ఞాన యోగమును బోధించును.

అయితే కర్మయోగము నందు– భక్తి జ్ఞానములు అంతర్భూతములై గౌణముగ యుండును. అట్లె యోగమందు కర్మ భక్తియును ఇమిడియుండును. వానిని ప్రత్యేకముగ విడదీయుటకు వీలులేదు.

## I.

శుభకరమైన **శ్రేయస్సు** ఒకటి, పూర్తిగా తద్భిన్నమైన **ప్రేయస్సు** మరొకటి. విభిన్న గమ్యాలకు తీసుకుపోయే ఈ రెండును పురుషుని బంధించేవే. శ్రేయస్సును వరించి అనుసరించేవానికి శుభం కలుగుతుంది. కాని ప్రేయస్సును ఎన్నుకొని అనుకరించేవాడు గమ్యం నుండి పతనం చెందుతాడు.

శుభకరమైనది, సుఖకరమైనది ఈ రెండు మానవుని సమీపిస్తాయి. బుద్ధిమంతుడు రెండింటినీ చక్కగా పరిశీలించి వివేచిస్తాడు. సుఖకరమైన దానికంటే శ్రేయస్కరమైనదే మేలని ఎన్నుకుంటాడు. కాని బుద్ధిహీనుడు లోభం చేత, ఆసక్తిచేత సుఖకరమైనదానినే ఎన్నుకుంటాడు.

**శ్రేయస్సు :-** పరతత్వం, తత్వజ్ఞానం మానవుడికి ముక్తిని ప్రసాదిస్తుంది.

**ప్రేయస్సు :-** ఇంద్రియ సుఖాలు.

**విభిన్న గమ్యాలకు తీసుకుపోయేవి:-** రెండు తమ అనుయాయులను వేరే వేరే గమ్యాలకు చేరుస్తాయి.

**రెండు పురుషుని బంధించేవే :-** పురుషుడు లేదా ఆత్మ స్వయంగా పరిపూర్ణము. ఏ కర్మకు అది కర్త అవదు. అయినా అజ్ఞానపు భ్రాంతి వలన తాను కోరికల చేత పరిమితుడైనట్లుగా భావిస్తాడు. అందుచేత ఆ భ్రాంతి వలననే తాను ఏదో ఒక గమ్యం కోసం పరిశ్రమిస్తున్నట్లుగా భావిస్తాడు. కనుక పరమాత్మ దృష్ట్యా మోక్షేచ్ఛా, సుఖేచ్ఛ రెండును బంధనాలే. అయితే మోక్షేచ్ఛ తుదకు భ్రాంతి నుండి విముక్తి కలిగిస్తుంది. ఆత్మ నిత్యముక్తం. త్రికాలాలలో కూడా అది బంధనా రహితమే. అటువంటప్పుడు తాను ముక్తుడు కావాలి అని చేసే ప్రయత్నాలన్నీ భ్రాంతి, బంధనము అనేకదా చెప్పాలి! అలా అయినా సరే సామాన్య మానవుడికి భ్రాంతిలో ఉన్న మానవుడికి "మోక్షేచ్ఛ" తప్పక ఉండాలి.

**తుదకు అజ్ఞానాన్ని తొలగిస్తూ తనకు తానే ఈ ఇచ్ఛ తొలగించు కొంటుంది.**

ఈ ప్రపంచమున కర్మ చేయక ఎవరును ఒక క్షణము అయినను ఉండజాలరు. కాయికా, వాక్కు, మనస్సు చేత చేయబడ సంకల్పములే కర్మలు. కావున స్వప్నమందు గూడ జీవుడు తనదంటూ ఒక ప్రపంచాన్ని

సృష్టించుకుని కర్మలను చేస్తూనే ఉంటాడు. ఇక సుషుప్తి తామస కర్మగా వేదమందు పేర్కొనబడినది.

అయితే ఆ కర్మకు యోగముగా మార్చు పద్ధతి నేర్చుకొనినచో కర్మబంధ హేతువు కానేరదు.

**కర్మ వేరు – కర్మ యోగము వేరు.**

అహంభావముతో, ఫలాపేక్షతో, సక్తముగా ఆచరింపబడునది కర్మ.

అదియో నిరహం భావముతో, ఫలాభిసంధి రహితముగా, అనాసక్తముగ, దైవార్పణ బుద్ధితో ఆచరింపబడినచో కర్మ యోగముగా మారును. అట్టి అనాసక్త కర్మకే మోక్షమను చక్కటి నామధేయము భగవానుడు గీతయందొసగెను. మరియు అట్టి యజ్ఞము కొరకు కానట్టి కర్మనంతయు బంధ హేతువేయగునని సెలవిచ్చెను.

ప్రపంచమందు ఎక్కువమంది ప్రవృత్తి మార్గమునే అనుసరించుదురు. కేవలము నివృత్తి ననుసరించి ఆశ్రయించి, నిరంతర ధ్యాన నిష్ఠలయందు నిర్వికల్ప సమాధులందు కాలము గడుపువారు చాలా అరుదుగా నుందురు. కాబట్టి ఎటుతిరిగి అందరును కర్మలు చేయవలసియే యుందురు. అట్టిచో ఆ కర్మను యజ్ఞముగా ఏల మార్చుకొనరాదు?

బంధహేతువును మోక్ష హేతువుగా ఏల పరివర్తనమొనర్చుకొనరాదు?

అనగా కర్మను అనాసక్తముగా, దైవార్పణబుద్ధితో సృష్టి చట్టము నతిక్రమింపక చేసిన చాలును.

**అద్భుతమగు ఫలితములు కలుగును.**

ఇది తెలుసుకొనియే జనకుడు మొదలైన వారు రాజ్యములను కూడ పరిపాలించిరి. ఈ అనాసక్తిని ఆశ్రయించియే సాక్షాత్ భగవానుడున్ను మూడు లోకములను పరిపాలించుచున్నాను అని పలికెను.

అట్టిచే ఒక చిన్న గృహమును, గృహ వ్యవహారమును నడుపుచు ముక్తిని సంపాదించుట దుర్లభమా?

కాదు - కానేరదు.

కర్మలను త్యజించివేసి సోమరిగ కూర్చొనుట భగవానుని ఆశయము కాదు. అందుచేతనే కర్మలను విడుచుటకంటే చేయుటయే మేలని తేల్చి చెప్పి వైచెను.

అనగా- వారి వారి కర్మలను వారు ఆచరించుకొనుచు, దైవార్పణ బుద్ధి కలిగి వానితో తగుల్కొనక కర్తృత్వమును వహింపకయున్నచో ఆ కర్మలన్నియు పూజలు గాను యజ్ఞములుగాను మారిపోవును.

**WORK IS WORSHIP**

అనగా

పాకీవాడు - పాకీపని చేసికొనుచు

మాదిగవాడు - చెప్పులు కుట్టుకొనుచు

వర్తకుడు - వ్యాపారమును చేసికొనుచు

పురోహితుడు - పౌరోహిత్యము చేసికొనుచు

తరించుటకు చక్కని అవకాశములు గలవని గీత బోధించుచున్నది.

కనుకనే కాబోలు శ్రీకృష్ణుడు బండితోలు పదవి స్వీకరించి అదియును ఏమంత తక్కువైనది కాదని ఋజువు చేసెను. అంతియే కాదు సంధ్యాకాలమును యుద్ధమును విరమించి అందరును అర్ఘ్య ప్రధానము లిచ్చుచుండు సమయమున ఆ గుఱ్ఱములకు తగిలిన గాయములను నదిలో కడిగి వానికి గుగ్గిళ్ళు పెట్టుచుండెడివాడు శ్రీకృష్ణ పరమాత్మ.

కావున భగవంతుని దృష్టిలో అన్నియును సమానములే. ఫలాని కర్మ యెక్కువని ఫలాని కర్మ తక్కువని జీవుడు భావింపరాదు. అన్నియు

పవిత్రములైనవే. కాకున్నచో వానిని ఒనర్చు పద్ధతియందు, మనోభావము నందు మార్పు రావలయును.

నీవు ఏ పనిని చేయుచున్నావని దైవము ప్రశ్నింపదు. ఏ భావముతో ఎంత పవిత్రముగా చేయుచున్నావని మాత్రము ప్రశ్నించును. గీత యొక్క గొప్పతనమిచ్చుటనే యున్నది. అదది ఏమి చేయవలెనో ఆదేశింపదు. ఎట్లు చేయ వలెనో ఆదేశించును.

వేదాంతమును వ్యవహారస్థాయికి దింపుటయు వ్యవహారమును వేదాంత స్థాయికి లేపుటయు గీతయొక్క చాతుర్యము. అందుచేతనే బ్రహ్మ జ్ఞానికి కర్మయోగము కరతలామలకమేయగును కదా.

గీత యంతయు వినిన తరువాత అర్జునుడు జోలి ఎత్తుకొని బిక్షాటనము చేయుచు అరణ్యములకు పారిపోలేదు. రణరంగమున నూతనోత్సాహముతో దుమికి క్షత్రియోచితమగు తన యుద్ధ కార్యమును ఆనందముగా నెరవేర్చెను.

మూలుగుచు ఒక మూల కూర్చున్న వానిని లేపి కర్తవ్యనిష్టునిగా నొనర్చిన ఘనత గీతకే చెల్లును.

ఈ నిష్కామ కర్మాచరణ రూపమగు దివ్యా ఔషదమును భుజించి వారి వారి వ్యవహారములను, గృహ కార్యములను లోక కార్యములను అనాసక్తముగా ఆచరించి ఎందరో శాంతి సౌఖ్యములను బడసిరి.

గీతా పఠనము గావించినచో మా బిడ్డలు సన్యసించి అరణ్యములకు పారిపోవుదురేమో అను బెంగ ఎవరికి ఉండవలసిన అవసరము లేదు. ఏలయన గీతను సాక్షాత్తుగా వినినట్టి అర్జునుడే ఆ పని చేయలేదు. క్షేత్రమున నిలబడి కర్తవ్యమును శీలించెను మరియు

**కర్మలందలి నేర్పరితనమే యోగమని**
శ్రీకృష్ణ పరమాత్ముడు సెలవిచ్చెను.

కావున గీతా శ్రవణముచే

మాదిగవాడు – చెప్పులను ఇంకా బాగా కుట్టును,

వంటవాడు – వంటను ఇంకా బాగుగా చేయును.

వర్తకుడు – ఇంకను చక్కగా, మోసము లేకుండా వర్తకము చేయును.

ఈ విధముగా గీత భౌతిక, ఆధ్యాత్మికరంగములు రెండు వేరుగా లేవనియు ఆ రెండింటి మధ్యనున్న అఖాతమునకు ఒక చక్కటి సేతువును నిర్మించినదాయెను.

**"సాధకుడు అన్ని యోగములు, కలిగి యుండుటయే భగవానుని మతము"**

అర్జునా ఎవడు నా సంబంధమైన కర్మలను చేయునో (కర్మ యోగము) నాయందే మనస్సు నిల్పునో (భక్తి యోగము) దృష్య పదార్థముల యందు సంగమము (Attachment) లేకుండునో (జ్ఞాన యోగము) ఎవడు భూతదయ కలిగి యుండునో వాడే నన్ను పొందును.

కొందరు సోమరులు ఏ కార్యమున్ను చేయక, కర్మేంద్రియములను బిగబట్టి ముడుచుకొని కూర్చొని (జగత్తు మిధ్య గనుక) తాము పరమ వైరాగ్యము అవలంభించుచున్నామని చెప్పుచు మనస్సుతో మాత్రము ముల్లోకములందు సంచరించుచుండును. అట్టివానికి కపట భక్తుడని, మిథ్యాచార్యుడని భగవానుడు చక్కటి నామధేయమొసంగెను.

కర్మ చేయుట గాని, చేయకపోవుట గాని ప్రధానము కాదు. హృదయ మందలి వాసనలు తొలుగుటయే ప్రధానము మనస్సు నందలి మాలిన్యములు నశించుటయే ప్రధానము. చిత్తమందలి రాగ ద్వేషములు వీడుటయే ప్రధానము. అవి తొలగనప్పుడు ప్రపంచమును వీడి

- ఏకాంతమునకు పరుగెత్తికెళ్ళి
- గిరి గహ్వరములలో కాపురముండినను
- కరేంద్రియములన్నింటిని బంధించి కూర్చున్నను
- ఏ కర్మమును ఆచరింపకున్నను

మనుజుడు బద్ధుడేయగును. ఏలనన వాని మనస్సు మలిన సంకల్పములు చేయుచునే యుండును.

ప్రపంచమంతయు తిరుగాడుచునే యుండును. వాసనలు విజృంభించుచునే యుండును.

అట్లుగాక రాగద్వేషములు తొలగినప్పుడు మనస్సునందలి మాలిన్యము నశించినపుడు, వాసనలు ఉడిగినప్పుడు మనుజుడు మహాజన మధ్యమున ఉన్నప్పటికి నిరంతరము కర్మ శీలించు చున్నప్పటికి ముక్తుడె యగును.

అందుచేతనే భగవానుడు జ్ఞాన యోగమునందు అర్జునకు కర్మ యోగిని గూర్చి ఈ క్రింది విధముగా తెలిపెను.

1) ఏ మనుజుడు కర్మ ఫలాపేక్షను వదిలినవాడై సదా సంతృప్తి నొందినవాడై నిరాశ్రయుడై యుండునో అట్టివాడు కర్మలయందు చరించు చున్నను కొంచమైనను చేయనివాడె అయి ఉన్నాడు.

2) ఆశ లేనివాడు, మనోబుద్ధులను జయించినవాడు అగు మనుజుడు కేవలము దేహము కొరకే కర్మలనాచరించినను పాపము నొందడు.

3) ప్రయత్నము లేకనే లభించిన దానితో సంతృప్తిని చెందినవాడు, ద్వంద్వముల నతిక్రమించినవాడు, మాత్సర్యము లేనివాడు కార్యముల ఫలాఫలమందు సమబుద్ధి గలవాడు కర్మలు చేసినను బంధింపబడడు.

4) సంగము లేనివాడును, ముక్తుడును, మనస్సును జ్ఞానమందు నిల్పినవాడును, యజ్ఞార్థమై కర్మము లాచరించువాడు అగు మనుజుని యొఒక్క కర్మ సంపూర్ణహుగ నశించిపోవుచున్నది.

5) హోమ సాధనములు, హవిస్సు, హోమాగ్ని, హోమము చేయువాడు, హోమము చేయబడినది సర్వము బ్రహ్మమే యనబడ భావముతో యజ్ఞము నాచరించెడివాడు పొందెడి ఫలము కూడా బ్రహ్మమే అయి ఉన్నది.

అర్జునా యజ్ఞ శేషమైన అమృతమును భుజించువారు నిత్యమైన బ్రహ్మమును బడయుచున్నారు. యజ్ఞ కర్మ లాచరించనివానికి ఈ లోకమే లేదు ఇక పరలోకమెక్కడిది.

ప్రారంభమున దుష్కర్మ నుండి సత్కర్మకు మారవలెను. అటు పిమ్మట సత్కర్మ నుండి నైష్కర్మ్యమునకు (మోక్షమునకు) దారితీయవలయును. ఇదియే సరియైన పద్ధతి.

అట్లుగాక దుష్కర్మ నుండి ఒకే పర్యాయము నైష్కర్మ్యమునకు గంతు వేసినచో అచరటికి చేరకపోవుట అట్లుండ కాలు మాత్రము విరుగగొట్టు కొనును (పతనమగును).

కర్మల ద్వారా చిత్తశుద్ధి కలుగును. ఏలయనగా ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలను చేయుచురాగా చిత్తమందలి దోషములు, పాపములు నశించి చిత్తము నిర్మలమగును. నిర్మల చిత్తమందు, శుద్ధ జలమందు సూర్యుని ప్రతిబింబము స్పష్టముగా గోచరించునట్లు జ్ఞానోదయమగును. జ్ఞానముచే మోక్షము కలుగును.

**కర్మణాజాయతే భక్తిః భక్త్యా జ్ఞానం ప్రజాయతే**
**జ్ఞానా ప్రజాయతే ముక్తిః ఇతి శాస్త్రార్ధ సంగ్రహః**

మరియు కర్మ యనునది మనుజుని సత్త ఎంతమాత్రమో తేల్చి చెప్పగలదు. జీవుడు సత్వగుణ సంపన్నుడో, రజోగుణ సంపన్నుడో లేక తమోగుణ సంపన్నుడో కర్మ రంగముననే భయటపడును. ఒకడు చూచుటకు దేవుడుగా కన్పించును. కాని కర్మయందు రాక్షసునిగా మారును. ఒకడు చూచుటకు రాక్షసునిగా కన్పించును. కాని కర్మయందు దేవునిగా మారును.

కావున మనుజుని పట్టి చూపునది కర్మయే గాని వేరొకటి కాదని విజ్ఞులు నిశ్చయించుకొని దానియందు క్షుణ్ణమైన పవిత్రతను సంపాదించ వలెను.

జ్ఞాని – అజ్ఞాని ఇద్దరు చేయు కర్మలు పైకి ఒకటిగా కన్పించినను రెండింటి లక్ష్యములు వేరు. అజ్ఞాని కర్మతో తాదాత్మ్యము చెంది నేను చేయుచున్నాననుకొనును. కర్తృత్వముతో ఫలాబిసంధితో చేయును.

జ్ఞాని ఆత్మస్థితియందుండి లేక మనస్సును దైవమందుంచి దైవబుద్ధితో కర్తృత్వ ఫలాభిసంధి రహితముగా చేయును. కావున దాని ఫలితములు గూడా వేర్వేరుగ యుండును.

అనగా జ్ఞాని కర్మ ముక్తిదాయకముగను అజ్ఞాని కర్మ బంధ దాయకముగను యున్నది.

ఈ కర్తృత్వమును మనుజుడు అవసరముగ తనయందు కల్పించుకొని బాధపడుచున్నాడు. వాస్తవముగ ఈ అనంతకోటి బ్రహ్మాండము నందు మనుజుని ఉనికి యెంత? మనుజుడు తాను పుట్టక పూర్వము కోట్లాది సంవత్సరములు ఈ జగత్తును ఎవరు పరిపాలించిరో, తాను మరణించిన పిదప కోట్ల కొలది సంవత్సరములు ఎవరు పరిపాలించుదురో అదియే "దైవము".

అతడే పరమాత్మ అతడే ఈ విశ్వమునంతటిని నడుపుచున్నాడు. మన ద్వారా పనులు చేయించునది కూడా అతడే. మనము కేవలము నిమిత్త మాత్రులము. అతని చేతిలో ఉపకరణములము.

ఈ జగన్నాటకములో అతడు సూత్రధారి మనము పాత్రధారులము. ఎవరెవరి పాత్రలకు వారు న్యాయము చేకూర్చుటయే ముక్తిదాయకము.

ఈశ్వరుడు ఈ బ్రహ్మాండమునంతటిని నడుపుచుండగా జీవుడు ఈ నలుబది, యాబది సంవత్సరముల బ్రతుకుతో తానే అంతయు చేయు చున్నాడని కర్తనని విఱ్ఱవీగుట హాస్యాస్పదముగా యున్నది. అది కేవలము అసంగతమే యగును. ఇది యెట్లున్నదనిన–

ఒక అమాయకుడగు పల్లెటూరి రైతు (ఇదివరలో ఎన్నడు రైలు ఎక్కనివాడు) ఒకపరి రైలులో ప్రయాణము చేయుట తటస్థించినది. అతనియొద్ద చిన్న మూట కలదు. రైలులో ప్రవేశించగనే చుట్టును అనేకమంది ప్రయాణికులు పెద్దపెద్ద పెట్టెలను క్రిందపెట్టుకొని యుండుట చూచి, అయ్యో (ఎంత భారము రైలునకు) వీరందరి సామానులను మోయుటయే దానికి కష్టము కదా! ఇక నా మూట కూడా అందు చేర్చి దానికి భారమేల అధికము చేయవలయును అని వితర్కించుకొని తన మూటను క్రిందపెట్టక తన నెత్తిపైననే పెట్టుకొని రైలులో కూర్చొనెను. ఆ వింతను చూసి ఆ జనము విరగబడి నవ్వసాగిరి మరియు అతనితో ఇట్లనిరి. ఓయీ వెఱ్ఱివాడా! నీవు నీ మూటను రైలులో క్రిందపెట్టక నీ నెత్తిన పెట్టుకున్నను దానిని మోయునది ఈ రైలే కదా! నిన్ను, నీ మూటను, మమ్ములను, వెయ్యేల ఈ రైలుయందుగల సమస్తమును ఆ రైలే మోయు చున్నది గదాయని చెప్పిరి. అప్పుడు ఆ రైతు తన తప్పిదమును తెలిసికొనెను.

అనగా భగవానుని మతము జీవుడు కర్మలు చేయకుండుట అని కాదు.

"నీకు కర్మలు చేయుట యందే అధికారము గలదు. కర్మఫలము నాశించుటయందు నీకధికారము లేదు. కర్మఫలమునకు నీవు కారణము కారాదు అని నియమిత కర్మలను చేయుట మానరాదు. అనాసక్తితో కర్మల నాచరింపవలెను.

**JIUAX INFINITY = GOD**

అనగా మన శరీరమును అనంతముతో హెచ్చించినా అది దైవ శరీరమగును (విరాట్) మనస్సును అనంతముతో హెచ్చించిన అది దైవ మనస్సగును (హిరణ్యగర్భుడు). ఇక మన ఆత్మయు అతని ఆత్మయు ఒకటియే.

దేవునియందు జీవుడు ఒక అంశమే గనుక జీవుడు చేయు పాపపుణ్యములను దేవుడు నిరంతరము గమనించుచునే యుండును. పాప సంకల్పముదయించుటకు పూర్వమే అచట పరమాత్మ నివసించి యుండ అతనికంటబడని పాపమేదైన యుండగలదా.

కావున జీవుడు తాను ఏఏ కర్మలయందు ప్రవర్తింతచుచుండునో తదనుగుణముగా కర్మఫలములు అనుభవించియే తీరవలెను.

**"Non can escape from the clutches of God"**

పాపము చేయవలెనని కోరిక లేనప్పటికి జీవుడు ఏల పాపము చేయుచున్నాడు? దేనిచే ప్రేరేపింపబడి అట్లోనర్చుచున్నాడని అర్జునిని శంక. ఇది సమయోచితమైన ప్రశ్న. ఏలనన ప్రతీ వానికి ఇదే సంశియము కలుగును అర్జునుడు జీవుల తరఫున "Representative" గా పరమాత్మను ఈ ప్రశ్న అడిగెను.

అబద్ధము మాట్లాడకూడదు అని అందరికిని తెలియును కాని మాట్లాడుచున్నారు.

పరులకు అపకారము చేయకూడదని తెలియును కాని చేయు చున్నాడు.

లంచమును తీసుకొనగూడదు అని తెలుసును కాని తీసుకొను చున్నాడు.

ఈరోజు ఏకాదశి– ఉపవాసముండవలెను –అని పట్టుదలతో వ్రతమునారంభించినను మధ్యాహ్నం వరకు ఏదియో ఒక శక్తి వచ్చి కొద్దిగా కాఫీ త్రాగినను ఫరవాలేదని చెప్పి జీవుని మెల్లిమెల్లిగా గోతిలోనికి త్రోయుచున్నది. ఆ దుష్టశక్తి యేదియో తెలుపుమని అర్జునుడు శ్రీకృష్ణ పరమాత్మను ప్రశ్నించెను.

సృష్టి చట్టమును, క్షుణ్ణహుగా అర్థము చేసికొనలేని 'అజ్ఞానము', 'కామము' (సృష్టికి విరుద్ధమని తెలిసినప్పటికి నిగ్రహించుకొనలేని అసహాయత) ఇవియే దుష్టశక్తులని శ్రీకృష్ణుడు అర్జునకు సెలవిచ్చెను.

కామ సంకల్పముదయించిన తరువాత దానిని విచారణాదులచే అరికట్టుతారు మధ్యతరగతివారు. ఉత్తములో బుద్ధికి పరమగు స్వస్వరూపమందే నిలకడగలవారై ఆత్మను ఆశ్రయించినవారై కామ సంకల్పములుదయించకుండగనే చూచుకొనుచుందురు.

ప్రపంచమున చతురంగ బలములను జయించినవాడు – శూరుడు కాడు; అస్త్రశస్త్రములు కలిగియున్నవాడు– శూరుడు కాడు; లోకమంతయు దిగ్విజయమొనర్చువాడు –శూరుడు కాడు.

వశిష్టులవారానతిచ్చినట్లు:

**ఇంద్రియ మనంబులను జయించి కామాదులపై విజయము సంపాదింపగలిగినవాడే శూరుడు. మోక్షమునకర్హుడు.**

రెండు విధములగు సంస్కారములతో మానవుడీలోకమున పుట్టుచున్నాడు. అందొకటటి ముముక్షత్వమునకు హేతువగు విద్య. రెండవది సంసార హేతువగు అవిద్య. మానవుని జననకాలమున ఇవి రెండును త్రాసునందలి సిబ్బుల వలె సరిసమానముగ ఉండునని చెప్పవచ్చును.

వెంటనే **సంసారము** ఒక సిబ్బిలో లౌకిక సుఖమును **దైవము** రెండవ సిబ్బిలో దైవ జిజ్ఞాసను పెట్టును.

మనస్సు సంసారమును కోరుకొనెనా **అవిద్య** అను సిబ్బి బరువై మానవుడు లోకము వైపునకు మొగ్గును. అటుగాక దేవుని కోరుకొనెనా **విద్య** అను సిబ్బి బరువై వానిని దేవుని వైపునకు మరల్చును.

ఒకటి తెలుసుకొంటివా నీకన్నియును తెలియును. ఒకటియను అంకె తరువాత ఎన్ని సున్నాలను చేర్చినచో వాని విలువ అంతకు అంత పెరుగును. కాని ఒకటిని చెరిపి వేసితివా సున్నాల విలువ సున్నాయే, ఏకము వలననే అనేకమునకు విలువ కలుగుచున్నది. మొదటిది ఏకత్వము తర్వాతది నానాత్వము. మొదట భగవంతుడు తర్వాత గణింపదగినవి జీవుడు జగత్తును.

మొదట ఆత్మ లాభమును పొందుము. తరువాత ధనము సంపాదింపుము. ఈ వరుసను తలక్రిందులు చేయ ప్రయత్నింపకుము. పరమార్థమును పొందిన వెనుక సంసారమున మెలిగినను నీ మనశ్శాంతిని భంగము కలుగబోదు.

మాయాబద్ధుడగు ఆత్మయే జీవుడు. బంధముక్తుడగు ఆత్మయే ఈశ్వరుడు.

జీవుడు నిజముగా సచ్చిదానంద స్వరూపుడు. అహంకారము వలన అనేక ఉపాధులచే బద్ధుడై జీవుడు నిజస్వభావమును మరచి యున్నాడు.

మనస్సు భోగములపై ఆశవీడి, నిర్మలమైనంతనే భగవానునిపై లగ్నము కాగలదు. బద్ధుడు ఈ విధముగా ముక్తుడగుచున్నాడు. భగవంతుని వీడి పెడత్రోవన పోవువాడే బద్ధుడు.

కామిని కాంచన మోహము మనస్సు నుండి నిర్మలమైనప్పుడు మిగులునదేమి? కేవలము బ్రహ్మానందము.

కాంతా కనకములకెవడు బానిస కాడో వాడే పుణ్యపురుషుడు.

## II.

నచికేతా ఆ నీవు ప్రేమాస్పదమైన విషయాలను ప్రియంగా కన్పించె విషయాలను చక్కగా పరిశీలించి వాటన్నిటిని పరిత్యజించావు. ఎందరో మానవులు మునిగి నశించే ఈ ప్రేయోమార్గంలో నీవు ప్రవేశించలేదు.

అజ్ఞానము, జ్ఞానము అనబడే ఈ రెండు విభిన్న గమ్యాలకు తీసుకుపోయేవి. అపారమైన అంతరము గలవి నచికేతుడు జ్ఞానాన్నే అన్వేషిస్తాడని నేను భావిస్తాను. ఎందుకంటే ఎన్ని విషయభోగాల ప్రలోభాలైనా నిన్ను చలింపచేయలేకపోయాయి.

**ఆ నీవు :** నాచేత అంతగా ప్రలోభపెట్టబడిన నీవు.

**ప్రేమాస్పదమైన విషయాలను :** పుత్ర పౌత్రాదులు

**ప్రియంగా కన్పించే విషయాలను:** సుందరీమణులు, రథాలు మొదలైనవి.

**ప్రేయోమార్గము :** ప్రాపంచీకులు ధనం కోసం పరిశ్రమించే ఈ మార్గం లౌకికుల ధనంకటె పరమార్థం లేదు. ఈ మర్త్య సుఖాలన్నింటిని స్వాధీనం చేసుకొని సంపన్నుడు కాగల నచికేతుడు బుద్ధి సూక్ష్మతతో వాటన్నిటిని పరిత్యజించాడు.

**అపారమైన అంతరం గలవి :** అజ్ఞానం, అంటే సుఖాన్వేషనకు మార్గము. తుదకు దుఃఖానికి, బంధనానికి తీసుకుపోతుంది. కాని జ్ఞానం, శ్రేయోమార్గం. మానవుని బ్రహ్మానందానికి, విముక్తికి చేరుస్తుంది. ఇక్కడ సౌఖ్యమార్గం అజ్ఞానంగా చెప్పబడింది. దానికి కారణం ఆత్మను గూర్చిన పొరపాటు అభిప్రాయమే. అజ్ఞానమే, సుఖాన్వేషనకు పునాది.

## III.

గాఢమైన అజ్ఞానంలో కూరుకుపోయిన మూర్ఖులు తామే ప్రజ్ఞావంతులు, గొప్ప విద్వాసులూ అనుకుంటూ గ్రుడ్డివాళ్ళచేతనే నడిపించబడే గ్రుడ్డివాల్లలాగ తూలుతూ తడబడుతూ సుడులు తిరుగుతూ ఉంటారు.

జాగ్రత్తలేని బాలుడికి ధన మదంతో మతిపోయిన వారికి శ్రేయో మార్గం ఎన్నటికి కన్పించదు. ఉన్నది ఈ లోకమే, మరో లోకం లేనేలేదు అనుకునేవాడు మళ్ళీ మళ్ళీ నాచేతిలో పడుతూ ఉంటాడు.

**సుడులు తిరుగుతూ ఉంటారు :** జీవిత బంధం నుండి వారికి ముక్తి లేదు. జనన మరణ చక్రాలెన్నింటిలో వారు తిరుగవలసి ఉంటుంది.

**తూలుతూ తడబడుతూ :** జీవితంలోని దుఃఖ శోకాల తాకిడికి వారు గడ్డిపోచలాగా కదలాడిపోతూ ఉంటారు.

మూడో వరం అడుగుతూ నచకేతుడు మరణానంతరం జీవితం ఉన్నదని కొందరు, లేదని మరికొందరు అంటారని చెబుతాడు. యముడు అలా ఉత్తరగతిని నిరాకరించే వారి స్వభావము ఏమిటో వివరిస్తూ చెప్తున్నాడు.

**జాగ్రత్తలేని బాలుడు:** అజ్ఞానులు అవివేకులు అయిన మనుష్యులు.

**నా చేతిలో పడుతూ ఉంటారు :** మళ్ళీ మళ్ళీ చావడానికే మళ్ళీ మళ్ళీ పుడుతూ ఉంటారు.

మాయ అనగానేమి? పారమార్థిక సాధనకు– ఆత్మ వికాసమునకు అడ్డువచ్చు కామమే మాయ.

సర్వము ధ్వంసము చేయుదానిని మాయ అనవలెనా? మదనాగ్ని అనవలెనా?

కామిని కాంచనము నందలి మోహముచే సంసార బద్ధులగు నరులు వాని మూలముగా వేనవేలు అవమానములను పొందుచున్నారు. వాని బంధమును విదిలించుకొని మనస్సు భగవంతునివైపు త్రిప్పజాల కున్నారు.

సంసారులారా! కామినులను నమ్మకుడు. అతికపటముగ వారు మిమ్ములను లోబరుచుకుందురు.

నీవెంత జాగురూకతతో మెలగువాడవైనను పొగచూరి మసిపారి యున్న గదిలో వాసము చేయుచున్న పక్షమున కొంచెమో గొప్పో మసి డాగులు పడకుండ తప్పించుకోలేవు. ఎంత నిగ్రహ సంపన్నుడైనను, ఎంత బుద్ధిమంతుడైనను నరుడు కాంతా జనము నడుమ నివసించు నెడల ఏ కొలదిగా నైనను కామచింతలు వాని మనమున పొడచూపక మానవు.

**ఈ సత్యము పురుషులు, స్త్రీలు ఒండొరులకు సమముగానే వర్తించును.**

కామిని కాంచనములు నరులను నారాయణుని ఎడ విముఖులను చేసి సంసారమున ముంచివేయునని జ్ఞప్తియుంచుకొనుడు.

**తన భార్య మంచిదైనను చెడుదైనను నరుడామెను పొగుడుచునే యుండుట కడు విచిత్రము.**

కోతి వేటకాని కాళ్ళచెంత పడి ప్రాణములు విడుచురీతిని పురుషుడు సుందరాంగి చరణములకడ బలియగుచున్నాడు.

భక్తి సాధనములను సాగించి భక్తి పొందగోరువారు కామిని కాంచనముల యొక్క వలలో పడకుండ కడు జాగరూకులై మెలగవలయును.

**లేనియెడల ఎన్నటికిని సిద్ధి పొందజాలరు.**

సంసార బద్ధులకెన్నడును తెలివి రాదు. ఎన్ని దుఃఖముల పాలైనను ఎన్ని యాతనలు పడినను ఎన్నిసార్లు వంచింపబడినను వారు తెలివి తెచ్చుకొనరు. ఒంటెను చూచితిరా! దానికి ముండ్ల తుప్పలనిన ఇష్టము. వాటిని అవి మేసినకొలదియు ముట్టినుండి నెత్తురు కారు చుండును. ఐననేమి? వానిని తినుట మానదే. సంసారికిదు ఎన్నియు ఇడుములు పడును, కాని కొలది నాల్లకే మరుచును.

బహుశః వాని భార్య చనిపోయి ఉండవచ్చును. అంతలోనే పెండ్లియాడును కదా! ఒకవేల వాని బిడ్డ చనిపోయి ఉండవచ్చును. అందులకాతడేడ్చును కాని కొలది నాల్లకే ఆ విషయము మరచిపోవును.

బిడ్డ చనిపోవుటచే ఘోర దుఃఖము అనుభవించిన స్త్రీ మరల నూతన వస్త్రములను దాల్చి కులుకుచున్నది. కుమార్తె పెండ్లి చేసి తల్లిదండ్రులు దారిద్ర్య పీడితులగుచున్నారు. ఐననేమి? ఏటేట బిడ్డలను కనుచునే యుందురు. ఇక వ్యాజ్యములచే ధ్వంసమగుచున్నను వానిని నడిపించుచునే యుందురు.

**ఉన్న బిడ్డలకు అన్న వస్త్రములు లేకున్నను, ఏటేట కాన్పులు!**

ఒక్కొక్కప్పుడు వీని గతి కొండెలుకను పట్టుకొనిన పాము గతిని పోలును. అది దానిని మ్రింగను జాలదు విడువను జాలదు. అతడు ఒకవేళ సంసారము అపాయమనియు అరిబాళపు పండువలె సంసారము నంతయు తొక్కయు, టెంకయునేగాని అనుభవింపదగిన గుంజు ఏమియు లేదని గ్రహించిన గ్రహించునేగాక– సంసారమును త్యజించి భగవంతుని పైకి బుద్ధి మరల్చునా? మరల్చడే? సంసార తాపత్రయము నుండి తొలగించి వానికి సత్సాంగత్యము కలుగజేసితిమా, నిరుత్సాహియై, దిగులు చెంది, చిక్కిపోవ నారంభించును.

మాలిన్యమున పుట్టిన పురుగును గైకొని వియ్యపు గూనలో నుంచిన యెడల అది యచట బ్రతుకలేక చచ్చునుగదా!

## IV.

దానిని గురించి వినడం కూడా ఎంతోమందికి సాధ్యపడదు. దానిని గూర్చి వినినవారు కూడా ఎందరో దానిని గ్రహించలేరు. దానిని ఉపదేశించే ఆచార్యుడు అద్భుతమైనవాడు, శిష్యుడు కూడా అలాగే బుద్ధితీక్షత గలవాడు, సమర్థుడైన ఆచార్యుడు ఉపదేశించితే దానిని గ్రహించగలిగే శిష్యుడు నిజంగా అద్భుతమైనవాడు కదా!

అసమర్థమైన పురుషుడు బోధించితే ఈ ఆత్మ ఏనాటికి సవ్యంగా గ్రహింపబడదు. ఎన్ని విధాలుగా ఆలోచించినా సరే మరొకరు బోధించితే తప్ప దానికి వేరే దారిలేదు. సూక్ష్మతమైన దానికంటే అది సూక్ష్మతరమైనది. తర్కానికి లొంగనిది.

**ఆచార్యుడు అద్భుతమైనవాడు :** సమాజంలో అతి సకృతుడుగా కనిపించేవాడు ఆత్మజ్ఞాని. ఆయన శక్తి స్వభావము కూడా నిజంగా ఆశ్చర్యకరమైనవై, సమాజానికి జీవగర్రలు.

**శిష్యుడు :** బుద్ధితీక్షత గలవాడు. ఆత్మవిద్యను అర్థం చేసుకోగల శిష్యుడు కూడా అరుదు. సామాన్య మానవులకంటే ఎంతో విశిష్టుడు అతడు. అవసరమైన అర్హతలు, సాధనా చతుష్టయం మాత్రమే ఆత్మవిద్యకు తగిన శిష్యునిగా చేయగలవు.

**అసమర్థమైన పురుషుడు :** ఆత్మజ్ఞాని కానివాడు.

**ఎన్ని విధాలుగా ఆలోచించినా సరే :** శ్రీ శంకరులవారు ఇలా అర్థం చెపుతారు. ఉన్నది-లేనిది-కర్త-అకర్త-శుద్ధము-అశుద్ధము ఇలా అనేక విధాలుగా భావించబడుతున్నది గనుక.

**మరొకరు బోధించితే తప్పు :** శ్రీ శంకరులు దీనికి విభిన్న వాక్యానాలనిస్తారు. ఆత్మైక్యత పొందినవారు ఉపదేశించితే ఇక సందిగ్ధతే లేదు. లేదా ఆయనకు ఆత్మతో తాదాత్మ్యం బోధించినట్లయితే ఇక అన్యమేమి కనిపించదు. లేదా ఇక పునర్జన్మ ఉండదు లేదా ఆత్మతో తాదాత్మ్యం పొందిన ఆచార్యుడు ఉపదేశించితే ఇక అర్థం కాకపోవడం అంటూ ఉండదు.

**తర్కానికి లొంగనిది :** మనస్సుకు కూడా అతీతమైనది కనుక.

## బాధ గురువులు - బోధ గురువులు

ఓ ఆచార్యుడా! బోధించుటకు నీకడ అధికార చిహ్నము కలదా? రాజుచే అధికార ముద్రను పొందినయెంతటి అల్ప సేవకుడైనను వాని మాటలను జనులు భయభక్తులతో విందురు. అతడు తన డవాలు బిల్లను చూపి ఎంతటి అల్లరియైనను అణచివేయగలడు. అటులనే నీవును మొట్టమొదట ఈశ్వరుని ఆజ్ఞను పొంది ఈశ్వర ప్రేరితుడవు కావలెను. ఈ ఈశ్వరాదేశ చిహ్నము నీకడ లేనియెడల జీవితకాల మంతయు నీవు ధర్మోపన్యాసములు చేయుదువుగాక, వట్టి కంఠశోషయే గాని ప్రయోజనము లేదు.

భక్తి సాగరమున మునుగుట కెవ్వరికిని అభిలాషగాని, ఓరిమి గాని లేదు. వివేక వైరాగ్యములను గాని, సాధనములను గాని ఎవ్వరును లక్షింపనే లక్షింపరు. ఏ పుస్తకము నుండియో నాలుగు ముక్కలు నేర్చినంతనే, ఇక ఉపన్యాసములు చేయుట యనిన ప్రతీ వ్యక్తికి తహతహ. అందులకై పరుగు. ఎంత విచిత్రము! పరులకు బోధించుట యనిన అంత తేలికైన పనియా? **కష్టాత్కష్ట తరము**. ఈశ్వర సాక్షాత్కారమును పొందిన ఈశ్వరాదేశమును పొందినవాడే బోధింపగలడు.

మంచి వక్తయు బోధకుడు అయ్యియు ఆత్మవికాసము లేనివాడు ఎట్టివాడో తెలియునా? అతడు తనవద్ద కుదువ బెట్టిన పరుల ధనమును వ్యయము చేయువాడు, దుర్వినియోగము చేయువాడు. ఇతరులకాతడు ధారాళముగ ఉపదేశింపగలడు. దాని వలన తనకేమి నష్టము. అతడు బోధించు భావములు ఎరువుసొమ్మే కదా!

నేటి మతబోధకుల విధానము లెట్టివో మీకు తెలియునా? ఒక్కనికి మాత్రమే సరిపోవు అన్నముండగా నూరుమందిని ఎందుకు పిల్చుట వంటిది. అణుమాత్రమైన ఆత్మానుభవము ఉన్నదో లేదో, కేవలము మహా ధర్మోపదేష్టలుగా నటించుచుందురు.

మొదట నీ హృదయ దేవాలయమున భగవానుని ప్రతిష్ఠించు కొనుము. మొదట వాని సాక్షాత్కారమును పొందుము. భగవంతుని చూచిన మీదట ప్రసంగములు, బోధనలు, ఉపన్యాసములు మొదలగునవి ఎన్ని చేసినను చేయవచ్చును. అంతేగాని అంతకు పూర్వము కాదు. విషయ లోలురయ్యును జనులు భగవంతుని గూర్చియు బ్రహ్మమును గూర్చియు ప్రసంగములు చేయుచుందురు.

**ఆలయమున దేవుడు లేనిదే ఆరాధనకై సంకు ఊదెనట!**

ఒకనాడు నేను పంచవటి నుండి పోవుచుండ కప్పయొకటి భయంకరముగ కూయుచుండుట వింటిని. దానిని పాము పట్టుకొనెనని ఊహించితిని. చాలాసేపైన తరువాత ఆ దారినే వచ్చుచు తిరిగి ఆ శబ్దమునే వింటిని. పొదల నుండి తొంగి చూడగా ఒక బురదపాము కప్పను పట్టుకొనియున్నది. దానిని మ్రింగను మ్రింగజాలకుండెను, విడువను విడువజాలకుండెను. అప్పుడు నేనిట్లనుకుంటిని– అదియే త్రాచుపామైన ఎడల రెండుమూడు కూతలలో ఆ కప్ప పని ముగిసి యుండెడిది. అంతటితో పామునకును, కప్పకును బాధ నివర్తించెడిది.

కాని ఇచట పాము బాధయు కప్ప బాధయు దాదాపు సరిసమానముగా యుండినవి.

అటులనే ఆత్మహీనుడు అహంకరించి మరియొకరికి తరింపజేయు బాధ్యత పూనిన యెడల ఇరువురి బాధకు అంతముండదు.

**కాని సమర్థుడగు గురువుని ఆశ్రయించిన యెడల జీవుని అహంకారము రెండు మూడు బెకలతో సరి.** తత్వజ్ఞాన శోభితుడే సద్గురువు. అతడే బోధగురువు.

ముక్తులు లోకమున ఇరుతెగలుగా కన్పించుచున్నారు.

తత్వజ్ఞానము పొందిన వెనుక శాంతముగ నిశ్చలముగా యుండి ఇతరులను గూర్చి మాటయే తలపెట్టక బ్రహ్మానందమును పొందు చుందురు.

మరికొందరు జ్ఞాన లాభమును పొంది దానినంతయు తమ యొద్దనే దాచుకొనుటలో ఆనందమును గాంచక పరులతోనుద్దేశించి–

**రండు– మాతో తత్వానందము అనుభవింపుడు,** అని యెలుగెత్తి చాటువారు కొందరు.

నిజమైన బోధనమెట్టిదో తెలుసా? పరులకు బోధించుటకు బదులు నిరంతరము భగవానుని భజించుట యెడల అదియే కావలసినంత బోధన. సంసార బంధము నుండి విముక్తుడగుటకై ప్రయత్నించువాడెవడో వాడే నిజమైన బోధకుడు. నల్దిక్కుల నుండియు వందల కొలది జనులు వచ్చి ముక్తుని చేరి వారి ఉపదేశములు పొందుటకై ఆతురత పడుచుందురు. గులాబిమొక్క వికసింపగనే తేనెటీగలు పిలువకయె నలువైపుల నుండి వచ్చి మూగును.

మేడకప్పుపై బడు వాననీరు అందు విచిత్రముగా పులితల తీరున అమర్చబడు గొట్టముల నుండి నేలపై బడుచుండును. దానిని చూచిన పులినోటి నుండి నీరు వచ్చుచున్నట్లు తోచును కాని నిజముగా ఆ నీరు ఆకాశము నుండే పడుచున్నది. అదే తీరున–

**భగవతోత్తముల నోటినుండి వెలువడు దివ్యబోధనలు వారి పలుకుల వలె కన్పించును. కాని నిజమునకవి భగవంతుని నుండియె వెల్వడుచున్నవి.**

## V.

నీవు పొందిన ఈ జ్ఞానం కేవలము తర్కము, చర్చల వల్ల లభించేది కాదు. మరొకరు బోధించితేనే తప్ప అది సుగ్రాహ్యం కాదు. నీవు అవశ్యం సత్యనిష్ఠ గలవాడవు.

**మాకు నీవంటి పృచ్ఛకులు లభిస్తారు గాక.**

జ్ఞానం అంటే యధార్థస్థితిని గ్రహించడానికి మన చైతన్యం జాగృతమవడమే.

**ఆత్మజ్ఞానం అనేది స్వయం స్ఫురణ వలన కలిగే ఒక దర్శనం. అపరోక్షానుభూతి.**

ఎంతగా తర్కవితత్వాన్ని కొనసాగించినా అది గ్రాహ్యం కాదు.

**అది ఆలోచించి తెలిసికోదగినది కాక అనుభూతి ద్వారా గ్రహించదగినది.**

## VI.

శాశ్వత వస్తువు అశాశ్వత వస్తువుల చేత ఎన్నటికి పొందబడదు. కనుక అన్ని సంపదలు అనిత్యాలని తెలిసినా అనిత్య వస్తువులతో నాచకేతాగ్ని నిర్వహించాను. తద్వారా శాశ్వత వస్తువును పొందాను.

ఆనంద జ్ఞానుడనే వ్యాఖ్యాత యముడు నచకేతుని ప్రశంశిస్తున్నాడని సూచిస్తున్నాడు. ఈ సూత్రం తర్వాత శ్లోకంలో బలపడుతున్నది కూడా. ఆయన అభిప్రాయంలో యముడు కర్మ, కర్మఫలము అనిత్యమని తెలిసి కూడా యమపదాన్ని పొందడానికి నచకేతాగ్ని కర్మను అనుష్టించాడు కాని–

**నచకేతుడు అలాంటి ప్రలోభాలకు కూడా లొంగలేదు. అంచేత నచకేతుడు యమునికంటె కూడా శ్రేష్టుడు.**

**శాశ్వత వస్తువు :** ఆత్మ

**అశాశ్వత వస్తువుల చేత :** స్వభావం చేతనే అనిత్యమైన కర్మ ద్వారా

**సంపదలు :** సత్కార్యాల చేత కలిగిన పుణ్యకర్మ.

**శాశ్వత వస్తువును పొందాను :** ఇచట శాశ్వతమంటె పారమార్ధికమైన శాశ్వతం కాదు. భూలోక జీవితంతో పోలిస్తే సాపేక్షికంగా శాఆశ్వతమైన యముడి పదవి అని అర్ధము.

## VII.

సకల వాంఛల సంపూర్ణ పరిపూర్తిని అన్ని యజ్ఞాది కర్మల శాశ్వత ఫలాన్ని అభయత్వపు అవ్వలి దరిని ఆరాధ్య తమమూ ఘనము, ఉన్నతమైన స్థితిని జీవితాధారాన్ని దీనినంతటిని చూచికూడా ఓ నచకేతా! ధీమంతుడవైన నీవు ధృఢ నిశ్చయంతో తిరస్కరించావు.

**సంపూర్ణ పరిపూర్తి :** ఈ విశేషణాలన్ని హిరణ్యగర్భ స్థితిని బ్రహ్మ లోకాన్ని సూచిస్థాయి. ఈ సృష్టిలో అందుకోగలిగిన జీవిత పరమావది అంతవరకే దానిని అశ్వమేధాది గొప్ప యజ్ఞకర్మల ద్వారా పొందవచ్చు.

**దీనినంతటిని చూచి కూడా :** ఆ స్థితిని పరిశీలించి దాని లోటు పాటులను గమనించి.

# VIII.

ఈ శరీరంలోనే ఉన్నది, హృత్పద్మంలో ఆసీనమైయున్నది, సనాతనము, అతిసూక్ష్మము, అంతర్లీనము, జ్యోతిర్మయము అయిన ఆ అంతరాత్మను ధ్యానం ద్వారా సాక్షాత్కరించుకొని ధీశాలి సుఖ దుః ఖాలకు అతీతుడవుతాడు.

**ధీశాలి... అతీతుడవుతాడు :** ఆత్మ సాక్షాత్కారమైనప్పుడు, సుఖ దుఃఖాలు, చావు బ్రతుకులు, మంచి చెడ్డలు మొదలైన సాపేక్షిక స్థితుల కతీతమైన స్థితిని సాధకుడు చేరుకుంటాడు. అంచేతనే ఈ స్థితిని శాశ్వత పరమపదమని అంటారు. శారీరకమైన ప్రతిచర్యల ద్వారా శారీరక సంబంధాల ద్వారా సుఖదుఃఖాల బోధ కలుగుతుంది. కాని అన్ని సంయోగ సంపర్కాలకు అతీతమైన ఆత్మ ఏ విధమైన వికారానికి లోనవదు. దేనిచేతను ప్రభావితము కాదు.

## ఆత్మ – పంచకోశ వివరణ

గుహయందు బ్రహ్మము విహితమైయున్నదని శృతి చెప్పుచున్నది. పంచకోశములే ఆ గుహయనియు వారిని వివేచించుట ద్వారా ప్రత్యగాత్మకు అభిన్నమగు బ్రహ్మము బోధపడుననియు తెలిసికొనవలసి యున్నది.

- **అన్నమయ కోశము**
- **ప్రాణమయ కోశము**
- **మనోమయ కోశము**
- **విజ్ఞానమయ కోశము**
- **ఆనందమయ కోశము**

స్థూలమగు దేహము అన్నమయ కోశము. దానిలో లోపల నుండునది ప్రాణమయకోశము. దానికంటే లోపల నుండునది మనోమయ కోశము. దీనిలో నుండునది విజ్ఞానమయ కోశము. ఇదియే కర్తయనబడుచున్నది. మరియు లోననున్నది ఆనందమయ కోశము. ఇది భోక్త యనబడుచున్నది.

మాతాపితలు భుజించిన అన్నపు రసములచే జన్మించిన స్థూల దేహము అన్నము వలననే వర్ధిల్లును. ఈ దేహము అన్నమయ కోశము. జన్మకు పూర్వమున మరణమునకు పిమ్మట ఇది లేకపోవుటచే ఇది శాశ్వతమైన ఆత్మ కాజాలదు.

శరీరమంతటను నిండియుండి ఇంద్రియములకు బలము నిచ్చుచు వానిని నడిపించు ప్రాణవాయువే ప్రాణమయ కోశము. ఇది అచేతనమగుట చేత ఇది ఆత్మ కాజాలదు. నేను అను భావమును, దేహ గృహాదుల పట్ల నాది అను భావమును కలిగించునది మనోమయ కోశము. కామ క్రోదాధి వికారములకు లోనగుచు భ్రాంతమై పరిభ్రమించు మనోమయ కోశము – అవికారము అచంచలము అగు ఆత్మ కాజాలదు.

సుషుప్తియందు లయము పొందుచు జాగృతావస్త యందు నఖాగ్రముల వరకు వ్యాపించుచు సచ్చిదానంద ప్రతిఫలన యుక్తమైన బుద్ధి విజ్ఞానమయ కోశము అనబడుచున్నది. సుషుప్త్యాది వికారములకు లోనగునది కనుక ఇదియును ఆత్మ కాజాలదు.

పుణ్యకర్మల ఫలమగు సుఖము ననుభవించునపుడు బుద్ధి మరికొంత అంతర్ముఖమై ప్రతిఫలించిన సచ్చిదానందపుటానందము విషయబోఘములు శాంతించిన పిదప అది నిద్రయందు లీనమగును.

ఇట్లు ఆనందము ననుభవించు బుద్ధి వృత్తియే ఆనందమయ కోశము. ఈ ఆనందానుభవము కూడా అప్పుడు మాత్రమే యుండుట వలన ఆనందమే యైనను ఈ కోశము కూడా ఆత్మ కాజాలదు.

**ప్రతిబింబమునకు కారణము, అవికార్యము శాశ్వతము అగు ఆనందమే ఆత్మ.**

## IX.

ధర్మానికి ప్రాణమైన ఆ సూక్ష్మతత్వాన్ని విని తగిన విధంగా నివేదించి చక్కగా గ్రహించిన మానవుడు దానిని (ఆత్మ) పొందుతాడు. ఆనందించదగిన దానిని పొందటం చేత ఆనంద పరవశుడవుతాడు.

**నచకేతునికిది తెరిచిన ఇల్లే అని నేను భావిస్తాను.**

**ధర్మానికి ప్రాణం :** ధర్మ్యం అనే పదానికి వాచ్యార్థం ధర్మంతో సంబంధపడినది అని. కాని ఇక్కడ ఆ పదానికి ఉద్దేశ్యం ధర్మానికి సారమైన ఆత్మను సూచించడమే. ధర్మం లేకపోతే ఏదీ సాధ్యం కాదు. ధార్మిక జీవనం అన్వేశించేది కూడా ఆత్మను మాత్రమే.

**తగిన విధంగా వివేచించి :** మనస్సు శరీరాల నుండి జాగ్రత్తతో ఆత్మను వేరుచేసి

**ఆనందింపదగిన దానిని :** ఆనంద స్వరూపమైన ఆత్మను

**ఆనంద పరవశుడవుతాడు :** ఆత్మ సాక్షాత్కారము ద్వారా కలిగే ఆనంద పరావశ్యం ఇంద్రియ సుఖాల ద్వారా కలిగే పారవశ్యం లాంటిది కాదు. రెండవ దాంట్లో మత్తు ప్రతిచర్య ఉంటుంది. మొదటి దాంట్లో నిశ్చలమైన ప్రశాంతి ఉంటుంది. అంచేత ఆత్మ సాక్షాత్కారం పొందిన వాడు ఇంద్రియ సుఖముల యొక్క అన్ని చర్య ప్రతిచర్యలను అతిక్రమించి అనిర్వచనీయమైన శాంతిని పొందుతాడు.

**తెరచిన ఇల్లు :** బ్రహ్మ సాక్షాత్కారం కలిగిన చైతన్యస్థితిని అలంకార ప్రాయంగా బ్రహ్మపురమని అనడం కద్దు. నచకేతునికి ఆత్మ సాక్షాత్కారం ఎంతోదూరంలో లేదని యముడిక్కడ ఉద్ఘాటిస్తున్నాడు.

## X.

ధర్మా ధర్మాలకు కార్యకారణాలను, భూత భవిష్యత్తులకు కూడా భిన్నంగా నీవు దేనిని సాక్షాత్కరించుకున్నావో దానిని దయచేసి నాకు ఉపదేశించుము.

## XI.

అన్ని వేదాలు ఘోషించే గమ్యము, అన్ని తపస్సులు ఉద్ఘాటించే గమ్యం అయిన దేనిని కోరి సాధువులు బ్రహ్మచర్య జీవితం గడుపుతారో దానిని సంగ్రహంగా చెపుతున్నాను విను-

**ఓం అనేదే అది**

**ఈ అక్షరమే బ్రహ్మము. ఈ అక్షరమే సర్వోత్తమము కూడా. ఈ అక్షరాన్ని తెలుసుకున్నవారికి ఏది కోరితే అది సిద్ధిస్తుంది. ఈ ఆలంబనమే ఉత్తమమైనది. ఈ ఆలంబనమే ఉత్కృష్టము సర్వోత్కృష్ట మైనది. ఈ ఆలంబనాన్ని తెలుసుకొని బ్రహ్మలోకంలో పూజింపబడతాడు.**

**గమ్యము :** పదమ్ అనే శబ్దానికి గమ్యము, స్థితి, మాట అను అర్థాలున్నాయి. శ్రీ శంకరుల వారు గమ్యము అన్న అర్థాన్ని తీసుకొన్నాడు.

**అన్ని తపస్సుల గమ్యము :** అన్ని తపస్సుల చేత సాక్షాత్కరింప బడేది.

**ఓం అనేది అది :** బ్రహ్మమునకు శబ్దప్రతీక ఓంకారము. అందుచేత దానికి శబ్ద బ్రహ్మమని పేరు. అన్ని శబ్దాలకు మూలం

అందులోనే ఉన్నది. ఏ భావనగాని, ఆలోచన గాని దానికి తగిన పేరు లేదా 'శబ్దం' లేకుండా ఉండజాలదు. కనుక శబ్దం భావంతో అవినాభావంగా చెప్పబడుతున్నది. అది వ్యక్తంగానైనా సరె వ్యక్తంగానైనా సరె బ్రహ్మ భావన. అది భావించటమంటూ జరిగితే అన్నిటిని తనలో ఇముడ్చుకుంటుంది. అందుచే దాని శబ్ద ప్రతీక కూడా అలాగే సర్వంకషంగా ఉండక తప్పదు.

| | | |
|---|---|---|
| | **అకార** | |
| **ఓంకారంలో** | **ఉకార** | **లు కలవు** |
| | **మకారము** | |

కంఠ్యశబ్దాలలో మొదటిది అకారము. మానవుడు పలుకగలిగె మొదటి శబ్దము అకారాము.

మకారము ఓష్య శబ్దములలో చివరిది.

ఉకారము కంఠము నుండి పెదవులవరకు దొర్లుతూ వస్తుంది అందుచేత ఈ మూడు శబ్దాల కలయిక మానవుడు ఉచ్ఛరించగలిగె శబ్దాలన్నిటికి గర్భితం.

ఓంకారము ఇక్కడే బ్రహ్మము అని చెప్పబడినది. అది బ్రహ్మమునకు ప్రతీక కనుక అదే బ్రహ్మమని ధ్యానించాలి.

**ఆలంబనము :** ఇక్కడ ఆలంబనమంటె పరబ్రహ్మ సాక్షాత్కారానికి చతుర్ముఖ బ్రహ్మ పదవికి కూడా సాధనోపాయం అని అర్థము.

# బ్రహ్మచర్యము

**"సదా బ్రహ్మవిచారమందే యుండువాడు బ్రహ్మచారియని గ్రహించవలయును"**

బ్రహ్మచర్యము సకల జనులకు బ్రహ్మప్రాప్తిని కలుగజేయును. ఆయుస్సును, జ్ఞాన సంపత్తును, మనస్సునకు నిలకడ కలిగించును. బ్రహ్మచర్యమనునది శివస్వరూపము. అనగా మంగళరూపము, పరమ శివమైనది.

ఈశ్వరుడు పతీవ్రతా స్త్రీని గూర్చి ఈ విధముగా చెప్పెను.

పతీవ్రతా స్త్రీని దర్శించుటచేత నాకేదైనా పాపముండిన అది నశించుచున్నది. అట్టి పతివ్రతా స్త్రీ మిక్కిలి శుద్ధురాలు. పార్వతీదేవికి సమానురాలు. బ్రహ్మచర్యము 3 విధములు.

- **స్థూలము - వ్యాయామము**
- **సూక్ష్మము - మనోనిర్మలత**
- **కారణము - ఆత్మశుద్ధి**

ఇచట వ్యాయామ పదముచే ఆసనాదులు మనో నైర్మల్య పదముచే ప్రాణాయామాదులు అని గ్రహించవలెను.

మూడవది ఆత్మశుద్ధి. ఇది కారణ బ్రహ్మచర్యము. ఆత్మశుద్ధిని గాంచినపుడే కారణశరీరము నశించును. ఓ పాపరహితుడా! ఈ కారణబ్రహ్మచర్యము చేతనే ముక్తి లభించును

ఇక మూడు విధముల బ్రహ్మచర్యముల స్వరూపమును నిరూపించుచున్నాను.

ఆహారము, కరుణ, బ్రహత్వ భావనము అని 3 రకములుగ యున్నది.

సత్వగుణాభివర్ధకమగు సాత్వికాహారము సేవించుట బ్రహ్మచర్యమే యగును.

భక్తిని వృద్ధి చేయు కరుణయు బ్రహ్మచర్యమే.

స్వాత్మయందు బ్రహ్మభావము బ్రహ్మచర్యమే. దీనిచే తాను ఆ బ్రహ్మమే యను నిశ్చయ భావము, జ్ఞానము కలుగును.

నైష్ఠికము, గార్హస్థ్యము, వైదురము అని బ్రహ్మచర్యము 3 విధములుగా యున్నది.

పుట్టుక మొదలు మరణ పర్యన్తము యెలాంటి దోషము లేక ఆచరింపబడు బ్రహ్మచర్యమే నైష్ఠికము.

Ex: **శ్రీశుక – అంజనానందన భీష్మాదులు**

ఋతుకాలమందు మాత్రము విషయములయందు ప్రవర్తించి ధర్మబద్ధుడై బ్రహ్మచర్యము ననుష్ఠించుట గార్హస్థ్యము.

Ex: **శ్రీరామ, జనకాదులు.**

ఏ గృహస్థుడు భార్య పరలోకగతురాలైన పిదపగాని, లేక భార్య యున్నప్పుడే విరక్తుడయి బ్రహ్మచర్యము నాచరించినచో అది విదుర బ్రహ్మచర్యమనబడును.

Ex: **విశ్వామిత్ర యాజ్ఞవల్క్యాదులు**

ఇంకను ఆ బ్రహ్మచర్యము

- **మానసికము**
- **వాచకము**
- **కాయికము**

**అని 3 విధములుగా యున్నది**

మనస్సున ఏలాంటి సంకల్పములు లేకుంటయే మానసిక బ్రహ్మచర్యము.

వాచిక బ్రహ్మచర్యము– వాక్కుతోను విషయాభిలాష ప్రయుక్తాలాపములు చేయకుండుట

శరీరముతో సంబంధము లేకుండుట కాయికా బ్రహ్మచర్య మనబడును.

బ్రహ్మచర్య వ్రత దార్ఢ్యము గలవానికి

| | | |
|---|---|---|
| సాగరము | -- | గోష్పాదిజలము వలె |
| మేరు పర్వతము | -- | చిన్న గుట్టవలె |
| దావాగ్ని | -- | చిన్న దీపము వలె |
| గాఢాంధకరాములో మహారణ్యములో సంచరించుట. | -- | పుష్పోద్యానవనంలో విహరించుట. |
| బలసాయుధ శత్రువు | -- | దుర్బలుడగు బాలునివలెను గోచరించును. |

అట్టి వ్రతము లేనివానికి Vice Versa గా కన్పించును.

ఓ ప్రజ్ఞావంతుడా! యెవరు కలియుగమున బ్రహ్మచర్యము అసాధ్యమని పలుకుచున్నారో వారలు కలి ప్రేరిత కల్మష హృదయులు.

**యెవరు కలిగమందు కూడా బ్రహ్మచర్యము సాధ్యమని పల్కుచున్నారో అట్టి వారందరు కృత, త్రేతాది యుగములో నుండి ఇప్పుడే పుట్టిన వారని సందేహము లేక ముమ్మారు నమ్ముడు.**

# బ్రహ్మచర్య వ్రత లక్షణము

బ్రహ్మచారి గురుకులమునందున్నవాడై ఈ నియమము లాచరింపవలెను. ఇంద్రియములను చక్కగా నియమించి, తాను తపస్సును వృద్ధి చేసుకొనవలయును.

ఓ మహానుభావా! శరీర శుద్ధియందు ప్రయత్నపరుడై నిత్యము స్నానము చేసి బ్రహ్మచారి దేవ, ఋషి, పితృ, నరులకు తర్పనము చేయవలెను.

సురాపానము, మాంసము, గంధము, పుష్పమాలికలు, రథములు, స్త్రీలు, ఇంకను ఆడంబరముగల వస్తువులు, ప్రాణులను హింసించుట, వీటన్నిటిని వదిలివేయవలయును.

హోమమునకు, వయుక్తములగు సమిధలను, దర్భలను, మృత్తికలను, పుష్పము, జలము, ఫలము వీటిని నానావిధ కాష్టమును బ్రహ్మచారి గ్రహింపవలయును.

అభ్యంగన స్నానము, కండ్లకు కటుక పెట్టుకొనుట, గొడుగు పట్టుకొనుట, చెప్పులను వేసుకొనుట, కామసంకల్పములు, క్రోధము, లోభము, గానము, వాద్యములు, నర్తన చేయుట, జూదము, జనులతో వృధాప్రసంగము, అసత్యము, ఇతరులపై నింద వేయుట వీటికి దూరముగా ఉండవలయును.

బ్రహ్మచారి ఎక్కడనైనను తానొంటరిగానే పరుండవలయును. కామ సంకల్పములచే రేతస్సును పోగొట్టుకొనినచో బ్రహ్మచర్య వ్రతమునే పాడుచేసికొనినవాడగును.

కామాభిలాష లేకనే స్వప్నమందు స్కలన దోషము కలిగనేని స్నానము చేసి సూర్యభగవానునికి అర్ఘ్యపాదాదులొసగి, పరిశుద్ధుడై పునర్మామ్ అను ఋఙ్మంత్రమును జపించవలయును.

బ్రహ్మచారి బిక్షాటన చేయవలయును.

ఓ నృపోత్తమా! యే పుణ్యాత్ములగు గృహస్థులు యజ్ఞముల యందును, భక్తి, శ్రద్ధ, విశ్వాసము కలవారై స్వకర్మలను, అనగా వేదోక్త గృహస్థ ధర్మములను ఆచరించుందురో అట్టి పవిత్ర గృహముల నుండి మాత్రమే బ్రహ్మచారి నియమోపేతుడై ప్రతిదినము బిక్ష గైకొనవలయును.

తన దాయాదుల యొక్కయు, బంధువుల యొక్కయు తన వంశము యొక్కయు ఇండ్లకడ బిక్ష గైకొనరాదు.

ఇతర గోత్రస్థుల గృహములలో బిక్ష దొరకపోయినచో గురు గృహము వదలి దాయాదులు, మొదలైన పూర్వము చెప్పబడిన వారి గృహములలో బిక్ష స్వీకరింపవచ్చును. దానిలో కూడ బిక్ష లభించనప్పుడు ముందు ముందు గల ఇండ్లను వదలి ఇతర గృహములకడ బిక్ష గైకొనవచ్చును. అచ్చటను దొరకనిచో గ్రామమంతయును సంచరించ వచ్చును.

బిక్ష లభించనియెడల మాత్రమే నాలుగు వర్ణములలో బిక్షను గైకొనవచ్చును.

ప్రాతఃకాలమందును, సాయంకాలమందును, అలసుడు గాక, బ్రహ్మచారి ఆ సమిధులచే అగ్నిని హోమించవలయును. మరియు ఆ బిక్షను తీసికొనక ఆ యగ్నిని హోమించగూడదు.

ఆ నియమమొకవేళ తప్పినచో తాను అతురుడు గాక ఏడు రాత్రులు అపకీర్ణ వ్రతమును చేయవలయును.

బ్రహ్మచారికి వృత్తి బిక్షాచరణమేయని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు.

బ్రహ్మచారికి బైక్ష్యవృత్తి ఉపవాసముతో సమానము.




గావించుచు సకల విషయములందు విరక్తుడై, గురుకులావాస సత్య కథన భైక్ష్యాచరణాది ధర్మములనాచరించుటయు బ్రహ్మచర్యమే యగును.

బ్రహ్మప్రాప్తికొరకు ఆచార్యుని వద్దయుండి బ్రహ్మ విచారము చేయు కాలములో యుండు నియమమునకు గూడా బ్రహ్మచర్య వ్రతమని గ్రహించవలయును.

## నైష్ఠిక బ్రహ్మచర్యము

పుట్టుక మొదలు మరణ పర్యంతము యెలాంటి విషయ దోషములు లేక ఆచరింపబడినది నైష్ఠిక మనబడును.

Ex: **శుక సనక సనందనాదులు**
**గార్గి – సులభాయోగినులు**

శ్రీ రామక్రిష్ణ పరమహంస, శారదాదేవులు వివాహితులైనను నైష్ఠిక బ్రహ్మచారులే.

నైష్ఠిక బ్రహ్మచర్యము 8 విధములు.

1) విషయ సంబంధ మాటలను వినుట.

2) వాక్కుతో విషయములను గూర్చి మాట్లాడుట

3) స్త్రీలతో ఆటలాడుట

4) దుష్టభావనతో స్త్రీ పురుషులు పరస్పరము చూచుకొనుట.

5) ఆ విషయమై స్త్రీ పురుషులు పరస్పరము చూచుకొనుట.

6) ఆ విషయమై ప్రవర్తించుటకు సంకల్పించుట

7) ఆ విషయముపై ప్రవర్తించుటకు స్థిరము చేసికొనుట

8) విషయములలో ప్రవర్తించుట

ఈ 8 విషయములగు దోషములు లేనివే పవిత్రమగు బ్రహ్మచర్య మనబడును. మరియు శాస్త్రాంతరంబున చెప్పినదేమనగా

1) సారములన్నిటిలోను బ్రహ్మచర్య వ్రతమే మిక్కిలి సారవంతమైనది.

2) బ్రహ్మచర్యము ఉత్తమము మరియు తపస్సారమగును.

**ప్రతీ సాధనలోను, వ్రతములలోను బ్రహ్మచర్య వ్రతము వృద్ధి పరచవలయును.**

బ్రహ్మచర్య వ్రత ప్రభావము చేతనే ఉగ్రమైన తపస్సునారంభించుటకు సాధ్యమగును.

బ్రహ్మచర్య వ్రతమును మహావ్రతమని తెలియజేయనైనది.

ఇది పురుషులకెట్టిదో స్త్రీలకును అలాగుననే యుండును.

బ్రహ్మచర్యముచే పూర్ణాయువు, బ్రహ్మతేజస్సు, దేవేంద్రియములకు బలము, ఓజస్సు, అమానుష ప్రజ్ఞ, జ్ఞాన సంపద, గొప్ప యశస్సు కలుగును.

బ్రహ్మ నిష్టుడైనను తల్లితోగాని, తోబుట్టువుతోగాని, కుమార్తెతో గాని ఏకాంతంబున యుండకూడదు. ఇంద్రియములు మిక్కిలి బలవంతమైనవి.

అదేరీతిని బ్రహ్మనిష్ట గల స్త్రీలు తండ్రితోగాని, సోదరునితోగాని, పుత్రునితో గాని ఏకాంతంబున యుండరాదు.

అనగా అట్టివారలును గూడ నమ్మరాదని శాస్త్రము విధించు చుండగా యౌవన స్థితిలో యుండు పురుషులు, స్త్రీలు, పరస్పరము విహరించుటయు ఒకే స్థలములో యుండుటయు ఎంత అపాయకరమైనదో ఊహించవలసి యుండును.

అగ్నికుండ వంటిది స్త్రీయనియు, నేతికుండ వంటిది పురుషుడనియు శాస్త్రము తెలుపుచున్నది. అగ్ని సంపర్కముచే నేయి కరుగును. అటులే స్త్రీ సమీపమున పురుషుని మనస్సు కరుగును.

సముద్రము దాటుటకు నౌక ఎటువంటిదో సంసార సముద్రమును దాటుటకు బ్రహ్మచర్యము ఉత్కృష్ట సాధనము.

బ్రహ్మచర్య వ్రత పాలనచేత బ్రహ్మవిద్యయు, బ్రహ్మ విద్యచేత బ్రహ్మ లోకమును మనుష్యుడు పొందుచున్నాడు.

బ్రహ్మచారి గురుకులమున నివసించుచు ఇంద్రియ నిగ్రహముతో బాటు తపోవృద్ధికై ఈ నియమముల పాటింపవలయును.

ఇచ్ఛా పూర్వకముగా ఎన్నడును రేతస్కలనము చేయరాదు. అట్లు నష్టపరచిన వాడు తన బ్రహ్మచర్య వ్రతమును చెరచుకొనినవాడగను. స్వప్నమందొకవేళ వీర్య నష్టము జరిగినచో అట్టి బ్రహ్మచారి స్నానము చేసి ప్రాతఃకాలమున సూర్యునికి ఎదురుగా నిలచి పూజింపవలయును. తర్వాత జపాదులు చేసికొనవలయును.

యెలాగున కర్రతో చేయబడిన ఏనుగు, చర్మముతో చేయబడిన కుట్టబడిన జింకయు నామమాత్రమే ఐనట్లు అధ్యయన, తపస్సులు లేని బ్రహ్మచారియు నామధేయుడేయగును.

సన్యాసులైనవారికి




ఇవి ఎల్లప్పుడు అనుష్టానములో యుండవలెను.

## గృహస్త బ్రహ్మచర్యము

మూడు వేదములు గాని రెండు వేదములు గాని, తుదకు తన శాఖావేదముగాని గురువు కడ బ్రహ్మచర్యము తప్పక అభ్యసించి యాయా గృహస్థాశ్రమమును ప్రవేశింపవలయును.

తపము చేయుగోరువారు వేదమునే యెల్లప్పుడు అభ్యసించ వలయును. విప్రునకు వేదాభ్యాసమే ఈ లోకమున ముఖ్యమని చెప్పబడినది.

ఋతుకాలమందు మాత్రమే స్వభార్య యందు చేరువారు గూడా బ్రహ్మచారులనే గ్రహించవలయును. నారీమణియు బ్రహ్మచారిణియే యగును.

ఏ సాధ్వీమణి భర్త మరణించిన పిమ్మట బ్రహ్మచర్య వ్రతము అనుభవించుచున్నదో అట్టివారు సంతానములేనివారైనను మరణానంతరము స్వర్గలోకమును పొందుచున్నారు. అంతియే కాదు

**బ్రహ్మచర్య వ్రతము సల్పెడి నైష్టిక బ్రహ్మచారులు ఏ బ్రహ్మ లోకమును పొందెదరో అట్టి బ్రహ్మలోకమును గృహస్థ బ్రహ్మచారులు కూడా పొందుచున్నారు.**

మనోవాక్కాయ కర్మలచే గృహస్థ బ్రహ్మచర్యమును పాటింపవలెను. తక్కిన 3 ఆశ్రమములో ఉండువారు ఎల్లప్పుడు బ్రహ్మచర్యమును పాటింప వలయును.

దైవ విషయములందు భార్యా భర్తలు అనుకూలవంతులై యుండ వలసియుండిన పూర్వజన్మములో ఉభయులున్ను గొప్పదైన పుణ్యము చేసికొని యుండవలయును.

ఓ శుద్ధాత్ముడా! కళాయి లేని పాత్రలో వండిన పులుసు చిలుము పట్టినట్లు ఆత్మశుద్ధి లేనివాని తపోధ్యాన భజన ప్రార్థన పుణ్యకార్యములన్నియు నిష్ఫలములే.

చిల్లుపడిన పాత్ర ఎంత గొప్పదైనను ఎలాగున వంటకమున ఉపయోగపడదో అలాగున యుండును. ఒక రంధ్రము పడినప్పుడే ఉపయోగపడనిచో ఇక నవరంధ్రములు పడియుండిన పాత్ర సంగతి వేరే చెప్పవలయునా?

శుకపిక మయూరాది పక్షివర్గములున్ను ఋతుకాలములో మాత్రమే ప్రవర్తించుచుండును. కావున మనిషి ఎంత పవిత్రముగా ఉండవలయునో అర్థము చేసికొనవలయును.

ఇతరుల అన్నమును తిని జీవించు స్త్రీ పురుషులచే ఏర్పడిన సంతానములు ఎవరి అన్నము తిని ఏర్పడినవో వారి గుణములు కలవారై యుందురు. ఆ సంతానము గూడ వారిదే గాని వీరిది కాదు. ఎందుకనగా అన్నపానముల చేతనే శుక్ల శోణితములు యేర్పడును.

తాపసికి అన్నము పెట్టినందువలనే తపస్సులో సగభాగము గృహస్థునకు చెందుచున్నది.

16 సంవత్సరములు పూర్తిగాని స్త్రీయందు 25 సంవత్సరముల వయస్సు పూర్తిగాని పురుసుడు గర్భాదానము చేసెనేని ఆ శిశువు గర్భములోనే ఆపత్తు పొందగలడు. ఒకవేళ పుట్టినేని ఆ శిశువు శౌరిరేంద్రియములు సరిగా పెరగక పుట్టును.

**దేహ సౌఖ్యమును కోరువారికి పుణ్యప్రాప్తి కలుగదు.**

ఎటులనగా తరచినచో దాని పాలనుండి వెన్న ఎట్లు బయలుపడదో అలాగుననే దేహమునందుండు ఆత్మను దర్శించవలెనన్న శరీర పరిశ్రమ బాగుగా చేయవలెను.

**ఇచ్చట జీవించియున్నప్పుడే అవిద్యచే కలిగెడు నరకమనేడి వ్యాధికి చికిత్స ఎవడు చేయడో అట్టివాడు నిరౌషధమైన పరలోకమును పొంది అవిద్యావ్యాధిని యెటుల కుదిరించుకొనును.**

## విధుర బ్రహ్మచర్యము

గృహస్థాశ్రమమందుండి భార్య పరలోకగతురాలైన పిమ్మట– అలాగునే పతి పరలోకగతుడైన పిమ్మట ఆచరించు బ్రహ్మచర్య వ్రతమును అనుష్టించుట విధుర బ్రహ్మచర్యమనబడును.

ఈ విధుర బ్రహ్మచర్యము చాలా వరకు వానప్రస్థాశ్రమమును పోలియుండును.

భార్యాభర్తలిరువురు ఆత్మశుద్ధి గలిగి విషయ విరక్తితో నివృత్తి మార్గమున జీవింపవలయును.

సామాన్యముగ గృహస్థాశ్రమములో భుజించెడి కట్వాంగ లవణాది ఆహారములను మాని కందమూల ఫలములు గైకొనుచు, గృహమును,

పరిజనమును వీడి, భార్యను పుత్రుల యాధీనములో విడచిగాని, ఆమె కిష్టమున్నచో ఆమెతో గూడగాని వనమునకేగవలయును.

పుత్రులు లేనిచో తగినవారి దగ్గర భార్యనుంచవలయును. లేదా జీవనోపాయమునకు ఏర్పాటు చేసి వెల్లవలయును.

వానప్రస్థము దేనికేర్పడినదనగా గృహస్థాశ్రమమున యుండిన కాలమున అంతఃకరణములో గలిగిన విషయ దోషములు, వాసనలు యుండినచో తపస్సచేత రహితమొనర్చుకొనుటకు ఏర్పడినది.

## ఓంకారము

ఈ ఆత్మ ఓం అన్నది ఒక శబ్దంగా చెప్పినప్పుడు దానితో తాదాత్మ్యం చెప్పుకోవాలి అది భాగాలతో చెప్పినప్పుడు ఆత్మయొక్క పాదాలుగా చెప్పుకోవాలి.




జాగృతావస్థ సంచార స్థానంగా కలిగిన వైశ్వానరుడు ఓంకారము లోని మొదటి అంశమైన 'అ'కారము ఎందుచేతనంటే రెండు అంతటా వ్యాపించి ఉండేవే. రెండూ ఆది ఉన్నవే. ఇది తెలుసుకున్నవాడు కోరినవన్ని పొందగలడు. అందరిలో మొదటివాడు అగుచున్నాడు.

స్వప్నావస్థ సంచారంగా గల స్థానంగా గలవాడు తైజసుడు ఓంకారం లోని రెండవ అంశమైన 'ఉ' కారము ఎందుచేతనంటె అవి రెండు శ్రేష్టమైనవి. మధ్యలో ఉన్నది కనుక దీనిని తెలుసుకున్నవాని జ్ఞానం

వర్ధిలుతున్నది. అందరికి అతడు సమానుడగుచున్నాడు. బ్రహ్మవిదుడు కానివాడు అతని వంశంలో జన్మించడు.

గాఢ నిద్ర సంచారస్థానం గలవాడు ప్రాజ్ఞుడు. మూడవ భాగమైన మ కారము ఎందుకంటె అవి రెండూ కూడ మిగతావాటిని కొలత చూస్తాయి. వాటిని తమలో లీనం చేసుకుంటాయి. ఇది తెలుసుకున్నవాడు అన్నిటిని తనలో లీనం చేసుకుంటాడు.

అంశలు లేని, శబ్ద రహితమైన అమాత్ర లేక అర్ధమాత్రయైన ఓంకారమే **తురీయము.** నాలుగవ పాదము. అది సర్వాతత నిర్వికారమైన సత్త పరమానందము అద్వైతము.

**ఇలా ఓంకారమే ఆత్మ. దీనిని తెలుసుకున్నవాడు తన ఆత్మను (పరమ) ఆత్మలో లీనం చేసుకుంటాడు.**

## XII.

జ్ఞాత అయిన ఆత్మ పుట్టదు చావదు. దేనినుంచి గాని అది పరిణమించదు. దానినుంచి గూడా ఏది పరిణామం పొందదు. శరీరము నశిస్తున్నప్పుడు గూడా జన్మరహితము, అనశ్వరము, శాశ్వతము, సనాతనము అయిన ఈ ఆత్మకు నాశనమనేది లేదు.

చంపేవాడు తాను చంపుతున్నానని, చంపబడినవాడు తాను చంపబడ్డానని భావిస్తే ఆ ఇరువురికి ఆత్మను గురించి సరిగా తెలియదన్న మాట. నిజానికి అది చంపదు, చంపబడదూ.

యముడు నచకేతుని ప్రశ్నకు సమాధానంగా మొదట బ్రహ్మమునకు ప్రతీక బ్రహ్మ సాక్షాత్కారికి ఉపాయమైన ఓంకారాన్ని గూర్చి చెప్పి తరువాత ఆత్మ స్వరూపాన్ని గురించి చెప్పుచున్నాడు.

గీతలో శ్రీ భగవానుడు ఆత్మను గూర్చి ఈ విధముగా వివరించినాడు.

ఆత్మ పుట్టేది కాదు, చనిపోయేది కాదు. అలాగని ఒకప్పుడు ఉండేది మరొకప్పుడు ఉండనిది కూడా కాదు. ఆత్మ జనితమైనది కాదు. ఎప్పుడూ ఒకేలాగ ఉంటుంది. నాశనము లేనిది, సనాతనమైనది, అది చంపదు, చంపబడదు.

## దేహం నశించినా - ఆత్మ నశింపదు.

పరమాత్మ జీవుని శరీర నిర్మాణము గావించియున్నాడు.

- **స్థూల శరీరము**
- **సూక్ష్మ శరీరము**
- **కారణ శరీరము**

పృధి వ్యాధి పంచ స్థూల భూతముల యొక్క పంచీకరణము వల్లను పూర్వజన్మ కృత కర్మ వశమున ఉత్పన్నమై జీవాత్మకు భోగ సాధనమైనది ఈ స్థూల దేహము. ఈ స్థూల దేవాభిమానియగు జీవాత్మ విశ్వుడనబడును. స్థూలార్ధానుభవము కలిగిన ఇది జాగృతావస్థ.

జీవాత్మ ఈ స్థూల శరీరముతో తాదాత్మ్య భావము పొంది చక్షురాది బాహేంద్రియముల ద్వారా పుష్పమాలలు, చందనము, స్త్రీ మొదలగు అనేక స్థూల పదార్థములను సేవించుచుండును. అందువలన ఈ స్థూల దేహమునకు జాగృతవస్థయనెడి ప్రసిద్ధి గలిగినది.

గృహస్థుడు గృహములో నివసించుచు బాహ్య సంసారము నెట్లు నిర్వర్తించునో అట్లే జీవుడీ స్థూల శరీరమునాశ్రయించి నేను చూచు చున్నాను, వినుచున్నాను అను మొదలగు బాహ్య వ్యవహారములను నడుపుచున్నాడు.

# స్థూల శరీర ధర్మములు

జన్మ జరామరణములు, పెరుగుట, చిక్కుట, మొదలగునవియు బాల్య, యౌవ్వన, కౌమార, వార్ధక్యావస్థలును, వర్ణాశ్రమాది నియమములును నానావిధ రోగానుభవము, ఇతరులచే పూజింపబడుట, అవమానింపబడుట మొదలగు విశేషములన్నియు స్థూల శరీర ధర్మములు.

# సూక్ష్మ శరీరము

- **వాగాది కర్మేంద్రియ పంచకము**
- **శ్రవణాది జ్ఞానేంద్రియ పంచకము**
- **ప్రాణాది వాయు పంచకము**
- **ఆకాశాది భూత పంచకము**
- **అంతఃకరణ చతుష్టయము**
- **అవిద్య**
- **కామము**
- **కర్మము**

అను ఈ 8 గూడియే సూక్ష్మ శరీరమనబడును.

జీవునియొక్క ఈ విభక్త్యవస్త స్వప్నమనబడును. ఈ స్వప్నావస్థ యందు సూక్ష్మశరీరము మాత్రమే శేషించియుండి భాసించుచుండును. స్వప్నమందు బుద్ధి జాగృతావస్థ యందు అనుభవించిన విషయముల యొక్క నానా ప్రకార సంస్కారములచేత కర్తృత్వాది భావములను చెంది స్వయముగా ప్రకాశించును.

అజ్ఞానమే కారణ శరీరము

**"స్థూల, సూక్ష్మ, కారణ శరీరములకు విలక్షణమై, ఈ శరీరాదులకు సాక్షియై నిలిచి చైతన్యము కలిగించు సచ్ఛిదానంద స్వరూపమే ఆత్మ"**

**ప్ర:- సర్వము భగవంతుడే ఐన ఎడల ఇక పుణ్యపాపములనునవి లేవా?**

ఉండనూ ఉన్నవి, లేను లేవు.

మనలోని అహంకారమునాతడు నిలిపియుండునంత వరకు ద్వైత భావమును, పుణ్యపాప విచక్షణను కూడా నిలిపియుంచును. కాని ఒక్కొక్కప్పుడాతడు అతని అహంకారమును నిర్మూలించును. అట్టివారు సమస్థ పుణ్యపాపములకు అతీతులగుదురు.

నరునకు బ్రహ్మసాక్షాత్కారము కానంత వరకు ద్వైత భావము, పుణ్యపాప విచక్షణము ఉండితీరవలయును.

పుణ్యపాపమును, కీడు మేళ్ళును సర్వము నీకు సమానమే యనియు భగవంతుడేది చేయించిన అదియే చేయుచున్నావనియు నీవు చెప్పవచ్చును. కాని అవియన్నియు వట్టి చిలుకపలుకలనియు నీ అంతరంగమున ఎరింగియే యుందువు. నీవేదేని దుష్కార్యము చేయగనే నీ అంతరాత్మ నిన్ను బాధించుచునే యుండును.

**ప్ర:- ఏ పని చేయుటకైనను భగవంతుడే ప్రేరేపించు పక్షమున నా పాపమునకు నేనుత్తరవాదిని కాదు కదా?**

ఉ॥ ధుర్యోధనుడు ఇట్లే చెప్పినాడు- ఓ సర్వేశ్వరా నీవే నా హృదయాంతర్వర్తివి. నీవేమి చేయించిన నేనది చేయుచున్నాను. కాని భగవంతుడే కర్తయనియు తాను నిమిత్తమాత్రుడుననియు నిజముగా నమ్మువాడెట్టి పాపమును చేయజాలడు.

పరిపూర్ణుడైన నర్తకుడెప్పుడును తప్పు చేయడు. నిజమునకు హృదయము పరిశుద్ధము ఐనవాడే కాని భగవంతుడున్నాడని కూడా నమ్మజాలడు.

**ప్ర:- స్వామి నాదొక సందేహము.**

**మనకు స్వేచ్ఛ కలదందురు. అనగా ధర్మము కాని, అధర్మము కాని మరేదికాని మన ఇష్టానుసారము చేయగలమందురు. నిజముగా మనకు స్వాతంత్రము కలదా?**

సర్వము భగవత్సంకల్పితమే. భగవత్సంకల్పము ననుసరించియే సర్వము నడుచును. ఇదంతయు దాని లీల. అతడు మనచేత అనేక విధముల అనేక కార్యములను- మంచివి, చెడ్డవి, ఉత్తమమైనవి, నీచమైనవి చేయించుచున్నాడు. వీటన్నిటికి మూలమాతడే. యోగ్యులు, అయోగ్యులు ఎల్లరునూ వాని మాయయే. వాని లీలయే.

బ్రహ్మ సాక్షాత్కారము కానంతవరకు జీవుడు తాను స్వతంత్రుడను కొనును. కాని సాక్షాత్కారము తరువాత అతడు మనః పూర్వకముగా ఇట్లు భావించును. దేవా! నేను యంత్రమును- నీవు గృహాధిపతివి. నేను రధమును - నీవు రధికుడు. నీవు నన్నెట్లు నడిపిన నేనట్లు నడుచుదును.

దేవుడే దొంగను పోయి దొంగతనము చేయుమని ప్రేరేపించును. మరియు దొంగను గూర్చి జాగ్రత్త పడుమని గృహస్థుని అతడే హెచ్చరించును.

భగవంతుడిట్లనును:

**కాటువేయు పామును నేనే**
**విషము తొలగించు మాంత్రికుడను నేనే**
**శిక్షలను విధించు ధండనాధికారిని నేనే**
**ఆ శిక్షలనమలుపరుచు కింకరుడను నేనే**

## XIII.

సూక్ష్మాతి సూక్ష్మమైన అనువుకంటె చిన్నది బ్రహ్మాండానికంటె ఘనమైనది అయిన ఆత్మ ప్రాణుల హృదయాలలోనే ఉన్నది. కామనా రహితుడు, శోక రహితుడై ఇంద్రియాల యొక్క మనస్సు యొక్క పవిత్రత ద్వారా ఆత్మ మహిమను సాక్షాత్కారించుకుంటాడు.

కదలకుండా కూర్చున్నా అతడు ఎంతో దూరం ప్రయాణిస్తాడు. పడుకునే ఉన్నా అతడు సకల ప్రదేశాలకు పోతాడు. ఆనందమయుడు, ఆనంద రహితుడు అయిన ఆ జ్యోతిర్మయిని నేను తప్ప ఎవరు తెలుసుకొనగలరు?

**కామనా రహితుడు :** ఇహ జీవితంలో, పరజీవితంలో కూడా సుఖాలనీ, కోరికలను త్యజించినవాడు.

**ఇంద్రియ–మనః పవిత్రత :** సాధనా చతుష్టయము.

**కదలకుండా కూర్చునే యున్నా:–** కేవలం స్వరూపంలో ఆత్మ ఇంద్రియాతీతము, గతి రహితము అయినా సాపేక్షంగా అది గతి స్వరూపము సర్వవ్యాప్తి అవుతున్నది.

**ఆనందమయుడు ఆనంద రహితుడు:–** సాపేక్షిక దృష్ట్యా ఆత్మ ప్రపంచాన్ని అనుభవించి ఆనందిస్తుంది. కేవల స్వస్వరూపంలో సాక్షి మాత్రమే. అంచేత ఆనంద నిరానందాలకు అతీతం.

## సమాధి – బ్రహ్మ సాక్షాత్కారము

కుండలిని ప్రబోధము గాంచినగాని ఆత్మ ప్రబోధము కలుగదు. కుండలిని శక్తి మూలాధారమున నిద్రాణమైయుండును. ఆమె మోల్కాంచి నప్పుడు సుషుమ్నయందు ప్రవేశించి స్వాదిష్టాన మణిపూరకాది

పద్మముల గుండా పోయి తుదకు సహస్రారమును చేరును. అపుడు సమాధి స్థితి కలుగును. దీనిని ప్రత్యక్షముగా కంటిని. అప్పుడు బ్రహ్మ దర్శనమగును.

కుండలిని ప్రబోధమును వర్ణించుచు శ్రీ గురుదేవుడొకప్పుడిట్లు పలికెను. ఒడలు జల్లుమన ఒకానొక శక్తి పాదముల నుండి శిరస్సున కెగురును. అది మెదడును చేరకుండునంతవరకు నాకు బాహ్య స్ఫురణ యుండును. కాని యది మెదటిని చేరినంతనే బాహ్య ప్రపంచ స్ఫురణ శూణ్యమగును. చూచుటయు, వినుటయు ఆగిపోవునప్పుడిక మాటలాడు మాట చెప్పెడిదేమి? ఇక మాటలాడు వారెవరు నీవు నేను అను విచక్షణయే అదృశ్యమగును. (హృదయమును, కంఠమును చూపుచు) లేదా ఇంతవరకును గూడా ఆ మహాశక్తి వెలువడినప్పుడు నాకు గోచరించునట్టియు, అనుభూత మగునట్టిదియు విషయములనన్నిటిని మీకు చెప్పవలెనని నేనొక్కొక్కప్పుడు అనుకొనుచుందును. (కంఠమును చూపుచు) కాని దీనిని దాటి యాశక్తి ఇంకను పైకి వెడలినంతనే ఎవ్వరో నా నోటిని మూసినట్లగును. ఇక నా స్వాధీనత తప్పిపోవును. కుండలిని కంఠమును దాటి వెడలునప్పుడు నాకు కలుగు అనుభవమును మీకు తెలుపవలెనని, నిశ్చయించుకొందును. కాని అట్లు నిశ్చయించుకొనగానే మనస్సు (శిరస్సు) వైపునకు పోవును. ఇక అంతటితో సరి గురుదేవుడనేక పర్యాయములు ఈ స్థితిని వర్ణింప ప్రయత్నించెను. కాని ఎన్నడును కృతార్థుడు కాలేదు. ఒకనాడు తన యెదుట ఉన్నవారికి ఈ యనుభవమును వర్ణింప నిశ్చయించుకొని కుండలిని శక్తి కంఠమును చేరు వరకు తన వర్ణనను సాగించెను.

భ్రూమధ్య భాగమున కవ్వలివైపున నుండు ఆజ్ఞచక్రమును చూపుచు ఇట్లు వచించెను– మనస్సు ఇచ్చుటికి వచ్చినంతనే పరమాత్మ

దర్శనము లభింప సమాధిస్థితి కలుగును. అపుడు జీవునకు పరమాత్మకు నడుమ పలుచని పొర మాత్రముండునని చెప్పనగును. అందుండి సర్వము గోచరించుచుండును. సవివరముగా ఆ స్థితిని వర్ణింప ప్రయత్నించుచుండగనే సమాధి స్థితుడాయెను. మనస్సు కొంచెము క్రిందకు దిగి వచ్చినంతనే అనగా బహిఃప్రజ్ఞ కలుగ నారంభించినంతనే మరల ప్రయత్నించెను. కాని మరల సమాధి నిమగ్నుడాయెను. ఇట్లు అనేక పర్యాయములు విఫల మనోరథుడై తుదకు గురుదేవుడు గుడ్లనీరు పెట్టుకొని ఇట్లు వచించెను. ఏమున్నది కొంచెమైనను దాపరికము లేకుండ అంతయు మీకు చెప్పుటకై నేనెంత మనఃపూర్వకముగ ప్రయత్నించినను అమ్మ నన్ను మాత్రము అటులచేయనీయకున్నది. నా నోరు మూసివేయుచున్నది.

కుండలిని శక్తి బయల్వెడలి మెదడును చేరు వివిధ మార్గములను సూచించుచు శ్రీ గురుదేవుడు ఇట్లు వచించినాడు- ఒడలు జల్లుమన మెదడు జారు ఆ శక్తి ఎల్లప్పుడు ఒకే గమనము అనుసరింపదు. శాస్త్రములు ఆ శక్తి 5 విధములైన గమనములను కలిగియుండునని తెల్పును.

**1) పిపీలికాది గమనము :** నోటిలో ఆహారము నిడుకొని చీమల బారుపైకి పోవుచున్న రీతి పాదముల నుండియేదియో మెల్లిగా పైకి ప్రాకి పోవుచున్నట్లు తోచును. కాని అది శిరస్సును చేరినంతనే సాధకుడు సమాధిస్థితిని పొందుచున్నాడు.

**2) మండూక గమనము :** కప్ప వడివడిగా చిన్నచిన్న రెండు మూడు దూకులు దూకి కొంచెముసేపాగి మరల గమనము ప్రారంభించు నటుల ఏదియో పాదము నుండి మొదటివైపుకు పోవుచున్నట్లు తోచును. ఇయ్యది మొదటిని చేరినంతనే సమాధి స్థితి కలుగును.

**3) సర్పగమనము :** తిన్నగా గాని, చుట్టచుట్టికొనిగాని, పాము పడియుండి ఎదుట తన ఆహారము కాన్పించగనే గాని, లేదా ఏదేని భయముతోచినంతనే వంకర టింకరగా ప్రాకిపోవునటుల కుండలిని శక్తి మొదటివైపునకు పరిగెడును. అంతట సమాధిస్థితి కలుగును.

**4) విహంగ గమనము :** పక్షి ఒకచోట నుండి మరియొక చోటికి ఎగురునపుడు రెక్కలనల్లార్చుచు ఒకప్పుడు ఎగువను మరొకప్పుడు దిగువను పోవుచు ఏమైనను గమ్యస్థానము చేరువరకు ఆగకుండనటుల ఆ శక్తి బయల్వెడలి మెదటిని జేరును. అంత సమాధి స్థితి కలుగును.

**5) మర్కట గమనము :** చెట్టు నుండి చెట్టునకు పోవునపుడు కోతి యొక కొమ్మనుండి మరియొక కొమ్మకు చెంగున దూకి రెండు మూడు దూకులలో గమ్యమును చేరునటుల కుండలిని మెదటిని చేరుచున్నట్లు యోగికి అనుభూతమగును. అంతట సమాధిస్థితి కలుగును.

శ్రీ గురుదేవుడీ అనుభవమును వేదాంత దృష్టిననుసరించి ఈ విధముగా వివరించుచున్నాడు. వేదాంతము సప్త భూమికల గూర్చి తెలుపును.

ప్రతీ భూమిక యందును సాధకుడు ప్రత్యేకమగు దివ్య దర్శనము లేక దివ్యానుభూతి కలుగును.

మానవుని మనోవ్యాపారము సహజముగా మూలాధారము, స్వాదిష్టానము, మణిపూరకము అను దిగువ మూడు చక్రములయందు మాత్రమే బద్ధమైయుండ ప్రవర్తించుచుండును. వీనిలో గొప్పది నాభి కెదురుగా యుండు మణిపూరకము. అందుచేత మనస్సు ఆహార నిద్రాదికములగు సామాన్య పశుధర్మముతో సంతుష్టి నొందుచుండును.

కాని అది హృదయమునకెదురుగా యుండు నవాహతమును చేరినంతనే దివ్య జ్యోతి యొక్క దర్శనము కలుగును. ఐనను సాధకుడు

ఈ స్థితి నుండి తరచు పతనము చెంది దిగువ మూడు చక్రముల వ్యాపారములలో పడుచుండును. కాని మది హృదయమునకు పైనగల విశుద్ధ చక్రమును చేరునపుడిక సాధకుడు భగవదన్యవిషయముల గూర్చి మాటలాడజాలడు. నేనీ స్థితిలో యుండినపుడు ఎవ్వరైనను ప్రాపంచిక గొడవలను గూర్చి ఏకరువు పెట్టిన పక్షమున నెత్తిపై ఎవ్వరో అమాంతముగా కొట్టినట్లుండెడిది. ఈ బాధ లేకుండ నేనపుడు పంచవటికి పోయి ఏకాంతమైన స్థలమున దాగియుండెడివాడను. లౌకికులు కాన్పించినంతనే పారిపోయెడివాడను. బంధువులు నా దృష్టికి– అందుబడినచో– మరల వెలువడుటకు వీలుకాని– పాతాళము వలె కన్పించువారు. వారి యెదుట నాకు ఊపిరి సలుపకుండెడిది. ప్రాణము పోవుచున్నట్లనిపించెడిది. వారి బారి నుండి తప్పించుకొనిపోయినప్పుడే నాకు మనశ్శాంతి కలిగెడిది. ఈ స్థితి పొందినను గూడ సాధకుడు దిగువ 3 చక్రములలోనికి పతనము నొందవచ్చును. కాబట్టి అతడు సదా జాగరూకుడై యుండవలయును.

కాని భ్రూమధ్యమున యుండు ఆజ్ఞాచక్రమును మనస్సు చేరిన పిమ్మట అపుడాతడు పరమాత్మ దర్శనము పొంది సదా సమాధిస్థితుడై యుండును. ఈ స్థానమునకు అత్యున్నతమగు సహస్రారమునకును నడుమ పలుచని పొర మాత్రముండునని చెప్పవచ్చును. పరమాత్మకు అపుడాతడు అత్యంత సన్నిహితుడై యుండుట చేత వానియందాతడు లీనమైనట్లు భావించును. కాని యాతడు ఇంకను లీనము కాలేదు. ఐక్యము నొందలేదు.

ఈ స్థితి నుండి మనస్సు ఐదవదియగు విశుద్ధ చక్రమునకు లేదా అంత పుట్టిమునక వచ్చినచో నాల్గవదియగు అనాహిత చక్రమునకు దిగవచ్చును. కాని అది అంతకంటె క్రిందకు దిగదు.

జీవుల తరగతిలోని వారగు సామాన్య సాధకులు ఈ స్థితిని పొందినచో మరల క్రిందికి అనగా బహిః ప్రజ్ఞకు రాజాలరు. 21 దినములు నిరంతర సమాధి స్థితులై యుండి అటుపిమ్మట ఆ పలుచని పొరను ఛేధించుకొని పరమాత్మతో శాశ్వతముగా ఐక్యత పొందుదురు.

**సహస్రారమున జీవాత్మ పరమాత్మల ఐక్యమే సప్త భూమికను పొందుటయని చెప్పుదురు.**

## XIV.

శరీర రహితము, సర్వవ్యాప్తి అయిన పరమాత్మను అన్ని శరీరాలలోను ఉన్నవానిని తెలుసుకొని ప్రజ్ఞావంతుడు శోకం నుండి విముక్తుడవుతాడు.

ఈ ఆత్మ

1) అంతరమైన చేతనా కాదు (స్వప్నావస్తతో లేక తైజసునితో పోల్చినపుడు)

2) బహిరమైన చేతనా కాదు (జాగృతావస్థతో లేక వైశ్వానరుడితో పోల్చినపుడు)

3) ఈ రెండు చేరిన అవస్థ కాదు.
(రెండు అవస్థల మధ్య స్థితి కాదు)

4) అస్పష్టమైన చేతనా కాదు (సుషుప్తితో పోల్చినపుడు)

5) సమిష్టి చేతనా కదు.

6) అచేతనా కూడా కాదు :– చైతన్య రాహిత్యంతో పోల్చినపుడు.

7) అది కనిపించదూ

8) ఇంకొక దానితో సంబంధం పెట్టి చెప్పడానికి వీలులేదు.

9) దానిని మనస్సు గ్రహించలేదు

10) ఊహించ శక్యము కాదు.

11) గుర్తులు చెప్పి నిర్ణయించడానికి వీలు కాదు.

12) వర్ణించడానికి వీలుపడదు.

13) జాగృత్, స్వప్న, సుషుప్తులు మూడింటికి సామాన్యమైన ఒకే ఆత్మ తత్వసారం అది.

14) అన్ని వికారాలు అందులో ఆగిపోతాయి.

15) అదే శాంతము

16) అదే శివము

17) అదే అద్వైతము

18) అదే విష్ణువు

19) అదే ఆత్మ

**ఓ నచకేతా! నీవు తెలుసుకోవలసినది అదే!**

గీతలో శ్రీకృష్ణ పరమాత్మ అర్జునునకు పరమాత్మ స్వరూపమును ఈ క్రింది విధముగా వర్ణించెను.

అర్జునా! నాయొక్క ప్రభావము దేవగణములకు, మహర్షులకును దెలియదు. దేవతల, మహర్షుల ఆవిర్భావమునకు ఆది కారణమైనవాడను నేనే కదా!

జన్మయు, ఆదియు లేనివాడును, సర్వలోక ప్రభువగు నన్ను ఎవడు తెలుసుకొనుచున్నాడో వాడు అజ్ఞానమును వీడినవాడై సర్వ కల్మషముల నుండి విడువబడుచున్నాడు.

నిశ్చయ జ్ఞానము, తత్వజ్ఞానము, అప్రమత్తతయు, సహనమును, సత్యము, దమము, శమము, సుఖము, దుఃఖము, భయము, అభయము, అహింస, సమత్వము, సంతృప్తి, తపస్సు, దానము, కీర్తి, అపకీర్తి, మొదలగు వివిధ భావములు నావలననే కలుగుచున్నవి.

లోకమునందలి ఈ జనులు ఎవరియొక్క సంతతి అయి ఉన్నారో, అట్టి పూర్వికులైన సప్త మహర్షులును, సనకాది దేవర్షులును, స్వయంభువు మనుషులును నా భావము కలవారై నా మానసపుత్రులై జన్మించిరి.

నాయొక్క ఈ ఐశ్వర్యమును, యోగమును యదార్థముగా ఎవరు తెలుసుకొనుచున్నాడో అతడు నిశ్చలమగు యోగముతో కూడినవాడగు చున్నాడు.

ఈ జగత్తంతయు నావలననే జనించినదనియు, నా వలననే నడుచు చున్నదనియు గ్రహించిన జ్ఞానులు నన్నే సేవించుచున్నారు.

నాయందే మనస్సును, ప్రాణమును లగ్నము చేసి, నన్ను గురించి బండొరులు ముచ్చటించుకొనుచు, భోధించుకొనుచున్నవారలై సదా బ్రహ్మానందమును బొందుచున్నారు.

సదా యోగయుక్తులై నన్ను ప్రీతితో భజించువారికి నన్ను పొందగల బుద్ధి యోగమును అనుగ్రహించుచున్నాను.

ఓ అర్జునా! దివ్యములగు నా విభూతులను ప్రాధాన్యతననుసరించి నీకు చెప్పెదను. నా విభూతుల కంతులేవు.

సకల భూతముల యొక్క హృదయమునందున్నటువంటి ఆత్మను నేనే. భూతముల యొక్క ఉత్పత్తి, స్థితి, లయములకు కారకుడను నేనే.

నేను ఆదిత్యులలో విష్ణువును, జ్యోతులందు సూర్యుడను, మరుత్తుల యందు మరీచిని, తారలయందు చంద్రుడనయి ఉన్నాను.

వేదముల యందు సామవేదమును, దేవతల యందు ఇంద్రుడను, ఇంద్రియముల యందు మనస్సును, భూతముల యందు చేతనాశక్తినయి ఉన్నాను.

నేను రుద్రలయందు శంకరుడను, యక్షుల యందు, రాక్షసుల యందు కుబేరుడను, వస్తువుల యందు అగ్నిహోత్రుడను, పర్వతముల యందు మేరు పర్వతమునయి ఉన్నాను.

అర్జునా! నేను రాజపురోహితులలో ప్రముఖుడైన బృహస్పతిని, సేనాధిపతులలో కుమారస్వామిని, సరస్సులలో సాగరుడనయి ఉన్నాను.

మహర్షులలో భృగుమహర్షిని, వాక్కులలో ఏకాక్షరమగు ఓంకారమును, యజ్ఞములలో జపయజ్ఞమును, స్థావరములలో హిమాలయా పర్వతమునయి ఉన్నాను.

వృక్షములలో రావిచెట్టును, దేవర్షులలో నారధుడను, గంధర్వులలో చిత్రరథుడను, సిద్ధులలో కపిలమునిని నేనే.

గుఱ్ఱములలో ఉచ్ఛైశ్వమును, ఏనుగులలో ఐరావతమును, నరులలో రాజుగాను నన్ను తెలిసికొనుము.

ఆయుధములలో వజ్రాయుధమును, గోవులలో కామధేనువును, సంతానకరుడగు మన్మధుడను, సర్పములలో వాసుకిని నేనే అయి ఉన్నాను.

నేను నాగులలో అనంతుడను, జలదేవతలలో వరుణుడను. పితృదేవతలో ఆర్యముడను, సంయమనము చేయువారిలో యముడను నేనే అయి ఉన్నాను.

దైత్యులలో ప్రహ్లాదుడను, గణితశాస్త్రములో కాలమును, మృగములలో సింహమును, పక్షులలో గరుత్మంతుడను నేనే అయి ఉన్నాను.

పవిత్రము చేయువారిలో నేను వాయువును, ఆయుధధారులలో శ్రీరాముడను, చేపలలో మొసలిని, నదులలో గంగానదిని నేనే అయి ఉన్నాను.

అర్జునా! సకల సృష్టులకును ఆదిమధ్యాంతములును నేనే, విద్యలలో ఆత్మవిద్య, వాదించువారిలో వాదమును నేనే.

అక్షరములలో అకారమును, సమాసములలో ద్వంద్వ సమాసమును, అనంతమైన కాలమును, అనంతముఖములు గల ధాతను నేనే అయి ఉన్నాను.

నేనే సర్వ సంహారకరుడైన మృత్యువును, జనించబోవు వారలకు జన్మమును అయి ఉన్నాను. స్త్రీలలో కీర్తి, సంపద, వాక్కు, స్మృతి, బుద్ధి, ధైర్యము, ఓర్పును నేనే.

సారవేదములలో బృహత్సామమును, ఛందస్సులలో గాయత్రియును, మాసములలో మార్గశిర మాసమును, ఋతువులలో వసంత ఋతువును నేనైయున్నాను.

మోసకారుల జూదమును, తేజోవంతుల యొక్క తేజస్సును అయి ఉన్నాను. నేను జయశీలుర జయమును, ప్రయతమును, సాత్వికుల యొక్క సత్వగుణమును నేన అయి ఉన్నాను.

నేను యాదవులలో శ్రీకృష్ణుడను, పాండవులలో అర్జునుడను, మునులలో వ్యాసుడను, కవులలో శుక్రాచార్యుడను అయి ఉన్నాను.

నేను దండించువారియొక్క దండమును, జయశీలుర యొక్క నీతిని, రహస్యములలో మౌనమును, జ్ఞానవంతులలో జ్ఞానము నేనై యున్నాను.

అర్జునా! సకల భూతములకు బీజమును నేనే. ఈ చరాచర స్వరూపమైన భూత సమూహము నందు నేను మినహా ఏదియును లేదు.

అర్జునా! నాయొక్క దివ్య విభూతులకు అంతము లేదు. నా విభూతుల యొక్క ఈ వివరణము సంక్షేమముగా చెప్పబడినది.

విభూతి యుక్తమును, కాంతియుతమును, ఉత్సాహవంతమును, అగు వస్తువు ఏది కలదో అది నాయొక్క అంశము వలన కలిగినదానిగ నీవు ఎరుగుము.

**విశేషమైన నా ఈ విభూతులను తెలియుటచేత నీకు ఏమి లాభము? ఈ సమస్త జగత్తును ఒక్క అంశముచేతనే నేను వ్యాపించి యున్నాను.**

# XV.

వేదాధ్యయనం చేతగాని, బుద్ధి కుశలత చేతగాని, అపారమైన పాండిత్యము చేతగాని ఈ ఆత్మ పొందబడదు. అది ఎవరిని వరిస్తుందో, ఎన్నుకుంటుందో, అతని చేతనే ఆత్మ పొందబడుతుంది. ఇది అంటె – అతనియొక్క ఆత్మయే తనయొక్క నిజ స్వరూపాన్ని వెల్లడిస్తుంది.

చెడు నడతల నుండి విరమించనివారు, ఇంద్రియ లౌల్యాన్ని నిగ్రహించుకోలేనివారు, ధ్యానపరులు కానివారు, ప్రశాంతత చెందిన మనస్సు లేనివారు, జ్ఞానం చేత కూడా దీనిని పొందలేరు.

పైవాక్యానికి అర్థం, సాధకుడు అన్వేషించే ఆ ఆత్మచేతనే ఎన్నుకోబడుతుంది. వివరంగా చెబితే ఆత్మను తప్ప మరి ఏ ఇతరాన్ని కోరని సాధకుని ఆత్మ చేత ఆత్మ సాక్షాత్కృతం అవుతుంది. కాని అద్వైతేతరులైన వ్యాఖ్యాతలు భగవంతుడు ఎవరిని ఎన్నుకుంటాడో అతనిచేత మాత్రమే అది పొందబడుతుందని వ్యాఖ్యానిస్తారు.

**ఇది అంటె అతని యొక్క ఆత్మయే :-**

తనలో ఉన్న ఆత్మయే తన నిజస్వరూపాన్ని అతనికి వెల్లడిస్తుంది.

## ఇదే ఆత్మ సాక్షాత్కారము

జ్ఞానం చేత కూడా దీనిని పొందలేరు. అటువంటి వారికి ఆత్మను గూర్చి స్ఫూర్తి కూడా అసంభవము.

కావున సాధకుడు భగవంతుని అనుక్షణము ఈ విధముగా వేడుకొనవలయును.

దేవా! మీరు భక్తవత్సలురు. మీరు తప్ప మాకింకెవరు దిక్కు. మిమ్ములనే ఆశ్రయించితిమి.

ఓ శ్రీనివాసా! ఓ పరమేశ్వరా!

మమ్ము

1) అసత్తు నుండి సత్తునకు కొనిపొమ్ము

2) తపస్సు నుండి జ్యోతిలోనికి కొనిపొమ్ము

3) మృత్యువు నుండి అమృతత్వమునకు కొనిపొమ్ము

ఇదియే మా వినతి – నీదరి చేర్చుకొనుము.

ఒకనాడు కేశవ చంద్రసేనుడు దక్షిణేశ్వరాలయమున నున్న శ్రీరామకృష్ణులను సందర్శించి ఇట్లు ప్రశ్నించెను. పండితులు పెట్టెల కొలది గ్రంథములను చదివియు నిజముగా పారమార్థిక విషయములు వచ్చుసరికి పరమ పామరులై యుండుటకు కారణమేమి?

అంత శ్రీగురుదేవుడిట్లు సమాధాన మొసంగెను– గ్రద్దలు, రాబందులును ఆకాశమున ఎంతయో ఎత్తున కెగురును కదా! కాని వాని కన్నులు మాత్రము కృళ్ళి కంపుకొట్టు శవములమీదను, మురికి గుంటల మీదను నిలిచియుండును. ఆ విధముననే ఎన్ని శాస్త్రములు చదివినను, ఎంత పాండిత్యము సంపాదించినను పండితంమన్యుల మనస్స కామిని కాంచనములును, ఐహిక విషయములయందే లగ్నమై యుండును. అందుచే వారికి బ్రహ్మజ్ఞానము అలవడదు.

**అంతఃకరణమును శుద్ధి చేయునదియే అసలైన విద్య. మిగిలిన దంతయు అవిద్య.**

కేవల గ్రంథ పాండిత్యము వలన ప్రయోజనమేమి. పండితులు వందల కొలది శ్లోకములను ఏకరువు పెట్టవచ్చును. కాని వానిని ఊరక వల్లించిన మాత్రమున లాభము లేదు. శాస్త్రములందలి తత్వములు జీవితమున ఆచరణములోనికి రావలయును. కామిని కాంచన మోహితుడై సంసార బద్ధుడై యున్నంతవరకు కేవల శాస్త్ర పఠనము వలన జ్ఞానము కాని ముక్తికాని లభింపదు.

ఏదైనా వస్తువులు కావాలని ఎవరైనా మనకు ఉత్తరం రాస్తే ఆ ఉత్తరం చదివి అవతల పారేస్తాం. బజారుకు పోయి ఆయా వస్తువులు సేకరించే ప్రయత్నము చేస్తాము. అంతేకాని రోజు ప్రొద్దున్నే లేచి ఆ ఉత్తరాన్ని పారాయణం చేస్తూ కూర్చోము కదా! అలాగే

**శాస్త్రాలన్నీ మోక్షానికి మార్గాలేమిటో మనకు చెబుతాయి.**

ఆ మార్గం తెలుసుకున్నాక నడుం బిగించి ఆ మార్గాన్ని అనుసరించితే ప్రయోజనం గాని ఆ మార్గాన్ని గూర్చి తర్క వితర్క, వాదోపవాదనలు చేస్తూ కాలాయాపనం చేయడం నిరర్థకమే కదా! మహా అయితే పైన చెప్పిన ఉత్తరంలోని సంగతులు మరిచిపోతే కంగారుగా ఆ ఉత్తరం కోసం మళ్ళీ వెతికి దానిని ఎలాగు చదువుతామో అలాగే మోక్షమార్గాన్ని అవలంభిస్తున్నపుడు మనకు కలిగే సంశయాలను తీర్చుకొనడానికి అప్పుడప్పుడు పరిశీలించవచ్చును.

మన పండితంమన్యులు మహా డాంబికంగా మాటలాడెదరు. బ్రహ్మమని, బ్రహ్మము అవ్యక్తమని, జ్ఞాన యోగమని, తత్వశాస్త్రమని వేదాంతమని ఏమేమో పలికెదరు. కాని వానియొక్క అనుభవమును పొందినవారు మాత్రమే **పూజ్యమని** చెప్పవచ్చును. మన పండితం మన్యులు శుష్క హృదయులు, సారక్షీణులు.

స, రి, గ, మ, ప, ద, ని అని ఊరక నోటితో అనుట తేలికయే కాని వానిని ఒక వాద్యము మీద పలికించుట కష్టము. అటులనే

**మత ధర్మములను గురించి మాటలాడుట సులభమే కాని ఆచరించుటయే దుర్లభము.**

చిలుక రాధాకృష్ణ నామమును పలుకుచుండును. కాని పిల్లి నోట చిక్కినప్పుడు మాత్రము కీచుకీచుమనును. అపుడు దాని సహజమైన కూతయే బయలుపడుచున్నది.

లౌకికులు ఐహిక ఫలములను బడయుటకై ఒక్కొక్కప్పుడు హరినామ స్మరణము చేయుదురు. పుణ్యకార్యములును, దాన

ధర్మములను కూడా సాగించుచుందురు. కాని దురదృష్టవశమున దుఃఖమో, దారిద్ర్యమో, మరణమో సంభవించునపుడు ఆ హరినామ స్మరణమును, ఆ నియమ నిష్ఠలను మంటగలుపుదురు.

భగవద్భక్తి పుస్తకములను చదువుట వలన లభించునా?

పంచాంగములో ఒకానొక దినమున ఇరువది దుక్కుల వాన కురియునని వ్రాయబడినది కాని ఆ పంచాంగమును మెలిపెట్టి పిండుటచే ఒక్కచుక్క వానయైనను వచ్చునా? అదే విధమున శాస్త్రములలో అనేక సద్వాక్యములు ఉండవచ్చును కాని వానిని పఠించినంత మాత్రమున ఎవ్వడు పారమార్థికుడు కాజాలడు. నీవా శాస్త్రముల యందు చెప్పబడిన ధర్మములను అనుష్టింపవలయును.

పరమేశ్వరుని మ్రోలయుక్తి, ధీశక్తి, పాండిత్యము – ఇవి ఏవియు కొరగావు. అచట

**మూగవాడు మాటలాడును**

**గ్రుడ్డివాడు చూచును**

**చెవిటివాడు వినును**

కేవలము శాస్త్రములు చదివి ఈశ్వరుని తత్వమును నిరూపింప బూనుట కేవలము కాశీ పఠమును చూచి కాశి యెట్టిదో ఇతరులకు వర్ణింపబూనుట వంటిది.

గంజాయి యను మాటను వేయిసార్లు ఉచ్చరించినను గంజాయి యొక్క మత్తు కలుగదు. కొంచెము గంజాయి తెచ్చి నీరు మొదలగు వానితో కలిపి నూరి యా రసమును త్రాగుము. అపుడు నిజముగా నీకు నిషా కలుగును.

దేవుడా! దేవుడా! యని దేవులాడుట వలన ఏమి లాభము? శ్రద్ధా భక్తులతో సాధన చేయవలయును. అప్పుడా దేవుని దర్శనము కలుగును.

**గ్రంథములు –** గ్రంథములు మనలను బాధించుచుండును. తరచుగా ఈ యర్థమే వారికి చెల్లును, గర్వమునంతయు విడిచి సత్యమును గ్రహింపవలయును.

**తీవ్ర వాంఛతో చదువని యెడల గ్రంథ పఠనము దుష్పాండిత్యము అహంభావము మొదలగునవి పెంచును. హృదయమున అవి గ్రంథులై బాధించును.**

**గర్వముతో ఉబ్బిపోవు వాని హృదయమున ప్రార్థనలును-ధ్యానములును ఫలవంతములు కాజాలవు.**

## XVI.

బ్రాహ్మణ క్షత్రియులు ఎవరికి ఆహారము ఎవరికి ఆహారమో మృత్యువు ఎవరికి అంజుకొనువచ్చుడో ఆ ఆత్మ ఎక్కడ ఉన్నదో ఎవరికి ఇలా తెలుసు.

పూర్తిగా శరీర బుద్ధిగల అజ్ఞాని ఆ ఆత్మను గురించి పరమమైన ఏకైక సత్తను గూర్చి తెలా తెలుసుకోగలడు? ఆ సత్తలో జాతి మతాది భేదాలన్నీ లయిస్తున్నవి. దాని భావనలో మృత్యువు కూడా నశిస్తున్నది కదా!

**ఇవరికి ఇలా తెలుసు :–** ముందు చెప్పబడిన అర్హతలు కలవాడు తప్ప ఈ ఆత్మను ఇక ఎవరు తెలుసుకోగలరు?

1) జాగృత్ స్వప్న సుషుప్తుల యందు ఏ చైతన్యము విరాజమానము అగుచున్నదో, ఆ బ్రహ్మ పిపీలికా పర్యంతము ఏ చైతన్యము సాక్షియైయున్నదో అట్టిది తానైనవాడు, నేను చైతన్యమునే గాని జడమును గాను అను జ్ఞానము ఎవరికియున్నదో అతడు భండాలుడే గాక లేక ద్విజుడే గాక! అతడే నా గురువు ఇది నా నిశ్చితాభిప్రాయము.

2) నేను పరబ్రహ్మమును ఈ సమస్త ప్రపంచము చైతన్యము వలననే ప్రకాశించుచున్నది. త్రిగుణాత్మకమగు జ్ఞానము చేత ఈ విశ్వము నాయందు కల్పింపబడియున్నది. సుఖ స్వరూపము, శాశ్వతము, నిర్మలమగు ఈ దృఢ భావము ఏ పరబ్రహ్మము నందు సుస్థిరమైనదో అతడు ఛండాలుడే గాక ద్విజుడే గాక అతడే నా గురువు. ఇది నా నిశ్చితాభిప్రాయము.

3) సమస్తమైన ఈ విశ్వమంతయు అశాశ్వతమని గురుబోధ ద్వార గ్రహించినవాడు, నిష్కల్మష చిత్తములో నిరంతరము బ్రహ్మ ధ్యానము చేయువాడు, సంచిత, ప్రారబ్ధ, ఆగామి కర్మలను చైతన్యాగ్ని యందు దహించినవాడు, శరీరమును ప్రారబ్ధమునకు వదిలి సకల ప్రశాంత చిత్తుడయిన వాడును ఛండాలుడైనను అతడే నాకు గురువు.

4) మృగ, నర, దేవతాదులు ఏ తత్వమును, ఏ తత్వమును 'నేను' అని అనుభవించుచున్నారో, ఏ చైతన్యము చేత జడములగు దేహేంద్రియ మనోబుద్ధులు ప్రకాశించుచున్నవో, మబ్బుల మాటున సూర్యుడుండి సమస్తమును ప్రకాశింపజేయుచున్నట్లు ఏదయితే ఈ సమస్త సృష్టిని ప్రకాశింపజేయుచున్నదో అట్టి చైతన్యమును ఏ యోగి భావన చేయుచు ప్రశాంత చిత్తుడైయున్నాడో అతడే నా గురువని నిశ్చితాభిప్రాయము.

5) ఏ ఆనంద సాగర కణ శేషమును అనుభవించి ఇంద్రాదులు ఆనందించుచున్నారో, జ్ఞాని దేనిని అంతర్యములో అనుభవించు చున్నాడో, ఏ శాశ్వతానంద సాగరమున అతని చిత్తము లయించి పోయినదో అతడు బ్రహ్మవేత్త గాడు బ్రహ్మమే. అతని చరణములకు ఇంద్రుడు కూడా నమస్కరించును. ఇది నా నిశ్చితాభిప్రాయము.

**ఓం నమో శ్రీనివాసాయ నమః**

**ఓం నమశ్శివాయనమః**

## I.

తమ పుణ్యకర్మ ఫలాన్ని అనుభవిస్తూ పరమమైన హృదాకాశం లోని బుద్ధియందు ప్రవేశించినవారు ఈ లోకంలో ఇరువురున్నారు. బ్రహ్మవిదులు వానిని వెలుగు నీడలని అంటారు. నాచకేత యజ్ఞాన్ని మూడుసార్లు చేసిన గృహస్థులు కూడా అలాగే అంటారు.

**తమ పుణ్యకర్మఫలాన్ని అనుభవిస్తూ :-**

ఇక్కడ జీవాత్మ యొక్క కర్మఫలాన్ని అనుభవిస్తున్నట్లుగా దానితో పరమాత్మ కూడా చేర్చబడినది. కాని దీనిని అలంకారిక ప్రయోగంగానే గ్రహించాలి. ఒకరినే ఉద్దేశించి సాధారణంగా మనం బహువచనం వాడుతాము కదా.

లోకమునందు గల సుగంధ దుర్గంద వస్తువుల యందు సూర్య కిరణములు ప్రసరించినను ఆ సుగంధ దుర్గంధ వాసనలు సూర్యుని అంటియుండన్నట్లు పరమాత్మ యొక్క అణు స్వరూపమైన ఆత్మ అన్ని దేహముల యందును వ్యాపించియున్నను ఆయా సంబంధమైన దేహము యొక్క సుఖదుఃఖములు ఆత్మను అంటజాలవు.

జీవిత చర్య కేవలము జీవుడి బాధ్యత మాత్రమే. మనస్సు, ఇంద్రియాలు ప్రాణాలు భౌతిక శరీరము అనే ఉపాధులతో నడిచే జీవిత చర్య కేవలము జీవుడి బాధ్యత మాత్రమే.

**ఆ చర్యకు శాశ్వత సాక్షి పరమాత్మ**

**2) ఇరువురున్నారు :-** జీవాత్మ పరమాత్మ అనే ఇరువురు.

దేహమనెడి భుజముపైన రెండు అందమైన పక్షులు గలవు. ఇందొకటి జీవాత్మయనియు రెండవది పరమాత్మయనియు చెప్పబడును.

జీవాత్మయనెడి విహంగము, శరీరమును తదింద్రియములను తానేయని తలంచుచు కర్మ పరానుభవములగు సుఖదుఃఖముల ననుభవించును.

పరమాత్మయనెడి పక్షి ఏ తలంపును, ఏ యనుభవంబును లేక సాక్షిగా మాత్రముగా నిలిచియున్నది.

**వారిని వెలుగునీడలని అంటారు :**

పరమాత్మకు జీవాత్మకు గల సంబంధము ఇక్కడ వెలుగు నీడల సంబంధంగా వస్తువు దాని ప్రతిఫలనాల సంబంధంగా వర్ణించబడింది. వస్తువు సత్యమేగాని దాని ప్రతిఫలకం వట్టి నీడమాత్రమే. లేదా ఈ రెండింటి పరస్పర విరుద్ధ స్వభావాన్ని సూచించవచ్చును. మొదటిది నిత్యయుక్తము రెండవది బద్ధమూ.

**గృహస్థులు :** గృహస్థులు అయిదు రకాల అగ్నులను పోషించ వలసి యున్నది. అవి

- **అన్వాహారవచన లేక దక్షిణ**
- **గార్హపత్య**
- **అహవనీయ**
- **సద్య**
- **ఆవంధ్య అనేవి**

అంచేత గృహస్థును సాధారణంగా పంచాగ్ని అంటారు లేదా పంచాగ్ని విద్యలో కుశలులైనవారు అని కూడా అర్థం చెప్పుకొనవచ్చును.

జీవుల్లందరు తప్పనిసరిగా జనన మరణాల వలయంలో అంతు లేకుండా తిరుగవలసియున్నది. మానవ జీవితమనే అద్భుత లీల – అతడి పుట్టుకకి వెనుకాల ఉన్న రహస్య ప్రక్రియ అంతా ఇచట వివరంగా

చెప్పబడుతుంది. తల్లి గర్భంలో మానవ శిశు పిండంగా ఏర్పడడానికి ముందు జీవుడు 5 దశలను 5 అగ్ని మార్గాలంటారు. ప్రతీ దశలోను అయిదు రకాల ఆహతులు హోమంగా చేయబడాలి. దీనిని పంచాగ్ని విద్య అంటారు.

ముఖ్య ప్రాణంగా తాదాత్మ్యం చెందిన ఆత్మ మరణ సమయంలో శరీరాన్ని వదలినప్పటి నుండి తిరిగి మళ్ళా గర్భశిశువు అయ్యేంత వరకు సూక్ష్మమైన 5 అగ్ని పరీక్షలకు లోనుకావాలి. స్వర్గం - విద్యుద్వర్షాల ప్రపంచం - భూమి - పురుషుడు - స్త్రీ. ఈ అయిదింటి ద్వారా ప్రయాణించడానికి అర్పించవలసిన ఆహతులు ఇవి- శ్రద్ధ - సోమం, వర్షం, ఆహారం, వీర్యం. ఈ ఆహుతులు ప్రయాణం ద్వారా తిరిగి పురుషరూపమైన గర్భశిశువుగా ఏర్పడుతుంది.

నిత్యము గృహస్థులు త్రిసంధ్యలలో మూడుసార్లు అర్పించే అగ్నిహోత్రాన్ని ఇక్కడ 'శ్రద్ధ' క్రింద వర్ణించారు. శ్రద్ధ అనడానికి ప్రత్యేక కారణమున్నది. ఈ మూడు సమయాల ఆహుతులని గాఢమైన భక్తితో, చలించని విశ్వాసంతో అర్పించాలి. శ్రద్ధ ఉన్నప్పుడే వాటి ఫలితం లభిస్తుంది. పితృకర్మలకు 'శ్రాద్ధం' అనడం కూడా అందుకే. అందుకే భక్తి విశ్వాసాలతో అర్చించబడాలి.

అగ్నికి అర్పించే ఈ ఆహుతుల ద్వారా మరణానంతరం జీవుడు ముందు స్వర్గాన్ని చేరుకుంటాడు ఆ తరువాత తనకున్న పుణ్యాన్ని అనుభవించి అంతకన్నా ఎక్కువైన సోమలోకాన్ని చేరడానికి తగిన శరీరాన్ని పొందుతారు. ఆ పుణ్యం ఖర్చుకాగానే సోమలోకం నుండి క్రిందకు దిగి పర్జన్యలోకం- అంటె మెరుపులు-వర్షం లోకానికి దిగి వస్తారు. అక్కడ మెరుపులు-వర్షం ద్వారా భూమి వైపుకి క్రిందిగా ప్రయాణిస్తారు. భూమిని చేరి మానవులు తినడానికి పనికివచ్చే ధాన్యం-దినుసుల ఆహార రూపాన్ని ధరిస్తాడు. పురుషుడు ఆహారాన్ని తినగానే

అతడిలో భీజరూపమౌతాడు. వీర్యం- అని నిర్దేశింపబడిన ఈ భీజం స్త్రీ గర్భంలోనికి చేరుతుంది. ఇలా శ్రద్ధగా అర్పించిన ఆహుతుల ద్వారా జీవుడు మానవ శిషువుగా మారుతాడు. ఉపనిషత్తు ఈ ప్రయాణానికి చెందిన జ్ఞానాన్ని పంచాగ్ని విద్య అన్నది.

జిజ్ఞాసువులు మూడు ఆశ్రమాలకు చెందినవారై యుంటారు. గృహస్థులు, వానప్రస్థులు, నిత్య బ్రహ్మచారులు. ఈ 3 తరగతుల వారు నిత్యము త్రికాలాలలో ఈ ఆహుతుల్ని అర్పించాలి. ఆహవనాగ్ని- అంటే ఈ అగ్నిహోత్రానికి సమిధలు, ధూమం, అర్చికలు, అంగారాలు, స్పులింగాలు అని అయిదు అంశాలు ఉంటాయి. ఈ అయిదు పైన వివరించిన పంచాగ్నులలోను ఉంటాయి.

శ్రద్ధ అనే మొదటి అగ్ని- హోత్రం ద్వారా చేరుకునేది స్వర్గస్థానం. ఇందులో ఈ అయిదు అంశాలు ఇవి: సూర్యుడు-సమిధ; సూర్య కిరణాలు-ధూమం; వెలుగులో కనబడే పగలు-అర్చికలు; సోముడు-అంగారాలు లేదా బొగ్గులు; నక్షత్రాలు-స్పులింగాలు. ఇవి చాలా సున్నితమైన సాంకేతికోపాసనలు.

శ్రద్ధను అర్పించి జీవుడు మొదట అందుకునే స్థానం- స్వర్గం, సంకేతాల వర్ణనలను విశ్లేషించి పరిశీలించి, ధ్యానించినపుడు జీవుడు ఉత్తమ వాసనలను అనుసరించి ఉర్ధ్వగామియై ప్రయాణిస్తాడని గోచరిస్తుంది. అతడు ఆచరించే తపస్సు, ఆద్యాత్మిక సాధనలు ద్వారానే స్వర్గం లభిస్తుంది నిర్మలంగా, స్వార్ధరహితమైన ఆధ్యాత్మిక జీవనాన్ని గడపడం ద్వారా ఉత్తమమైన తేజోవంతమైన ఊర్ధ్వలోకాలను పొంది సుఖాలను అనుభవిస్తారని సాధకులకు ఈ వర్ణనలు హామీ ఇస్తాయి.

ఈ స్వర్గలోకాలలో జీవులు ఎతకాలం ఉంటారనేది వాళ్లు ఇక్కడ జీవించి ఉండగా చేసిన సాధనా సమయంలో ఏయే వాసనలు, కోరికలు వాళ్ళ సాధనకు కారణం అయ్యాయో వానిమీద ఆధారపడియుంటుంది.

వాళ్ళ ఉద్దేశ్యాలు, కోరికలు పూర్తి స్వార్థపరంగా ఉండి అహంకారంతో స్వర్గలోకాల సుఖాలు అనుభవించడం మేరకే ఉంటే, అక్కడ వాళ్ళ ఉనికి వాళ్ళు చేసిన పుణ్యకర్మల మేరకే ఉంటుంది. ఈ పరిమిత కర్మలు ముగియగానే వాళ్ళు తిరిగి భూమిపై పుట్టాలి. శుద్ధమై, స్వార్థరహితమై, అహంకారపూరితమైన కోరికలు లేకుండా దివ్యమైన నిర్మలమైన భావాలతో ఇక్కడ జీవుడు సాధన చేసినట్లయితే జీవుడు భూమిపైన తిరిగి పుట్టడు స్వర్గానికి ఇంకా పైనున్న ఊర్ధ్వలోకాలకి వెళ్ళి సర్వ వ్యాప్తమైన పరమాత్మలో కలిసిపోయే స్థానం వరకు వెళతాడు.

తరువాత జీవుడు మానవశిశువుగా తిరిగి జన్మించే సిద్ధాంతం ప్రవేశించబడుతున్నది. అందుకనే పైలోకాలకు వెళ్ళకుండా క్రింది లోకాలకు వెళ్ళే విషయమే ప్రస్తావించబడినది ఈ క్రింది లోకం పర్జన్యలోకం.

ఇలాంటి జీవుళ్ళు స్వర్గం చేరుకున్నాక చంద్రలోకానికి వెళ్ళడానికి తగిన రూపాన్ని ధరిస్తారు. దానినే శాస్త్రాలలో పితృలోకం అంటారు. చంద్రలోకంలోని స్వర్గ సుఖాలను అనుభవించాక పుణ్యాలన్నీ ఖర్చయి పోయిన జీవుడు చంద్రుని దివ్యలక్షణాలు పొంది క్రిందకు దిగడం ప్రారంభిస్తాడు. చంద్రలోకంలో జీవుడు సంపాదించుకునే చంద్రలక్షణాలు ఆ లోకంలోని సుఖాలన్నీ అనుభవించడానికి, తిరుగు ప్రయాణానికి కూడా తోడ్పడుతాయని తోస్తున్నది. అందుకే సోమున్ని కూడా ఆహుతి క్రింద పేర్కొన్నారు. శ్రద్ధ జీవున్ని స్వర్గానికి తీసుకెల్తుంది. సోముడు అతన్ని పర్జన్య లోకానికి తీసుకువస్తాడు.

విద్యుల్లోకంలో జరుగవలసిన యజ్ఞం, సోమున్ని ఆహుతిగా ఇవ్వడం ఇందులో హోమం తాలూకు అంశాలు అయిదు ఉండాలి

వాయువు–సమిధలు; మేఘాలు–దాని పొగ; విద్యుత్తు–దాని అర్చికలు; మెరుపులు–అంగారాలు; ఉరుములు–నిప్పురవ్వలు.

ఈ యజ్ఞంతో జీవుడు మేఘాలలోకి సూక్ష్మరూపంలో ప్రవేశిస్తాడు.

ఇక తరువాత స్థాయి జీవుడు వర్షంగా భూమిలోనికి ప్రవేశించి మానవులు తినే ధాన్యంగా మారుతాడు. భూమిపై జరిగే మూడో యజ్ఞంలో అయిదు అంశాలుంటాయి.

ఋతువులు – సమిధలు

పైన వ్యాపించియున్న ఆకాశం – పొగ

చంద్రుడు, నక్షత్రాలు – అర్చికలు

నాలుగు దిక్కులు – బొగ్గులు

అవాంతర దిశలు – నిప్పురవ్వలు
(నాలుగు మూలలు)

వర్షాల కారణంగా భూమిపైన జీవించే మొక్కలు, చెట్ల ద్వారా మానవులకు పనికివచ్చే ఆహార దినుసులు లభిస్తాయి. జీవుడు ధాన్య రూపాన్ని పొందుతాడు.

అటు పిమ్మట జీవుడు పురుషుడులోనికి ప్రయాణిస్తాడు. అతడిలో ఆహారం అరగడం నాలుగవ యజ్ఞం. ఇందులోని అయిదు అంశాలు ఇవి–

వాక్కు–సమిధ; నాలిక–అర్చికలు; ప్రాణం–ధూమం;
కళ్ళు – అంగారాలు, చెవులు–నిప్పురవ్వలు.

ఈ స్థానంలోనికి అర్పించే ఆహుతులు రకరకాలైన ఆహార పదార్థాలు. ఈ యజ్ఞం ద్వారా పురుషుడు తినే ఆహారం నుండి భీజం ఏర్పడుతుంది. దానిని రేతస్సు అంటారు. జీవుడు ఆహార రూపం వదిలి రేతస్సు రూపం ధరిస్తాడు.

చివరి అగ్ని-స్త్రీ ఇందులో అయిదు అంశాలు-

నాభి - సమిధలు

పురుషునితో సంగమము - ధూమం

గర్భం - అర్చికలు

స్త్రీ గర్భంలోకి ప్రవేశించే భీజం - అంగారాలు

ఆ కలిగే ఆనందం - నిప్పురవ్వలు. పురుషుడర్పించే వీర్యమే ఆహుతి.

**దానితో పునర్జన్మ కోసం జీవుడికి మానవ శిశు రూపం వస్తుంది.**

కాని ఆత్మ నెరిగిన బ్రహ్మజ్ఞానికి ఎక్కడికో ఈ ప్రయాణం అంటూ ఉండదు.

**అతడు బ్రాహ్మీస్థితిలోనికి మేల్కొని బ్రహ్మమే అవుతాడు.**

మూడో రకానికి చెందిన మనుష్యులు వేరే ఉంటారు. వీరు పంచాగ్ని విద్యను అనుసరించి ఉత్తమ ధ్యానాన్ని చేయరు. మామూలు పూజలు-ప్రార్థనలు చేయరు. సమాజ పరమైన కర్తవ్యాన్ని కూడా నెరవేర్చరు.

క్రమముక్తి మాట అలా ఉంచి, ఈ నికృష్టులు కనీసం తాత్కాలిక స్థానాన్ని పొందటం కూడా నోచుకోరు. పరమాత్మ పదానికి ఎంతో దూరంగా జీవిస్తూ వేలాది సంవత్సరాలైనా అందులోంచి బయటపడే మార్గం లేక జీవిస్తారు.

క్రిమికీటకాదులుగా పుట్టి ఆ దుర్మార్గమైన జీవుల్లకు ఉత్తమ గతులు మృగ్యమే

**ఒక జీవుడికి రాగల అతి దుర్భర క్లేశం అది.**

అయితే దేవయాన, పితృయానాలు కూడా అంత ఆనందకరంగా ఉంటాయని చెప్పడానికి వీలు లేదు.

స్వర్గంలోని చంద్రలోకాన్ని చేరాక కూడా ఆ జీవుడు తిరిగి మానవుడిగా పుట్టడానికి లక్షలాది సంవత్సరములు పడుతుంది. చంద్రలోకం లోని సుఖాలు అనుభవిస్తున్నప్పుడు కూడా వాళ్ళకు, ఈ సుఖాల నుండి ఏనాటికైనా పతనం వస్తుందని నిత్యము బెంగలు, భయాలు పడుతుంటారు.

పతనమై క్రిందకు వచ్చాక గూడా వెంటనే మానవునిగా పుడుతారన్న నమ్మకం లేదు. వర్షపు నీటి గుండా ఆ జీవుడు దిగివచ్చి నప్పుడు ఆ నీరు భూమిమీద కాక నదులలో పడవచ్చును. ఆ నదులు అతన్ని సముద్రంలోని తీసుకుపోతే మరల ఆవిరై మేఘంలోనికి వెళ్ళి మళ్ళీ వర్షపునీటితో దిగిరావాలి. ఇలా జీవుళ్ళు తిరిగి మానవులుగా జీవించే కాలము అనిశ్చితం ఎంతో దీర్ఘకాలం పట్టవచ్చును.

ఒకవేళ జీవుళ్ళు ధాన్యంగా మారినా వాళ్ళు మానవులకు ఆహారమైనప్పుడే పురుషుడిలో భీజంగా మారే అవకాశం లభిస్తుంది. ఇది కూడా అనిశ్చితమైనదే.

పోనీ దేవయానంలో ప్రయాణించి బ్రహ్మలోకానికి వెళ్ళి అక్కడ క్రమయుక్తిని పొందుదామంటే బ్రహ్మదేవుడు పరమాత్మలో కలవాడానికి ఎన్నికోట్ల సంవత్సరాలు పడుతుందో అన్నికోట్ల సంవత్సరాలు అచట వేచి ఉండాల్సిందే.

అక్కడి కాలమానమైనా ఎంతో భయం గొల్పుతుంది.

**అందుచే సరైన వివేచనల వల్ల ప్రతీ జీవుడు ఈ జన్మలోనే ఆత్మజ్ఞానాన్ని ఆర్జించి, బ్రహ్మనిష్టతో జీవనాన్ని గడిపి ఆత్మసాక్షాత్కారాన్ని పొందాలి. లేకున్నచో అంతా సర్వనాశనమే.**

# II.

యజ్ఞకర్మలు నిర్వర్తించే వారికి వారధియైన నాచికేత యజ్ఞాన్ని మేము నిర్వర్తించగలము. అంతేగాక ముక్తిచెందగోరే వారికి అభయాన్ని ప్రసాదించే అవ్వలితీరమైన పరబ్రహ్మమును కూడా మేము తెలుసుకొన గలము.

వారధియైన : యజ్ఞకర్తలను ఈ మర్త్యలోకము నుండి సర్వోన్నత స్వర్గమైన బ్రహ్మలోకానికి తీసుకుపోయేది అయిన

కర్మ ఉపాధికి సంబంధించినది గావునను, ఉపాది భ్రాంతి జన్యము కనుకను, ఆత్మ సర్వసాక్షి గనుకను కర్మ దోషమునగిది త్యజింప తగినదని సాంఖ్యుల మతము. కర్మ బొత్తిగా వదిలినచో జీవునకు చిత్తశుద్ధి యెట్లు కలుగును, అసలు దేహయాత్రయే ఎట్లు కలుగుననియు భావించినవారై యజ్ఞ తపోదానాది కర్మలు వదలదగినవి కావు అని కొందరు చెప్పుదురు ఈ ప్రకారముగా జనులలో కర్మలను గూర్చి భిన్నాభిప్రాయములు గలవు.

గీతయందు భగవానుడు అర్జునునుద్దేశించి ఓ అర్జునా! యజ్ఞము, దానము, తపస్సు అనెడి కర్మలు త్యజింపతగినవి కావు. ఏల యనిన అవి బుద్ధిమంతులకు పవిత్రతను, చిత్తశుద్ధిని కలుగజేయుచున్నవి.

యజ్ఞ దానాది తపోకర్మలను తప్పక చేయవలెనని భగవానుడు మరల మరల చెప్పుటచే ఈ విషయమున భగవంతుడెంత నిశ్చయముగా చెప్పెనో విదితమగుచున్నది. మరియు అట్టి పుణ్యకార్యములు చేయుట ముముక్షువులకెంతటి అవసరమో అదియును స్పష్టమైనది.

సామాన్యముగా లోకములో కొందరు జనులు పుణ్యకర్మములు చేసినచో కూడా మరల జన్మము కలుగును కావున వానిని చేయరాదని అమాయకులగు వారికి దుర్భోధలు చేయుచు అట్టి కార్యముల నుండి వారిని

విరమింపచేయుచున్నారు. ఇది చాలా ఘోరము. ఇది భగవదాశయమునకు విరుద్ధము. మరియు పరమాత్మ పలుచోట్ల యజ్ఞ తపో దాన కర్మలను ప్రోత్సహించిరి. తప్పక చేయవలెనని హెచ్చరించిరి. వానిని వదలరాదని శాసించెను. యేలనన–

1) యజ్ఞ దాన తపోకర్మలను నిష్కామముగా ఆచరించినచో జనులకు చిత్తశుద్ధి కలుగును.

2) చిత్తశుద్ధి వలన ఆత్మజ్ఞానముదయించును.

3) ఆత్మ జ్ఞానముచే మోక్షము లభించును. ఇదియును గాక భగవానుడు:–

**"అర్జునా!**

**యజ్ఞ దాన తపోః కర్మలను కూడా ఆసక్తిని, ఫలములను విడిచి భగవాదర్పనగా చేయవలయునని నాయొక్క నిశ్చితమగు ఉత్తమాభి ప్రాయము"**

కావున జనులు అజ్ఞాన వశమున ఇతర వాదనలను గ్రుడ్డిగా నమ్మి అధోగతిపాలు కాకూడదు.

నాచకేతాగ్ని మాట ఎలా ఉన్నా గీతయందు శ్రీకృష్ణ పరమాత్మ మోక్ష హేతువులగు పలు యజ్ఞములను అర్జునునకు బోధించిరి. అందు సంగ్రహముగా మొత్తము 12 (పన్నెండు) యజ్ఞములు గలవు.

**I.** 
- **దైవయజ్ఞము**
- **బ్రహ్మాయజ్ఞము**

**II.** 
- **ఇంద్రియ సంయమ యజ్ఞము**
- **శబ్దాది విషయ నిరోధ యజ్ఞము**

**III. ఆత్మ సంయమ యజ్ఞము**

**IV.**
- **ద్రవ్య యజ్ఞము**
- **తపోయజ్ఞము**
- **యోగ యజ్ఞము**
- **స్వాధ్యాయ యజ్ఞము**
- **జ్ఞాన యజ్ఞము**

**V. ప్రాణాయమ యజ్ఞము**

**VI. ఆహార నియమ యజ్ఞము**

## దైవయజ్ఞము - భక్తియోగము

దైవయజ్ఞమనగా దేవతారాధన, దేవతా ధ్యానము, దేవతోపాసన, దేవతా కైంకర్యము, దేవతా ప్రార్థన ఇత్యాది కార్యముల నొనర్చుచుందురు.

వీరు కర్మయోగులు లేక భక్తియోగులు అని చెప్పవచ్చును.

భగవానుని గూర్చి నిక్కము నిష్కలకంకము అగు అన్వేషనమే భక్తియోగము. ఇయ్యది ప్రేమమున జనించి, ప్రేమలో వికాసము పొంది, ప్రేమమున లయించును.

**"ఉత్కృష్టమగు ఇట్టి భగవత్ప్రేమోన్మాదము క్షణమైనను లభించెనేని అయ్యది మనకు శాశ్వత మోక్షమును లభించును"**

దేవర్షియైన నారదుడు

**"భగవంతుని యందలి పరమ ప్రేమయే భక్తి"** యని నిర్వచించి యున్నారు.

అట్టి భక్తి లభించిన మానవుడు సిద్దుడు, మృత్యురహితుడు, తృప్తుడు అగును. ఇకనతడు దేనిని వాంఛింపడు. విచారమునకాధీనుడు

కాదు; ద్వేషింపడు; రమింపడు; దేనియందును అధిక హర్షము నందడు ఈ దివ్యప్రేమకు యే ఐహిక లాభమును సరికాదు.

"ఏలనన లౌకికక విషయవాంఛ లున్నంత వరకు భగవత్ప్రేమ ఎన్నటికిని జనింపదు"

కర్మము కంటెను, జ్ఞానము కంటెను భక్తి యధికతరము కారణమేమన నివియన్నియు ఏదో ఒక ప్రయోజనమునుద్దేశించు నట్టివి. భక్తియన్నచో దానికదే ఫలము, సాధన మరియు సాధ్యము.

భక్తి మార్గమునకు వలసిన యోగ్యతలు వేదాంతాదకులకు వలె అంత కాఠిన్యంబులు కాకపోవుటయే సర్వజన సౌలభ్యముగా కూడా యున్నది ఎట్లనిన

1) భక్తిమార్గమునందెల్లరును అర్హత కలదు ఎవరికిని ఇందు నిషేధము లేదు.

2) భగవదనుగ్రహము నందు విశ్వాసము అట్టి భగవదను గ్రహము వలన సంసారము నుండి విముక్తి మరియు ముక్తి కలుగునను నిశ్చయ జ్ఞానము గలవారెల్లరును భగవద్భక్తి మార్గము ననుష్టించుటకు పరమ యోగ్యులగుదురు.

3) భక్తిమార్గము నవలంభించుటకు ఎట్టి చదువులును అవసరము లేదు.

**నిరక్షర కుక్షియగు గాక పరమ పాపియగుగాక పైన జెప్పిన రెండు లక్షణములన్నచో చాలును.**

ఈ విషయమై భగవానుడు గీతలో ఈ విధముగా తెల్పుచున్నాడు.

**I.** మిగుల దురాచారము కలవాడైనను అనన్యభక్తి కలవాడై నన్ను భజించునేని స్థిరచిత్తము కలవాడైనను అతడు సాధువే యనబడును.

అతడు శీఘ్రముగా ధర్మాత్ముడగుచున్నాడు. మరియు శాశ్వత శాంతిని పొందుచున్నాడు. **అర్జునా! నా భక్తుడెన్నడును నశింపడు అని ప్రతిజ్ఞ చేయుము.**

**II.** ఎవరు ఏకాగ్ర చిత్తముతో నన్నే స్మరించుచు ఉపాసించుదురో నాయందే మనస్సును స్థిరీకరించియుండు అట్టివాని యోగక్షేమములు నేనే వహించుచుందును.

మరియును భక్తియొక్క విశేషములను ఈ విధముగా వచించెను.

1. భగవత్సాక్షాత్కారమునకును, సంసార నివృత్తికిని భక్తిమార్గము చాలును,
2. అది మూడు మార్గములలో సులభమార్గము.
3. ఆ మార్గము సర్వప్రాణి వర్గమునకు అందుబాటులో యున్నది.
4. జ్ఞానమార్గమునకు కూడా అది తోడ్పడుచున్నది.
5. జీవాత్మ పరమాత్మలకు గల పరస్పర ప్రేమాతిశయము యొక్క రసానుభూతికై జ్ఞానులు సయితము ఆత్మసాక్షాత్కారానంతరము కూడ అప్పుడప్పుడు భక్తి చేయుదురు.
6. ఈ భక్తి రసానందంబును అన్యులు గూడి నేను సయితము పొల్గొందు గాక.

భక్తి గురించి మరికొన్ని విశేష వ్యాఖ్యానములు గలవు.

1. భగవంతుడు నావాడనెడి మమకారము భక్తియగునని భీష్ముడు, ప్రహ్లాదుడు పల్కిరి.
2. ప్రతీవ్యక్తికి వాని ఇష్ట వస్తువులయందు మొట్టమొదట ఒక విధమైన అమరంజనము కలుగును. అది క్రమక్రమముగా గాఢమై రాగరూపము దాల్చును.

3. భగవద్దర్శనము పరాభక్తియగును. ఐక్యము పరాజ్ఞానమగును.

ఇక భక్తియందలి ప్రమాదమేమన పరమత ద్వేషము. ఇదియును క్షుద్ర దేవతోపాసన నుండియో బయలుదేరును.

సాధన దశలోనిదగు గౌణస్థితిలో యున్నప్పుడే భక్తిమార్గము నందు ఈ ప్రమాదము కలదు. భక్తి పరిపక్వమై పరాభక్తిగ పరిణమించినంతనే ఈ ఘోర మతద్వేశాదులకు అవకాశము గాని దాని వలన భయము గాని కలుగదు. ఉత్కృష్టమైన భక్తి రసాస్వాదనమున తన్మయుడగు భక్తుడు భగవానునకు అత్యంత సన్నిహితుడు అతని హృదయమన ద్వేషమునకిక తావెక్కడిది?

భక్తులు వారి వారి యంతఃకరణ పరిమాణానుసారముగా పూజ్య పదార్థముల గ్రహింతురు. అది ప్రాయికముగా 8 విధములు.

1) శివకేశవాది సాకార సగుణ బ్రహ్మమును కొందరు గ్రహింతురు.

2) అట్టి సాకారగుణ బ్రహ్మము యొక్క ప్రతీకంబున కొందరాలంబనము చేయుదురు.

3) ఆ సగుణ బ్రహ్మయొక్క అవతారమూర్తులను గొందరు పూజింతురు.

4) వారివారి గురువునే సాక్షాత్ బ్రహ్మభావములో కొందరారాధింతురు.

5) వారు వీరనకు జీవత్వమునే కొందరు గ్రహింతురు.

6) విశ్వాకారమే భగవదాకారమని దానిని కొందరు సేవింతురు.

7) అంతర్యామియై ఏ తత్వము సృష్టి నెల్ల నడుపుచున్నదో అదే భగవతత్వమని వాని నూహించి కొందరు భజింతురు. (అహంకారాది ఉపాదిరహితమైన)

8) తమ ఆత్మయే పరమాత్మయని దానిని కొందరు ధ్యానింతురు.

భక్తియనిన పరమార్ధ దృష్టికి ఏకరూపవేమైనను అది వ్యవహారమునందు 11 రూపములు దాల్చుచున్నవి.

1) భగవత్కళ్యాణ గుణాభివర్ణనము

2) భగవద్దివ్యమంగళ విగ్రహానురాగము

3) భగవత్పూజ

4) భగవత్స్మరణము

5) భగవత్సేవ

6) భగవంతుని యెడ సఖ్యభావ ప్రేమ

7) భగవంతునకు సర్వము అర్పించుట

8) భగవతన్మయుడై యుండుట

పరాభక్తి మహత్యము

1) పరాభక్తి యనునది కర్మ జ్ఞానయోగంబులు మూటకన్న అధికతరమై యున్నది.

2) పరాభక్తి యనునది ఫలరూపంబుగా యున్నది యోగంబులన్నచో సాధనామాత్రంబులు. సాధనా మాత్రంబులకన్న వాని ఫలములు శ్రేష్టమగుట న్యాయమే కదా.

3) సాధనంబులైన యోగములు సాద్యమైన పరాభక్తి కన్న తక్కువ యనుటకు మహర్షిగారు మరియొక కారణమును గూడా తెలుపుచున్నారు.

సాధనమందు స్వప్రయత్నము తప్పదు. స్వప్రయత్నమన్నంతనే యత్నించువాని యందు తానొక ప్రత్యేక వక్తియను భావంబంటియే

యుండును. అనగా అహంకారము తప్పకయుండును, అహంకారము నశించిన గాని పరాభక్తి కలుగదు.

ఇంకను లోతునకు దిగి విచారించినచో పరాభక్తి సిద్ధికి ఈ అహంకారము ఎంతయో అడ్డుపడుచున్నది. యోగంబులలో అంతో ఇంతో అహంకారము నాశ్రయించియే యుండుననియు, పరాభక్తియన్నచో అహంకారము నశించిన గాని కలుగదనియు ఆ కారణంబున గూడా యోగంబులన్నింటికన్న పరాభక్తి యుత్తమమని మహర్షి భావము.

4) జ్ఞానము వలననే ముక్తియని కొందరి మతము

నారధ మహర్షి గారి దృష్టిలో మోక్షమన్నను పరాభక్తియన్నను ఒక్కటియగును.

మోక్షప్రాప్తికి ఎల్ల మార్గంబులు ఒండొంటి నాశ్రయించి యున్నవని మరికొందరు తలంతురు.

5) పరాభక్తియనునది ఒక సాధనా ఫలముగాని ఒకానొక కారణ కార్యము గాని కానేరదు. **దానికదే ఫలరూపమగునని బ్రహ్మకుమారుడనైన నామతము.**

సిద్ధి పర్యంతము నిరంతరము సాధినము చేయవలయును, దేహమున్నంత కాలము దేహ ధర్మంబులు, క్షుత్పిపాసాదులు ముక్తునకు కూడా తప్పవు, వాని కొరకు ప్రతీ దినము కొంత కాలవ్యయము కూడా తప్పదు. మరియు ఎల్లరును సర్వసంగ పరిత్యాగముచేసి సన్యాసము స్వీకరించి భగవత్సేవైక తత్పరులు కాజాలరు. లోకులు ప్రాయికంబుగా గృహమేధలై గృహధర్మములందు మునిగియుందురు. అయినను వారికి మోక్షేచ్ఛగలదు. మోక్షమునకు నిరంతర భగవత్సేవారూపసాధనము విధివిధానమైన వారిగతి యేమి అని అడుగవచ్చును?

వేయేల! సాధనములు చేయుదురు గాక మానుదురు గాక మనస్సు భగవాదీనమైన చాలును.

ఏకాంత ప్రదేశము నందుండుట, ముల్లోకములందలి సుఖాభిలాష లేకుండుట, త్రిగుణాతీతుడగుట, లేని దానిని సంపాదించుట, దానిని రక్షించుట యందాశ లేకుండుట–

**పరవైరాగ్యమనమడును**

**అట్టి పరాభక్తుడు తాను తరించి లోకంబును కూడా తరింపజేయును.**

ముక్తులకు లోకముతో పనియేమి అని శంకింపవచ్చును. ముక్తుడు పరమ కృపాస్వరూపుడు.

క్రీస్తును, బుద్ధుడు, మహమ్మదు, రామకృష్ణ వీరి జీవితములు చదివినచో లోకోపకారార్థమై వారెంత తపించినది తేటతెల్లమగును.

## బ్రహ్మయజ్ఞము

మరికొందరు బ్రహ్మాత్మైకత్వ భావనచే చిత్తమును బ్రహ్మమనెడి అగ్నియందు ఆహుతి చేయుచున్నారు. అగ్ని సమస్తమును భక్షించి తనయందు లీనమొనర్చుకొనును. అట్లే బ్రహ్మయందు దృశ్యజౌతమంతయు లీనమైపోవును. చిత్తము కూడ దృశ్యమునంతర్భాగమే గనుక జీవబ్రహ్మైక్య భావనచే మహనీయులద్దానిని బ్రహ్మమను అగ్నియందు హోమముచేసి వైచుచున్నారు. అనగా లయింపజేయుచున్నారు. ఇదియే బ్రహ్మయజ్ఞము. దీనినాచరించువారు జ్ఞానయోగులనబడును. ఇట్టి యజ్ఞముచే వారు (భ్రమర కీటకన్యాయము) బ్రహ్మమములో ఐక్యము పొందుచున్నారు. ఏ వస్తువు అగ్నియందు వేయబడినను అది అగ్నిరూపమునే పొందును. అట్లే బ్రహ్మము నందు వ్రేల్చబడిన జీవుడు బ్రహ్మమే యగును. అదియే మోక్షస్థితి. ఆత్మ

విచారణ చేతను విషయ విరక్తి చేతను తన యందలి వాసలు, దృశ్య సంస్కారములు నిర్మూలనము కాగా అట్టి శుద్ధ సాత్విక చిత్తము బ్రహ్మమందు విలీనమైపోవును. ఇదియే బ్రహ్మయజ్ఞము.

అయితే జ్ఞాన తపస్సనగానేమి?

- **రాగ భయ క్రోధములు లేకుండుట**
- **భగవన్మయుడగుట**
- **భగవంతుని ఆశ్రయించుట**

అట్టి జ్ఞాన తపస్సు యొక్క ఫలితమేమి-

- **చిత్తశుద్ధి**
- **పరమాత్మ స్వరూపప్రాప్తి**

అని భగవానుడు బోధించెను.

## II. ఇంద్రియ నిగ్రహము - శబ్దాది విషయ త్యాగము :-

ఇంద్రియ నిగ్రహము ఆధ్యాత్మ శాస్త్రమున కీలక స్థానమాక్రమించి యున్నది. మోక్ష సౌధమునెక్కుటకు ఇది నిచ్చెన వంటిది.

అందుచేతనే కాబోలు భగవానుడు ఈ విధముగా పలికెను.

“ఇంద్రియములను నిరోధింపక పలుకు వేదాంత వచనములు నిర్వీర్యములును నిస్తేజములును అగును. అది వాచావేదాంతమే కాగలదు”

ఇంద్రియములను జయించి ఏమియు పలుకున్నను అట్టి సంయమశీలుని నుండి వేదాంత బోధ దిగంతములు ప్రసరించు చుండును. మహోన్నతమగు అట్టి ఇంద్రియ నిగ్రహ రూపసాధన

ఒకానొక యజ్ఞముగ ఇచట వర్ణించబడినది. మోక్షమును పొందవలెనన్న మనస్సును నిగ్రహించవలయును. మనస్సును నిగ్రహించవలెనన్న ఇంద్రియములను నిరోధించవలయును. కాబట్టి ముముక్షువునకు ఇంద్రియ నిగ్రహమత్యావశ్యకమైయున్నది. పెక్కు వ్రతముల ద్వారా సంయమముల ద్వారా, నియమముల ద్వారా ఇంద్రియములను స్వాధీనపరచుకొనవలెను. సంయమమను అగ్నులందు ఇంద్రియములను హోమము చేయుట అనగా ఇదియే. అనేక ఇంద్రియములుండుట వలన ఒక్కొక్క దానిని ఒక్కొక్క దానిని విడివిడిగా బాగుగా సంయమమొనర్చ వలెనని తెలుపుటకై 'అగ్నులు' అను బహువచన ప్రయోగము చేయనైనది.

ఇక రెండవ యజ్ఞమగు శబ్దాది విషయ నిరోధమున్ను దాదాపు పై యజ్ఞమునకు సంబంధించినదియే అగును. ఇంద్రియములు శబ్దాది విషయములను క్షేత్రములందు సంచరించుచుండును. ఆయా విషయమందలి దోషములను చక్కగా విచారించి వానిపై ప్రీతిని విడనాడెవలెను. ఇదియే విషయములను హావిస్సును ఇంద్రియములను అగ్నులయందు హోమము చేయుట.

విషయమందలి ఇట్టి పతనమును తెలుసుకున్న తరువాత ఇంద్రియములు ఆయా విషయములపైకి పరుగిడకుండును. ఇంద్రియము లెప్పుడు నిశ్చలముగా యుండునో అప్పుడు చిత్త వృత్తులు నిరోధింపబడును. ఎప్పుడైతే చిత్తవృత్తులు నిరోధింపబడునో అప్పుడు దృష్టయగు జీవుడు స్వస్వరూపమగు ఆత్మయందు నిలకడ పొందును. అదియే మోక్షము.

## III. ఆత్మ సంయమ యజ్ఞము :-

మరికొందరు ఇంద్రియములయొక్క వ్యాపారములన్నిటిని ప్రాణముల యొక్క వ్యాపారములన్నిటిని జ్ఞానముచే ప్రకాశింప చేయబడిన

మనోనిగ్రహమను యోగమును అగ్నియందు హోమము చేయుచున్నారు (సమాధి).

మోక్ష ప్రాప్తికి మనస్సు అనునది అడ్డుగా యున్నది. అది అనేక జన్మాంతర దుస్సంస్కారములతో కూడి మహా ప్రభలమైయున్నది. దానిని నిగ్రహింపవలెనన్న ఇంద్రియ నిరోధము ప్రాణాయామము మొదలగునవి అవసరములై యున్నవి. ఏలయనిన ఇంద్రియ వేగమును, ప్రాణ వేగమును అరికట్టనిచో మనస్సును ఎవరును జయించలేరు. కాబట్టి మనస్సంయమమునకు సహాయముగా ఇంద్రియ నిగ్రహము, ప్రాణాయామము శీలించవలసియుండును. ఆ విషయమే అలంకారిక భాషలో ఆత్మ సంయమనెడి అగ్నియందు ఇంద్రియకర్మలు ప్రాణకర్మలు వ్రేల్చబడుచున్నవి అని తెలుపబడినది.

"జ్ఞానదీపితే" అను పదము ఇచట గమనింప దగినది. మన స్సంయమము, మనోనిగ్రహము ఆత్మజ్ఞానముచే లెస్సగా ప్రకాశింపజేయ బడగలదు, వర్ధిల్లగలదు. తత్వజ్ఞానము యొక్క సహాయములేనిచో వాసనా క్షయము (మనోనిగ్రహము) సిద్ధించుట కష్టము కనుకనే **జ్ఞానముచే వృద్ధి నొందిన మనోనిగ్రహమని** ఇచట పేర్కొనబడినది.

మనస్సంయమమనెడి అగ్నికి తత్వజ్ఞానము విసనకఱ్ఱ వంటిది. దానిచే ఆ సంయమాగ్ని దేదీప్యమానముగ ప్రజ్వరిల్లును. అనగా మనో నిగ్రహమును శీలించువారు తత్వజ్ఞానము యొక్క సహాయమును తప్పక తీసికొనవలయును. ఈ జగత్తు శాశ్వతమా? విషయములు శాశ్వతమా? శాశ్వతమగు పదార్థమేది? అను విషయ జ్ఞానము వలన మనస్సు విషయములపై పరుగిడక ఆత్మవైపు ప్రయాణము చేయుట మొదలిడును.

మరియు జ్ఞానదీపితే అని చెప్పినందువలన మనస్సంయమము ఒక శూన్యావస్థ కాదని కేవలము ప్రజ్ఞామయమగు చైతన్యస్థితియే యని స్పష్టమగుచున్నది.

**IV. మరికొన్ని విధములగు యజ్ఞములను భగవానుడిచట తెలుపుచున్నాడు.**

**1) ద్రవ్యయజ్ఞము :-** వారి వారి ధనమును, వస్తువులను సత్పాత్రులకు దానము చేయుట. సద్విషయములకు వినియోగపరుచుట. అట్టి దాన ధర్మములు కూడా ఒకానొక యజ్ఞమని పేర్కొనబడినది.

**2) తపోయజ్ఞము :-** వ్రతోపవాసాదులచే దేవేంద్రియ మనంబులను తపింపజేసి క్రమముగా వానిని స్వాధీనపరచుకొనుట. ఇదియును ఒక యజ్ఞమే.

**3) యమనియమమను అష్టాంగ యోగము :-** ఇదియు యజ్ఞమే.

**4) స్వాద్యాయ జ్ఞాన యజ్ఞము :-** వేదాధ్యయనము, శాస్త్ర పఠనము చేయుట అందలి అర్థములను బాగుగా తెలిసికొని అనుష్టించుట. ఇదియును ఒక యజ్ఞమే.

ఈ వివిధములగు యజ్ఞముల వలన చిత్తశుద్ధిని కలిగి జీవుడు పరమాత్మను చేరుచున్నాడు.

**V. ప్రాణాయామ యజ్ఞము :-**

ప్రాణాయామము కూడ ఒక యజ్ఞమేయని ఇచట పేర్కొనుచున్నారు. ప్రాణాయామము అష్టాంగ యోగములలో నాల్గవది. శరీరము యొక్క ఆరోగ్యమును కాపాడుట కొరకు, మనస్సు యొక్క చాచలత్వమును రూపు మాపుటకు ప్రాణాయామము ఆవశ్యకరమైయున్నది. ఇది పూరక, వేచక, కుంభకములను 3 విభాగములతో యున్నది.

ఈ శ్లోకమందు అపానము నందు ప్రాణమును హోమము చేయుట అనగా పూరకము. ప్రాణము నందు అపానము హోమము చేయుటయనగా రేచకము. ప్రాణపాన గతులను నిరోధించుటయనగా కుంభకము. ఈ పూరక, కుంభక, రేచకములనాచరించునపుడు ఏదైన దివ్యమంత్రమును

లేక ఇష్ట దైవమును మనస్సునందు చింతన చేయవలెను. ఇదియే సమంత్రక ప్రాణాయామము లేక అజపగాయత్రి యనబడును. ఈ ప్రాణాయామము వలన మనస్సు అంతర్ముఖమై నిశ్చలముగ యుండును. ఏలయనిన ప్రాణమునకు, మనస్సునకు చాలా సన్నిహిత సంబంధము గలదు. ప్రాణ నిరోదముచే మనో నిరోధము, మనో నిరోధముచే ప్రాణ నిరోధము కల్గుచున్నది.

అయితే దీనిని అనుభవము గలవారి వద్ద చక్కగా నేర్చుకొనవలెను. ప్రాణాయామము ఒక యజ్ఞముగా ఇచట వర్ణింపబడినది.

## VI. ఆహార యజ్ఞము :-

ఆహార నియమము కూడ ఒక యజ్ఞముగా ఇచట వర్ణించబడినది. ఆహార విషయము అతిసామాన్యమైనదేయని కొందరు తలంచవచ్చును. కాని శ్రీకృష్ణపరమాత్మ ఆహారయజ్ఞము గురించి పెక్కుచోట్ల మోక్షసాధనలో ప్రధాన పాత్రగా వర్ణించిరి.

ఏలయనగా ఆహారము చేతన శరీరము - మనస్సు రెండును ఏర్పడుచున్నవి. ఆహారము యొక్క శుద్ధత్వము వలన మనస్సును శుద్ధ పడుచున్నది. ఆహారము సాత్వికమైనచో మనస్సును సాత్వికముగ యుండును. రజోగుణాత్మకమైన మాంసాద్యాహారములతో సురాపానముతో మనస్సు క్రూరముగా మారుచున్నది.

పెద్ద ఫ్యాక్టరీలో ఒక చిన్న మేకు సరిగా పనిచేయనిచో ఆ ఫ్యాక్టరి అంతయు ఎట్లాగిపోవునో, ఒక చిన్న శీల ఊడి పోయినచో రైలుబండికెంత ప్రమాదము కలుగునో అదేరకముగా ఒక చిన్న ఆహార నియమము సరిగా లేనిచో మోక్ష యంత్రాంగమంతయు స్థబ్దమైపోవును.

ఆహార నియమమేవిధముగా యుండవలెననిన-

**మితాహారము**

**సాత్వికాహారము**

**న్యాయార్జితముగను**

**భగవదర్పితముగను**

**నియమిత సేవిత కాలముగను** యుండవలయును.

"నా పాపమెట్లుపోవును" అని చాలామంది ప్రశ్నించుచుందురు. పాపము తొలగుటకు, మోక్షప్రాప్తికి మామూలు నియమములు సరిపోవని, కఠోర నియమ వ్రత యజ్ఞములే శరణ్యమని భగవానుడు సెలవిచ్చెను.

పాపము నశించిన గాని చిత్తము శుద్ధము కాదు. చిత్తము శుద్ధమయినగాని ఆత్మజ్ఞాన మలవడదు. ఆత్మజ్ఞానము దయించిన గాని మోక్షప్రాప్తి కలుగదు. కావున ముముక్షువులెల్లరును పైన తెలిపిన 12 యజ్ఞములలో కొన్నిటిని గాని అన్నిటినిగాని తప్పక ఆచరించవలయును.

**తపస్సు :** జ్ఞానపరముగా తపస్సు 3 విధముల చెప్పబడినది.

**శరీర లేక కాయికా**

**వాక్కు**

**మనో తపస్సు**

దేవతలను, బ్రాహ్మనులను, గురువులను, జ్ఞానులను పూజించుట.

శుచిత్వము, సత్ప్రవర్తనము, బ్రహ్మాచర్యము, అహింస కాయికా తపస్సని చెప్పబడుచున్నది.

ఇతరుల మనస్సును నొప్పింపనిదియు, సత్యమైనది, ప్రియమైనది, శ్రేయము నొనర్చునదియు, వేదాధ్యయనము వాచిక తపస్సుగా చెప్పబడుచున్నది.

ప్రసన్నమైన మనస్సు, శాంత స్వభావము, మౌనము, ఆత్మ నిగ్రహము, **అంతఃకరణ శుద్ధి,** యనునవి మానసిక తపస్సని చెప్పబడుచున్నవి.

ఫలము కోరనివారును, యోగయుక్తులును అగు మనుజులు ఉత్తమమైన శ్రద్ధ బూనినవారై ఆచరించె ఆ త్రివిధ తపస్సులనను సాత్విక తపస్సులని చెప్పబడుచున్నది.

ఇతరుల నుండి సత్కారములందుకొనుటకు, గౌరవములు పొందుటకు, పూజలు గ్రహించుటకు డంబముగా చేసెడి తపస్సు చంచలమై, అస్థిరమై రాజస తపస్సని చెప్పబడుచున్నది.

మూర్ఖపు పట్టుదలచే తన శరీరమును బాధించుకొనుట ద్వారా గాని,ఇతరులకు హాని చేయునది గాని యగు తపస్సు తామస తపస్సని పేర్కొనబడినది.

## -: దానము :-

**1. ప్రత్యుపకారము చేయుటకు శక్తిలేనివారికి :**

- బీదలకు
- అశక్తులకు
- వికలాంగులకును
- దరిద్రనారాయణులకు చేసెడి దానము ఉత్కృష్టము.

**2. యోగ్యుడగువానికి**

**3. దేశ కాల పాత్రములకు తగిన దానము**

అనగా

- పుణ్యక్షేత్రములందు,
- తీర్థాదుల యందు,
- శ్రమాదులయందు,
- దైవసంబంధ కార్యములందు

**కాలే యనగా:**

- గ్రహనము
- సంక్రాంత్రి
- పుణ్యకార్య సందర్భము
- పవిత్రకాలమందు – చేయునదియని అర్థము.

ఇట్టి దానము సాత్విక దానమనబడును. ఎవరేని నీవెందులకు దానము చేయుచున్నావని అడిగినచో ఇది నా ధర్మము, నేను ధానము చేయవలసినదే కాబట్టి చేయుచున్నాను అని దృఢనిశ్చయముతో చెప్పవలెను.

తవాస్తవమునకు దానము, త్యాగము చేయుట తన మేలుకొరకే యగును. ఇవి చిత్తశుద్ధిని వృద్ధిచేయుటలో ఎంతయో తోడ్పడును.

**ప్రత్యుపకారము కొరకు గాని, ఫలాపేక్షతో గాని లేక అతికష్టముతో గాని చేసెడి దానము రాజస దానమని చెప్పబడుచున్నది.**

**దేశకాల పాత్రోచితము కానిదియు, సత్కృతము కానిదియు నిర్లక్ష్యముతో ఈయబడిన దానము తామస దానమని చెప్పబడుచున్నది.**

# III.

నచకేతా! ఆత్మ రథారూడుడైన యజమాని అని తెలుసుకో అలగా శరీరము రథము బుద్ధియో సారథి మనస్సే కళ్ళెము అని గ్రహించు.

ఇంద్రియాలే గుఱ్ఱాలు. ఇంద్రియ విషయాలే అవి పరుగుతీసే మార్గాలు అని అంటారు. శరీరము, ఇంద్రియములు, మనస్సుతో కూడిన ఆత్మనే ప్రాజ్ఞులు భోక్తగా చెబుతారు.

జీవునిలో సారవస్తువు, శుద్ధ చైతన్యము అయిన ఆత్మ ఏ కర్మ ఫలాలకు భోక్తగాని, కర్తగాని ఎన్నటికి కాజాలదు. అవిద్య ద్వారా ఆత్మకు శరీరేంద్రియ మనస్సులకు కలయిక ఏర్పడినట్లు భాసించినపుడే ఆత్మ కర్మకు కర్తకు భోక్తగా భావిస్తాడు. ఇంద్రియాల ద్వారా శరీరము ద్వారా మనస్సు కర్మలు చేస్తూ ఫలాన్ని అనుభవిస్తుంటుంది. మనస్సు యొక్క ఈ లక్షణాన్ని పొరపాటుగా ఆత్మకు దాని సహజ స్వభావంగా అన్వయించి చెబుతాము. మనస్సుపైనే చైతన్యాన్ని ఆరోపిస్తాయి. దీనినే వేదాంత పరిభషలో 'ఇతరేతరాధ్యాం' అంటాము కనుక ఇలా మనస్సు ఇంద్రియాలు శరీరాల లక్షణాలపై పరిశుద్ధాత్మ ఆద్యారోపింపబడినప్పుడు దానికి జీవుడనే పేరు వస్తుంది. ఆ జీవుడే కర్మకు కర్త కర్మఫలానికి భోక్త అవుతాడు.

**ఆత్మయొక్క నీడ లేక ప్రతిఫలనమూ అయిన ఈ జీవుడే సుఖ దుఃఖాలను జనన మరణాలను అనుభవిస్తాడు.**

గీతయందు శ్రీభగవానుడు ఈ విధముగా తెలిపెను.

అర్జునా! ఈ శరీరము క్షేత్రమనియు, దీనిని తెలిసినవాడు క్షేత్రజ్ఞుడనియు యందురు. సర్వ క్షేత్రములలోని క్షేత్రజ్ఞుడుగా నన్ను తెలిసికొనుము. క్షేత్ర క్షేత్రజ్ఞులను తెలిసికొనుటయే నిజమైన జ్ఞానమని నా అభిప్రాయము.

ప్రకృతి పురుషులిరువురును ఆదిలేని వారుగా తెలిసికొనుము. వికారములు గుణములు ప్రకృతి వలన జనించినవని తెలిసికొనుము.

కార్యకారణము లేర్పడుటకు ప్రకృతి హేతువనియు. సుఖ దుఃఖములనుభవించుట యందు పురుషుడు హేతువనియు చెప్పబడుచున్నది.

ప్రకృతియందున్న పురుషుడు ప్రకృతి వలన జనించిన గుణములను అనుభవించుచున్నాడు. గుణ సంగము వలననే నీచోన్నత జన్మములు కలుగుచున్నవి.

ఈ దేహమందలి పురుషుడు ఉపద్రష్టయు, అనుమంత, భర్త, భోక్త, మహేశ్వరుడు, పరమాత్మ అయి ఉన్నాడు.

ఎవడు ఈ విధముగా పురుషుని, గుణములతో కూడిన ప్రకృతిని తెలిసికొనుచున్నాడో వాడు సర్వ విధముల ప్రవర్తించుచున్నను తిరిగి జన్మింపడు.

సమస్త భూతముల యందు సమముగా ఉండి ఆయా భూతముల శరీరములు నశించుచున్నను తాను అవినాశిగా యుండు పరమేశ్వరుని ఎవడు గాంచుచున్నాడో వాడే నిజముగా చూచువాడు.

అర్జునా ఒక్క సూర్యుడు సమస్త ప్రపంచమును ప్రకాశింపజేయున్నట్లు క్షేత్రజ్ఞుడు క్షేత్రమునంతటిని ప్రకాశింపజేయు చున్నాడు.

పంచ జ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, పంచ ప్రాణములు, మనోబుద్ధులు రెండు ఈ 17 అవయవములు కంటికి కనబడకుండ పై చెప్పబడిన స్థూల శరీరములోనే ఉండుట వలన వీటిని సూక్ష్మ శరీరమనబడును.

స్థూల సూక్ష్మ శరీరములకు మూలకారణములుగా నుండి జనన మరణములను కల్పించి దుఃఖమునే సుఖమని భ్రమింపచేయునట్టి గాడాంధకారమైన అజ్ఞానమే కారణ శరీరము.

స్థూల శరీరము వ్యాధుల చేతను ఆహారము లేమి చేతను, శుష్కించి కడపలు మృతి చెందగానే ఆ శరీరము కాల్చబడి రూపనాశనమగును. అట్లు సూక్ష్మశరీరము నశించదు. ఈ సూక్ష్మశరీరము వృద్ధియగు కొలది జన్మములు వచ్చుచునే యుండును. ఎపుడు సూక్ష్మ శరీరము నాశనమగుచున్నాడో అప్పుడే జీవుడు మోక్షమును పొందుచున్నాడు.

సూక్ష్మ శరీరము కలదని ఎట్లు చెప్పవచ్చుననగా నిద్రించునపుడు బహిరింద్రియములు అవి వాటి పనులు చేయుట లేవు కాని స్థూల శరీరములో ఉండి సూక్ష్మ శరీరమే చేయుచున్నది.

ఇక మిగిలినది కారణ శరీరము. స్థూల, సూక్ష్మ శరీరములు కలుగుటకు గల కారణరూపమే కారణ శరీరము కాబట్టి శరీర ఉత్పత్తికి మొదటి కారణం అవిద్య అహంకారము. ఇదియే కారణ శరీరము. ఇది నశించునంత వరకు జన్మములు తప్పవు.

కారణ శరీరము నశించినంతనే భరభంధములు నశించి ఆత్మ పరమాత్మలో ఐక్యమగును.

కారణ శరీరము బ్రహ్మజ్ఞానమనెడి అగ్నిచే నశించును.

సూక్ష్మ శరీరము మనోనైర్మల్యతచే నశించును.

స్థూల శరీరము ప్రారబ్ధ కర్మలు తీరినంతనే నశించును.

**కావున సాధకుడు స్థూల శరీరము ఉండగనే సూక్ష్మ కారణ శరీరములు నశింపజేసుకొను సాధన చేయవలయును.**

దీనికొరకై సాధకుడు సద్గురువు నాశ్రయించి వారిచే ఉపదేశమును పొందు బ్రహ్మజ్ఞానమును అవష్టించుచు జీవిత పర్యంతము గడుపవలయును.

**ఇదియే మోక్ష సాధనము**

**స్థూల శరీరము  నిత్యకర్మలు**

- కర్తవ్య కర్మలు
- నైమిత్తిక కర్మలు
- సత్కర్మలు
- పుణ్యకర్మలు
- నిష్కామ కర్మలు
- త్యాగము

**సూక్ష్మ శరీరము**

- ధ్యానము — సాకార / నిరాకార
- మనోనైర్మల్యత
- మనోవైరాగ్యము

**కారణ శరీరము**

- ఆత్మజ్ఞానము
- అక్షరపరబ్రహ్మ జ్ఞానము

# IV.

మనస్సును విచ్చలవిడిగా వదిలేసి సరియైన జ్ఞానం లేకుండా ఎవడైన ఎల్లప్పుడు సంచరిస్తే అలాంటి వాని ఇంద్రియాలు, దోషం ఉన్న గుఱ్ఱాలు సారథి అదుపు తప్పిపోయినట్లే, వశం తప్పిపోతవి.

మనుష్యమాత్రులు, మనీషావంతులు అని మనుష్యులు ఇరు తెగలుగా ఉన్నారు. భగవంతుని కోసం పరితపించువారు మనీషావంతులు.

కామినీ కాంచనముల కోసము ఆరాటపడువారు మనుష్యమాత్రులు. ఒకే వేషమును అనేకులు ధరింపవచ్చును.

మేకవన్నె పులి వలె అనేకులు నరరూపమును దాల్చిన జంతువులు వీరిలో కొందరు చీల్చి చెండాడు తోడేళ్లు కొందరు, భయకరమగు భల్లూకములు మరికొందరు జిత్తులమారి నక్కలు. ఇంకను మరికొందరు విషసర్పములు.

సన్నని ధాన్యపు గింజలను జారవిడచి ముదుక గింజలను పొల్లుకాయలను నిలుపుకొనుట జల్లెడ స్వభావము. అట్లే దుర్జనులు సద్విషయములను విడిచి దుర్విషయములను తమలో నిలుపుకొందురు.

చేట యొక్కయు, సజ్జనుల యొక్కయు స్వభావము ఇందులకు సరిగ్గా వ్యతిరేకము.

ప్రాతఃకాల మారుతము వలె స్వేచ్ఛామయమై నవకుసుమము లీలను కోమలమై మంచుబిందువు చందమున స్వచ్ఛమై తనరారు బాల్యము ఆజన్మాంతము ఎవ్వనియందు శోభిల్లునో వాడే ధన్యాత్ముడు.

సంసార యాతనలను నిరంతరము అనుభవించుచున్నను కామిని కాంచన మోహమును నిగ్రహించి కామానికి పైకి మనసు మరలింపనొల్లరు కదా!

పరమార్ధమున కలుగు వెగటు చేతనే ప్రాపంచికుని సులభముగా తెలిసికొనవచ్చును. మంత్రమును గాని, స్తోత్రమును గాని, తుదకు నామ సంకీర్తనమును గాని యాతడు విననొల్లడు సరికదా ఇతరులనువిననీయక నిరుత్సాహపరచును.

ప్రార్థనలను భజన సంఘములను నిరసించి హేళన చేయు వాడెవ్వడో వాడే పరమ లౌకికుడు, సంసార బద్ధుడు.

పాపాత్ముని మనస్సు ఉగరాల జుట్టు వంటిది. ఎంత ప్రయత్నించినను ఉగరాల జుట్టును నీవు సాపుగా చేయలేవు. అటులనే దుర్జనుని వక్రబుద్ధిని సరిచేయుట దుర్లభము.

రాతిముక్కలో నీరు ఇంకజాలని రీతిని ధర్మ బోధలు సంసారబద్ధుని మనసునకెక్కజాలవు. అందెట్టి మార్పును కల్గింపజాలవు.

మేకును రాతిలో కొట్టజాలము. అటులనే హితబోధ లౌకికుని మనస్సులో చొరదు. కాని శ్రద్ధాభక్తులుగల ఆస్తికుని హృదయమున అతి సులభముగా నాటుకొనును.

మెత్తని రేగడి మట్టియందు ముద్రపడును. కాని రాతిపైబడదు. అటులనే తత్వజ్ఞానము భక్తుని హృదయమున హత్తుకొనునట్లు సంసార బద్ధుని హృదయమున హత్తుకొనదు.

వంతెన క్రింద నీరు ఒకవైపు నుండి ప్రవేశించి రెండవ వైపునకు పోవునటుల సంసారికులకు చేయు ధర్మ బోధలు ఒక చెవిలో నుండి ప్రవేశించి రెండవ చెవి నుండి పలాయనమగును. వారి హృదయమున రవ్వంతయు మార్పు కలుగదు.

## V.

అయితే ఎల్లప్పుడు మనస్సును అదుపులో ఉంచుకొని సరియైన జ్ఞానం కలిగి ప్రవర్తించేవాని ఇంద్రియములు సారథి యొక్క మంచి గుఱ్ఱములలాగా వశములో ఉంటవి.

నిపుణుడైన సారథి కళ్ళాలను చాకచక్యంతో ఉపయోగిస్తూ రథానికి పూన్చిన గుఱ్ఱాల్లాగా వశంలో ఉంచుకుంటాడు. అలాగే సాధన చతుష్టయ అనుష్ఠానంతో ఇంద్రియములను అదుపులోనికి చేరవచ్చును.

# సాధనా చతుష్టయము

## I. నిత్యా నిత్య వస్తు వివేకము

- త్రికాలాబాధ్యము
- దేశకాల వస్తుకృత పరిచ్ఛేద రహితము
- సర్వాదిష్టానమునగు బ్రహ్మము సత్యము
- బ్రహ్మ అతిరిక్తమగు సకల ప్రపంచము మిథ్య
- సమస్త కామ్యకర్మ పరిత్యాగము
- గురు ముఖమున వేదాంత శ్రవణము
- మననము
- నిది ధ్యాసనము
- సంకల్ప వికల్పరహితముగా అద్వయానంద రూపానుభవము

## II. ఇహాముక్త ఫలభోగ విరాగము

## III. శమాది షట్క సంపత్తి

- శమము
- దమము
- ఉపరతి
- తితీక్ష
- శ్రద్ధ
- సమాధానము

## IV. ముముక్షుత్వము

# VI.

సరియైన జ్ఞానంలేక చెదరిపోయిన మనస్సుతో ఎల్లప్పుడు అశుచిగా ఉండేవాడు ఆ గమ్యాన్ని పరమపదాన్ని ఎన్నటికి పొందలేడు. అంతేగాక జనన మరణరూపమైన సంసార చక్రంలో పడిపోతాడు.

కాపువాడొకడు దినమంతయు చెరుకు తోటకు నీరు పెట్టుచుండెను. తన పని అయిన పిమ్మట చూచుసరికి తోటలోనికి ఒక చుక్క అయినను నీరు ఎక్కలేదు. నీరుయంతయు పెద్ద పెద్ద ఎలుక కన్నముల గుండా క్రిందకు పోయి ఉండెను.

ధనము, కీర్తి మొదలగు వానికోసము గొంతెమ్మ కోరికలను అంతరంగమున పెట్టుకొని భగవంతు నారాధించు భక్తుని విషయము గూడా ఇట్టిదే. నిత్యము అతడు ప్రార్థనలను సల్పుచున్నను ఎట్టి అభివృద్ధిని పొందకుండును. కారణమేమన మనసులో పెట్టుకొనిన ఈ వాంఛలను ఎలుక కన్నముల ద్వారా అతని భక్తి సాధనలన్నియు గంగ పాలవుచున్నవి. యావజ్జీవనము సాధనజేసి యాతడు తుదకు రెడ్డొచ్చె మొదలాడుము అన్నట్లు ఎప్పటికిని లౌకికుడై యుండును.

ధ్యానించునపుడు మనస్సు చలించుచుండుటకు కారణమేమి? ఒకప్పుడు ఈగ మిఠాయి దుకాణములోనున్న మిఠాయి మీద వ్రాలును. కాని పాకీవాడు అశుద్ధ తట్టను తీసికొని ఆ త్రోవను రాగానే మిఠాయీలను విడిచి తట్టపై వ్రాలును. కాని తేనెటీగ ఎల్లప్పుడు పూలమీదనే వ్రాలును. అశుద్ధపు వస్తువుల వెంటపడదు.

లౌకిక జనులకు ఈ ఈగవలె ఒక్కొక్కప్పుడు భగవద్భక్తియను మిఠాయి యందు రుచి కలుగుచుండును. కాని అది క్షణికము. తుచ్ఛ విషయములందు వారికి గల సహజమైన రాగము వానిని వెంటనే ఐహిక సుఖము అను అశుద్ధపు తట్టమీదకు లాగుచుండును.

కాని మహనీయులగు పరమహంసలు – సదా ఆత్మ సంయోగానందమున – తేనెటీగ వలె – భగవత్ప్రేమానందమున – ఓలలాడుచుందురు.

లౌకికునకు జ్ఞానికున్నంత తెలివియు జ్ఞానముండవచ్చును. యోగి పడునంత శ్రమను, కష్టమును అతడు పడవచ్చును. సన్యాసి

చేయునంత మహోత్యాగమును అతడు చేయవచ్చును. కాని వాని శ్రమయంతయు నిరర్థకము. ఏలనన వాని శక్తి సామర్థ్యములన్నియు పెడత్రోవన నడుచుచున్నవి. అతడెన్ని పాట్లుపడినను భగవంతుని కోసము గాక సిరి సంపదలు, ఖ్యాతి మొదలగు క్షుద్ర భౌతిక విషయముల కోసమే.

లౌకికుడు మొసలివంటివాడు ఎట్టి ఆయుధములైనను దాని చర్మమునకు దుర్భేధ్యము కదా! కడుపుపై కొట్టిననే కాని చావదు కదా! అదే విధమున లౌకికునకు నీవు ఎంత హితబోధ చేసినను వానిపై ఎంత వెగటు పుట్టించినను – అతడు అంటిపెట్టుకొనిన విషయముల నుండి ఈవలకు లాగిననే కాని తన పరిస్థితులనాతడు గుర్తింపజాలడు.

కావున ఎంతయో ఆలోచించి అట్టివాని నాకర్షించునిమిత్తము చైతన్య నిత్యానందులు ఒక ఉపాయమును పన్నిరి.

అన్నలారా రండు! హరినామ స్మరణ చేయుడు. మీకు మంచి పాయసము లభింపగలదు. సొగసుకత్తెల కౌగిండ్లననుభవింపవచ్చును. రండు! రండు!! అని బోధించుచు వారికి ఎర చూపిరి. వీరికాశపడి అనేకులు వారితో భగవన్నామ సంకీర్తనమునకై గుమికూడెడివారు. క్రమముగా నామామృతము యొక్క రుచి మరిగినంతనే వారికి నిత్యానందుని బోధనలోని రహస్యము బోధపడినది. భగవద్భక్తిచే బాష్పదారలు వెల్లివిరియ తమకు కలుగు ఆనంద పారవశ్యమే పాయసానందమనియు, భూమియే ఈ సొగసుకత్తెయనియు, నేలపై బడి భక్తిపారవశ్యమున దొరలుటయే ఆలింగనమని వారు గ్రహించిరి.

## VII.

కానీ ఎవడైతే విజ్ఞానవంతుడో వశీకృతమైన మనస్సుగలవాడో సదా పరిశుద్ధుడో అతడు పునర్జన్మ రహితమైన ఆ పరమపదాన్ని చేరుకుంటాడు.

ఏ మనుజుడు తాను చేయవలసిన కర్మలను ఫలాపేక్ష లేకుండా చేయునో అతడే సన్యాసియు, యోగియును అయి ఉన్నాడు అగ్నిహోత్రాదులను విడిచినంత మాత్రమున సన్యాసికాడు కర్మలను చేయునంత మాత్రమున యోగియును కాడు.

అర్జునా! దేనిని సన్యాసమనెదరో అదియే యోగమని గ్రహింపుము. సంకల్పత్యాగము చేయనివాడు ఎవడును యోగియు కాజాలడు.

యోగస్థుడు కాగోరువాడు వానికి కర్మ సాధనమనియు యోగస్థునకు శమము సాధనమైయున్నది.

మనుజుడు ఎప్పుడయితే ఇంద్రియ విషయముల యందును, కర్మల యందును అపేక్షనుంచక సర్వ సంకల్పములను విడుచునో అప్పుడు యోగారూఢుడనబడును.

తనకు తానే ఉద్ధరించుకొనవలయును. అథోగతి పాలు చేసుకొన గూడదు. ఆత్మయే తనకు బంధువు ఆత్మయే తనకు శత్రువు.

ఎవడు ఆత్మ నిగ్రహము కలిగియుండునో వానికి వాని ఆత్మ బంధువు. ఆత్మనిగ్రహము లేనివానికి వాని ఆత్మయే శత్రువు వలె యుండును.

మనస్సును జయించినవాడు ప్రసన్నమైన అంతఃకరణము కలవాడు అగు పురుషునకు శీతోష్ణ సుఖ దుఃఖములయందును, మానావమానముల యందును ఆత్మానుభవము చెదరకయుండును.

జ్ఞాన విజ్ఞానముల చేత తృప్తి చెందినవాడును, కూటస్థుడును, జయింపబడిన ఇంద్రియములు గలవాడును యోగియనబడును. అట్టి యోగి మట్టిగడ్డయందు, రాతియందు, బంగారమునందును సమత్వము కలవాడై యుండును.

సహృదులు, మిత్రులు, శత్రువులు, ఉదాసీనులు, మధ్యస్థులు, ద్వేషులు, బంధువులు, పాపులు మొదలగువారి యందు సమబుద్ధి గలవాడు శ్రేష్టుడు.

యోగియగు మనుజుడు రహస్య ప్రదేశము నందు ఏకాంతముగా నున్నవాడై వశీకృతమైన దేహేంద్రియములు కలవాడై, ఆశలేనివాడై, ఇతరుల నుండి యేమియు ఆశించక నిరంతరము మనస్సును పరమాత్మయదే ఉంచవలయును.

ఈ విధముగా నిశ్చలచిత్తుడై మనస్సును ఆత్మ ధ్యానమందున నిలిపిన యోగి నా స్వరూపము, ఉత్తమ మోక్షమైన శాంతిని పొందుచున్నాడు.

మితమైన ఆహార విహారములు, మితమైన నిద్ర మేలుకువయు ఉచిత రీతిని కర్మలయందు చరించువానికి ఈ యోగము దుఃఖాహారమగు చున్నది.

ఎప్పుడు నిగ్రహింపబడిన మనస్సు ఆత్మయందు నిలిచియుండునో అప్పుడు సర్వకామముల నుండి విముక్తుడై యోగయుక్తుడగుచున్నాడు.

ఆత్మ ధ్యానమును అభ్యసించు యోగి యొక్క నియమిత చిత్తము గాలిలేని చోట నుండు దీపము వలె నిశ్చలముగా యుండును.

మరియు ఇంద్రియములకు అతీతమై బుద్ధికి తెలియదగు ఉత్తమ సుఖమును ఎచట తెలుసుకొనుచున్నాడో ఆ స్థితిననుభవించిన యోగి తత్వము నుండి చలింపడు.

అట్టి యోగము ఇంకను కలుగలేదనే విసుగుచెందక నిశ్చయబుద్ధితో అభ్యాసము సాగింపవలయును.

సంకల్పము వలన జనించెడి సమస్తమైన కోరికలను సంపూర్ణముగా విడిచి మనస్సుచేత ఇంద్రియములను ఇంద్రియ విషయములను మరల్చి

ధైర్యముతో కూడిన బుద్ధిచేత మనస్సును బాహ్య విషయముల నుండి మెల్లమెల్లగా మరల్చి ఆత్మయందు ఉంచవలయును.

ఆత్మకు అన్యమైన ఏ విషయమును కూడా చింతింపకూడదు.

చంచలమైనదియు నిలకడ లేనిదియు అగు మనస్సు ఎచ్చటెచ్చట సంచరించునో అచ్చటచ్చట నుండి దానిని మరల్చి ఆత్మయందే నిలుపవలయును.

ప్రశాంత చిత్తుడును, శాంతినొందిన రజోగుణము కలవాడును, బ్రహ్మభూతుడును, నిష్కల్మషుడును అగు ఈ యోగి ఉత్తమ సుఖమును పొందుచున్నాడు.

ఈ ప్రకారము మనస్సును సదా ఆత్మయందే నిలిపి, కల్మష రహితుడైన యోగి బ్రహ్మసాక్షాత్కార రూపమగు పరమ సుఖమును సులభముగా పొందుచున్నాడు.

ఆత్మయోగి అంతటను సమదృష్టి కలిగి తనను సర్వభూతముల యందును సర్వభూతముల యందును దర్శించుచున్నాడు. అట్టివానికి నేను ప్రత్యక్షమే నాకు వాడు కూడా ప్రత్యక్షమే.

అర్జునా! తన యందును సర్వభూతముల యందును కలుగు సుఖ దుఃఖములను ఒకే రీతిగా సమాయుత చిత్తముతో చూచువాడు పరమ శ్రేష్టుడయిన యోగి అని చెప్పబడుచున్నాడు.

అర్జునా! మనస్సు చంచలము నిగ్రహించుటకు శక్యము కానిదనుటలో సందేహము లేదు. కాని అభ్యాస, వైరాగ్యములచేత, మనస్సు నిగ్రహింపబడుచున్నది.

## మనోనిగ్రహము లేనివానికి యోగసిద్ధి కలుగుట దుర్లభము.

కాని మనో నిగ్రహము కలవాడై ప్రయత్నించువానికి ఉపాయము వలన పొందుట సాధ్యమని నా అభిప్రాయము.

ఏ మనుజుడు నాయందు మనస్సును నిలిపి శ్రద్ధతో నన్నే సేవించు చున్నాడో అట్టివాడు యోగులందరిలోను శ్రేష్టుడని నా అభిప్రాయము.

# VIII.

ఇంద్రియాల కంటె వాటి విషయాలు శ్రేష్టమైనవి. విషయాల కంటె మనస్సు గొప్పది. మనస్సు కంటె బుద్ధి ప్రశస్తమైనది. బుద్ధికంటె కూడా ప్రశస్తమైనది మహత్తు. అవ్యక్తం మహత్తు కంటె ఉత్కృష్టమైనది. అవ్యక్తాని కంటె కూడా పరమోత్కృష్టమైనది పురుషుడు అపురుషుని మించినదేదియును లేదు.

## అదే పరమ గమ్యము అదే చరమసీమ.

**వివరణ :** ఇచట సూక్ష్మత ననుసరించి శ్రేష్టత నిర్ణయించబడినది. అన్నిటికంటె శ్రేష్టతమైనది శుద్ధచైత్యం, పురుషుడు. ఇదే ద్రవ్యానికి చేతనకు ఆధారమైనది. దీనికంటె కొంచెం స్థూలమైనది ప్రకృతి. అదే అవ్యక్తమైన పదార్థము. శక్తిని, పురుషునిపై ఆవహించి ఈ విశ్వమనే కల కల్పించేది ఇదే, ఇందులో మొదటి కల్పన విశ్వచైతన్యమైన హిరణ్యగర్భుడు, ఇది అన్ని జీవాత్మల సమిష్టి. బుద్ధి, మనస్సు అనే రెండు జీవాత్మల విశేష లక్షణాలు. విశ్వద్రవ్యం స్థూలరూపంలో మరలా రెండవుతుంది ఇంద్రియాలు వాటి విషయాలు అని.

**విషయాలు శ్రేష్టమైనవి :-**

ఇక్కడ విషయాలంటే పంచ మహాభూతాలని అర్థము. ఇంద్రియాలు గ్రహించే అన్ని విషయాలు వాటి సంయోగాల వలననే ఏర్పడ్డాయి. మౌలికాలయిన ఈ మహాభూతాలు ఇంద్రియాలకంటె గొప్పవని చెప్పడానికి కారణము ఇంద్రియాలు కూడా తక్కిన అన్ని విషయాల వలెనే ఆ పంచమహా భూతాల కలయిక వలననే ఏర్పడును. కార్యం కంటె కారణం సూక్ష్మము వ్యాపకము కనుక ఇంద్రియాల కంటె మహాభూతాలు శ్రేష్టమైనవని చెప్పబడినది.

**విషయాల కంటె మనస్సు గొప్పది :**

మనస్సు విషయాలను దర్శించగలుగుచున్నది కనుక స్థూల మహా భూతాలకంటె సూక్ష్మమైనది కనుక మనస్సు తన్మాత్రలచేత సూక్ష్మ మహా భూతాలచేత ఏర్పడుచున్నది.

**మహత్తు: –** హిరణ్యగర్భుడు విశ్వాత్మ జీవాత్మల సమిష్టిగా హిరణ్య గర్భుడు చెప్పబడుతాడు.

**అవ్యక్తం :** మూల ప్రకృతి, దీని నుండె మొట్టమొదటగా హిరణ్య గర్భుడు ఆవిర్భవిస్తాడు.

## IX.

అన్ని జీవులలోను గుప్తమైయున్న ఈ ఆత్మ అందరికి ప్రకటితం కాదు. సూక్ష్మదర్శులైన ఋషులు మాత్రమే తీక్షణమైన, ఏకాగ్రమైన తమ బుద్ధి ద్వారా ఆ ఆత్మను సాక్షాత్కారించుకొనగలరు.

**సూక్ష్మదర్శులైన ఋషులు :** విషయాల సూక్ష్మతలను వివేచించి దర్శించగలిగే బుద్ధిసూక్ష్మత గలవారు.

**తీక్షణమైన ఏకాగ్రమైన బుద్ధి :** ఇతర విషయములపై చెదరకుండా ఆత్మపైనే ఏకోన్ముఖం చేయబడిన బుద్ధి.

## X.

ప్రాజ్ఞుడైనవాడు వాక్కును మనస్సులోను, మనస్సును బుద్ధి యందును, ఆ బుద్ధిని హిరణ్యగర్భునిలోను ఆ హిరణ్యగర్భుని కూడా తుదకు పరమశాంతి అనే పరమాత్మయందు క్రమముగా లయింపచేయాలి.

సంయమా ధ్యానం ఇక్కడ ప్రస్తావించబడినది. మొదట ఇంద్రియ చర్యలనన్నిటిని నిలిపివేయాలి. చేతనను ఇంద్రియముల నుండి

ఉపసంహరించుకొని మనస్సుపైనే కేంద్రీకరించాలి. తరువాత మనస్సుకు కూడా ఇంకా లోపలికి, చేతనను, ఉపసంహరించి, వివేచనా శీలమైన బుద్ధి యందు నిలపాలి. ఆపైన అక్కడ నుండి కూడా లోనికి పోయి విశ్వాత్మ స్ఫురణలో ఏకాగ్రం చేయాలి. ఇది పరిశుద్ధమైన అహంకారము వలననే సాధ్యం. ఆ తెరను కూడా చీల్చివేసి ఇంకా లోపలికిపోతే స్వత సిద్ధమైన చైతన్య స్వరూపం సాక్షాత్కరిస్తుంది.

ఇక్కడ పరమశాంతి శాంతి ఆత్మ అని సార్థకంగా చెప్పబడినది. ప్రకృతి యొక్క అన్ని కార్యకలాపాలు ఇక్కడ పూర్తిగా లుప్తమై పోతాయి.

# XI.

లేవండి! మేల్కొనండి! శ్రేష్టులైన ఆచార్యులను ఆశ్రయించి ఆ ఆత్మను సాక్షాత్కరించుకొండి. ఆ మార్గం కత్తిమొన లాగ తీక్షణమైనది. దానిననుసరించి పోవడం కూడా ఎంతో ప్రయాసతో కూడినదని, తరించడం ఎంతో కష్టమని విజ్ఞులు చెపుతారు.

ఆత్మసాక్షాత్కారం మార్గం ఎంత కఠోరమైనదో చెపుతూ ఈ మార్గంలో గమ్యం చేరడానికి అత్యంతమైన అప్రమత్తతా, చాకచక్యము అవసరమని యముడు నచకేతునకు బోధిస్తున్నాడు.

# XII.

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు లేనిది, నాశరహితమైనది, మహత్తుకు అతీతమైనది, అవికార్యమైనది అయిన ఆత్మను సాక్షాత్కరించుకొని మానవుడు మృత్యువు నుండి విముక్తుడవుతాడు.

మనలోని పరమాత్మను గురించి అజ్ఞానంలో ఉన్నంత కాలము చావు పుట్టుకలు తప్పవు. ఆత్మలో చావు పుట్టుకలవంటి వికారాలేవి లేవు.

అది చైతన్యం యొక్క శాశ్వతమైన అవికార్యమైన కేవల స్వరూపం. ఆత్మను తెలుసుకోవడం సాక్షాత్కరించుకోవడం అంటె ఆ శుద్ధ చైతన్య స్థితిని అనుభవగతం చేసుకోవడం.

# XIII.

యమరాజు చెప్పిన ఈ నాచకేతోపాఖ్యానాన్ని సనాతనమైనదాన్ని ఇతరులకు చెప్పి, తాను వినిన బుద్ధిశాలి బ్రహ్మలోకంలో ఘనత పొందుతాడు.

**ఇతరులకు చెప్పి తాను విని :** సమర్థులైన ఆచార్యుల ద్వారా తాను ఉపదేశం పొంది అర్హులైన సాధకులకు తాను ఉపదేశించి ఘనత పొందుతాడు. బ్రహ్మలోకంలో ఐక్యము అవుతాడు.

# IVX.

అత్యంత రహస్యమైన ఈ కథను బ్రాహ్మణ సభలోగాని శ్రాద్ధ కర్మ చేసే సమయంలో గాని పరమభక్తితో వినిపించినవాడు అనంతమైన ప్రతిఫలాన్ని పొందగలడు.

**బ్రాహ్మణ సభలో :** బుద్ధికుశలురైన సాధకుల సమావేశంలో ఈ ఆత్మ సాక్షాత్కార రహస్యాన్ని అర్థం చేసుకోగలిగేది వారే మరి.

**శ్రాద్ధకర్మ చేసే సమయంలో :** శ్రాద్ధం, పితరుల నుద్దేశించి వారి ఆత్మశాంతికై చేసే కర్మ అందుచేత ఈ ఆత్మ విభూతిని వివరించడానికి ఇది తగిన సమయంగా చెప్పబడినది.

**ఓం నమో శ్రీనివాసాయ నమః**

**ఓం నమశ్శివాయ నమః**

ఈ చతుర్ధ వల్లిలో సమవర్తి నచకేతునకు ఆత్మను గురించి అతి మధురమగు రమణీయముగ, హృదయమునకు హత్తుకునేటట్లు బోధిస్తాడు. అనేక సోదాహరణములతో వివరిస్తాడు.

## సృష్టిలోనే ఆత్మబోధ అతి ఉత్కృష్టమైనది

నచకేతునకు సమవర్తిచే అతిచక్కని శైలిలో ఆత్మజ్ఞానము ప్రబోధింపబడినది. దీనిని చదివి ఏ ఒక్కరైనను ఆత్మజ్ఞాన నిష్ఠాపరులు కాగలిగితే, అంతకు మించిన అదృష్టము ఉండబోదు.

ఆత్మ సచ్చిదానంద స్వరూపము. అది పరమహంసలకు గతి, తురీయము. జాగృత్, స్వప్న, సుషుప్తి అవస్తలకు అతీతము. అది నిత్యము, నిష్కలంకమైనది. అట్టి ఆత్మయే నేను. దేహేంద్రియ మనోబుద్ధులకు అతీతమైన ఆత్మయే నేను. ఇట్టి ఆత్మ తత్వమును, నిత్యమున ప్రాతఃకాలమున స్మరించెదను.

అని ఆదిశంకరులవారు వచించిరి.

తపస్సుచే పాపములు పోగొట్టుకొన్నట్టి శాంతచిత్తులు, కోరికలను అధిగమించినట్టి, మోక్షాపేక్ష కలిగినట్టి వారి కొరకు ఈ ఆత్మబోధ వ్రాయబడినది అని శంకరులు బోధించిరి.

అగ్ని లేనిదే వండుట సాధ్యపడదు. అట్లే జ్ఞానం లేనిదే మోక్షం సిద్ధించదు. మోక్షమనగా విముక్తి అజ్ఞానమే బంధనము. అవిద్య నాశనం అయినవాడు మన నిజ స్వరూపము తెలిసికొంటాము.

అజ్ఞానం వల్ల ఆత్మ పరిమితమైనట్లు గోచరిస్తుంది. అజ్ఞానం నాశనం అనగానే శుద్ధ ఆత్మ, మేఘములు తొలగగానే సూర్యుడు ప్రకాశించునట్లు స్వయంగా ప్రకాశమానమౌతుంది.

కర్మ మాయను నిర్మూలించలేదు. కర్మ అనునది దానికి భిన్నమైనది కాదు. చీకటిని తొలగించుటకు దీపమే కావలసియున్నది. అట్లే జ్ఞానము మాత్రమే మాయను రూపుమాపగలదు ఏలనన

**జ్ఞానముతో కూడిన కర్మలు – కర్మయోగముగా మారుచున్నది.**

**జ్ఞానముతో కూడిన భక్తి – పరభక్తిగా మారుచున్నదది.**

ఇదియే కర్మ, భక్తి, జ్ఞానయోగముల రహస్యము.

అజ్ఞాన కలుషమైనదానిని జ్ఞాన సాధనామార్గం ద్వారా శుద్ధి చేయాలి. ఇండువు గింజ మలినమైన నీటిని శుద్ధిపరచి తనంతట దిగిపోవునట్లు జ్ఞానం తన శుద్ధి కార్యక్రమం పూర్తికాగానే లయం అవుతుంది.

ఆత్మ స్వరూపం జ్ఞానమే. ఆత్మజ్ఞానమనునది వృత్తిజ్ఞానమైన మేధస్సుకు సంబంధించినది. వృత్తి చైతన్యము మూల చైతన్యంలో లయం అయిననాడు జీవభావం పోతుంది. వ్యక్తి చైతన్యం శుద్ధ అఖండ చైతన్యంలో లీనం కావాలి. అంతటి సృష్టి కథ ముగస్తుంది.

మనము కలగంటున్నంత కాలము అది యథార్థముగానే కన్పిస్తుంది. అటులనే రాగద్వేషాలతో కూడుకొన్న సంసార జీవితం జ్ఞానోదయం కానంతవరకు నిజమైన దానివలె గోచరిస్తుంది.

**పారమార్థిక సత్తాలో ప్రవేశించిన వారికి ప్రపంచము స్వప్నతుల్యమే.**

జ్ఞానోదయమై ఆత్మజ్ఞాన నిష్ఠ కుదరనంత కాలం జీవుడు చచ్చుచు, పుట్టుచు సంసార బాధలకు లోనౌతూ ఉంటాడు. క్షణిక సుఖాలకు, కష్టాలకు గురి అవుతుంటాడు. వ్యావహారిక ప్రపంచము కూడా స్వప్న ప్రపంచము వలె దానిని అధిగమించనంతకాలం వాస్తవమైన దానివలె భ్రమింపజేస్తూ ఉంటుంది.

**ఆధ్యాత్మిక శిఖరాల నుండి చూస్తే వ్యావహారిక, స్వప్న ప్రపంచములు రెంటికి తేడాలేదు. రెండును క్షణికములే.**

బ్రహ్మపదార్థము సత్–చిత్–ఆనందమయము. ప్రపంచ దృష్ట్యా చూస్తే సృష్టి, స్థితి, లయలకు కారణభూతము నీటిలో పుట్టి, కొంత కాలముండి, తిరిగి అందులోనే కలిసిపోవు బుడగవలె, ఈ అనంత సృష్టి కూడ బ్రహ్మములోనే పుట్టి బ్రహ్మములోనే పెరిగి బ్రహ్మములోనే లయిస్తుంది.

మాయ ఆత్మను కప్పి, అనాత్మను స్ఫురింపచేస్తుంది. జాతి, మతము, కులము – స్త్రీ పురుష బేధములను శుద్ధాత్మయందు మాయవల్ల ఆరోపిస్తున్నాము. ఉపాధి దోషము మాయా కల్పితము.

**అది తొలగగానే మిగిలేది ఆత్మ ఒక్కటియే.**

దంచి నూకను బియ్యం నుండి వేరు చేయునట్లు యుక్తిచేత మధించిఇ పంచకోశములను శుద్ధాత్మ నుండి వేరుచేయవలయును.

విచారణ, వివేకము అనునవి జ్ఞానమునకు ముఖ్య సాధనములు. శ్రవణ, మనన, నిది ధ్యాసనలు వీటికి మూలము. వీని ద్వారా పంచకోశములను, విడదీసినచో నిజమైన నేను మిగులును.

పరిశుభ్రమైన అద్దంలో ప్రతిబింబము చక్కగా కన్పడుతుంది. అటులనే పరిశుద్ధమైన మనస్కులకే ఆత్మ ప్రకాశమానమవుతుంది.

నిష్కల్మశమైన మనోబుద్ధులను కలిగి యుండవలయును.

క్రమశిక్షణ నీతిమార్గము కలవారికే కేంద్రీకృతమైన బుద్ధి కుదురుతుంది.

**అట్టివారే ఆత్మసాక్షాత్కారము పొందగలరు.**

రాజుగారు తన దర్బారులో జరుగు ఉత్సవ కార్యక్రమం చూస్తారు. వారు లేనిదే ఉత్సవం జరుగదు. కాని వారు ఉత్సవంలో భాగస్తులు కారు. అటులనే ఆత్మ–దేహం, ఇంద్రియములు–బుద్ధి స్వభావములకు అతీతము విలక్షణము అయినది. ఆత్మసాక్షి చైతన్యము అట్లు ఆత్మను తెలియవలెను.

**నిజమైన నేను అనునది కేవలము సాక్షిస్వరూపము. దానికి సంఘటనలతో నిమిత్తము లేదు. వాటికి అది చలించదు.**

అవివేకికి ఆకాశంలో మేఘములు కదులుతుంటే చంద్రుడు కదులుతున్నట్లు తోస్తుంది. అటులనే అవివేకి ఇంద్రియములు చేయు పనులను ఆత్మకు అంటకడతాడు.

వివేకము లేనంత కాలము ఆత్మ అనాత్మలకు బేధం తెలియదు. అనాత్మ క్షణికమైనది. ఆత్మ శాశ్వతమైనది.

సూర్యుని కాంతివల్ల జనం పనులు చేసుకుంటారు. కాని మనం చేసే పనులతో సూర్యభగవానునికి ఎట్టి సంబంధం లేనే లేదు. అటులనే ఆత్మచైతన్యము నాశ్రయించుకొని దేహము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి వాటి, వాటి పనులు చేస్తాయి.

**కాని ఆత్మకు వాటి కార్యకలాపాలతో ఎట్టి సంబంధము లేదు.**

కదలిక నీటిదైనా దానిని అందలి చంద్రబింబానికి ఆపాదిస్తాము. అటులనే కర్తృత్వాదులు ఉపాధియైన మనమునకు చెందినవే అయినా, అజ్ఞానం వలన వాటిని ఆత్మకు ఆపాదిస్తాము.

అనురాగము, కోరిక, సుఖం, దుఃఖం, మొదలగునవి మనసుకు సంబంధించినవైయున్నవి. సుషుప్తిలో అవి లేవు కనుక అవి ఆత్మకు సంబంధించినవి కావు.

వాటిని చూచి, పాము అని భ్రమించి భయం చెందునట్లు జీవభావం వల్ల భయం కలుగుతుంది. నేను ఆత్మను – జీవున్ని కాను అను నిశ్చయ జ్ఞానం కల్గిననాడు అంతా నిర్భయమే.

వెలుగుచున్న దీపమును గుర్తించుటకు వేరొక దీపం అవసరం లేదు. జ్ఞాన స్వరూపమైన ఆత్మను తెలియుటకు వేరు ఇతరజ్ఞానం అవసరం లేదు.

**అవిద్యా నిర్మూలనమే ఆత్మ తేజస్సును బయటకు తెస్తుంది.**

ఆత్మకు గుణములు లేవు. కార్యములు లేవు, వికల్పములు లేవు. ఎట్టి మలినము కాని, వికారము కాని లేవు, ఆకారములు లేవు. అది శాశ్వతము–నిత్యశుద్ధము బంధరహితము.

ఏకాంత ప్రదేశములో కూర్చొని, కోరికలను జయించి, ఇంద్రియ నిగ్రహము కలిగి, అనంతము, ఏకమయిన ఆత్మను ధ్యానించవలెను.

యావత్తు దృశ్య ప్రపంచమును ఆత్మయందు లయము చేసి, తెలివికలవాడు ఆత్మ ధ్యానము చేయును. నిర్మలాకాశము వలె అది సదా శుద్ధమైనది.

స్వస్వరూపం సంధానమే ముక్తి. దీనిని క్రొత్తగా సంపాదించవలసిన అవసరము లేదు. అజ్ఞానం వల్ల మన నిజస్వరూపమును మనము మర్చినాము. అది నాశనం అయిననాడు **ఆత్మసాక్షాత్కారం లభిస్తుంది.**

కుండ, పిడత, మూకుడు మొదలగువన్నియు మట్టియే. నామరూపాదులకు వెనుకనున్న మూలం మట్టియే. అటులనే జగత్ అంతయు ఆత్మయే. ఆత్మకంటె భిన్నమైనదేదియును లేదు. జ్ఞాని సర్వత్రా ఆత్మనే ధరిస్తాడు.

భ్రమర కీటక న్యాయమువలె (కీటకం భ్రమరమందలి భయముచే ఎల్లప్పుడు దానినే స్మరించుచు కొంతకాలమునకు తానును భ్రమరమే

యగును) జీవన్ముక్తుడు ఉపాధులు త్యజించి ఆత్మజ్ఞాన నిష్టుడగును. తన సచ్చిదానంద స్వభావము వలన బ్రహ్మమే యగును.

నీటిలో కలిసిన నీరు, మహాకాశంలో కలిసిన ఘటాకాశం, వెల్తురులో కలసిన వెల్తురు ఎట్లు ఒకటి అగునో ఉపాధి రహితమైన ముని సర్వవ్యాప్తి అయిన విష్ణుతత్వంలో నిర్విశేషంగా లీనమయిపోవును.

దేనిని చూచిన ఇక చూడదగినది ఏమియు ఉండదో, దేనిని పొందిన ఇక పునర్జన్మ ఉండదో, దేనిని తెలిసిన ఇక తెలియదగిన దేమియు ఉండదో అదియే బ్రహ్మము.

సృష్టికర్త మొదలగువారు పరబ్రహ్మము యొక్క అఖండ ఆనందములో ఒక అణువును రుచిచూచి తదనుగుణ్యంగా ఆనందం అనుభవిస్తున్నారు.

బ్రహ్మము సూక్ష్మము కాదు. స్థూలము కాదు, పొట్టికాదు, పొడుగు కాదు, పుట్టుకలేదు, మార్పులేదు, రూపము, గుణము, రంగు, పేరు దానికి లేవు.

దాని వెల్తురు వల్లనే సూర్యాదులకు ప్రకాశము కలుగుచున్నది. దానిని ఇతర వస్తువులు ప్రకాశింపచేయలేవు.

**జ్ఞానచక్షువు ద్వారానే సర్వవ్యాప్తి చైతన్యస్వరూపి అయిన ఆత్మను దర్శించగలము. అంధుడు సూర్యుని చూడలేడు. అటులనే అజ్ఞాని ఆత్మను చూడలేడు.**

**యావత్తు సృష్టి బ్రహ్మముచే పరివేష్టింపబడియున్నది. బ్రహ్మచైతన్య ప్రసాదం వల్లనే వ్యవహారం జరుగుచున్నది. పాలలోని వెన్న వలె బ్రహ్మం అంతట నిండియున్నది.**

**ఆత్మజ్ఞానము నెరిగి అందు నిత్య నిమగ్నుడగు నిష్టాపరునకు అమృతత్వము శాశ్వతానందము లభించును.**

# I.

స్వతసిద్ధుడు, స్వయంగా ఆవిర్భవించినవాడు అయిన భగవంతుడు ఇంద్రియాలని దోషపూరితాలుగా సృష్టించాడు. అందుచేత అవి బయటి విషయాల వైపే పోగలవు. **లోనున్న ప్రత్యగాత్మను దర్శించలేవు.** సకృతుగా ఎవరో ఒక ధీరుడు అమృత తత్వాన్ని కోరి తన కన్నులను లోపలికి మరల్చుతాడు. అంతరాత్మని దర్శిస్తాడు.

**వివరణ :** ఇచట కన్నులు అన్నిఇంద్రియాలకు ఉపలక్షణంగా ప్రయోగించబడినది.

పరమాత్ముడు ఉద్దేశ్యపూర్వకంగా, జీవునకు తరించే మార్గంలో, ఒక పరీక్షా భాగంగా ఇంద్రియాలను బహిర్ముఖం చేశాడు. అందుచేత అవి మామూలు పరిస్థితులలో ఇంద్రియ సుఖాలనే అవి ఆశిస్తాయి.

ప్రియమును కలిగించేవి మన ఇంద్రియాలకు తాత్కాలికంగా సుఖాన్నే కలిగిస్తాయి. కాని కాలక్రమంలో ఈ ఇంద్రియ సుఖం దుఃఖాంతం అవుతుంది. దురదృష్టవశాత్తు మనలో విచక్షణ లోపించడం వలన ప్రియమును కలిగించే వస్తుజాలాన్ని సంపాదించటంలోనే బ్రతుకంతా గడిచిపోతుంది. ఈ ప్రియాలు మనకు ఆత్మకళ్యాణం కలిగించలేవు.

**ఇందుకులకు విరుద్ధంగా ఉన్నదే శ్రేయోమార్గము.**

మొదట్లో శ్రమకరంగా ఉన్నా రానురాను సుఖంగా అంతం కావడమే శ్రేయోమార్గము.

కేవలము డబ్బును, సుఖాన్ని కోరుకునేది ప్రేయోమార్గము. కాని శాశ్వత శాంతిని, ఆనందాన్ని కోరుకునేది శ్రేయోమార్గము.

**విషయకర్మలు వేరు – శ్రేయోకర్మలు వేరు.**

మనము జీవితంలో ఎదుర్కొనే అనర్థాలకు, బాధలకు మొదటి కారణము మనము శ్రేయోమార్గాన్ని కాదని కేవలము ప్రియమును కల్గించే మార్గాన్ని ఎన్నుకోవడమే.

**కాని ఒకానొక ధీరుడు, స్ఫురద్రూపి, ఆత్మజ్ఞాని, బ్రహ్మనిష్ఠా పరుడు శ్రేయోమార్గాన్నే ఎన్నుకొని ఇంద్రియాలను అంతర్ముఖము చేసి ఆత్మ సాక్షాత్కారాన్ని పొందుతాడు.**

సమాజంలోని ప్రతీవ్యక్తి సమాజంలోని అంతర్భాగమే. కన్ను, చెవులు, ముక్కు, చేతులు, కాళ్ళు ఇవన్నీ వేరువేరుగా కనిపిస్తున్నా అవి అన్నీ ఒక మనిషిలోని అంతర్భాగాలే. మనిషికి సమాజానికి గల సంబంధం ఇలాంటిదే.

దారిలో కన్ను ముల్లును చూచిన క్షణమే కాలు దానిని దాటుతుంది. కన్ను చూచింది కాలు దాటింది. కాలికి ముల్లు నాటితే కన్ను ఏడుస్తుంది. ఇది సన్నిహిత సంబంధము.

గ్రామం శరీరం వంటిది. గ్రామంలోని ఇండ్లన్నీ శరీరంలోని అంగముల వంటివి. ఎవరికి ఏ బాధ కలిగినా మనకే ఆ బాధ కలిగినట్లు భావించాలి. ఇవాల వారికి కలిగినది మనకు రేపు కలుగవచ్చును. చెప్పుటకు వీలు లేదు.

ఒకరికొకరు సహాయకారిగా ఉండాలి. అనవసరంగా ఒకరిని నొప్పించే మాటలు పలుకగూడదు.

సేవాపరముగా మూడు విధములైన మనోలయములను సేవాసాధనలో గుర్తించాలి.

**1) బాధావస్తలో –** సేవ నేను చేస్తున్నాను. సేవ చేయించుకునేది దైవ స్వరూపుడైన మానవుడు. ఈ అవస్థలో మనస్సు లీనం కావడం సూక్ష్మ శరీరంలో మనస్సు లీనం కావడం!

**2)** సేవలో ఆనందం పొందుతూ తన్మయీ భావమునకు, ఆనంద పారవశ్యంలో మనస్సు లయించడము అర్ధ బాధావస్థ. ఈ దశలో దేశం, కాలం వంటి బాహ్య స్ఫురణ లేకుండా ఆనందస్ఫురణలోనే ఉంటుంది మనస్సు. ఇది బాధావస్థకు పైమెట్టు.

**3)** తర్వాతది మహాకారణంలో మనస్సు లయించే స్థితి. ఇక్కడ సేవ చేస్తున్నాను అనే స్ఫురణ కూడా ఉండదు. ఊపిరి పీల్చుతున్నాను అని ఎవరూ అనుకోరు. అది ఒక సహజస్థితి.

మనస్సును నశింపచేయటం ఎలా? ఒకరు రమణ మహర్షిని అడిగారు.

అసలు మనస్సనేది ఉన్నదా? మనస్సు ఒక భ్రమ. అది అహంకారం నుండి పుట్టినది. స్థూల, సూక్ష్మ ఇంద్రియములే లేకుంటే నీకు మనస్సనేది తెలియదు. ఇంద్రియములు ఎప్పుడు లేకుండా ఉంటాయి? నిద్ర అయినా ఉండాలి లేకుంటే ఆత్మయందు లీనమైనవాడివైనా అయి ఉండాలి.

Watch your Words

Watch your Acts

Watch your Thoughts

Watch your Character

Watch your Heart

వీటన్నిటిలో సత్వగుణాన్ని ప్రతిబింబచేయగలిగితే పరమాత్మ సాక్షాత్కారము అసాధ్యం ఏమీ కాదు.

భగవద్గీత యందు శ్రీకృష్ణపరమాత్మ బోధించినట్లుగా భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము అని భగవంతుని మాయ 8 విధములుగా యున్నది.

అర్జునా ఈ అపరా ప్రకృతి చాలా నికృష్ణమైనది ప్రాణులకు జీవరూపమైనదియు, జగత్తునకు ఆధారమైనదియు, శ్రేష్టమైనదియు అగు పరాప్రకృతిని తెలిసికొనుము.

ఒక కుండ కలదు. దానిలో నీరు ఉన్నది. ఆ నీటిలో సూర్యుడు ప్రతిబింబిచెను.

**ఇచట సూర్యుడు పరమాత్మ**

**పరాప్రకృతి** —— ప్రతిబింబము - జీవుడు

**అపరాప్రకృతి** ⌈ ఘటము - దేహము
⌊ నీరు - మనస్సు

వికారములన్నియు ఘట, జల ప్రతిబింబాలకే కలుగును గాని సూర్యునికెట్లు కలుగదో అట్లే సమస్త జగద్వికారములును పరాపర ప్రకృతికే కలుగును కాని తద్విలక్షణమైన ఆత్మకు కాదు.

**కాబట్టి ముముక్షువగువాడు పరాపర ప్రకృతులు రెంటిని దాటి సాక్షియగు ఆత్మను చేరవలెను.**

ఈ అనంత బ్రహ్మాండ సృష్టి అంతా ఈశ్వరుని సొత్తు. అదే విధంగా జీవకోటి అంతా ఈశ్వర సంతానము.

అందుచేత పరమాత్మ ఈ సృష్టిలోని ఐశ్వర్యాన్ని అంతా జీవుల యొక్క కర్మల ఆధారంగా చేసికొని పంచడం జరిగింది.

కావున ప్రతీ జీవుడు ఇతరుల ధనాన్ని ఆశించక, తన కర్మఫలంగా, ఈశ్వరునిచే న్యాయమార్గంలో ప్రసాదింపబడిన ధనాన్ని ఆధారం చేసికొని విద్యుక్త ధర్మాలతో, నిష్కామ కర్మలతో పరాభక్తితో, ఆత్మజ్ఞానంతో ఈ జీవనయాత్ర సాగించాలి.

**మరియు దేహంతమందు పరమాత్మలో లయం కావాలి ఇదియే సృష్టి రహస్యము.**

భగవద్గీత యందు గల పరాప్రకృతిని విష్ణుతత్వము ఈ విధముగా వర్ణించినది.

భౌతిక సృష్టికై భగవంతుడైన కృష్ణుని సంపూర్ణ వ్యాప్తి మూడు విష్ణురూపములను పొందును.

1) అందు మొదటిది అయిన మహావిష్ణువు మహా తత్వమనబడు సర్వభౌతిక సృష్టిని సృష్టించును.

2) రెండవది గర్భోదకశాయి విష్ణువు ప్రతీ విశ్వము నందును వివిధ రూపములను సృష్టించుటకు అన్ని విశ్వములను ప్రవేశించును.

3) మూడవదిఐన క్షీరోదకశాయి విష్ణువు సర్వ విశ్వముల యందును పరమాత్మ రూపముగా వ్యాపించును. అతడు అణువులో కూడా యుండును.

ఈ 3 విధములగు విష్ణువులను తెలిసికొనినవాడు భౌతిక బంధముల నుండి విడివడును.

## II.

పసిబాలురు బాహ్యసుఖాల వెంట పడతారు. అలా వారు విస్తారమైన మృత్యువు వలలో పడతారు. కాని ప్రాజ్ఞులు ఈ అనిత్య విషయాల మధ్య నిత్యము, శాశ్వతము, అమరమూ అయినదేదో తెలుసుకొని ఈ ప్రపంచములో దేనిని కూడా కోరరు.

**పసిబాలురు :** అనుభవము, ఆలోచన లేని అజ్ఞాన జీవులు

**విస్తారమైన మృత్యువు :** జీవితంలోని అన్ని వికారాలు- జన్మ, వృద్ధి, స్థితి, క్షయము, పరిణామము.

శ్రీ భగవానుడైన కృష్ణపరమాత్మ ఈ విధముగా పలికెను.

అభయము, సత్యసంయుద్ధి, జ్ఞానయోగ నిష్ట, దానశీలము, నిగ్రహము, యజ్ఞములు, అధ్యయనము, తపస్సు, ఋజుత్వము, అహింస, సత్యము, క్రోధము లేకుండుట, త్యాగము, శాంతి, చాడీలు చెప్పకుండుట, శాంత స్వభవము, మృదుత్వము, సిగ్గు, చపలత్వము లేకుండుట, గర్వము లేకుండుట మొదలగు సుగుణములు దైవసంపద కలవారికి కలుగుచున్నవి.

| | | |
|---|---|---|
| **రాగము** | **లోభము** | **అసూయ** |
| **ద్వేషము** | **మోహము** | **డంబము, దర్పము** |
| **కామము** | **మదము** | **అహంకారము** |
| **క్రోధము** | **మత్సరము** | **అజ్ఞానము** |

అగు రాగద్వేషాదులు అసుర సంపద కలవారికి కలుగుచున్నవి.

**దేవీసంపద మోక్షమును, అసుర సంపద బంధమును కలుగ చేయుచున్నది.**

అసుర సంపద గలవారు ప్రవృత్తి మార్గము గాని నివృత్తి మార్గమును కాని ఎరుగరు. వారియందు శుచి యుండదు. ఆచారము గోచరించదు. సత్యము అగుపించదు.

వారు ప్రపంచము అసత్యమనియు, ప్రతిష్టలేనిదనియు, భగవంతుడు లేడనియు, కామము యొక్క కారణము స్త్రీపురుషుల సంబంధము వలననే కలిగినదనియు దానికి వేరే కారణము లేదనియు చెప్పెదరు.

ఈ భావము కలిగినవారై చెడిన మనస్సు కలవారై, అల్పబుద్ధులై, క్రూర కర్ములై, లోక కంఠకులగు ఈ అసుర స్వభావము కలవారు ప్రపంచ నాశనము కొరకై జన్మించుదురు.

వారు తృప్తిచెందని కోరికలు గలవారై, డంబ దర్పాది మానములతో కూడినవారై భ్రష్ట ఆచారవంతులై దురాచారములను మోహ ప్రభావముతో ఆచరించుదురు.

వారు అపరిమితమైనదియు, మృత్యువే అంతముగా గల విషయ చింతనను ఆశ్రయించినవారై, కామేన భోగమే ఉత్తమమని భావించుచు, అదియే పరమార్థమని నిశ్చయించుచు, ఆశా పాశములచే బద్ధులై, కామ క్రోధ పరాయణులై, ఈ కామేప భోగర్థము, అన్యాయ మార్గము ద్వారా ధనార్జన చేయుచున్నారు.

ఇది నాకు ఇప్పుడు లభించినది, ఇక మీదట ఈ కోరికను పొందుదును. నాకు ఇంత సంపదయున్నది. ఇంకను ఇకమీదట వచ్చును. ఈ శత్రువును ఇప్పుడు చంపితిని. మిగిలినవారిని ఇకమీదట చంపబోవుదును. నేను ప్రభువును, భోగిని, సిద్ధుడను, బలవంతుడను, సుఖవంతుడను, ధనవంతుడను, గొప్ప కులము కలవాడను, నాతో సమానుడు లేడు. నేను యజ్ఞము చేసెదను, దానము చేసెదను, సంతసించెదను అని అజ్ఞాన మోహితులై భ్రాంతికి లోనైన చిత్తము కలవారై కామ భోగములందు ఆసక్తి కలిగిన మలినములైన నరకమున పడుచున్నారు.

వారు ఆత్మస్థుతి కావించుకొనుచు, అవివేకులై ధనాభిమానములచేత మదము కలవారై విధి రహితముగా పేరు కొరకు యజ్ఞము చేయుదురు.

వారు అహంకారమును, బలమును, గర్వమును, కామమును, క్రోధమును ఆశ్రయించినవారై తమయందును ఇతరుల యందును ఉన్నానన్న అసూయతో జూచువారలై ద్వేషించుచున్నారు.

నన్ను ద్వేషించుచు క్రూరస్వభావులై అశుభగులకు ఆ నరాధములను రాక్షస సంబంధములగు గర్భములయందు ప్రవేశపెట్టుచున్నాను.

అర్జునా! ఈ విధముగా అసుర జన్మము నెత్తిన మందగతులు ప్రతీ జన్మమునందును నన్ను పొందకనే అంతకంతకు అథోగతి పాలగుచున్నారు.

కామము, క్రోధము, లోభము అనునవి నరకమునకు మూడు ద్వారములైయున్నవి. ఇవి వినాశనమును కలిగించును. కనుక ఈ మూడింటిని విడవవలయును.

అర్జునా! అజ్ఞాన ద్వారములైన ఈ మూడింటిని విడిచిన మానవుడు తనకు శ్రేయమును కలిగించుకొనుచు ఆతరువాత పరమోత్కృష్టమగు మోక్షమును పొందుచున్నాడు.

ఎవడు శాస్త్రోక్త విధిని విస్మరించి యథేచ్ఛగా కాయోపభోగములై వర్తించుచున్నాడో

**వాడు సిద్ధిని బడయలేడు. సుఖమును పొందలేడు. మోక్షమును పొందజాలడు.**

కార్యకర్మములను నిర్ణయించుటకు నీకు శాస్త్రమే ప్రమాణము కావున శాస్త్రము నందు తెలుపబడిన కర్మలను తెలిసికొని కర్మలను ఆచరింపుము.

# III.

రంగు, రుచి, వాసన, శబ్ద, స్పర్శలను మైథున సంయోగాలను, మానవుడు, ఏ ఆత్మచేత తెలుసుకుంటున్నాడో ఆ ఆత్మకు తెలియరానిది ఈ ప్రపంచంలో ఏమున్నది-

**ఇదే (నీవు తెలుసుకోగోరిన) ఆ ఆత్మ.**

ఇంద్రియాలకు, మనస్సుకు కూడా వెనుకనున్న ఆ శుద్ధ చైతన్యమే ఆ ఆత్మ.

ఏది ప్రాణమునందు ఉన్నదో, దేనిని ప్రాణం తెలుసుకోలేదో, ఏది ప్రాణమును నియమిస్తున్నదో ఆ అంతర్యామియైనదే ఈ ఆత్మ.

ఏది వాక్కు మొదలైన ఇంద్రియములలో ఉన్నదో దేనిని ఆ ఇంద్రియములు తెలుసుకోలేవో... ఏది ఆ ఇంద్రియములను నియమిస్తున్నదో ఆ అంతర్యామియైనదియే ఈ ఆత్మ.

ఏది నీ మనస్సునందున్నదో, బుద్ధియందున్నదో, దేనిని మనస్సు, బుద్ధితో తెలుసుకోలేదో, ఏది బుద్ధిని, మనస్సును నియమిస్తున్నదో ఆ అంతర్యామి అయినదియే ఈ ఆత్మ.

ఇలా దేహము, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, వీటన్నిటిలో ఉన్నదిని, వీటిచేత తెలుసుకోబడనిదిన్ని, వీటన్నిటిని నియమించేదిన్ని అయినట్టి ఆత్మకంటె వేరే దృష్ట, శ్రోత ఈ సృష్టిలో లేదు.

సంకల్పాలు చేసేది, నిశ్చయం చేసేది ఏదో, ఇలా సంసారుల యొక్క కర్మఫలాన్ని అనుభవింపజేసేది, ఏదై ఉన్నదో అదే నాశరహితమైన ఈ ఆత్మ. ఈ ఆత్మకంటె ఇతరమైన దంతయును నశించేదే.

నేను బ్రహ్మ మొదలుకొని గడ్డిపోచవరకు ఉన్న చరాచరాల హృదయాలలో అంతర్యామిగా ఉన్నాను, నాతో పోల్చి ఈ జీవులకు కర్మ ఫలానుసారంగా వాటి జ్ఞానం గాని, జ్ఞప్తి గాని, మరుపుకాని అన్నీ కలుగుచున్నవి.

నా దేహం, నా ఇంద్రియాలు, నా మనస్సు, నా బుద్ధి, నా అహంకారము అనే మాటలలోనే తెలుస్తున్నది. ఆత్మ– జడపదార్థాలైన దేహాన్ని, మనస్సును ఇంద్రియాలను ప్రకాశింపజేస్తున్నదనే సత్యము.

సాక్షాత్తుగా, ప్రత్యక్షంగా తెలుస్తుంటే, ఈ విషయాన్ని గ్రహించ కుండా, ఈ ఆత్మకోసం శాస్త్రాలలోను – పుస్తకాలలోను వెదకడం మొదలు పెట్టారు మహామహా పండితులు అనుకునేవారు కూడా!

## IV.

స్వప్నావస్థలో, జాగృతావస్థలో, అన్ని విషయాలను, ఏ ఆత్మ ద్వారా మానవుడు దర్శిస్తాడో, మహత్తరము, సర్వవ్యాపి అయిన ఆ ఆత్మను సాక్షాత్కరించుకొని ప్రాజ్ఞుడు ఇక శోకించడు.

మనకు మూడు అవస్థలలో అనుభవము కలుగుచున్నది.

మొదటిది – జాగృతావస్థ... జాగృతావస్థ యందు వ్యక్తి దేహేంద్రియ మనోబుద్ధుల ద్వారా స్థూల ప్రపంచము అనుభవించును.

రెండవది – స్వప్నావస్థ. ఇందు జీవుడు మనోనిర్మితమైన ప్రపంచంలో సుఖదుఃఖముల ననుభవించును. ఇచట దేహము, ఇంద్రియములు పనిచేయవు (ప్రస్ఫుటము కావు).

మూడవదియగు సుషుప్తి యందు మనోబుద్ధులు గూడా విలీన మగుటచేత సమస్తము లయించిపోవుచున్నది. అజ్ఞానముచే ఆవరింపబడి దుఃఖ రహిత స్థితియందు ఉండుట జరుగుచున్నది. ఇదియే సుఖరూపమని చెప్పబడుచున్నది. ఇచట ఏమియును తెలియకున్నను మేలుకొనిన తరువాత "అహం కిమపిన జావామి" నాకు ఏమియును తెలియలేదు అని చెప్పబడుట చేత సుషుప్తి యందున్న అనుభవము నిరాకరించుటకు వీలు లేనిది యైయున్నది.

అవస్థలు అవి అందించు అనుభవములు, భిన్నముగా తెలియు చున్నను వీటన్నిటిని గ్రహించుటకు ఆధారమైన ఆత్మ అభిన్నమయ్యే యుండుటవలన అవస్థా త్రయమునందలి అనుభవములన్నియు మనకు అందుచున్నవి. ఇవియే బ్రహ్మరూపమైన ప్రజ్ఞానమనబడుచున్నవి. అవస్థా త్రయమును ప్రకాశింపజేయుచు దానికి అతీతముగా నిలిచెడిదే శుద్ధ చైతన్యము. అందుచేత ప్రజ్ఞానము మాటలకు అందనిదైయున్నది. మనస్సు

నిర్వచింపలేనిదైయున్నది. సర్వ విశేషములను తొలగించి చూడగా అనుభవమునకు అందెడి విషయమైయున్నది.

**అందుచేతనే జాగృత్స్వప్న సుషుప్తుల యందు ఏది ప్రస్ఫుటముగా విరాజమానమగుచున్నదో అదియే ఆత్మయైయున్నది.**

అవస్థా త్రయమును ప్రకాశింపజేయునది ఆత్మయగుట చేత ప్రకాశింపజేసెడి వస్తువు, ప్రకాశింపబడు దృష్యములకు అన్యమైనదియై యుండుట చేత ఆత్మ అవస్థాత్రయమునకు అన్యమైనదియనియు అతీతమైనది యనియు గుర్తింపవలయును.

సమస్తమైన శబ్దములు లయించిపోయిన, స్థితియైనందున తురీయము శబ్దముల ద్వారా వ్యక్తము కాబడదు. అందుచేత విశేషములను, స్థితులను నిషేధించుట అనబడెడి మార్గము ద్వార తురీయము నిర్దేశింప బడుచున్నది.

ప్రజ్ఞాన రూపమైన బ్రహ్మము సత్యము.

జాగృతావస్థ యందు స్వప్నము అనుభవమునకు అందుటలేదు. స్వప్నానుభవము జాగృత్ సుషుప్తుల నుండి వేరుపడుచున్నది. సుషుప్తియందు జాగృత్ స్వప్నముల స్పృహయే లేదు.

అవస్థలు ఒకదానికొకటి పరిమితమొనర్చుకొనుచున్నవి. అందుచేత అవి ఏవియును సత్యము కానేరవు. అసత్యమైనను సత్యము వలె గోచరించెడి అవస్థా త్రయముచే పరిమితము చేయబడనందున ఆత్మ సత్యమైయున్నది. జ్ఞానరూపమై యున్నది. అన్యమైనదంతయు అజ్ఞానమని గ్రహించవలయును.

మేలుకొన్నవానికి, స్వప్నము ఎలా అసత్యమైనదని తెలియుచున్నదో, బ్రహ్మానుభవము పొందినవానికి ఈ జాగృత ప్రపంచము కూడా మిథ్యయే యగుచున్నది.

అదే వాస్తవమైనచో మరి ఈ జగత్తేమిటో? ఇక్కడ పొందేడి జ్ఞానము యొక్క విషయమెలాంటిది? గురు శిష్యులేమౌతారు?

రజ్జువునందు సర్పము మాయారూపమున గోచరించు విధముగా గురుశిష్యులనెడి ఆరోపన గూడా జ్ఞానోదయమునకు ముందు అలాంటిదియే అయి ఉన్నది. శిష్యుడు, గురువు, శాస్త్రము అనునవి బోధ యొక్క సౌలభ్యము కొరకే. బోధయొక్క లక్షణమైన జ్ఞానము లభించగానే ద్వైతము అదృశ్యమగు చున్నది అని శ్రీ శంకరులవారు మాండుక్య కారికలో తెలియజేయుచున్నారు.

మనస్సు లేకపోయిన జాగృద్దర్దశయందు ఎవరు ఏమియును గ్రహింపజాలరు. అది బ్రహ్మాకారమైన తానును బ్రహ్మమే అది వ్యతిరిక్తమైన వ్యతిరిక్తమే. జగత్తు మిథ్యాభూతము కనుక జాగృద్దశ యందు గూడా మిథ్యాభూత జగత్తునంతయు కర్తృ కరణ కార్య భోక్తృ భోగ భోగ్యవస్తువులతో సృజించుచున్నది.

స్వప్నమందు కనుగొనిన వస్తువు ఎలాగున మేలుకొనిన తరువాత అసత్యములగుచున్నవో జ్ఞానము కలిగిన తరువాత జాగృత్ పదార్థములు అసత్యములే.

**మనస్సే కల్పితము. అట్టి కల్పనాధురీణయగు మనస్సుచే కల్పింపబడిన భ్రమింపబడిన వస్తువులు కల్పితములు గాక అన్యములగునా?**

**కాన జాగృత్ స్వప్నావస్థల స్వరూపము మనస్ఫూర్తియే గాక వేరు కాదు.**

ఇట్టి అవస్థా త్రయములకు సాక్షిగానున్న ఆత్మను సాక్షాత్కరించు కొన్న ప్రాజ్ఞునికి ఇక శోకమెక్కడిది, అంతా బ్రహ్మానందమే!

5) తేనెను ఆస్వాదిస్తున్నది, జీవితాన్ని పోషిస్తున్నది, భూత భవిష్యత్తులకు ప్రభువు అయిన ఆత్మను చాలా దగ్గరగా తెలుసుకున్న వాడు ఆ తరువాత ఇక భయము చెందడు.

## నిజంగా ఇదే ఆ ఆత్మ

తేనె = కర్మఫలము

చాలా దగ్గరగా = ఈ శరీరంలోనే ప్రత్యగాత్మగా

ధర్మ, అర్ధ, కామ మోక్షములందు, జీవన మరణములందు సమబుద్ధి కలిగి దేనిని కోరకుండా, నిరాకరించకుండా, వచ్చినవాటిని ప్రసాదబుద్ధితో ఆనందంగా స్వీకరిస్తూ నిత్యవర్తమానంలో జీవించే ఉదారుడ దుర్లభుడు.

వ్యక్తిగత అహంకారం నుండి అనంతమైన అహమే తానని గుర్తించే వరకు ఈ జీవనయాత్ర సాగుతూనే ఉంటుంది. ఈ యాత్రలో అవసర విభాగాలుగా నాలుగు మజిలీలుగా చతుర్విద పురుషార్థాలనబడే ధర్మార్ధ కామ మోక్షాలను మన మహర్షులు గుర్తించి నియమించారు. క్రమానుగతంగా వీనిని సాధించడంలో అహంకారము అవసరమైన పద్ధతిలో మలచబడుతుంది. అహంకారం ఉన్నంత వరకు ఈ ధర్మాచరణ అత్యవసరమే. ఈ ఆచరణలోశుద్ధినొందిన అహంకారమే చివరగా ఆత్మానుభవంలో లయం కాగలదు.

మానవ జీవిత లక్ష్యాలయిన ఈ నాలుగు పురుషార్థాల అవసరాన్ని అధిగమించిన జ్ఞాని దర్శనం దుర్లభమే. అహంకార రహితుడైన అట్టి జ్ఞానిలో ప్రయత్నించి సాధించవలసిన ఈ లక్ష్యాలు కూడా ఉండవు. అందుకే అతడు వీటన్నిటిని ఉదాశీనంగా నిర్లిప్తంగా సమదృష్టితో చూడగలుగుతాడు.

**జీవితం, మరణం కూడా అట్టి జ్ఞానికి రెండు సంఘటనలు మాత్రమే.**

జీవణ మరణాలు శరీరానికి చెందిన స్థితులు మాత్రమే శరీరాభిమానియైన అహంకారి మాత్రమే వానిని గురించి ఆందోళన పడుతుంది. అమరమైన ఆత్మలో శరీరపు ఉనికి, వినాశము రెండు కూడా రెండు భావాలు మాత్రమే. ఒక కెరటం జన్మించినా, నశించినా సముద్రానికి బాధ ఏముంటుంది.

ఈ ప్రపంచం ఇలా ఉండాలని కాని, నశించాలి అని కాని జ్ఞాని కోరుకోడు. ఉన్నస్థితిపై అతనికి ద్వేషభావం ఉండదు. తన ప్రారబ్ధానుగుణంగా సంప్రాప్తమైన దేనినయినా అతడు సంతోషంగా స్వీకరించి ఆనందంగా జీవిస్తాడు.

తన స్వస్వరూపమైన అనంత చైతన్యంలో ఈ జగత్తంతా ఒక అలవంటిదని మాత్రమే అతనికి తెలుసు. ఆత్మ చైతన్యం సాగరమైతే ఈ ప్రపంచం ఒక అల అయినప్పుడు ఈ శరీరమేపాటిది. ఒక బిందువు మాత్రమే.

ఈ శరీరం బిందువుగా స్థితి కలిగి ఉన్నా సాగరగర్భంలో కలిసి పోయినా చైతన్య సాగరుడయిన అతనికి సమానమే. అట్టి వానికి శరీర తాదాత్మ్యం ఉండదు.

అతడి దృష్టి ఏమయినా, మన దృష్టిలో మాత్రము అతడు కూడా సమాజంలోని ఒక వ్యక్తి అతని శరీరానికి కూడా మనలాగే తిండి, బట్టా, ఇల్లూ కావాలనే ఉంటాయి.

చూస్తున్నా, వింటున్నా, స్పృశిస్తున్నా, వాసన చూస్తున్నా తింటున్నా అన్నిటిలోను ఆనందమయిన తననే తన శక్తినే గమనిస్తూ నిశ్చల మనస్సుతో, నిర్మలమైన జ్ఞానంతో నిత్యసుఖుడై జీవిస్తూ ఉంటాడు.

బాహ్యప్రపంచం యదార్థం కాదని, భావన మాత్రమని దృఢంగా తెలియడంతో జ్ఞానికి ఇష్టా అయిష్టాలనేవి ఉండవు. ఇవి లేకపోవడంతో

అతని దృష్టి భావశూన్యంగా నిర్లిప్తంగా ఉంటుంది. అతని శరీర కర్మలకు ప్రత్యేక ప్రయోజనం ఉండదు. అతని ఇంద్రియములు తమంత తాముగా దేనిని కోరి పనిచెయ్యవు.

ప్రభూ నీవు ఇంతవరకు తెలిపిన భక్తిలక్షణమగు ధర్మమును ఎవరు ఎట్లు ఆచరింపవలెనో, తెలిపెడి వర్ణాశ్రమ ధర్మములను వివరింపుమని ఉద్దాలకుడు అడుగగా సర్వులకు ఉపకరించునవి, మోక్షప్రదమైనవి యగు భాగవత ధర్మములును శ్రీకృష్ణుడు ఉపదేశించెను.

అర్జునా! కృతయుగము నందు వర్ణాశ్రమములు లేవు. హంసయనెడి వర్ణమొక్కటియే యుండెను. పుట్టుకతోడనే ప్రతీ మనుజుడు అనన్య భక్తియుతుడైయుండెను. జనులు ఈ విధముగా కృతకృత్యులయ్యెడివారు. అందుచేతనే ఆ యుగమునకు కృతయుగమని పేరు వచ్చినది.

ఈ యుగమున ఓంకారమొక్కటియే వేదముగా యుండెను. యజ్ఞ యాగాది కర్మలేవియు అపుడుండెడివి కావు అని శ్రీకృష్ణుడు ధారావాహికముగా బోధించసాగెను.

త్రేతాయుగారంభమున పరమాత్మ నుండె వేదములుద్భవించెను. యజ్ఞములు ప్రారంభమాయెను. ఈ యుగమున విరాట్పురుషుని ముఖము నుండి బ్రాహ్మణులు, బాహువుల నుండి క్షత్రియులు ఉరువుల నుండి వైశ్యులు, పాదముల నుండి శూద్రులు అవిర్భవించిరి. ఈ విధముగా వర్ణము లేర్పడెను.

విరాట్పురుషుని జఘన ప్రదేశము నుండి గృహస్థాశ్రమము, హృదయము నుండి బ్రహ్మచర్యాశ్రమము, వక్షస్థలము నుండి వానప్రస్థాశ్రమము, శీర్షము నుండి సన్యాసాశ్రమము అవిర్భవించినవి. ఈ విధముగా ఆశ్రమము లేర్పడినవి.

| | | | |
|---|---|---|---|
| **I.** | **శమము** | **సంతోషము** | **కరుణ** |
| | **దమము** | **క్షమ** | **సత్యము** |
| | **తపస్సు** | **ఋజుత్వము** | |
| | **శౌచము** | **నాయందు భక్తి** | |

ఇవన్నియు బ్రాహ్మణ స్వభావములన్నియని గ్రహించవలెను.

| | | |
|---|---|---|
| **II.** | **తేజస్సు** | **ఔదార్యము** |
| | **బలము** | **ఉద్యమము** |
| | **ధైర్యము** | **స్థైర్యము** |
| | **శౌర్యము** | **బ్రాహ్మణ్యత** |
| | **తితిక్ష** | **ఐశ్వర్యము** |

ఇది క్షత్రియుని స్వభావములని గ్రహించవలయును.

| | | |
|---|---|---|
| **III.** | **ఆస్తిక్యము** | **ధనాది సంపదలచే** |
| | **దానశీలత** | **తృప్తిలేకుండుట** |
| | **అదంచిత్వము** | |
| | **బ్రాహ్మణసేవ** | |

ఇవి వైశ్యుని స్వభావములు.

**IV.** **విప్రులకు, ఆవులకు, దేవతలకు నిష్కపట భావముతో సేవ చేయుట, దానిచే లభించినదానితో తృప్తి చెందుట శూద్ర స్వభావములు.**

**అశౌచము - అసత్యము - దొంగతనము - నాస్తికత్వము - అకారణ కలహము - కామము - క్రోధము - పేరాశ ఇవి అంత్యజుని స్వభావములు.**

## ఆశ్రమ ధర్మములు

- బ్రహ్మచర్యాశ్రమము
- గృహస్థాశ్రమము
- వానప్రస్థాశ్రమము
- సన్యాసాశ్రమము
- పరమహంస వైభవము

ఈ ఆశ్రమ ధర్మములు ఈ క్రింది విధముగా శ్రీకృష్ణ పరమాత్మచే పేర్కొనబడినవి.

## బ్రహ్మచర్యాశ్రమము

బ్రహ్మచర్యమును స్వీకరించువారు గర్భాదానాది సంస్కారములను క్రమముగా స్వీకరించి, ద్వితీయ జన్మమగు ఉపనయనమును పొంది ఆచార్యునిచే ఆమంత్రితుడై, ఇంద్రియములను నిగ్రహించినవాడై వేదము నభ్యసించవలెను. బ్రహ్మచారి విధులన్ని తెలిసి వాటిని పాటించవలయును.

బ్రహ్మచారి ఆచారిని బాధింపరాదు, సర్వదేవతా రూపుడైన ఆచార్యునిలో దోషములను చూడరాదు. గురువు వెడలునప్పుడు ఆయనకు వెనుక నడువవలయును. విశ్రాంతి సమయమున గురువు దగ్గర పాదసేవ చేయవలయును. ఆసీనుడైనప్పుడు చేతులు జోడించి నమస్కరించుచు గురువు ఆదేశములకై ఎదురుచూచుచుండువాడై యుండవలయును.

బ్రహ్మచారి పాటింపవలసిన విధులన్ని శ్రీకృష్ణుడు మహాత్ముడైన ఉద్ధవునకు తెలుపుచున్నాడు.

బ్రహ్మచారి స్త్రీలతో ఎక్కువ భాషించరాదు. పొరపాటున కూడా వారిని తాకరాదు. పరిహాసమును పరిత్యజించాలి. బ్రాహ్మణుడు అగ్నివలె

ప్రకాశించును. **ఈ కర్మానుష్ఠానము వలన అంతఃకరణము శుద్ధి నొందును.** భక్తి కలవాడగును. ఆచారవంతుడై ఆత్మజ్ఞానమును పొందగలుగును.

బ్రహ్మచర్యాశ్రమము కూడలి వంటిది. అక్కడ నుండి సకాముడైనచో గృహస్థాశ్రమమునకు వెళ్ళవచ్చును. లేదా నిష్కాముడైనచో వానప్రస్థా శ్రమము నకు వెళ్ళవచ్చును. లేదా నిష్కామ సన్యాసమును స్వీకరింప వచ్చును.

## గృహస్థాశ్రమము

గృహస్థాశ్రమములో ప్రవేశింపగోరువారు వయసులో తనకంటె చిన్నదియగు కులీనురాలును వివాహము చేసికొనవలయును. అభిలాషతో తక్కువ కులములోని స్త్రీని వివాహము చేసికొనవచ్చును.

ఉద్ధవా! తాను ధర్మబద్ధముగా జీవించుచు, భక్తులకు, ఆర్తులకు, బాధితులకు సహాయము చేయుచుండవలయును.

**అట్టివానిని సముద్రములో మునిగిపోవు వానిని నావ రక్షించునట్లు నేను రక్షించుదును అని శ్రీకృష్ణుడు పలికెను.**

గృహస్థుడు సంసారిగా ఉండాలి కాని సంసారమును మోయరాదు. అనాసక్తుడై జీవించవలయును. సదా భక్తితత్పరుడై జీవించవలయును. ఇహ పరలోక సుఖములు అనిత్యములని తెలియ వలెను. స్వజన బాంధవ్యము స్వప్నతుల్యముగా భావించి జీవించ వలయును. పుత్రులు, భార్య, ఆప్తులు, బంధువులు తోడి సమాగమము, బాటసారులతోడి సమాగమము వంటిది.

**మేల్కొనినప్పుడు స్వప్నదృశ్యములెలా అదృశ్యములగునో అలాగే కుటింబీకుల సంబంధము గూడా దేహమున్నంతవరకే తెలిసి ఆ తరువాత నశించును.**

ఈ విధముగా గృహ జీవనమును అవగతమొనర్చుకొని **ఇంటిలో అతిథిగా జీవించవలయును.** అహంకారమమకారములు లేనివాడై యుండవలయును. అట్టివాడు బంధములలో చిక్కుకొనడు. గృహస్థుడు గృహమునందే నిలిచి భక్తి చేయవచ్చును. పుత్రవంతుడైనచో సన్యాసమును స్వీకరింపవచ్చును.

నా తల్లితండ్రులు, వృద్ధులు, నా భార్య చిన్నపిల్లల తల్లి, పుత్రులు నన్నాశ్రయించుకొన్న ధీనులు, దిక్కులేనివారు, నేను లేకున్న వారెట్లు జీవింతురు? ఈ విధమైన అప్రస్తుత ప్రసంగము చేయు గృహస్థుడు వ్యర్ధుడు. గృహాసక్తచిత్తుడు. అహంకారయుత జీవుడు. జీవిత లక్ష్యము లేనివాడు గర్వితుడు. వచ్చిన పని మరచి విషయములతో మచ్చిక నేర్పరుచుకొనినవాడు.

**జ్ఞాని కానివాడు సదా కర్మలనాచరించుచునే యుండవలయును.**

సర్వలనుద్ధరించుటకు సర్వేశ్వరుడున్నాడు. ఇంటిలో యుండినా, వీధిలో యుండినా అహంకార రహితుడై కర్తృత్వ, భోక్తృత్వ అభిమానాలకు దూరుడై జీవించు విధానమును గృహస్థుడు అలవర్చు కొనవలయును.

## వానప్రస్థాశ్రమము

ఇది తృతీయాశ్రమము. తురీయమునకు చివరి సోపానము. గృహస్థాశ్రమమును పూర్తిచేసికొనిన మనుజుడు తపము నాచరించు ఆసక్తితో అడవులకేగుటయే వానప్రస్థాశ్రమము.

వానప్రస్థాశ్రమమున ప్రవేశించవలెనని భావించు వ్యక్తి సతీసమేతుడై వెడలవలయును. ఒకవేళ సతి ఇచ్చగించనిచో ఆమెను పుత్రుల రక్షణలో ఉంచవలయును లేదా ఆమెకంటూ ప్రత్యేక జీవనము ఏర్పాటు చేయవలయును.

అపక్వాహారములను భుజించుచు అరణ్యములయందు నివసింప వలయును. విలువైన వస్తువులను ధరింపరాదు. కేశములను, నఖములను తొలగింపరాదు. మూడువేళల స్నానము నాచరింపవలయును. భూమిపై పరుండవలయును. సంపదలను పరిత్యజింపవలయును. నిష్కాముడై కర్మలనాచరింపవలయును. కఠోర తపము నాచరింపవలయును. పై చెప్పిన రీతుల జీవితమును కొనసాగించి పూర్ణవైరాగ్యవంతుడైనప్పుడు సన్యాసమును స్వీకరింపవచ్చును. అదికూడా నిరోపేక్షుడై నిర్వర్తించాలి.

ఉద్ధవా! మంచి పనులకు అంతరాయములధికముగా యుండును. వానప్రస్థుడు సన్యాసమును స్వీకరించునపుడు దేవతలు ఈర్ష్య చెందుదురు. మమ్ములను పరిత్యజించి పరబ్రహ్మమును పొంద యత్నించుచున్నాడని భావించి విఘ్నములు కల్పించుటకు యత్నించుదురు అని శ్రీకృష్ణుడు హెచ్చరిక చేసెను.

**ఇచట ఇంద్రియములే దేవతలని గ్రహించాలి.**

త్యాగమొనర్ప ప్రయత్నించువానిని ఇంద్రియములు మోసగించ ప్రయత్నించును. ఇట్టి సమయములలో **సాదకుడు జాగరూకుడై యుండవలయును.** జితేంద్రియుడై మోక్షదామమున ప్రవేశింపవలయును.

## సన్యాసాశ్రమము

సన్యాసి పవిత్ర ప్రదేశములయందే సంచరింపవలయును. శుద్ధ జలమునే పానము చేయవలయును. వడగట్టిన నీటినే త్రాగవలయును. సత్యవాక్కును కలిగియుండవలయును. ఏ పనినైనా బాగుగా విచారించి చేయవలయును. సన్యాసి మూడు దండములను ధరించవలయును. అందుచే అతనిని త్రిదండి అనికూడా పిలుతురు.

**అలాగని చాలామంది సన్యాసులు వెదురు దండములను విధిగా మోయుచుందురు. మోయవలసిన దండములను వదలి వేయుదురు. ఇదియొక అయోమయ సన్యాసము.**

ఉద్ధవా! వాక్కునకు మౌనము, దేహమునకు కామ్యకర్మ త్యాగము, మనస్సునకు ప్రాణాయామము దండములని చెప్పబడుచున్నవి.

**ఈ మూడు దండములను మోయలేనివాడు, వెదురు కొమ్మలను మోసినంత మాత్రమున సన్యాసి కాడు.**

సన్యాసి ఏడు ఇండ్లకు వెళ్ళి భిక్ష గ్రహించాలి. భిక్షయనునది భగవత్ప్రసాదము కనుక సన్యాసి సప్తాంగ యోగసిద్ధుడై యుండాలి. సమాధిననుభవించుటకు ఆసక్తిపరుడై యుండాలి అని గ్రహించుటయే ఏడు ఇండ్లలోని భిక్షను గ్రహించుటలోని అంతర్భావము.

గ్రామ పొలిమేరలందు యున్న తటాకమునందు స్నానమాచరించి బ్రహ్మార్పణము గావించిన పిదప భోజనము చేయవలయును. నిర్జన ప్రదేశము నందు నిర్భయుడై చరింపవలయును. ఆత్మ ధ్యాననిమగ్నుడై యుండవలయును. ధీరుడై యుండవలయును. నిస్సంగుడై యుండవలయును. ఏకాంతవాసుడై యుండవలయును. నదీ తీరముల యందును, పర్వత ప్రాంతములయందును జీవించుచు భిక్షను గ్రహించుటకై గ్రామములో ప్రవేశింపవలయును. ఎవరిని కష్టపెట్టరాదు.

## పరమహంస వైభవము

పరమహంస పవిత్రాత్ముడై సన్యాసి చిహ్నములయిన త్రిదండిని కూడా పరిత్యజించి నాయందే రమించు చిత్తము కలవాడై యుండును. జ్ఞానవంతుడెవడైనను అజ్ఞానియగు బాలునివలె ప్రవర్తించుచు, కుశలుడైనను జడునివలె మెలగుచు పండితుడైనను పామరునివలె మెలుగుచుండును.

ఖేదారహితుడై యుండును. యోగములో యున్నను భోగములో యున్నను పరమాత్మయందే విలీనమైయుండును.

ఉద్ధవా! నాయందు విశిష్టమైన భక్తి కలిగి పైన చెప్పిన విధముగా ప్రవర్తించు పుణ్యాత్ములు తప్పక మోక్షమును పొందుదురు.

## 6.

పూర్వం జ్ఞానానికి జన్మించినవాడు, నీటికంటె కూడా ముందుగా జన్మించినవాడు అయిన అది హృదయములో ప్రవేశించి పంచభూతములతో ఉంటున్నదని దర్శించినవాడు నిజంగా బ్రహ్మమునే దర్శిస్తాడు.

## నిజంగా ఇదే అది

బ్రహ్మమే సమిష్టి రూపములో హిరణ్యగర్భుడూ వ్యష్టిరూపంలో జీవుడు బ్రహ్మమును ఈ రెండు రూపాలలోనూ తెలిసుకొన్నవాడే నిజంగా బ్రహ్మవిధుడు.

| | వ్యష్టి | సమిష్టి |
|---|---|---|
| **స్థూలము** | | |
| **దేహము** ———— | జీవుడు ———— | విరాడ్రూపము |
| **మనస్సు** ———— | అంతఃకరణము ———— | హిరణ్యగర్భుడు |
| **సూక్ష్మము** | | |
| **ఆత్మ** ———— | ప్రత్యగాత్మ ———— | పరమాత్మ |

**జ్ఞానానికి జన్మించినవాడు :** హిరణ్యగర్భుడు పురాణాలలోని చతుర్ముఖ బ్రహ్మ ఉద్దేశింపబడుచున్నాడు. బ్రహ్మము యొక్క తపస్సు ద్వారా, అంటే జ్ఞానము ద్వారా మొట్టమొదట ఆవిర్భవించేది హిరణ్యగర్భుడు. **తపసాచీయతే బ్రహ్మః** – తపస్సు ద్వారా బ్రహ్మము వర్ధిల్లుతుంది అంటుంది ముండకోపనిషత్తు.

సర్వజ్ఞుడు, సర్వవిధుడూ, జ్ఞానమే తపస్సయినవాడు అయిన అతనికి (పరబ్రహ్మకు) ఈ బ్రహ్మ (హిరణ్యగర్భుడు) జన్మించాడు.

**నీటికంటె ముందు జన్మించినవాడు :** పంచభూతముల కంటె ముందు జన్మించినవాడు.

**పంచభూతాలతో ఉంటున్నది :** పంచభూతాలతో ఏర్పడిన ఈ శరీరములో ఉంటున్నదని.

జగత్తు పరమాత్మ నుండి పుట్టినది కనుక జగత్తు ఆత్మస్వరూపమే యగును. ఇతరము కానేరదు.

**మన్ను వలన బుట్టిన కుండ మట్టి వస్తువే కాని ఇంకొకటి కానేరదు కదా!**

కుండ, మూకుబు ఈను మొదలగు వస్తువులకు మట్టికంటే వేరు తత్వము లేదు కదా వ్యవహారమందున్న నామము–రూపము వాటి కల్పితములే.

కన్పించునది, విన్పించునది అంతా బ్రహ్మమే. సరియైన జ్ఞానము వలన అధ్యయము–సచ్చిదానంద స్వరూపమగు బ్రహ్మమని తెలియ వలయును.

అర్జునా! నాకంటె శ్రేష్టమైనది ఈ సృష్టిలో వేరొకటి లేదు. దారమందు మణులవలె ఈ సమస్థ ప్రపంచమంతయు నాయందే నిక్షిప్తమైయున్నది అని పరమాత్మ పలికెను.

సృష్టికర్తా, జగద్రక్షకుడు అయిన బ్రహ్మ దేవతలందరి కంటె ముందు పుట్టినవాడు. ఆయన సకల శాస్త్రాలకూ ఆధారభూతమైన బ్రహ్మవిద్యను తన పెద్ద కుమారుడైన అధర్వునకు అనుగ్రహించాడు.

బ్రహ్మ అధర్వునకు ఉపదేశించిన బ్రహ్మవిద్యను ప్రాచీన కాలంలో అధర్వుణుడు అంగీరసునికి బోధించాడు. ఆ విద్యనే భారద్వాజ గోత్రుడయిన సత్యవాహుడు అధర్వుణుని వద్ద నేర్చుకున్నాడు. ఇలా పరంపరా ప్రాప్తమైన ఆపరా విద్యకు సత్యవాహుడు అంగీరసునకు అందజేసాడు.

శునకఋషి కుమారుడు ఉత్తమ గృహస్థుడయిన శౌనకుడు శాస్త్రోక్తరీతిగా అంగీరస మహర్షిని సమీపించి వినీతుడై ఇలా అడిగాడు– భగవాన్! దేనిని తెలిసికోవడం చేత గతిశీలమైన ఈ ప్రపంచం అంతా తెలిసికొనబడుతుంది?

అంగీరసుడు శౌనకునకు ఇలా బదులు చెప్పాడు–

పరావిద్య – అపరావిద్యయని తెలిసికొనవలసిన విద్యలు రెండు ఉన్నాయని బ్రహ్మజ్ఞులు చెబుతారు.

ఈ రెండు విద్యలలో నాలుగు వేదాలు, వేదాంగములైన శిక్షాకల్పం, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిష్యము అన్నీకూడా అపరావిద్యలే.

**ఇక శాశ్వతము, అమరము, అక్షరము అయిన తత్వాన్ని అందించే విద్యచే పరావిద్య.**

కన్నులు మొదలైన జ్ఞానేంద్రియాలకు గోచరం కానిది, చేతులు మొదలైన కర్మేంద్రియాలకు దొరకనిది, ఉత్పత్తిలేనిది, లావు–తెలుపు మొదలైన గుణాలు లేనిది, కన్నులు, చెవులు, చేతులు, కాళ్లు లేనిది; శాశ్వతమైనది, అంతటా వ్యాపించినది, అత్యంతము సూక్ష్మమైనది, అవధిలేని అవిర్భావాలు కలిగినది, అయిన అక్షరతత్వాన్ని ప్రజ్ఞామలు సకల జగత్తుకూ మూలంగా అంతటా చూడగలరు.

సాలెపురుగు ఎలా తన గూడును తనలోనుండే వెలికితీసి, తనలోకే తీసుకుంటుందో–

భూమి నుండి మూలికలన్నీ ఎలా ఉద్భవిస్తాయో–

మానవుని తలమీద, శరీరం మీద ఏ ప్రయత్నము లేకనే వెంట్రుకలు ఎలా పెరుగుతాయో అలాగే అక్షరతత్వం నుండి ఈ విశ్వం ఉత్పన్నమవుతుంది.

గాఢ తపంలో ఉన్న బ్రహ్మం సృష్టి చేయాలన్న ఆనందంతో పెంపొందుతుంది. ఆ బ్రహ్మం నుండి అన్నం పుడుతుంది, ఆ అన్నం నుండి శక్తి, మనస్సు, సత్యమైనవి, లోకములు, ఇక కర్మలలోని అంతులేని మెలికలూ (పునర్జన్మల పరంపర) కలుగుతాయి.

సృష్టికర్తయైన బ్రహ్మ, సకల ప్రాణులు, వాటి ఆహారము, అన్నీ కూడా సర్వజ్ఞుడు, సర్వవిధుడు, జ్ఞానమే తపముగా కలవాడు అయిన పరబ్రహ్మం నుండి ఉద్భవిస్తున్నవి.

## 7.

ప్రాణరూపంగా అభివ్యక్తమైనది పంచభూతాలతో సృష్టించ బడినది. హృదయంలో ప్రవేశించి నివసించేది అయిన అదితిని, దేవతల ఆత్మను తెలిసికొనినవాడు నిజంగా బ్రహ్మమునే తెలుసుకుంటాడు.

**నిజంగా ఇదే అది**

**ప్రాణము :** విశ్వానికి ప్రాణము 'హిరణ్యగర్భుడు'

**అదితి :** వాచ్యార్థం భుజించేది అని. యావద్విశ్వాన్ని భుజించే వాడు తానొక్కడే కనుక, హిరణ్యగర్భుడు ఇచట అదితి అనబడ్డాడు.

పంచభూతములు, పంచేంద్రియములు, మనస్సు కలిసి మనలను నడిపించుచున్నవి. అయితే అవి వాటంతట అవి చరించే అవకాశము లేదు కదా!

**మరి వీనిని ప్రకాశింపజేసి, నడిపించు శక్తి ఎవరు?**

ఒక సమయములో ఇంద్రియ సంఘాతములో వైరుధ్యము పొడసూపెను. వారిలో శ్రేష్టులెవరో తెలిసికొనుటకు పోరాటము ఆరంభమాయెను. శరీరమును అవియే ధరించి భరించుచున్నవనెడి అహంకారము కలిగెను. తమ పరిధిని దాటి ఆలోచించుటకు అవి విముఖత చూపసాగెను.

**అంతలో వాటికన్నను శ్రేష్టమయిన శక్తి పలుకసాగెను. అదియే ప్రాణము.**

ఆ ప్రాణము ఇంద్రియ సమూహమునుద్దేశించి మీరు మోహమును చెందకండి అని హెచ్చరించినది.

మోహమనగా భ్రాంతి. సత్యము అసత్యముగా, అసత్యమును సత్యముగా దర్శించు అయోమయ జీవనము 'మోహము' వలన కలుగును. తమకన్న గొప్పదైన ప్రాణము దేహము నందుండగా, ఈ సత్యమును విస్మరించి తమ గొప్పను తాము ప్రకటించుకొనసాగినవి.

ఇంద్రియములారా! ఇది మోహజీవనమని తనను ఎలా విభజించుకొని దేహమును ధరించి, భరించుచున్నదో ప్రాణము చెప్పసాగెను.

తనను తాను 5 భాగములు చేసుకొని శరీరమును ధరించు చున్నట్లు ప్రాణము తెలియజేసెను. ఇవియే పంచప్రాణములనబడును.

అవియే- **ప్రాణ, అపాన, సమాన, ఉదాన, వ్యానములు**

ఈ పంచ ప్రాణములవలననే దేహమునకు చేతనత్వము కలుగు చున్నది.

నిద్రావస్థయందు ఇంద్రియములు మనస్సు ప్రాణము నందు లయిస్తాయి.

ప్రాణము యొక్క గొప్పతనమును ఉపనిషత్తులు బాగా శ్లాఘించాయి.

ప్రాణము యొక్క ప్రాశస్త్యమును గురించి ప్రాణస్తులు చేయు సందర్భములో ప్రాణము స్వతంత్రముగా పరమేశ్వరుని నుండియే ఆవిర్భవించినట్లు కొన్ని ఉపనిషత్తులు తెలిపియున్నవి. అట్టి తనను విస్మరించుట మోహమని హెచ్చరించినను ఇంద్రియములు వినలేదు.

అంతట ఇంద్రియముల మూర్ఖత్వమునకు ప్రాణము విసుగుచెంది దేహము నుండి నిష్క్రమించుటకు ప్రయత్నించెను.

ప్రాణము అలా ఉద్యుక్తము కాగానే ఇంద్రియములు పట్టుతప్పి నీరసపడిపోయినవి. మరల ప్రాణము స్థిరపడగానే ఇంద్రియములలో శక్తి పెల్లుభికినవి. ఈ అనుభవమును పురస్కరించుకొని ఇంద్రియములు ప్రాణాధిక్యత గుర్తించి స్తుతించసాగినవి.

**అనుభవ జ్ఞానమే వ్యక్తికి స్థిరత్వమునొసగి సత్య దర్శనము చేయునట్లు తీర్చిదిద్దును.**

తేనెతెట్టెలోని రాణి ఈగ నిష్క్రమించగానే అన్ని ఈగలు నిష్క్రమించునట్లు ప్రాణము దేహము నుండి నిష్క్రమించగానే ఇంద్రియ ములన్నియు అస్థిరతను పొందినవనియు, రాణి ఈగలు తుట్టెలో ప్రవేశించగానే అన్ని ఈగలు దానిననుసరించునట్లు, ప్రాణము మరల దేహములో స్థిరపడగానే ఇంద్రియములన్నియు స్థిరపడినట్లు అత్యద్భుతముగా ప్రాణస్థితిని పిప్పలాది మహర్షులు వర్ణించిరి.

ప్రాణ నిష్క్రమణస్థితిలో ఇంద్రియములతోపాటు మనస్సు కూడా చేరియున్న విషయమును పాఠకులు మరువరాదు.

ఛాందోగ్యోపనిషత్తు యందు సనత్కుమారుడు నారదునకు ప్రాణమే అన్నిటికంటె ముఖ్యమని తెలిపెను. అద్దము నందు వస్తువు ప్రతిబింబించునట్లు ప్రాణమునందు ఆత్మ ప్రతిబింబించునని తెలియ జేసెను.రాజువద్దనున్న సేవకుడు రాజునకు అన్ని సమకూర్చునట్లు ప్రాణము ఆత్మకు నీడవలెయుండి సర్వమును సమకూర్చునని తెలిపెను.

ప్రశ్నోపనిషత్తులో పిప్పలాది మహర్షి వైదర్భ అడిగిన ప్రశ్నకు ఈ క్రింది విధముగా సమాధానము వివరించుచున్నాడు.

త్రిలోకముల యందు సర్వము ప్రాణము యొక్క అధీనములో నున్నదని చెప్పుచున్నాడు. ఇచ్చట త్రిలోకములనగా జాగృత్ స్వప్న సుషుప్తి

అని భావము. ఈ అవస్థా త్రయమునకు గూడా ప్రాణమే ఆధారమై యున్నది. అట్టి ప్రాణమును ప్రార్థించుచు తల్లిబిడ్డలను రక్షించునట్లు మమ్ములను కాపాడుము అని ఋషి అభ్యర్థిస్తున్నాడు.

తల్లి బిడ్డల ఆక్రందనలను ఆలకించును. అర్థము చేసికొనును. అంతేకాదు అడుగ అవసరము లేకనే అవసరము లేకనే అవసరములను తీర్చును.

## ప్రాణము కూడా తల్లిలాంటిదే

మన ప్రమేయము లేకుండానే మన అభ్యర్థనలు కదలకముందే దేహము నందు సమస్త సంచార క్రియలను నడిపి మనలను క్షేమకరముగా యుంచుచున్నది.

ఋక్కులు, యజస్సులు, సామాలు, యజ్ఞాలు కూడా ప్రాణము పైననే ఆధారపడియున్నదని పిప్పలాది మహర్షి తెలియజేయుచున్నారు.

వేదాధ్యయనము వలన వేదములు నిలుచును. వేదాధ్యయనము చేయువాని యందు ప్రాణము లేనిచో జరిగేది వేదాధ్యయనము కాదు, అంతిమ యాత్రయే.

అలాగే యజ్ఞము కూడా ప్రాణముపైనే ఆధారపడియున్నదని చెప్పుచున్నాడు. యజ్ఞ నిర్వాహకునియందలి ప్రాణమే యజ్ఞమును కొనసాగించుచున్నది.

అలాగే బ్రాహ్మణ, క్షత్రియులు కూడాను అని తెలియజేయు చున్నాడు. అనగా బ్రహ్మనుల యందలి బ్రహ్మజ్ఞానము, క్షత్రియుల యందలి పరాక్రమమునకు కూడా ప్రాణమే ఆధారమైయున్నదని చెప్పుచున్నాడు.

ఈ యజ్ఞముల ద్వారా మీరు దేవతలను తృప్తిపరచండి. ఆ దేవతలు మిమ్మల్ని తిరిగి తృప్తిపరచగలరు అని సృష్టాదియందే ప్రజాపతి శాసించినట్లు భగవద్గీత యందు శ్రీకృష్ణుడు అర్జుననకు ఉపదేశించెను.

మరి యజ్ఞ యాగాదులందు మనము సమర్పించెడి ఆహుతులను దేవతలకు చేర్చువారెవరు? ప్రాణమే అగ్నిరూపములో ఆహుతుల నందించును. పితృదేవతలకు మనము అర్పించే పిండమును కూడా తానే వహించుచున్నది. మహర్షులు అగ్నిరూపమున యున్న ఈ ప్రాణము నాశ్రయించియే యజ్ఞములను నిర్వహించిరి.

దేవతలనెడి ఇంద్రియములకు విషయముల నందించునది ప్రాణమే అయి ఉన్నది. పితృదేవతలనెడి పూర్వ వాసనలకు పుష్టి నొసంగునది కూడా ప్రాణమే అయి ఉన్నది.

ఋషులనెడి సాత్త్విక భావాలకు స్ఫూర్తి తానే అయిఉన్నదని పిప్పలాదులు తెలియజేసిరి.

**సమస్తము తానే అయి ఉన్న ప్రాణము ఆత్మ నుండి జన్మిస్తుందని, మనిషి నుండి నీడ వచ్చినట్లు ఆత్మనుండి ప్రాణము జనిస్తుందని పిప్పలాదులు తెలిపిరి.**

నచకేతుడు అడిగిన ఆత్మ ఇదేనని సమవర్తి నచకేతునకు వివరించెను.

# VIII.

గర్భవతులైన తల్లుల చేత రక్షింపబడి పోషింపబడే గర్భం లాగా, ఆరణి కర్రలలో జాగ్రత్తగా ఉంచబడిన సర్వజ్ఞుడైన అగ్నిదువుడు ప్రబోధితులైన వారి చేతా యజ్ఞకర్తలచేతా అనుదినము ఆరాధ్యుడవుతాడు.

## నిజంగా ఇదే అది

ఒక్క బ్రహ్మమే ఈశ్వరుడని జ్ఞానులచేత – ధ్యానం ద్వారాను, అగ్ని – అన్ని గృహస్థుల చేత యజ్ఞకర్మల ద్వారాను ఆరాధింపబడు తున్నాడనడానికి సూచన ఇక్కడ యున్నది.

**ఆరణి కర్రలలో :** వైదిక యజ్ఞాలలో... ఉత్తరారణి (పైకర్ర) అధరారణి (క్రిందికర్ర) అనే రెండు ప్రత్యేకమైన కర్రలకు పరస్పరము ఘర్షించడం ద్వారా అగ్నిని రగుల్కొల్పాలి.

**ప్రబోధితులైనవారు :** జ్ఞానులు-సన్యాసులు

**యజ్ఞకర్తలు :** కర్మలు, గృహస్థులు

## IX.

సూర్యుడు దేనినుండి ఉదయిస్తూ దేనిలో అస్తమిస్తాడో దానియందే సకల దేవతలు అమర్చబడియున్నారు. నిజంగా దానినెవరు అతిక్రమించలేరు.

### నిజంగా ఇదే అది

సకల దేవతలు అమర్చబడి యున్నారు ఇరుసులో చక్రపు ఆకులలాగా.

బండి నడుచుటకు చక్రములుండవలయును. క్రపుటిరుసుపై ఆకులు ఆధారపడియుండును. ఇరుసు విరిగినచో బండి బోల్తా పడిపోవును. అలాగే జీవన శకటము ప్రాణముపై ఆధారపడియున్నది. ప్రాణము లేనిచో జీవితమే శూన్యమగునని మహర్షి తెలుపుచున్నారు.



**కంపనము :** సృష్టి అనేది ఒక కదలిక, గతి, ఒక శక్తి, కంపనము.

ఇది మరొక అకంపము, గతిరహితము, అవికార్యము అయిన దానిలోనే అంటె నిర్గుణ బ్రహ్మంలోనే సంభవము. అందుచేత నిరంతరంగా మారిపోతూ ఉండే ఈ సృష్టికి నిర్గుణ బ్రహ్మమే ఆధారము కనుక యావద్విశ్వము బ్రహ్మములో కంపిస్తున్నదని చెప్పబడినది.

ఈ జగత్తు యొక్క సృష్టి స్థితి లయలను ఒక దివ్య నియమము పర్యవేక్షిస్తున్నదని, దానిని ఎవరు అతిక్రమించలేరని కూడా ఈ వాక్యము సూచిస్తున్నది.

**ఎత్తబడిన వజ్రాయుధము :** విశ్వజనీనమైన ధర్మం ఆ బ్రహ్మపు భంగిమలలో ఒకటి. ప్రతీది ఆ కఠోర శాసనానికి లొంగి ఉంటున్నది. ఆ కబంధ హస్తాల నుండి ఎవరు తప్పించుకొనలేరు. అందుచేత ఆ బ్రహ్మము మహా భయంకరుడని చెప్పబడినది.

ఈ జగత్తు యొక్క అభివ్యక్తికి ఏకైక కారణం కూడా ఆ బ్రహ్మయే. ఈ విశ్వాన్ని లోపల నుండి నియమించే ధర్మం కూడా అదే. మన మానసిక చర్యలకు సాక్షికూడా ఆ బ్రహ్మమే.

అతని వలన భయంచేతనే అగ్ని దహిస్తుంది. అతని వలన భయం చేతనే సూర్యుడు ప్రకాశిస్తాడు. అతని భయం వలననే ఇంద్రుడు, వాయుదేవుడు, మృత్యుదేవతయైన నేను కూడా మామా విధులను నిర్వహించుటకు పరుగులు పెడతాము అని యముడు నచకేతునకు బోధించెను.

చక్రంలో ఉండే ఇరుసు లేదా నాభి ఒక్కటే చుట్టూ ఉండే చట్రాన్ని, ఆకులను కలిపి ఉంచే ఆధారం. ఆకులు చట్రాన్ని నాభిని కలుపుతాయి. ఆకుల గుండ్రని కదలిక పూర్తిగా నాభిమీద ఆధారపడియుంటుంది. చక్రం కదిలినప్పుడు ఆకుల కదలికే కనబడుతుంది. నాభి కదలిక చాలా స్వల్పంగా కనబడ్తుంది.

అలా వాటివాటి వ్యష్టి సమిష్టి పరిధుల్లో పరిభ్రమించే నామరూపాల జగత్తులు అన్నీ పరమాత్మపైన ఉన్న ఆధ్యారోపనలు తప్ప వేరుకాదు. సర్వవ్యాప్తమైన పరమాత్మను తెలుసుకొన్న తన స్వరూపాన్నే అంతటా చూస్తాడు.

ఇన్నేల్లుగా అనుభవమైన అన్ని ప్రపంచాలు కేవలము అభాసలుగా తనపైనే అద్యావలుగా గోచరమవుతాయి.

## X.

ఇక్కడ ఉన్నదే అక్కడ ఉన్నది. అలాగే అక్కడా ఉన్నదే ఇక్కడా ఉన్నది. ఇక్కడ వివిధాలుగా ఉన్నవని చూసేవాడు మళ్ళీ మళ్లీ మరణిస్తాడు.

**వివరణ :** సత్తకు రెండు స్థితులున్నాయి. కేవలస్థితి–అభివ్యక్త స్థితి. అందుచేత ఈ రెంటిలో నిజానికి ఏ భేదము లేదు. సముద్రము తరంగము వస్తుతః అభిన్నాలు కదా!

శ్రీ శంకరుల అభిప్రాయంలో సత్తకు నిజంగా రెండు అవస్థలు లేవు. ఆసత్త శాశ్వతం, అవికార్యం. దాని వికారము వట్టి అభాస మాత్రమే. అంచేత ఉపాధిలోని అసలు వస్తువు, కేవలసత్తా రెండూ ఒకటే. కేవలము జ్ఞానము మాత్రమే అవి రెండు వేరే వేరే అని తోపింప చేస్తుంది.

**ఇక్కడ :** ఈ అభివ్యక్త ప్రపంచంలో లేదా ఈ శరీరంలో

**అక్కడ :** బ్రహ్మము యొక్క కేవల స్థితిలో నిర్గుణ స్థితిలో

**మళ్ళీ మళ్ళీ మరణిస్తాడు :** సత్యాన్ని గూర్చిన అజ్ఞానం వలన ఎనెన్నో జనన మరణాల పాలు కావలసి ఉంటుంది.

పరమాత్మ యొక్క అనంత దివ్యలీలలు విశ్వమంతటా మహాన్వితమై సర్వాతీతమైన పరిమాణాలలో ఉంటాయి. ఆయన

దివ్యాంశాలు ప్రత్యగాత్మగా అంతరాంతరాళంలో సూక్ష్మంగా అతి చిన్నవిగా కద్దిపాటి వ్యక్తరూపాలలో ఉంటాయి. ఇలా వ్యాపకం సంకోచం ఉన్న ఆత్మయొక్క మహిమలే దేవతలుగా వర్ణింపబడుతున్నాయి.

**శాకల్యుడు :** యజ్ఞావల్క్యున్ని ఇలా అడిగాడు- దేవతలు ఎంతమంది?

**మహర్షి :** 3003 మంది దేవతలు. తమ దివ్యరూపాలతో ప్రపంచమంతటా విస్తరించుకొని ఉంటారు. అయితే వాళ్ళు తమ సూక్ష్మ రూపాలలో 303, 33, 6, 3, 2, 1½, 1 ఇలా సంకోచం చెందుతారు. ఇలా సంకోచము చెందుతూ వాళ్ళందరూ ముఖ్య ప్రాణంగా ఉన్న పరమాత్మలో కలిసిపోతారు.

అసంఖ్యాకంగా ఉన్న బ్రహ్మాండమంతా వ్యాపించి ఉన్నా దేవతలందరూ పరమాత్మ యొక్క దివ్యమహిమలు తప్ప వేరు కాదు.

**శాకల్య :** 33 దేవతలు ఎవరు

**8 – వస్తువులు**

**11 – రుద్రులు**

**12 – ఆదిత్యులు**

**ఇంద్రుడు**

**ప్రజాపతి**

**8 వస్తువులు :** అగ్ని, భూమి, వాయువు, అంతరాళం, సూర్యుడు, స్వర్గం, చంద్రుడు, నక్షత్రాలు

**11 రుద్రులు :** పది ఇంద్రియాలు, మనస్సు – వీరే ఏకాదశ రుద్రులు. వాళ్ళు ఈ శరీరాన్ని వదలి వెళ్ళేటప్పుడు బంధువులందరూ రోధిస్తారు. అందరిని ఏడిపిస్తారు కాబట్టి రుద్రులన్నారు.

**12 ఆదిత్యులు :** 12 నెలలు ద్వాదశాదిత్యులు. ప్రతీ నెలలోను తాదాత్మ్యం పొందేది సూర్యుడే. వాళ్ళు చేసే పర్యటనలలో జీవుళ్ళ ఆయువును హరించేస్తారు. ఆదాన క్రియ చేస్తారు కాబట్టి వారిని ఆదిత్యులన్నారు.

**ఇంద్రుడు** వర్షించే మేఘంలోని ఉరుము. **ప్రజాపతి** యజ్ఞాదిపతి. ప్రతీ నిస్వార్థ కర్మలోను ఆయన అధ్యక్షుడు.

**శాకల్య :** కుంచించుకుపోయే మార్గంలో వచ్చే ఆరుగురు దేవతలెవరు.

**యజ్ఞ :** చంద్రుడు–నక్షత్రాలు– కాక మిగిలిన ఆరుగురు వస్తువులు.

**శాకల్య :** ముగ్గురు – ఇద్దరు – ఒకటిన్నర – ఒకరు అయిన దేవతలెవరు.

**భూమి**
**అంతరాకాశం** — వీరు ముగ్గురు దేవతలు
**దివి**

తక్కిన వాళ్ళు వీళ్ళలో కలిసిపోతారు.

**అన్నం**
**ప్రాణం** — తక్కిన దేవతలు వీళ్ళలో కలిసిపోతారు.

తమ శక్తితో కూడిన ముఖ్య ప్రాణం– ఒకటిన్నర దేవత. కదిలేవి – కదలనివి ఈ ముఖ్య ప్రాణం మహిమ వల్ల విస్తరించుకొని వ్యాపిస్తాయి.

**పరమాత్మ సర్వ ప్రపంచంలోను వ్యాపించి అంతరాత్మగా ఉండే ఒక్క దేవుడు. అందుచేత అంతరాత్మ పరమాత్మ.**

నామ రూపాల జగత్తు, కర్మలు హృదయాంతరాళం నుండి జనిస్తాయి. హృదయం స్థూల శరీరంలో ఉన్నది. స్థూల శరీరం పరమాత్మలో ఉన్నది.

ఆ అనంత స్వరూప పరమాత్మ సౌమ్య కాశీపతి నాకు అమూల్యమైనవి బ్రహ్మవిద్యా సంపదని ప్రసాదించు గాక.

జనకుని దర్బారులో విశిష్టమైన వాదాన్ని కొనసాగిస్తూ భుజ్జు అనే బ్రాహ్మణ పండితుడు యాజ్ఞవల్క్యుని పాండిత్యాన్ని పరీక్షించడానికి లేచాడు. పారిక్షితులంటే ఎవరు? వారు ఎక్కడుంటారు అని అడిగాడు.

అశ్వమేధయాగం చేసిన వాళ్ళని పారిక్షితులని, వాళ్ళు ఉత్తమ జీవులని సమాధానమిచ్చాడు. పారిక్షిత్త అనే మాట శృతులలో చాలా అరుదుగా వాడబడుతుంది. ఈ పదాన్ని యాజ్ఞవల్క్యుడు విన్నాడో లేదో తెలుసుకోవడానికి ఈ ప్రశ్న అడిగాడు. సరియైన సమాధానం వచ్చేసరికి భుజ్జు, శరీరం రాలిపోయినప్పుడు పారిక్షిత్తులు ఎక్కడికి వెళ్తారని ప్రశ్నించాడు. యజ్ఞవల్క్యుడు ఈ విధంగా సమాధానమిచ్చాడు.

ఈ లోకం సూర్యుడు 32 రాత్రింబవళ్ళు ప్రయాణించేంత విశాలమైనది. దాని చుట్టూర సముద్రాలు విస్తరించుకొని ఉన్నాయి. ఈ లోకంలోనే భూమిపైన ఉండే అన్ని ప్రాణులు భోగాలననుభవిస్తారు ఈ లోకాన్ని చుట్టుకొని దీనికి రెట్టింపు విశాలమైన మరో భూమి పరివేష్టించి ఉన్నది. దానిని మనరోమనే సముద్రం చుట్టి ఉంటుంది. ఈ రెండు భాగాలకు క్షురధార లేక ఈగరెక్క మాత్రమే పట్టే సన్నని దారి ఉంటుంది. అశ్వమేధ యాగం చేసిన ఉత్తమ జీవుళ్ళు మరణించినపుడు, అగ్నిదేవుడు వాళ్ళని ఆ సన్నని దారి వరకు తీసుకెళ్తాడు. ఆ దారిలో అగ్నిదేవుడు ప్రయాణించలేడు కాబట్టి ఆ పుణ్యజీవుళ్ళని వాయుదేవుని కప్పగిస్తాడు. వాయుదేవుడు ఆ సూక్ష్మమార్గం ద్వారా ఆ లోకాలకు అవలీలగా తీసుకొనివెళ్తాడు.

అప్పుడు వాళ్ళు హిరణ్యగర్భుని లోకం అంటే బ్రహ్మలోకంలో ప్రవేశిస్తారు. యజ్ఞవల్కుడు సరియైన సమాధానమిచ్చినందుకు భుజ్యు నిష్క్రమించాడు.

అశ్వమేధ యాగం, రాజసూయం మొదలైన పెద్ద యాగాలు చేసినవాళ్ళు బ్రహ్మలోకం, ఇతర దేవలోకాలను, శాస్త్రాలలో చెప్పినట్టు ఆయా యాగాల ఫలానుసారం పొందవచ్చును. కాని ఇవి అహంకారంతో కూడి చేయబడినవే గాబట్టి ఆయా యజమానులకు పరిపూర్ణమైన మోక్షం లభించదు.

## పూర్ణముక్తికి పరమాత్మను తెలుసుకోవడం ఒక్కటే మార్గం.

ప్రఖ్యాతి గాంచిన మేధావి గార్గి ప్రశ్నలతీరు ఇలా నడిచింది. ఓ మహర్షి! బ్రహ్మాండంలో మనకు కనిపించేది యావత్తు సముద్ర జలాలచేత పడుగు పేకలుగా ఆవరించబడియున్నది. నీరు దేని ఆధారంగా నిలబడి ఉన్నది?

**మహర్షి :** నీరు వాయువుచేత పడుగు పేకగా కప్పబడియున్నది.

**గార్గి :** ఆ వాయువో?

**మహర్షి :** అంతరిక్షం వల్ల.

**గార్గి :** అంతరిక్షం దేనివల్ల నిలబెట్టబడియున్నది?

**మహర్షి :** గంధర్వలోకం వల్ల

**గార్గి :** గంధర్వలోకమో?

**మహర్షి :** సూర్యలోకం వల్ల

**గార్గి :** సూర్యలోకమో దేనివల్ల కప్పబడియున్నది?

**మహర్షి :** సోమలోకం

**గార్గి :** సోమలోకమో?

**మహర్షి :** నక్షత్రలోకం వలన

**గార్గి :** నక్షత్రలోకమో?

**మహర్షి :** దేవలోకం వలన

**గార్గి :** దేవలోకమో?

**మహర్షి :** ఇంద్రలోకం వలన

**గార్గి :** ఇంద్రలోకమో ?

**మహర్షి :** ప్రజాపతిలోకము వలన

**గార్గి :** ప్రజాపతి లోకమో?

**మహర్షి :** సూక్ష్మశరీరమైన హిరణ్యగర్భుడిలోకం వలన

**గార్గి :** హిరణ్యగర్భుని లోకమో?

**మహర్షి :** నీ ప్రశ్న బుద్ధికి తర్కానికి అతీతమైనది. ఈ ప్రశ్నను వదిలిపెట్టకపోయావో నీతల పగిలిపోతుంది. నీ బుద్ధిని వెలిగించే ప్రకాశాన్ని గురించి అడుగుతున్నావు.

ఇది విని గార్గి నిష్క్రమించింది.

చక్రుని కుమారుడు ఉషస్థుడు యజ్ఞవల్కుని పరీక్షింపగోరి అతనిని ఇలా అడిగాడు. సర్వాతీతమైన అన్నిటికన్నా ప్రశస్తమైనది అయిన అందరిలోను ప్రత్యగాత్మగా ఉండే పరమాత్మ లక్షణం ఏమిటో చెప్పుము? దానికి సమాధానంగా యజ్ఞవల్కుడు–

**నీలో ఉండే ఆత్మే అన్ని ప్రాణులలోని సారమైన ఆత్మ** అన్నాడు.

ప్రత్యగాత్మ సాన్నిధ్యం కారణంగానే పంచప్రాణాలు, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, తమతమ వ్యవహారాలు చేస్తాయి.

ఉషస్థ అడిగిన మరో ప్రశ్నకు సమాధానంగా "ప్రత్యగాత్మను" బాహ్యా వస్తువుల్ని దర్శించినట్లుగా దర్శించడానికి వీలులేదు. నడిచే ఎద్దునో, పరిగెత్తే గుఱ్ఱాన్నో ఇంద్రియాల ద్వారా చూచినట్లు ప్రత్యగాత్మను చూడడానికి వీలుకాదు.

ప్రత్యగాత్మ శక్తిని ఇచ్చినప్పుడే ఇంద్రియాలకు చూపు, వినికిడి, స్పర్శ, ఆలోచనలు సాధ్యమౌతాయి. లోపల నుండి నిరంతర శక్తిని ప్రసాదించే ఈ ప్రత్యగాత్మే కళ్ళలోని ద్రష్ట, చెవిలోని శ్రోత, మనస్సులోని భావకుడు, బుద్ధిలోని విచారశీలి. ఈ పరికరాల ద్వారా దానిని తెలుసు కొనుటకు వీలుపడదు.

ఒకానొక ధీరుడు మాత్రమే ఆత్మజ్ఞానపూర్వక కర్మ నిష్టాపరుడై, భగవంతుని అనుగ్రహం పొంది శుద్ధమనస్సు చేత ఆత్మ సాక్షాత్కారం పొందుతాడు.

ఆత్మజ్ఞానాన్ని పొందటంలో వచ్చే 3 ఆటంకాలు

**పుత్రేషణ**
**ధణేషణ** — పూర్తి వైరాగ్యభావంతో
**ధారేషణ**

వీటిని త్యజించితేగాని ఆత్మజ్ఞానం లభింపదు.

## XI.

మనస్సు ద్వారానే దీనిని సాక్షాత్కరించుకోవాలి. అప్పుడు ఇక్కడ ఏ వైవిధ్యమూ ఉండదు. ఇక్కడ వైవిధ్యాన్ని చూసేవాడు మరణాన్నుంచి మరణానికి పోతూ ఉంటాడు.

**మనస్సు :** పరిశుద్ధమైన మనస్సు

**దీనిని :** నిర్గుణ బ్రహ్మాని

**అప్పుడు :** పరిశుద్ధమైన మనస్సు ద్వారా బ్రహ్మమును సాక్షాత్కరించుకొనినప్పుడు ఈ ప్రపంచమంతా ఆ బ్రహ్మము యొక్క అభివ్యక్తియే అని, అంచేత బ్రహ్మం కంటే నిజంగా భిన్నం కాదని తెలిసి వస్తుంది.




# XII & XIII.

బొటనవ్రేళి పరిమాణం గల పురుషుడు ఈ శరీరంలో నివసిస్తున్నాడు. భూత భవిష్యత్తులకు ఆయనే ప్రభువు. ఇవాల రేపు గూడా ఆయన ఒకేలా ఉంటాడు. ఆయన పొగలేని కాంతి పుంజము వంటివాడు. ఆపైన మానవుడు ఇక భయపడడు.

## నిజంగా ఇదే అది

బొటనవ్రేలి పరిమాణం గల : యోగులు సాధారణంగా హృదయ కమలం అని చెప్పే హృదయంలో బ్రొటనవ్రేలంత కాంతిపుంజంగా పురుషుడు ధ్యానింపబడడమే దీనికి కారణము.

దేశ కాలాది అవధులకు అతీతమైన ఆత్మకు ఒక పరిమాణాన్ని చెప్పడం ధ్యాన సౌలభ్యం కోసమే. దానిని అక్షరాల అర్థం చేసుకొనగూడదు.

**పురుషుడు :** శరీరం అనే పురం (పట్టణం)లో నివసించడంచేత గాని యావద్విశ్వాన్ని పూర్తిగా నిండి ఉండడం చేతగాని ఆత్మ పురుషుడు అని పిలవబడుచున్నది.

మాంసముతో చేరి, నరములతో గూడి, యెరుపు, తెలుపు వన్నెగల తామర కమలము వంటి ఒక మొగ్గ హృదయమున అధోముఖముగా అనగా తలక్రిందులుగా వ్రేళాడుచుండును. ఆ కమలము కంఠమునకు జానెడు క్రిందుగను నాభికి జానెడు పైగను వ్రేలాడుచుండును. ఆ కమలము యొక్క మధ్య రంధ్రమొకటి కలదు. ఆ రంధ్రములో అంగుళము పొడుగు బయలుండును. హృదయ కమలమున నుండు బయలు నందు జలసముద్రము వలె నిండియుండును.

అనగా కంటికి కానరాని చిన్న పురుగు మొదలు బ్రహ్మదేవుని వరకు గల సకల జీవరాసుల యొక్క హృదయ కమలము నందు జలము సముద్రము వలె నిండియుండును. వడ్లగింజ ముక్కు కొనయందు, సూదివలె మిక్కిలి సన్నగాయుండును. ఆ సూది కొనయంత మాత్రము ఆత్మ హృదయ కమలంలోనున్న జలముతో చేరి నివసించుచుండును. ఈ ఆత్మ నల్లని మేఘమధ్యమున మెరయుచుండెడి మెరపుతీగ వలె మిక్కిలి సూక్ష్మముగాను దానికి సమానమైనది వేరొకటి లేనిదిగను, పచ్చని కాంతి గాను యుండును.

బ్రహ్మాది దేవతలు మొదలు సకల ప్రాణుల యొక్క హృదయ కమలము నందు నేను ఆత్మగా నివసించుచున్నాను. నావల్లనే తలంపులు, మరపులు పుట్టుచున్నవి. సకల వేదములకు కనబడువాడను నేను. ఇంతియేగాక వేదాంత సాంప్రదాయమును బోధించు గురువును నేను గానెయున్నాను. ఇట్లుగా యుండునన్ను స్త్రీ పురుషులకు గల ఆశా

పాశాలును, కామ క్రోదాదులును యున్నందున నేను వారలకు కనబడుట లేదు. వీటన్నిటిని తలగించిన మహానుభావులకు మాత్రమే నేను కనబడుదును అని శ్రీగీతాచార్యుడు పలికెను.

పుష్పము మధ్యనుండు వాసనవలెను, పాల మధ్యనుండు నెయ్యి వలెను, నువ్వుల మధ్యనుండు నూనెవలెను, రాతి మధ్య నుండు బంగారము వలెను ఆత్మయున్నది. హృదయకమల మధ్యమందుండే జలములో అణిగియున్నది. ఈ ఆత్మయొక్క హంసము ఒకప్పుడు నారాయణుడగుటను మరియొకప్పుడు బ్రహ్మగాను, మరియొకప్పుడు శివుడుగను, ఇంద్రుడుగను, నుండుటయే గాక, నాశనము లేనియట్టి వాడైయున్నాడు. ఆయా జీవి చేయుచుండెడి పాపపుణ్యములను చూచు చుండుటవలన ఆత్మకు చిత్రగుప్తుడని మరియొక నామము కలిగెను.

# XIV.

ఉన్నత శిఖరంపై వర్షించిన నీరు పర్వత సానువులలో లెక్కలేపి పాయలై ప్రవహించినట్లు గుణాలను వివిధాలుగా చూచేవారు వాటి వెంటనే పరుగు తీస్తారు.

శిఖరము, చరియలు, ఒకే పర్వతునియే అయినా శిఖరము ఐక్యతను వదిలేసి చరియల వైవిధ్యాన్ని అన్వేషించే వర్షపు నీరు చెదరుపాటును, కాలుష్యాన్ని పొందుటయు, అలాగే జీవితంలో కూడా ఉపాదుల వైవిధ్యంలో, బ్రహ్మము యొక్క అభివ్యక్తులలో అనేకతను చూచేవాడు, వాటి వలలో చిక్కుకొని బంధాన్ని అనుభవిస్తాడు.

## వాటి వెంటనే పరుగు తీస్తాడు.

పదార్థమనబడే ఆ ఉపాదుల చేత ఆకర్షింపబడి, జనన మరణాలనే వలలోకి లాగివేయబడతాడు.

# XV.

శుభ్రమైన నీరు శుభ్రమైన నీటిలో పోయబడి ఎలా శుభ్రంగానే ఉంటుందో అలాగే ఆత్మ యొక్క ఏకత్వాన్ని తెలుసుకొనిన ఋషి ఆత్మకూడా అవుతుంది.

అలాగే.... అవుతుంది.

**విజ్ఞానం ద్వారా అహంత అనే మాలిన్యం కడిగివేయబడిన ఋషి యొక్క ఆత్మ బ్రహ్మముతో ఐక్యమవుతుంది.**

**ఓం నమో శ్రీనివాసాయనమః**

**ఓం నమశ్శివాయనమః**

# I.

జన్మరహితుడు, అకుంఠిత ప్రజ్ఞావంతుడు అయిన ఆత్మకు పదకొండు ద్వారాల పట్టణమున్నది. ఆ ఆత్మను ధ్యానించినవాడు ఇక శోకించడు. అన్ని అజ్ఞాన బంధాల నుండి విముక్తుడై జన్మ మృత్యు బంధాన్నుంచి కూడా స్వేచ్ఛ పొందుతాడు.

## ఇదే నిజంగా అది

**పదకొండు ద్వారాల పట్టణము :** పదకొండు రంధ్రాలు గల శరీరము. తలలో ఏడు - అధోభాగంలో రెండు, నాభి - బ్రహ్మరంధ్రం అనేవి పదకొండు.

ప్రతీ జీవిలోను బ్రహ్మరంధ్రము నాభి అను రెండు ద్వారములు మాత్రము మూసికొనియుండును. ఇవి సాధనచే, మరియు సాకార, నిర్గుణ, నిరాకార బ్రహ్మోపాసనచే తెరుకొని మోక్షానికి అర్హున్ని చేస్తాయి.

**మోక్షార్హత కలిగిన జీవుడు మాత్రమే ఈ రెండు ద్వారములలో ఏదో ఒక ద్వారము గుండా శరీరము నుండి నిష్క్రమిస్తాడు.**

ఇంద్రియ నిగ్రహము గల యోగి మనసా సర్వకర్మల ఫలత్యాగము కావించి నవద్వార పురము వంటి ఈ దేహము నందు సుఖముగా యున్నాడు.

శారీరకముగా కర్మలనాచరింపక తప్పించుకొని పారిపోవుట సన్యాసము కాదు. అనాలోచితమై అవివేకమైన విషయముల నుండి మనస్సును మరల్చుటయే సన్యాసమగుచున్నది.

**సన్యాసము మనోభావము కాని, బాహ్య వేషము, దేహధారణ కాదు.**

ఆత్మ నిగ్రహము కల వ్యక్తి విషయ వాసనలననిచివేసి, అహంకార, మమకార సహిత సకామకర్మలను త్యజించిన యెడల తన అంతఃపురము నుండియే వెడలివచ్చు నిరుపమానమైన, అనిర్వచనీయమైన శాంతిని సంతృప్తిని అనుభవించుచున్నాడు. అట్టి జ్ఞాని సుఖ సంతోషములతో నవద్వార పురమగు దేహము నందు నివసించుచున్నాడు.

**నవద్వార పురమనునది దేహమును సూచించుటకు ఉపయోగించ బడిన ప్రసిద్ధ రూపకము.**

2 కన్నులు, 2 చెవులు, రెండు ముక్కు ద్వారములు, నోరు, మూత్రపురీష విసర్జనా ద్వారములు అను తొమ్మిది రంధ్రములను నవ ద్వారములుగా పోల్చి ఈ శరీరమును దృఢమైన కోటగోడ గల పురముగా వర్ణించియున్నారు.

రాజు కోటగోడలో కూర్చొని తన మంత్రుల ద్వారా ప్రజలను పాలించుచు తన సాన్నిధ్యము చేతనే వారికి ఉత్సాహము బలము ఇచ్చునట్లు ఆత్మకూడా తానేదియు చేయక తన సాన్నిధ్యము చేతనే జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలను ఉజ్జీవింపచేసి మనోబుద్ధుల ద్వారా వానిని పాలించుచున్నది.

ఒక జీవుడు ఒక శరీరాన్ని విడిచి మరొక శరీరాన్ని ప్రవేశించు నపుడు వాయువు పుష్పము నుండి పరిమళాన్ని తీసుకుపోవునట్లు మనస్సుతో కూడిన పంచేంద్రియములను ఆకర్షించుకొని పోతుంటుంది.

**ఆ పరమాత్మ ఉపాధిగతుడైనప్పుడు జీవుడు అవుతున్నాడు.** ఆ జవుడే దేహాన్ని ధరించి వివిధ పరిసరాల్లో అవతరిస్తున్నాడు. తనకుండే ఆశలు, అభిలాషల ద్వారా అటువంటి పరిసరాలను తానే కోరుకొంటున్నాడు.

తాను కోరుకొన్న పరిసరాల్లో జన్మించి అక్కడ తన కోరికలను తీర్చుకొంటున్నాడు. అలా ధరించిన శరీరాన్ని విడిచే వరకు ఈ ఇంద్రియ జ్ఞానాన్ని, మనోభావనలను తన దగ్గర ఉంచుకొంటున్నాడు.

**ఇదియే సూక్ష్మ శరీరము**

ఈ సూక్ష్మశరీరము స్థూల శరీరాన్ని విడిచిపోతుంది. అంత ఆ స్థూల దేహము జడమై శవమైపోతుంది. అపుడు ఆ దేహానికి ఆ వ్యక్తి ఆకారము ఉన్నప్పటికీ ఆ వ్యక్తికి ఉన్న ఇంద్రియజ్ఞానం గాని, మనోబుద్ధులు, శక్తికాని ఉండవు. ఇంద్రియ మనోబుద్ధులు ఉండటం చేతనే ఆ వ్యక్తికి ప్రత్యేక గౌరవం వచ్చినది.

**ఈ శక్తులన్ని సూక్ష్మశరీరము అవుతున్నవి.** స్థూల శరీరం నుండి సూక్ష్మశరీరం విడిచిపోగానే అది కేవలము మృతదేహమే అవుతున్నది.

ఒక ఉద్యోగస్తునికి బదిలి అయినప్పుడు, తానున్న ఇంటిని విడిచి అతడు తన సామానునంతటిని కట్టుకొని ప్రస్థుతము తానున్న ఇంటిని విడిచి బదిలీ అయిన ఊరికి వెడుతున్నాడు.

**అక్కడ తనకిచ్చిన ఇంటిలో ఈ సామానులన్నిటిని సర్దు కుంటున్నాడు.**

అదేవిధముగా ఈ జీవుడు స్థూల శరీరమును విడిచినప్పుడు తన శక్తులనన్నిటిని తనతో కూడా మూటకట్టుకొనిపోయి భాగాయుతమైన క్రొత్త శరీరంలో ప్రవేశించి తన శక్తులనన్నిటిని విప్పి పరచుకొంటున్నాడు.

ఓ అగ్నీ, మేము చేసిన కర్మల ఫలాన్ని అనుభవించడానికి మమ్మల్ని మంచి మార్గము ద్వారా తీసుకుపో, మాచే చేయబడిన కర్మలన్నీ నీకు తెలుసు. ఓ దేవా! మాలోని మాయదారి పాపములను నిర్మూలించు. మా మాటలతో నీకు మరల మరల నమస్కరించుచున్నాము.

దేహత్యాగం చేసిన జీవులు భూమిమీద వారు చేసిన కర్మఫలాన్ని అనుభవించుటకై ప్రయాణించే రెండు రకాల మార్గాలు వేదాంతంలో చెప్పబడ్డాయి.

ఒకటి దేవయానము. అంటే దేవతల మార్గము లేక అర్చిక మార్గము. రెండవది ధూమమార్గము లేక పితృయానము లేక పితృ మార్గము. ఇది చీకటి దారి.

మొదటిది అగ్నిలోకము పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణము, సంవత్సరము, దేవతలు, వాయువు, సూర్యుడు, చంద్రుడు, మెరుపు, వరుణలోకం, ఇంద్రలోకం, ప్రజాపతి లోకాల ద్వారా బ్రహ్మలోకానికి లేదా సత్యలోకానికి తీసుకెడుతుంది.

**ఈ మార్గం గుండా ప్రయాణించువారు తిరిగి ప్రపంచమునకు రారు.** వారు కల్పాంతము వరకు బ్రహ్మలోకంలోనే ఉండి కల్పాంతంలో బ్రహ్మతో సహా పరబ్రహ్మంలో లీనమవుతారు. ఇది క్రమముక్తి లేక పరోక్ష ముక్తి అంటారు.

జీవన్ముక్తి యనగా శరీరముతో జీవించియుండగానే ఆత్మ సాక్షాత్కారము చేసికొనడం ద్వారా లభిస్తుంది. సగుణ బ్రహ్మ ఉపాసకులు, నైష్టిక బ్రహ్మచారులు నిర్గుణ బ్రహ్మ ఉపాసకులు. వానప్రస్థులు, పంచాగ్ని విద్యను తెలుసుకున్న గృహస్థులు దీనికి అర్హులు.

రెండవ మార్గము ధూమ మార్గము, అలాగాక, పొగ లేదా చీకటి, రాత్రి, కృష్ణపక్షము, సంవత్సరము, పితృలోకం, ఆకాశాల ద్వారా చంద్రలోకానికి తీసుకువెడుతుంది. సాధారణమైన జ్ఞానము, కర్మ కలిగి, జీవితంలో కొన్ని సత్కార్యాలు చేసినవారు రెండవ మార్గము ద్వారా చంద్రలోకానికి పోయి తమ పుణ్యఫలం తీరేవరకు అక్కడే ఆనందిస్తారు. ఆ తర్వాత పరిశిష్టమైన పూర్వకర్మతో ఈ లోకంలోని సుఖదుఃఖాలను అనుభవించడానికి మళ్ళీ జన్మిస్తారు.

శ్రీనారాయణమూర్తి గరుత్మంతునితో గరుడ పురాణంలో ఈ విధంగా పలికెను.

ఓ గరత్ముంతుడా!

1) ఎవరు పాపము నందు ఆసక్తి కలవారో

2) ఎవరు దయయనెడి ధర్మమును విడిచిపెట్టిరో

3) ఎవరు దుర్మార్గులతో సహవాసము చేసితిరో

4) ఎవరు మంచి శాస్త్రములయందు సత్పురుషుల యందు వారి సహవాసమందు విముఖులై యుందురో

5) ఎవ్వరు తన్ను తానే గౌరవింపచేసికొనుచు ధనము కలిగి యున్నదని గర్వపడి రాక్షస కృత్యముల నొనరించుచు దేవతా సంబంధమగు సాత్విక బుద్ధి లేనివారై యుందురో

6) అనేక విషయముల యందు మనస్సు వ్యాపించుట వలన భ్రాంతికలవారును, మోహమనెడి వలలో చిక్కుపడిన వారును భోగములందు ఆసక్తి కలవారై

**దుఃఖకరమగు నరకమును పొందుచున్నారు.**

ఏ మనుష్యులు జ్ఞాన స్వభావము కలవారో అట్టివారు స్వర్గాది పుణ్యలోకములకు వెళ్ళుదురు.

పాపాత్ములగువారు దుఃఖమును చెందుచు నరకమునకు వెళ్ళుదురు.

ఓ గరుత్మంతుడా! పాపాత్ములీలోకమందు అనుభవించెడి దుః ఖమును పిమ్మట మరణము పొంది నరకమును పొందునట్టు రీతిని చెప్పుచున్నాము వినుము–

పూర్వజన్మమున చేసికొనబడిన కర్మానుసారముగా పుణ్యము వలన సుఖమును గాని పాపము వలన దుఃఖమును గాని పొందిన పిమ్మట తన కర్మానుసారముగ రోగము పొందినవాడగును.

పిమ్మట మనోవ్యాధియు, దేహవ్యాధియు కలవాడుగా జీవించ వలయును. ఆశతో కూడినవాడుగాయుండగా, మరణకాలము సమీపించి 'మరణము' వానిని బలమైన సర్పము ఎలుకను పట్టుకొనునట్లు పట్టుకొనును.

పాపాత్ముడు ఇట్లు మరణకాలము సమీపించినప్పటికి, వైరాగ్యము లేనివాడై తాను భార్యాపిల్లలచే పోషింపబడుచు ముసలితనముచే వికార రూపము కలవాడై యుండును.

తిరస్కార భావముతో భార్యా పుత్రులచే దగ్గర యుంచబడిన యన్నమును శునకమువలె తినుచు, రోగము కలవాడై మందమైన జఠరాగ్ని కలవాడై కొద్దియాహారమును భుజించుచు బలము లేక చేష్టలుడిగియుండును.

మరణ కాలమందు ప్రాణము బయలు వెడలుచుండగా నాడుల యందంతటను, శ్లేష్మము వ్యాపించి దగ్గు, శ్వాస పుట్టి, ఆయాసపడుచుండి, కండ్లు మూయుచు, తెరచుచు గొంతులో గురకపెట్టగా బాధపడు చుండును.

తన బంధువులందరు తనచుట్టు చేరి యేడ్చుచుండగా మృత్యువు ప్రాణములను తీసికొని పోవుచుండగా బంధువులెన్నిసార్లు పిలిచినను పలుకలేక యుండును.

ఓ గరత్మంతుడా! ఆ మృతినొందెడి సమయములో దివ్య జ్ఞాన ముదయించగా ఇహలోక పరలోకములు సమముగానే కన్పించుట వలన ఏమియు చెప్పలేనివాడైయుండును.

ఇట్లు ఇంద్రియములు స్వాధీనము తప్పియుండగా అపుడు తన సమీపమున కాచుకొనియున్న యమభటులు ప్రాణములు తీయుటకు ప్రయత్నము చేయుదురు.

ఇట్లు యమభటులు ప్రాణములు తీయుటకు బ్రయత్నించుచు, ప్రాణమును కదల్చుచుండగా నూరు తేళ్లు కుట్టునంత బాధ కలిగి ఒక్కొక్క క్షణకాలము ఒక్కొక్క కల్పముగా తోచుచుండును.

ఇట్లు వాడు బాధపడుచు, నోటివెంట నురుగును గ్రక్కుచు చొంగను కార్చుచుండును.

**వాడు పాపాత్ముడు కావున వాని ప్రాణములు అధోద్వారము గుండా వదలిపోవును.**

భయంకరులును, క్రూరమగు చూపులు కలవారును, యమ పాశమును దండమును ధరించినవారును, పండ్లు పటపట కొరుకుచున్న వారును, కాకి వలె నల్లని యాకారము కలవారును, గొల్లు ఆయుధముగా కలవారును అగు యమధూతలు అచ్చటికి రాగా అప్పుడు చూచి భయము పొందినవాడై మలమూత్రములను విడిచిపెట్టును.

అప్పుడు బొటనవ్రేలంత ప్రమాణం గల జీవుడు దుఃఖించు చుండగా మోహముచే తన గృహమును విడువలేకుండా యమభటులచే శరీరమునుండి బయటకు తీయబడుచున్నాడు.

ఈ స్థూల శరీరము నశించుటచేత కేవలము సూక్ష్మ శరీరమును తీసుకువెళ్ళుటకు వీలు లేదు కాబట్టి అప్పుడొక యాతనా శరీరమందు ఆ జీవుని ప్రవేశపెట్టి, కంఠమును త్రాళ్ళచే గట్టిగా కట్టి, రాజభటులు నేరస్తుని తీసికెళ్ళు రీతిగా చాలాదూరముగా యుండునట్టి మార్గమున తీసికెళ్ళుదురు.

ఈ ప్రకారము యమభటులు వారిని తీసికెళ్ళుచు, మార్గములో భయపెట్టుచు నరకముల భయంకర స్థితిని చెప్పుచుందురు.

అప్పుడీ ప్రకారము యమధూతలు పలుకునట్టి మాటలను, బంధువుల రోధనలను వినుచున్నవాడై యమకింకరులు కొట్టుచుండగా హాహాయని బిగ్గరగా అరుచుచుండును.

ఇట్లు ఆ యమభటులు ఇద్దరు జడిపింపగా భయపడుచు మనస్సు చెడిపోయినవాడై దారిలో తనను శునకములు కరువగా దుఃఖించుచు తన పూర్వజన్మ పాపములను తలచుకొనుచు వెళ్ళుచుండును.

ఆకలి దప్పులచే బాధపడుచు, సూర్యుడు, వాయువు, అగ్ని హోత్రము, దావాగ్ని మొదలగు వానిచే పీడింపబడుచు మిక్కిలి తీవ్రముగా వీపు మీద యమభటులు కొరడా కొట్టుచుండగా, కాలిన ఇసుక గలదియు, నిలుచుటకు నీడలేనిదియు, త్రాగుటకు నీరులేనిదియు నగు భయంకర మార్గమున తాను నడచుచు, నడచుటకు కూడా శక్తిలేనివాడై మెల్లమెల్లగా నడచును.

ఇట్లు పోవుచు, అక్కడక్కడ పడుచు అలసి మూర్ఛనొందుచు, తిరిగి లేచుచు, ఇట్లు బాధపడుచు, గాఢాంధకారమగునదియు పాపులు పోదగిన మార్గమందు జీవుని, యమభటులు యమలోకమునకు తీసికెళ్ళుదురు.

ఇట్లు ఆరు గఢియలకు గాని 4 గఢియలకు కాని యమభటులు యమలోకమునకు తీసికెళ్ళి భయంకరమగు నరకములను, నరక బాధలను చూపింతురు.

ఇట్లు శీఘ్రముగా తీసికొనివెళ్ళి యొక్క ముహోర్తకాలము భయంకరుడగు యముని చూపింపగా అపుడు అతని యాజ్ఞానుసారముగా ఆకాశగమనము కలవాడై యమభటులతో కూడా తిరిగి వచ్చును.

## II.

స్వర్గంలో తిరిగే సూర్యుడు ఆత్మ.

అంతరాళంలో తిరిగే వాయువు ఆత్మ.

యజ్ఞవేదికపైన అగ్ని – కూజాలోని సోమరసము ఆత్మయే మానవులలో, దేవతలలో, యజ్ఞంలో ఆకాశంలో ఆ ఆత్మ ఉన్నది. ఆ ఆత్మ నీటిలో జన్మించింది – యజ్ఞంలో జన్మించింది – పర్వతంపై జన్మించింది.

**ఆ ఆత్మయే సత్యము ఆ ఆత్మయే బృహత్తు**

**వివరణ :** ఆత్మయొక్క సర్వవ్యాపితాన్ని శృతి ఉద్ఘాటిస్తున్నది.

నీటిలో జన్మించింది – జలచరములు

భూమిపై జన్మించింది – చెట్లు–మొక్కల రూపంలో, జంతువులు, క్రిమికీటకాదుల రూపంలో

పర్వతంపై జన్మించింది – నదులు మొదలైనవాని రూపంలో.

# III.

అతడు ప్రాణాన్ని పైకి పంపిస్తాడు. అపానాన్ని క్రిందకు విసురుతాడు. మధ్యలో ఆసీనుడైయున్న ఆ పూజనీయుని అందరు దేవతలు ఆరాధిస్తారు.

**అందరు దేవతలు :** మనస్సుతో కూడా ఇంద్రియాలు కూడా తమతమ పనులను చక్కగా నిర్వహించడము ద్వారా తమ ప్రభువైన ఆత్మను సేవిస్తాయి.

ప్రపంచం నుండి అనుభవాలను సేకరించి ఆత్మకు నివేదిస్తాయి. అన్ని ఇంద్రియాలు, ప్రాణాలు కూడా ఆత్మకోసమే పనిచేస్తాయి.

శారీరక ప్రక్రియలన్నీ పది రకాల శక్తులచేత నిర్వహింపబడతాయని ప్రాచీన భారతీయ తాత్వికులు భావించేవారు. అవి–

**పంచ ప్రాణములు :** ప్రాణము, అపానము, వ్యానము, సమానము, ఉదానము

**ఉపవాయువులు :** నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనుంజయ

## శరీరములో దశవాయువులు చేయు పనులు :–

1) హృదయమునందెప్పుడును ఉండునది ప్రాణవాయువు. ఈ ప్రాణవాయువు ఊపిరిగా నుండి ముక్కు ద్వారముల గుండా బయటకు

వచ్చును. మరల లోపలకు పోవుచుండును. ఇట్లు చేయుచుండి కడపట నాసికను బంధించి మలమూత్రములను విసర్జింపజేసి మృత్యువును తెచ్చును.

2) గుదము నందుండునది (మలమూత విసర్జనావయవము లందు) అపాన వాయువు. ఇది మలమూత్రములను బయటికి తెచ్చి వదలును. ఇంతియేగాక శుక్ల శోణితములను బయటకు తోయుచు, ముక్కు ద్వారము గుండా శ్వాసను వెలుపలకు పంపుచుండును.

ఇట్లు పంపుచు, కడపట స్త్రీలకు యోనియొక్కయు పురుషులకు శిశ్నము యొక్క ద్వారమును బంధింపజేసి జిహ్వాద్వారా మృత్యువు తెచ్చును.

3) కంఠము నుందుండెడిది ఉదానవాయువు. ఇది భుజించునట్టి వస్తువులను, త్రాగునట్టి జలమును లోపలకు పోవునట్లు చేసి ఆ యాహారమును రసరూపకముగా జీర్ణింపంజేయును.

మరియు నిద్రించునపుడు ఇంద్రియములనన్నిటిని గాఢాంధ కారమున అణిచి, మరల నిద్రలేచునపుడు వాటివాటి స్థానము లందు ఇంద్రియములను తెచ్చి నిలుపును. అట్లా నిలిపిన వెంటనే ఆయా ఇంద్రియములు వాటివాటి పనిని చేయుచుండును.

ఇట్లు చేయుచుండి, కడపట పాదములను శీతలముగా చేసి నేత్రముల దృష్టిని తప్పించి మృత్యువును తెచ్చును.

4) నాభియందుండెడిది సమాన వాయువు. ఇది పై చెప్పబడిన ఉదాన వాయువుచే జీర్ణింపబడిన రసమును సకల నాడులకు చక్కగా పంచి దేహమును పెరుగునట్లు చేయును. మరియు మరణ సమయమున వాక్కున వాక్కును, కర్ణములను బంధించి తెలివితేటలను మార్చి మృత్యువును తెచ్చును.

5) దేహమందంతటను వ్యాపించి యుండునది వ్యానము. ఈ వ్యానము చర్మముపై తగులునట్టి శీతోష్ణవాయువులను తెలిసికొనుచు, ఇంతియేగాక భోజన పదార్థములోని రసమును, పిప్పిని వేరుచేయును.

ఇంతియేగాక వ్రేళ్ళను శీతలముగ చేసి నేత్రముల దృష్టిని మరల్చి మృత్యువును తెచ్చును.

ఈ 5 వాయువులు సకల జీవరాసుల యందును వ్యాపించి యుండుటచేత అవి జీవించియున్నవి.

**వీటిని పంచప్రాణములనియు ప్రధాన వాయువులనియు చెప్పబడును.**

**ఉపవాయువులు :**

1) కంఠమునందుండునది నాగవాయువు. ఈ నాగవాయువు అన్ని వస్తువులను చూచునట్లు చేయును మరియు వాంతిని పుట్టించును.

2) కనురెప్పలు మూయునట్లు తెరచునట్లు చేయునది కూర్మ వాయువు.

3) తుమ్ము వచ్చునట్లు చేయునది కృకర వాయువు.

4) ఆవలింపులను, త్రేనుపులను పుట్టించునది దేవదత్త వాయువు.

5) ప్రసవ సమయము నందు శిశువును గర్భాశయము నుండి వెలుపలకు నెట్టునది ధనుంజయ వాయువు.

ఈ ధనుంజయ వాయువు మరణానంతరమున కూడా దేహమును వదలక యుండి ఆ దేహమునకు వాపును కలుగజేయు చుండును. ఈ వాయువు దహనము వరకును దేహమును అంటియే యుండును.

# IV.

శరీరములో నివసించే వానికి చెందినది, శరీరము నుండి అతడు వేరుచేయబడిన తరువాత ఇక్కడ ఏదిమాత్రము మిగులుతుంది?

**నిజంగా ఇదే అది**

**ఇక్కడ : ఈ శరీరంలో ఏది మాత్రము మిగులుతుంది.**

ఆత్మ శరీరము నుండి నిష్క్రమించిన తరువాత శరీరములో ఆత్మకు చెందినది ఏదీకూడా మిగలదు. అందుచేత మొత్తము శరీరము నశించి పోతుంది.

వైరాగ్యమయమైన జీవనం ద్వారా, నిరంతర అభ్యాసం ద్వారా, పవిత్ర స్వభావులై వేదాంతాలు అన్వేషించే పరమాత్మయందే సుస్థితులైన సాధకులు సాక్షాత్కార సమయంలో అరులై బ్రాహ్మీభూతులవుతారు. అన్ని విధాల ముక్తులవుతారు.

వారి 15 అంశాలు వాటి మూలకారణంలో చేరిపోతాయి. ఇంద్రియాలు వాటి అది దేవతలలో లీనమవుతాయి. వారి కర్మలు, వ్యక్తిత్వము, పరమమైన అక్షయతత్వంలో ఐక్యం పొందుతాయి.

ప్రవహించే నదులు, వాటి పేర్లను, ఆకారాలను కోల్పోయి ఎలా సముద్రంలో ఏకమవుతాయో, అలాగే జ్ఞాని కూడా తన నామరూపాల నుండి విముక్తుడై సద్యోత్కృష్టము, దేదీప్యమానము అయిన పరబ్రహ్మ తత్వంలో లీనమవుతాడు.

**ఆ పరబ్రహ్మ తెలుసుకొన్న ప్రతీవాడు పరబ్రహ్మమే అవుతాడు.**

**ఆపైన ఇక్కడ ఏదిమాత్రం మిగిలిపోతుంది.**

# V & VI

మానవుడెవడు ప్రాణంచేత గాని, అపానం చేతగాని జీవించడు. ఈ రెండు ఆధారపడే మరొకదానిచేత జీవిస్తాడు.

**వివరణ :** ఇచట ప్రాణము అపానము అనేవి అన్ని ప్రాణులకు ఇంద్రియాలకు ఉపలక్షణంగా వాడబడ్డాయి.

ఓ గౌతమా! ఇక నీకు ఆ రహస్యము సనాతనము అయిన బ్రహ్మమును గూర్చి చెబుతాను. అలాగే మరణానంతరము ఆత్మ ఏమవుతుందో కూడా చెబుతాను.

# VII.

కొన్ని జీవాత్మలు శరీరం కోసం గర్భంలో ప్రవేశిస్తాయి.

మరికొన్ని జీవాత్మలు చెట్టు చేమలనాశ్రయిస్తాయి.

**అంతా వారివారి కర్మలను అనుసరించి – జ్ఞానాన్ని అనుసరించి ఉంటుంది.**

శృతి ఇక్కడ స్పష్టంగా కర్మ సిద్ధాంతాన్ని, పునర్జన్మని స్పష్టం చేస్తుంది సాత్వికము, రాజసము, తామసము అయిన కర్మజ్ఞానాల్ని బట్టి మానవుడి పునర్జన్మ మొదలు గడ్డిపోచ వరకు ఎందులోనైనా కలుగవచ్చు.

**జన్మ క్రమము :-**

**I.** కోదండరామయ్యా యెల్ల మానవులను మొట్టమొదట పచ్చగడ్డి నుండి

**II.** ఆ జన్మ పుణ్యవిశేషము వలన మరుజన్మలో ఆ గడ్డిలో పూతగా పుట్టి

**III.** ఆ జన్మ పుణ్యఫలము వలన వృక్షమై పుట్టి

**IV.** ఆ జన్మ పుణ్యఫల విశేషము వలన రాయియై పుట్టి

**V.** ఆ జన్మ విశేషము వలన పక్షులై జన్మించి

**VI.** ఆ జన్మ విశేషము వలన ప్రాకుడు జంతువులుగా

**VII.** ఆ జన్మ విశేషము వలన మృగముగా జన్మించి

**VIII.** ఆ జన్మ విశేషము వలన మనుజుడై పుట్టును.

## యమయాతనా నిరూపణము :

ఓ గరత్మంతుడా! యమలోకమునందునట్టి నరకములను మొదట నుండి చివర పర్యంతము సంపూర్ణముగా చెప్పెదను. నీవు వినుము. ఆ నరకముల గురించి చెప్పుచుండగా వినినంతనే నీవు కూడా భయము పొందువాడవగుదువని శ్రీకృష్ణమూర్తి చెప్పుచున్నాడు.

ఓ గరత్మంతుడా! బహుభీతి యను పట్టణము దాటిన పిమ్మట దానికి నెదురు నలుబది నాలుగు యామడల దూరము నందు యమధర్మరాజు యొక్క పట్టణము కలదు.

యమ బాధలచే హాహాకారములు చేయునట్టి జీవులు గల యమపట్టణమును చూచి పాపాత్ముడు దుఃఖించుచుండగా వాని ఏడ్పును విని అక్కడ నుండువారు ఆ పట్టణ దక్షిణ ద్వారమందు కావలియున్న ధర్మధ్వజుడను ద్వారపాలకునియొద్దకు వెళ్ళి చెప్పుదురు.

అప్పుడు ద్వారాపాలకుడు వానిని గురించి చిత్రగుప్తునకు, చిత్రగుప్తుడు వాని గురించి యమధర్మరాజునకు చెప్పును.

ఓ గరత్మంతుడా!

ఏ మనుషులు

1) దేవుడు లేడనియెడి నాస్తిక బుద్ధి గలవారై మిక్కిలి పాపములు చేసియుందురో యమధర్మరాజు వారందరు ఎవరెటువంటి పాపములు చేసియున్నారో తెలిసికొనును.

2) ఆ యమధర్మరాజు తాను సమస్తము నెరిగినవాడైనను వారి దుష్కృతములను చిత్రగుప్తునడుగును. చిత్రగుప్తుడు తానును తెలిసిన వాడైనను శ్రవణులను వారినడుగును.

శ్రవణులు (బ్రహ్మసుతులు) వారు మనుష్యులు మనస్సు చేత, వాక్కు చేత శరీరము చేత చేయబడిఇన సక్రుతము కాని దుష్కృతము గాని సమస్తమును యధార్థముగా తెలుసుకొను సమర్థులగుచున్నారు.

వ్రతముల చేతను, దానము చేతను, ఎల్లప్పుడు నిజముగా మాట్లాడుట చేతను శ్రవణులను సంతోషింపజేసెనేని యా శ్రవణులు మంచివారై యాతనికి స్వర్గముగాని మోక్షమును గాని ఇచ్చువార లగుదురు.

సూర్యుడు, చంద్రుడు, వాయువు, అగ్నిహోత్రుడు, ఆకాశము, భూమి, జలము, ఆత్మ, యమధర్మరాజు, పగలు, రాత్రి, ప్రాతఃకాల-సాయంకాలములగు రెండు సంధ్యలు, ధర్మము ప్రపంచము నందు మనుజుడు చేయు ప్రవర్తనను తెలిసికొనుచుందురు.

యమధర్మరాజు, చిత్రగుప్తుడు, శ్రవణుడు, సూర్యుడు, మొదలగు వారందరును వాని శరీరము నాశ్రయించియున్న పాపపుణ్యములను తమతమ స్వస్థానములయందు ఉన్నవారలై చూచుచుందురు.

చేతిలో దండము గలవాడును, పెద్ద కిరీటము గలవాడును, దున్నపోతు వాహనంబున కూర్చున్నవాడును, ప్రళయకాల మేఘ ఘర్జనతో సమానమగు ధ్వనికలవాడును, నల్లని కాటుక పర్వతముతో సమానమగు ఆకారము కలవాడును, మెరపుతీగవలె మెరయుచున్న ఆయుధములతో కూడినవాడును, ముప్పది రెండు చేతులు కలవాడును మూడామర పొడవు గలవాడును, దిగుడు బావుల వంటి నేత్రములు కలవాడును, భయంకరమగు కోరలు గల ముఖము గలవాడును, పొడవు ముక్కు గలవాడును, భయంకరుడును అగు యమధర్మరాజును చూచి పాపాత్ములు భయపడుదురు.

చిత్రగుప్తుడును మృత్యువు, జర్వము మొదలగు వానితో గూడి భయంకరముగా యుండును.

యమధూతలందరును గూడా యముని వలెనే భయంకరులుగా యుండువారగుదురు.

**ఏమియు దానధర్మములు చేయని పాపాత్ముడగు దుర్మార్గుడు ఆ యమధర్మరాజును జూచి మిక్కిలి భయము చెంది మాటిమాటికి వణుకుచు నాకు ఎంత కష్టము వచ్చెనని ఏడ్చుచుండును.**

అనంతరము యముని ఆజ్ఞానుసారముగా చిత్రగుప్తుడీ విధముగా పల్కుచున్నాడు.

ఓ పాపాత్ములారా! మీరు అయోగ్యమార్గమందు తిరిగి అహంకారాది గుణములచే నిందింపబడుచు జ్ఞాన విహీనులై పాపము ఏల చేసితిరి.

జ్ఞానము లేని యోమనుష్యులారా! దుర్మార్గుల సహవాసము చేసి కామ క్రోధ, లోబాధి గుణములు కలవారై పాపములు చేసితిరి. కావున మీకిట్టి దుఃఖము సంభవించినది.

ఓ జనులారా! పూర్వమందు మీరెంత సంతోషములో పాపము లెట్లు చేసితిరో ఆ విధముగానే ఇప్పుడు నరకముల ననుభవింప వలయును. మీరు ఇచట భూలోకమందు వలె ఈ శిక్షల నుండి పారిపోలేరు. ఇవి మీకు తప్పవు.

ఓ నరులారా! చదువుకొనని వానియందును, చదువుకొనిన వానియందును, దరిద్రుని యందును, భాగ్యవంతుని యందును, బలము కలవాని యందును, బలహీనుని యందును యమధర్మరాజు సమబుద్ధి కలిగియుండి (భావము) పక్షపాతము లేక శిక్షించుచుండును. **కాబట్టి ఇట్టి దుఃఖము పొందుటకు మీరు చేసిన పాపములే హేతువులు గాని యమధర్మరాజునందేలోపము లేదు.**

ఈ ప్రకారముగా పలికిన చిత్రగుప్తుని వాక్యములు వినినవారై యా పాపాత్ములు తమరు చేసికొనిన పాపకర్మములను గురించి దుఃఖించుచు ఏమియు చేయనేరక యూరకుందురు.

యమధర్మరాజు యొక్క ఆజ్ఞ ప్రకారము నడచుచుండెడివారగు చుండుడు, ప్రచండుడు మొదలగు యమధూతలు వారినందరిని యొకే తాటితో కట్టి నరకములకు భటులు కొట్టుకొనుచు తీసికొని పోవుదురు.

ఇట్లు తీసికొనిపోవుచుండగా దారిలో అగ్నిహోత్రము వలెనే మండుచున్నదియు, అయిదు ఆమడల పొడవును, అయిదు ఆమడల వెడల్పును కలిగిన, ఒక ఆమడ ఎత్తు కలదియు అగు ఒక గొప్ప వృక్షము కలదు.

ఆ వృక్షము నందు గొలుసులచే కట్టి పిమ్మట తలక్రిందులుగా బయవేయుచున్నారు. అప్పుడు అక్కడుండు మంటలచే దహింపజేయబడి పాపాత్ములు ఏడ్చుచుందురు.

**అప్పుడు వారిని రక్షించు వారెవరును లేకుందురు.**

విశేషముగా చేసినవారు (పాపములు) కొందరు ఆ బూరుగు వృక్షము నందు కట్టబడి వ్రేలాడుచున్నవారిని యమధూతలు కొట్టుచుండగా ఆకలి దప్పులచేత అలసి బాధపడుచుందురు.

ఓ యమధూతలారా! మీకు నమస్కారము చేసెదను. మేము చేసిన అపరాధములను క్షమింపవలయునని దిక్కులేనివారలై ప్రార్థింతురు.

యమధూతలా పాపాత్ములను ఇనుపచువ్వల చేత, సమ్మెటల చేతను, ఈటెల చేతను, గధల చేతను రోకల్ల చేతను మాటిమాటికి బాగా కొట్టుచుందురు.

ఈ విధముగా కొట్టుటవలన స్మృతి తప్పి మూర్ఛ చెందుచున్న పాపాత్ములను జూచి యమభటులిట్లనుచున్నారు.

దుర్మార్గ ప్రవర్తనము గల ఓ పాపాత్ములారా! అయోగ్యమైన ప్రవర్తన కలవారై ఏల సంచరించితిరి. సులభముగా చేయనైనదియును మంచితీర్థమునైనను దానము ఇవ్వకపోతిరి! పట్టెడన్నమునైనను ఇతరులకు పెట్టకపోతిరి. అతిథి అభ్యాగతులను పూజింపరైతిరి. పితృదేవతలకు తర్పణముజేయరైతిరి.

యమధర్మారాజుని, చిత్రగుప్తుని ధ్యానము చేయవైతిరి. నరకమును కలుగనీయని వారి మంత్రమునైనను జపింపవైతిరి.

ఒకానొక పుణ్యక్షేత్రమైనను సేకరింపబడలేదు. ఏ దేవతల నైనను పూజించితివి కాదు.

**నీవు గృహస్థాశ్రమములో యుండి దిక్కులేనివారిని రక్షించ సమర్థత కలిగియుండియు బ్రతికించవైతివి.**

సత్పరుషులకు శుశ్రూష చేయవైతివి.

**కాబట్టి నీ పాపమును నీవు అనుభవింపవలయును.**

నీవెంత మాత్రమును ధర్మమును చేయకపోతివి. కాబట్టి మిగుల కొట్టబడుచున్నావు.

మేము యమధర్మరాజు ఆజ్ఞానుసారము అపరాధము చేసిన పాపాత్ములను శిక్షలను అనుభవింపచేయుచున్నాము.

ఆ యమధూతలీవిధముగా పలికి దయాస్వభావము లేనివారై వారిని కొట్టగా వారు నిప్పువలెనే మండుచున్నవారై అక్కడ నుండి క్రిందకు పడిపోదురు.

అక్కడ నుండి పడుట వలన కత్తులతో సమానమగు ఆకులచే శరీరమంతయు భిన్నము కాబడియుండగా అట్టి భాగములను కుక్కలు భక్షించుచుండగా ఏడ్చుచుందురు.

కొందరు పాపాత్ములిట్లు ఏడ్చుచుండగా యమధూతలు వారి ముఖములో మన్నుంచి త్రాళ్ళచే గట్టి మద్దరములు మొదలగువాని చేత కొట్టబడుదురు. కొందరు పాపాత్ములు కొయ్యవలెనే రంపములచేత రెండు ప్రక్కలుగా కోయబడుచుందురు. మరికొందరు పాపాత్ములు భూమి మీద పడద్రోయబడి గొడ్డల్ల చేత ముక్కలు ముక్కలుగా ఖండింపబడుచుందురు.

కొందరిని గొయ్యితీసి మొలలోతు వరకు పాతిపెట్టి వారి శిరములపై భాణములతో కొట్టుచుందురు. మరికొందరిని గానుగలలో నుంచి చెరుకుగడ వలె నలిగిపోవునట్లు చేయుదురు.

కొందరిని మండుచుండెడి నిప్పులతో కూడిన కొరవులను అగ్నిహోత్ర మధ్యమున ఇనుప ముద్ద నుంచి యేతీరుగా కాచుచుందురో యా తీరునే కాచుదురు.

బూర్లె మూకుడు యందుంచబడి వేయించిన వడియముల వలెనె క్రాగుచుండెడి నేతితో నిండియుండెడి గంగాళములో కొందరిని, నూనెతో నిండియుండెడి గంగాళములో మరికొందరిని పడవేసి వేయింతురు.

కొందరిని మార్గములో ఏనుగుల ముందర పడద్రోయుదురు. మరికొందరు కాళ్ళు చేతులు కట్టబడి తలక్రిందులుగా నిలబెట్టబడుదురు.

పాపాత్ములలో కొందరిని నూతులలో త్రోయుచున్నారు, మరికొందరిని పర్వతముల నుండి క్రిందకు బడదోయుదురు. మరి కొందరిని పురుగులతో నిండిన గోతులలో త్రోసి ముంచుదురు. మరికొందరిని పురుగుల చేత బాధింపచేయుదురు.

వజ్రముతో సమానమగు నోళ్ళు గల కాకులచేతను, మాంసము నందబిలాషగల గ్రద్దల చేతను, ముక్కులతో శిరస్సున, నేత్రమున, ముఖమునందు పొడవబడి, పీల్చబడుచుందురు.

భూలోకమున నుండగా నావద్ద కొంత ధనమును నీవు బదులు తీసుకొనినట్లు ఇప్పుడు యమలోకమునందుడగా తెలిసినది. కాబట్టి నా ధనమును నాకిమ్మని పాపాత్ములు కొందరు ఇతర పాపాత్ములతో పోట్లాడుకొనుచుందురు.

ఇట్లు నరకస్థానంబున పాపాత్ములు పోట్లాడుకొనుచుండగా వారి మాంసములను యమధూతలు వాడిగల తమ దంతములతో కరచి తీసి వారికి తిరిగి భక్షణ నిమిత్తం ఇచ్చుచుందురు.

యమధూతలీ ప్రకారము ఆ పాపాత్ములను కొట్టి తమ ప్రభువగు యమధర్మరాజు యొక్క యాజ్ఞానుసారము ఈడ్చుకొనిపోయి లూమిక్రమగు మొదలగు నరకములలో బడవేతురు.

**ఓ గరత్మంతుడా! ఆ వృక్ష సమీపమందు విశేష దుఃఖ ప్రథములగు నరకములున్నవి. ఆ నరకముల యందు కలిగెడి దుఃఖమును చెప్పుటకు వాక్కులకైనను శక్యము కాదు.**

ఓ గరత్మంతుడా నరకములనియు 84 లక్షలు గలవు. దానిలో మిక్కిలి దుఃఖకరములగు నరకములు 21 కలవు.

అవి

1) లూమిక్రము (మిక్కిలి చీకటి గలది)

2) లోహశంకువు (ఇనుముతో సమానమగు మేకులు కలవి)

3) మహారౌరము (మిక్కిలి దుఃఖము కలది)

4) శాల్మలి (బూరుగు వృక్షములు కలవి)

5) రౌరవము (సామాన్య దుఃఖము గలవి)

6) కుట్మలము (వాడిగల మొగ్గలు కలవి)

7) కాళ శ్రూతము (పాశములు గలవి)

8) పూతిమృతికరము (చీముతో గూడిన మన్ను కలవి)

9) సంఘాతము (సమస్త జంతువులు గలవి)

10) లోహిదోతము (రక్తము వంటి జలము గలది)

11) నవిపము (విషముతో గూడియున్నది)

12) సంప్రతాపకము (మిక్కిలి తపింపచేయునది)

13) మహానిరయము (మిక్కిలి పీడాకరమైనవి)

14) కాకోలము (బాధాకరములగు కాకులు గలవి)

15) సంజీవనము (ప్రాణములు కొంతవరకు కాపాడును)

16) మహాపదము (చాలా దూరము కలది)

17) అవీచి (తరంగము లేని జలము కలది)

18) అంధతామిస్రము (మిక్కిలి చీకటి గలది)

19) కుంభీపాకము (కడవలు మొదలగు వానలో నుండి వండబడుదురు)

20) సంప్రతాపనము (మిక్కిలి తపింపజేయునది)

21) తపనము (సూర్యతాపము గలది)

ఈ 21 నరకములు అనేక భేదములుగా కల్పింపబడి అనేక బాధల నొందించి వారి పాపములను పరిపక్వమొందించుచు యమకింకరులచే నిండియుండును.

సన్మార్గమును విడిచి దురాచారముగా ప్రవర్తించిన యా పాపాత్ములు పూర్వమందు చెప్పబడిన 21 నరకములలో వారివారి పాపములకు తగిన నరకములోబడి కల్పాంతము వరకును అనుభవించు చుందురు.

ఈ ప్రకారము సంసారమును వహించి తన కడుపును నింపుకొనుచు, కాలము సమీపించినప్పుడు సంసారమును, దేహమును రెండింటిని విడిచి మరణించిన పిమ్మట ఇటువంటి గొప్ప దుఃఖము ననుభవింతురు.

## ఇట్లు లోకములో అందరిని కష్టపెట్టి

తన కుటుంబమును సంరక్షణము చేసికొననట్టి వాడు నరకములో భగవంతునిచే నేర్పరుచబడిన పాపమును, ధనము పోయినవాడు త్వరపడినట్లుగా త్వరపడి అనుభవింతురు.

లోకములో సంసారమును పోషించుకొనుట నిందితము కాదు. కేవలము అక్రమముచే సంసారమును పోషించుకొనుట నిందితము.

పరలోకమునకు క్రిందుగా యుండునట్టి యా నరకములన్నియు జీవుడు క్రమముగా తిరిగి వాటియందు పరిశుద్ధుడై తిరిగి భూలోకమున జన్మించుచున్నాడు.

భూలోక యమలోక పట్టణ మధ్యగల పట్టణములు

1) సౌమ్యము (చంద్రుని సంబంధమైనది)

2) సౌరపురము (సూర్యుని సంబంధమైనది)

3) నగేంద్ర భవనము (ఇది పర్వతములలో యుండును)

4) గంధర్వ శౌలాగము (ఇది గంధర్వుల కలిగియుండును)

5) క్రౌంచము (ఇచట కొంగలుండును)

6) క్రూరపురము (ఇచట క్రూరులుందురు)

7) విచిత్ర భవనము (ఇచట ఇండ్లు విచిత్రముగా యుండును)

8) బహ్వాపదము (ఇచట కష్టములెక్కువగా యుండును)

9) దుఃఖదరాని (ఇచట దుఃఖము లెక్కువగా యుండును)

10) నాకాక్రందపురము (ఇచట అనేక రోధన ధ్వనులతోయుండును)

11) రౌద్రము (ఇచట భయంకరముగా యుండును)

12) సుతప్తభవనము (ఇచట ఎప్పుడు ఇల్లు కాలుచుండును)

13) పయో వర్షనము (ఇచట వర్షమెప్పుడు కురియుచుండును)

14) శీతాఢ్యము (ఇచట చలి విపరీతముగా యుండును)

15) బహుభీతి పట్టణము (ఇచట మిక్కిలి భయము కలదు)

16) ధర్మ భవనము (ఇది పుణ్యాత్ముల కొరకైయున్నది)

--: 0000 :--

# పాప చిహ్న నిరూపణము

ఓ గరత్మంతుడా! ఏయే పాపములు చేసిన, నరకమనుభవించి యమలోకము నుండి వచ్చి ఏయే పాపముల వలన ఎటువంటి హీన జన్మములనొంది యేయే పాపముల వలన ఎటువంటి రోగములు వచ్చుచున్నవవో చెప్పుచున్నాను వినుము అని శ్రీకృష్ణమూర్తి పలికెను.

1) బ్రహ్మహత్య పాపము చేసినవాడు క్షయరోగిగా పుట్టును.

2) గోహత్య చేసినవాడు మరుగుజ్జుగా పుట్టును. తెలివిలేని వాడుగను పుట్టును.

3) కన్యను చంపినవాడు కుష్టురోగము గలవాడుగను పుట్టును

ఈ ముగ్గురు మాలకులమందు పుట్టుదురు.

4) స్త్రీలను చంపినవాడు, గర్భస్రావము చేసినవాడును, బోయ కులము నందు రోగము కలవాడుగను పుట్టును.

5) సంభోగింపతగని ఇతరజాతి స్త్రీలతో సంభోగించిన ఎడల నపుంసకుడగును.

6) గురు భార్యతో సంభోగించిన ఎడల యేనుగు చర్మము కలవాడుగ పుట్టును.

7) మాంసమును తినినవాడు కుష్టురోగముతో, నొకజాతియగు ఎఱ్ఱని శరీరము కలవాడగును.

8) విషయాభిలాష వలన తినగూడని పదార్థములను తినిన బ్రాహ్మణుడు జలోదర వ్యాధి కలవాడగును.

9) కల్లు త్రాగినవాడు నల్లని దంతములు కలవాడగును.

10) తాను షడ్రోపేతముగా తిని ఇతరులకు ఏమియు పెట్టక భుజించు వాడు కంఠమునందు పుండ్లుగలవాడగు రోగము కలుగును.

11) శ్రాద్ధము నందు పరిశుద్ధము లేని అన్నము నిచ్చిన ఎడల చిత్రమైన కుష్టురోగము కలవాడగును.

12) గర్వముచే గురువును దిక్కరించినవాడు, తిరస్కరించినవాడు అపస్మారమను రోగము కలవాడగును.

13) వేదశాస్త్రములను నిందించినవాడు పాండురోగము కలవాడగును.

14) అబద్ధపు సాక్ష్యము చెప్పినవాడు మూగవాడగును.

15) పంక్తి భేదము చేసినవాడు, వివాహము చెడగొట్టినవాడు పెదవులు లేనివాడుగను పుట్టును.

16) పుస్తకములను దొంగిలించినవాడు పుట్టుగ్రుడ్డిగను పుట్టుదురు.

17) ఆవులను, బ్రాహ్మణులను కాళ్ళతో తన్నినవాడు కుంటి వాడుగను పుట్టుదురు.

18) అబద్ధమును పలికినవాడు తొట్రుపడునట్టి మాటలు కలవాడగును.

19) అబద్ధము వినినవాడు చెవిటివాడుగను పుట్టుదురు.

20) విషము పెట్టినవాడు, మాంధ్యము కలవాడుగను, పిచ్చివాడు గను పుట్టుదురు.

21) ఇండ్ల మీద నిప్పుపెట్టి, తగులబెట్టినవాడు బట్టతల గలవాడగును.

22) మాంసమును అమ్మినవాడు మూలశంక మొదలగు రోగములు కలవాడగును.

23) మాంసమును భుజించినవాడు వింత వింత రోగము కలవానిగను పుట్టుదురు.

24) రత్నములను దొంగిలించినవాడు తక్కువజాతి యందు పుట్టుదురు.

25) బంగారమును అపహరించినవాడు పిప్పిగోళ్ళు కలవాడగును.

26) రాగి, ఇత్తడి, మొదలగు ధాతువులను దొంగిలించినవాడు దరిద్రుడుగను పుట్టును.

27) అన్నము దొంగిలించినవాడు ఎలుకగను

28) ధాన్యము దొంగిలించినవాడు మిడుతగను

29) జలమును దొంగిలించినవాడు చాతక పక్షిగను.

30) విషమును దొంగిలించినవాడు తేలుగను పుట్టుచున్నారు.

31) కూరను-ఆకులను అపహరించినవాడు నెమలిగను

32) శ్రేష్టములగు కస్తూరిని, అగరు మొదలగు సుగంధ ద్రవ్యములను దొంగిలించినవాడు చుంచుగను.

33) తేనెనపహరించినవాడు తేనెటీగగను

34) ఉప్పును దొంగిలించినవాడు చీమగను పుట్టుదురు.

35) తాంబూల ఫలములు పుష్పములు మొదలగు వాని నపహరించిన వాడు అడవిలో కోతిగను

36) పాదుకలు, గడ్డి, ప్రత్తి మొదలగు వాని నపహరించినవాడు మేకగను పుట్టును.

37) క్రూర వ్యాపారముచే జీవించువాడై మార్గమందు బాటసారులను కొట్టువాడు వేటాడువాడును, కటికవాని ఇంటి మేకగను పుట్టుదురు.

38) విషము త్రాగి మృతిచెందినవాడు పర్వతము నందు నల్లని త్రాచుపాముగను పుట్టుదురు.

39) శాస్త్రాచార పద్ధతిని విడిచి స్వేచ్ఛగా సంచరించినవాడును మనుష్య రహితమగు అడవిలో ఏనుగై పుట్టును.

40) వైశ్యదేహము చేయని బ్రాహ్మణులును – సర్వవర్గముల వారి అన్నము తినిన బ్రాహ్మణులును, ఏఏ పదార్థము విడువవలయును, విడవగూడదో పరీక్షింపక భక్షించిన బ్రాహ్మణులును మనుష్యులు లేని అడవియందు పెద్ద పులులుగా జన్మించుదురు.

41) సంధ్యావందనము చేయనివాడు, గాయత్రి మంత్రమును జపింపనివాడు, మనస్సులో క్రూరత్వముగా యుండి బయటకు సజ్జనుడుగా నుండు బ్రాహ్మణుడు కొంగగను పుట్టుదురు.

42) యాజ్జీనకము చేయించదగని మ్లెచ్ఛామలకు యాజ్జీనకము చేయించిన వాడు ఊరపందిగను పుట్టును.

43) ధనమందాశచే అనేకులకు యాజ్జీకము చేయించిన వారలు గాడిదలుగా పుట్టుదురు.

44) పలిషేదనాది మంత్రములు లేకుండ భుజియించినవాడు కాకిగాను పుట్టును.

45) యోగ్యుడగువాడు సంభవించినపుడు చదువు చెప్పని బ్రాహ్మణుడు యెద్దుగా పుట్టును.

46) గురుసేవ చేయనివాడు కంచరగాడిదగను పుట్టును.

47) బ్రాహ్మణునితో వాదము పెట్టుకొని తృణీకరించి, హేంకరించి, యెదిరించిన బ్రాహ్మణుడు అడవిలో జలములేని ప్రదేశమందు బ్రహ్మరాక్షసుడై పుట్టును.

48) బ్రాహ్మణునకు దానమిచ్చెదనని వాగ్దానము చేసి ఇవ్వనివాడు నక్కగా పుట్టును.

49) సత్పురుషులకు అపకారము చేసినవాడు అగ్నిహోత్రముపైన పెటపెటమను బయలు వెడలు శబ్దముగ పుట్టును.

50) మిత్ర ద్రోహము చేసినవాడు పర్వతమునందు గ్రద్దగను పుట్టుదురు.

51) వస్తువుల అమ్మకములో దగా చేసినవాడు గుడ్లగూబగును.

52) వర్ణాశ్రమ ధర్మములను నిందించినవాడు అడవిలో పావురాయిగను జన్మించుదురు.

53) ఇచ్చెదని ఆశపెట్టి ఇవ్వక ఆశాభంగము చేసినవాడు, స్నేహమును భంగము చేసినవాడు, భార్యయందు కోపము కలిగి విడిచి పెట్టువాడు చక్రవాక పక్షిగను జన్మించి బహు కాలము జీవించుదురు.

54) తల్లితండ్రిని తోబుట్టువును, సహోదరులను నిందించి పోట్లాడువాడు అనేక జన్మముల పర్యంతము గర్భమునందు ప్రవేశించుచు ఆ గర్భము పూర్తిగాక మునుపే గర్భస్రావముగా నశించుచుండును.

55) అత్తమామలచే నిత్యము పోట్లాడి వారిని బాధపెట్టు స్త్రీ జలగయై పుట్టును.

56) పెనిమిటి నెదిరించి పోట్లాడు స్త్రీ ఊపురుకుట్టు రోగము కలదిగను పుట్టును.

57) తన పెనిమిటిని విడిచిపెట్టి పరపురుషులయందాసక్తి గల స్త్రీ ఆడమేకగను, బల్లిగను, రెండు తలలుగల ఆడపాముగను పుట్టును.

58) స్వగోత్రము నశింపజేసినవాడు, స్వగోత్రము కల స్త్రీని వివాహము చేసికొనినవాడు శిథిలమగు అవయవములు గల యెలుగుబంటియై పుట్టును.

59) కామము గలవాడై తాపస స్త్రీతో సంభోగించినవాడు జలములేని దేశమున పిశాచముగా పుట్టును.

60) యౌవనము రాని స్త్రీతో సంభోగించినవాడు అడవియందు కొండచిలువగను బుట్టును.

61) గురుభార్య సంగమము గలవాడు తొండ జన్మనెత్తురు.

62) రాజు భార్యతో సంభోగించినవాడు లొట్టపిట్టగా పుట్టును.

63) స్నేహితుడి భార్యతో సంభోగించినవాడు గాడిదగా పుట్టును.

64) యోని యందాసక్తి గలవాడు పందిగను పుట్టును.

65) రజస్వలయైన స్త్రీని పెంపు చేసుకొనెడివాడు వృషభముగా పుట్టును.

66) మిక్కిలి కామము గలవాడు కామాభిలాషగల గుఱ్ఱముగా పుట్టును.

67) మరణించినవాని యొక్క పదకొండవ దినంబున చేయబడు శ్రాద్ధమును భుజించెడివారు కుక్కగా జన్మింతురు.

68) డబ్బు పుచ్చుకొని దేవతా పూజ చేయువారు కోడిగను జన్మించుదురు.

69) ఏ బ్రాహ్మణ హీనుడైనను ధనము నిమిత్తము దేవతాపూజను చేసిన ఎడల, దేవలకుడని చెప్పబడును. అట్టి దేవలకుడు పితృకార్యమందు గాని, శుభకార్యములందు గాని పంక్తిభోజనమునకు తగనివాడుగ చెప్పుదురు.

70) విశేష పాపములు చేసినవారు, ఆ పాపములకు తగిన భయంకరము లగునవియు, కఠినములైనవియు నరకములను పొంది కర్మము క్షీణించిన పిమ్మట తిరిగి ఈ లోకమున అనేక నీచజన్మలెత్తుదురు.

75) బ్రహ్మహత్య చేసినవారు గాడిదగను, లొటపిట్టగను, దున్న మొదలగు జన్మములెత్తుదురు.

76) కల్లు త్రాగినవాడు తోడేల్లు, నక్క, కుక్క మొదలగు జన్మము లెత్తుదురు.

77) బంగారము దొంగిలించినవారు పేడ మొదలగు దుర్గంధము గలవానియందుండు పురుగులుగను, ఈగ, దోమలుగను జన్మించుదురు.

78) గురు భార్య సంగమము చేసినవాడు గడ్డిపొద మొదలగు జన్మములను క్రమక్రమముగా పొందుదురు.

79) ఇతరుల భార్యనపహరించి, దాచిబెట్టిన ధనము నపహరించు వాడు, బ్రాహ్మణ సొమ్మునపహరించువాడు బ్రహ్మరాక్షసునిగా పుట్టుదురు.

80) బ్రాహ్మణ ధనమును స్నేహముచే అపహరించిన ఎడల తన వంశము ఏడు తరముల పర్యంతము దహించును.

81) బలవంతముగా అపహరించిన ఎడల సూర్యచంద్రులుండు వరకు తన వంశమును దహింపచేయును.

82) అనగా తన పితృదేవతల పర్యంతము పాపము అనుభవించుదురు.

83) మూడు లోకములలో ఎవరైనను ఇనుము రాయి మొదలగువాని యొక్క చూర్ణమును గాని విషమును గారి హరించుకొనుచు బ్రాహ్మణ ధనము నపహరించి హరించు కొనలేడు.

84) రాజు గారి యొక్క చతురంగ బలములు బ్రాహ్మణ ధనము చేత పోషింపబడి బలిసియున్నప్పటికి యుద్ధము చేయవలసి వచ్చినప్పుడు బలము లేనిదై యిసుకతో కట్టబడిన కట్టలెట్లు జారిపోవుచుండునో యాతీరుగనే యుద్ధము నుండి తొలగిపోవును.

85) దేవతా ధనము నపహరించువారు బ్రాహ్మణ ధనము నపహరించు వారు బ్రాహ్మణుని తిరస్కరించినవారు తన వర్గము నుండి చెడి హీనకులత్వమును చెందుదురు.

86) తననాశ్రయించుకున్నట్టి వేదశాస్త్రజ్ఞుడగు బ్రాహ్మణుని విడిచి విద్యావిహీనుడగు నితర బ్రాహ్మణునకు దానమియ్యబడెనేని అది బ్రాహ్మణతిక్రమము అనిపించుకొనబడును.

87) ఓ గరత్మంతుడా! బ్రాహ్మణాతిక్రమ దోషము వలన జీవుడు క్రమముగా అనేక రకములైన నరకములననుభవించిన పిమ్మట ఔత్యంధుడై దరిద్రుడగుచు ఎల్లప్పుడు ఇతరుల యాచించువాడగును. కాని దానము చేయ సమర్థుడు కాకయుండును.

88) తనచే నివ్వబడినది కాని లేక ఇతరులచే నివ్వబడినది కాని అగు భూమినపహరించినవాడు అరువది వేల సంవత్సరముల పర్యంతము ఉమ్మియందు పురుగుగా పుట్టును.

89) బ్రాహ్మణుల జీవనాధారముగ భూదానమిచ్చిన వానిని కాపాడు చుండవలయును. అలా కాపాడక అపహరించినవాడు కుంటి కుక్కగా పుట్టును.

90) బ్రాహ్మనునకు జీవన నిమిత్తమై వృత్తిని కల్పించిన యెడల లక్ష గోదాన ఫలములు చేసినంత ఫలితము కలుగును.

91) బ్రాహ్మణ వృత్తి నపహరించిన ఎడల కోతిగను, కొండముచ్చు గను కుక్క మొదలగు జన్మములనెత్తును.

92) ఈ ప్రకారముగ పాపకర్మలను చేసినవాడు నరక బాధల ననుభవించి మిగిలిన పాపము వలన ఈ చెప్పబడిన హీన జన్మములందు పుట్టుచుందురు.

అనంతరము శరీరములలో మృగాది శరీరములను పొంది బరువులు మోయుట మొదలగు దుఃఖములను పొందుచున్నారు.

అనంతరము పక్షి జన్మమెత్తి వర్షము, చలి, ఎండ మొదలగు వానివలన కలిగెడి కష్టములననుభవించి **అనంతరము పుణ్య పాపములు సమానమవగా మనుష్యజన్మ మెత్తుచుండును.**

ఈ జీవుడు స్త్రీ పురుష సాంగత్యముచే గర్భములో ప్రవేశించి గర్భోత్పత్తి మొదలు జన్మించి మరణము పొందునంత పర్యంతము నుండు దుఃఖము అనుభవించి తిరిగి మరణించును.

**ఈ ప్రకారములు సమస్త జీవులు, పుట్టుచు చచ్చుచుందురు.**

**ఈ జీవులు నా మాయచేత కర్మపాశములతో గూడినవారై భూమి యందు పుట్టుచు, నరకములను పొందుచు మాటిమాటికి గడియారము వలనే తిరుగుచుండును.**

దానము చేయకపోవుటచే దరిద్రుడగును – దరిద్రుడగుటచే పాపము చేయును – పాపము చేయుట వలన నరకమును పొందును – కాబట్టి పాపాత్ముడు తిరిగి దరిద్రుడగుచున్నాడు.

జీవుడు చేసికొనిన కర్మము అనుభవించిన గాని అనేక కల్పముల కైనను నశించదు. కాబట్టి పుణ్యకర్మ కాని పాపకర్మ కాని ముఖ్యముగా అనుభవించియే తీరవలెను.

# VIII.

మనము నిద్రించేటప్పుడు కూడా వివిధములైన వాంఛనీయములైన వస్తువులను నిర్మిస్తూ మేలుకుని ఉండే ఆ పురుషుడే పరిశుద్ధమైన బ్రహ్మము. అన్ని లోకాలు ఉన్నది దానియందే. దాని నెవరు అతిక్రమించలేరు.

## ఇదే నిజంగా అది

గార్గ్య శౌరాయనుడు పిప్పలాది మహర్షిని అడిగిన ప్రశ్నలలో మొదటిది– దేవా! మానవునిలో నిద్రించునవి ఏవి? ఈ ప్రశ్నకు ఆ మహర్షి ఈ విధముగా సమాధానము చెప్పెను.

నిద్ర అనేది ఒక విచిత్రమైన అనుభూతి. మరొక విషయము ద్వారా పొందలేని సత్యమును నిద్ర మనకు ఎరుకపరుచును. నిద్రలో ఏమి తెలియుటలేదు అది అనుభవశూన్యమైన భూమిక అని కొందరంటారు.

**నిద్ర అనునది అనుభవరహిత స్థితి కాదు. శూన్యస్థితి కానేరదు. చైతన్య రహితస్థితియు కాదు.**

జాగృత్ స్వప్న సుషుప్తుల యందు చైతన్యము ఒకే విధముగా యున్నది.

జాగృత్ స్వప్నముల యందు చైతన్యము ఒక విధముగా యున్నది. జాగృత్ స్వప్నముల యందు చైతన్యము ప్రకాశించుటకు వస్తువులు, విషయములు ఉన్నవి, సుషుప్తులో అవి లేవు.

వెలిగే టార్చిలైటును వస్తువు మీదకు మళ్ళించిన ఆ వస్తువు మనకు గోచరిస్తుంది. అదే టార్చిలైటును ఆకాశం వైపు ప్రసరింపచేసినపుడు ఆ వెలుగు దేనిని ప్రకాశింపచేయలేదు. పైగా వెలుగుతున్నట్లు కూడా కనిపించదు. అంతమాత్రాన టార్చిలైటు ఆరిపోతేదు. అలాగునే సుషుప్తిలో చైతన్యముచే ప్రకాశింపబడుటకు ఏ వస్తువు లేనందున చైతన్యము చైతన్యముగా భాసించుచు రెండవ వస్తువును ఎరుగక అద్వయజ్వాలుగా వెలుగుచున్నది.

మనోవ్యాపారములు లేకపోవుట చేత ప్రాజ్ఞుడు ఏకీభూత ప్రజ్ఞాన ఘనరూపుడగుచున్నాడు అని శంకరులవారు మాండూక్యకారిక యందు తెలిపియున్నారు.

అస్తమించే సూర్యుని కిరణాలు సూర్యునియందు ఐక్యమైనట్లు నిద్రించు సమయమున దృశ్యమాన జగత్తంతయు మనస్సులో ఏకమవుతుంది. సూర్యుడు ఉదయించగానే కిరణములు అంతా విస్తరించినట్లు నిద్ర లేవగానే సమస్తము తెలిసివస్తుంది.

రాత్రుల యందు సూర్య కిరణాలు గోచరింపవు. అపుడు సూర్యుడు అస్తమించినాడు అని చెబుతాము. ఇది వ్యవహారిక సత్యమే గాని వాస్తవానికి సూర్యుడు ఎప్పుడు అస్తమించడు. అలాగే నిద్రలో కూడా ఇంద్రియ ద్వారములు మూతపడటమే గాని మనస్సు లేకుండా పోలేదు. అది చైతన్యంలో లయించి ఉంటుంది. అస్తమించు సూర్యునిలో కిరణము లన్నియు ఏకీభూతము అగునట్లు నిద్రలో సమస్తము మనస్సులో ఏకీభూతము కాగా మనస్సు చైతన్యంలో లయిస్తుంది.

రాత్రులయందు చీకటి కారణంగా వ్యక్తుల మధ్య తారతమ్యం లేక ఏవిధంగా అందరూ ఒకటిగా యుందురో అలాగే నిద్ర సమయాన సమస్తము మనస్సులో ఏకమైయుండును. మనస్సు ఇంద్రియముల ద్వారా వస్తు ప్రపంచమును గ్రహించును. మనస్సు ఇంద్రియముల నుండి వెనుతిరగగానే ఇంద్రియములు మూగబోవును. బాహ్యజగత్తు అంధకార బంధురమగును. బాహ్య సంబంధమైన జగత్తుకు సంబంధించిన విషయము లన్నియు మనస్సులో ఏకీభూతమై యుండును. దీనిని ప్రజ్ఞాన ఘనరూపమని అందురు లేక పిలుతురు.

వివేక రహిత స్థితియైనందున ఆ అవస్థ ప్రజ్ఞాన ఘనమని తెలియ బడినది. ఏ విధముగా రాత్రులయందు గాడాంధకారమున వేరు చేసేందుకు వీలులేక సర్వులు ఒకటిగానే తెలియునట్లు ప్రజ్ఞాన ఘనరూపమున్నది అని శంకరులవారు తమ మాండూక్యకారికలో తెలిపియున్నారు.

కనుక ఈ నిద్రావస్త యందు బాహ్య ప్రజ్ఞ నశించుచున్నందున మానవుడు ఆలకించలేడు (చెవులు), దర్శించడు (నేత్రము), వాసన చూడడు (నాసికము), రుచి చూడడు (జిహ్వా), స్పృశించడు (చర్మము) అనగా జ్ఞానేంద్రియములు పనిచేయుట లేదు.

అలాగే భాషించడు (వాక్కు), గ్రహించడు (హస్తము), ఆనందించడు (జననేంద్రియములు), విసర్జించడు (గుదేంద్రియములు), చలించడు (పాదము), అనగా కర్మేంద్రియములు కూడా చేష్టలుడిగియున్నవి.

**అట్టి స్థితిలో ఉన్నవాడిని అతడు నిద్రించుచున్నాడని యందురు. ఇదియే సుషుప్త అవస్థ.**

ఈ పురములో నిద్రాసమయాన ప్రాణాగ్నులే మేలుకుని ఉంటాయి.

అపానమే – గార్హపత్యాగ్ని

వ్యానము – అన్వాహార్య పచనాగ్ని

ప్రాణమే – అహవనీయాగ్ని

ఉచ్వాస నిచ్వాసాలు రెండు ఆహుతులును దేహమంతటికి సమానముగ వితరణ చేయుట వలన సమానమే పురోహితుడాయెను. మనస్సు యజమాని ఆమెకు. ఉదానమే యజ్ఞఫలమాయెను. **ప్రతీరోజు ఉదానమే యజమానిని బ్రహ్మవద్దకు చేర్చుచుండును.**

ఈ స్థితిలో మనస్సు స్వప్న మహిమను అనుభవిస్తుంది. గతంలో దర్శించిన వానిని మళ్ళీ దర్శిస్తుంది. ఆలకించిన వానిని మళ్ళీ ఆలకిస్తుంది. వివిధ ప్రదేశాలలో, స్థలములలో అనుభవించిన దానిని మళ్ళీ అనుభవిస్తుంది.

**అన్ని తానుగా మారి చూచిన వానిని, చూడని వానిని, వినిన దానిని, వినని దానిని, అనుభవించిన దానిని, అనుభవించని దానిని, సత్యమైన దానిని, అసత్యమైన దానిని అన్నిటిని చూస్తుంది.**

మనస్సు తేజము చేత పరివ్యాప్తమైయున్నప్పుడు మనస్సు స్వప్నమును దర్శించదు. అపుడు శరీరంలో ఆనందం వ్యక్తమౌతుంది.

సౌమ్యుడా! పక్షులు గూళ్ళకు చేరి స్థిమితపడినట్లు ఇవన్ని కూడా పరమాత్మలో నిష్క్రమిస్తాయి.

దర్శించువాడు, స్పృశించువాడు, ఆలకించువాడు, ఆఘ్రాణించు వాడు, రుచిచూచువాడు, ఆలోచించేవాడు, తెలుసుకునేవాడు, కర్త

విజ్ఞానయుతుడైన పురుషుడు అక్షరమైన పరమాత్మ యందు ప్రతిష్ఠితమై యుంటాడు.

ఓ సౌమ్యుడా! నీడలేనిది, శరీరము లేనిది, రంగు లేనిది, స్వచ్ఛమైనది యగు అక్షరమైనదియగు దానిని తెలిసికొనినవాడు సర్వము తానై యుంటాడు.

ఓ సౌమ్యుడా! ఇంద్రియ, ప్రాణ, మనస్సులు ఎవనియందు ప్రతీష్ఠితమైయున్నవో అట్టి అక్షర రూపమును గ్రహించినవాడు సర్వజ్ఞుడగును. సర్వములో ప్రవేశించును – సర్వము తానే యగును.

## IX & X.

ఒకే ఒక అగ్ని ప్రపంచంలో ప్రవేశించి అది మండించే పదార్థాన్ని పోలిన రూపాలనే దర్శించినట్లు అన్ని జీవులలోను ఉన్న ఒకే ఒక ఆత్మ తాను ప్రవేశించిన ఆయా వస్తువుల రూపాలే ధరించి కన్పిస్తుంది. అంతేకాక వాటిని మించి కూడా ఉంటుంది.

ఒకే వాయువు ప్రపంచంలో ప్రవేశించి వివిధ రూపాలను పోలిన రూపాలను దర్శిస్తుందో అలాగే సకల జీవుల హృదయాలలోను ఉన్న ఆత్మ తాను ప్రవేశించిన వివిధ రూపాలలోను వివిధంగా కన్పిస్తుంది.

**వివరణ : వాటిని మించి కూడా ఉంటుంది.**

అద్వయమైన ఆత్మ సకల జీవులయందు వ్యాపించి ఉండి తాను ఏర్పరుచుకొన్న వివిధ రూపాలలో వివిధంగా బాసిస్తూ ఉండడమేగాన, తన నిజ స్వరూపంలో ఆయా రూపాలన్నిటి కంటే భిన్నమై వాటి వలన ఏ వికారానికి లోను కాకుండా స్వచ్ఛంగా ఉంటుంది.

మనస్సు, ఇంద్రియాలు, శరీరము అనే ఉపాధి ద్వారా వివిధ రూపాలను పొందినా ఆత్మ స్వస్వరూపంలో అతీంద్రియమైనది, నామ రూపాల కంటె అతీతమైనది.

# XI.

యావత్ప్రపంచానికి నేత్రమైన సూర్యుడు చర్మచక్షువుల మాలిన్యాల వలన మాలిన్యం కానట్లే ప్రపంచానికి అతీతమైనది సకల జీవుల హృదయాలలోను ఉన్నది అయిన ఆత్మ ప్రపంచము దుఃఖాల వలన దుఃఖాన్ని ఎంతమాత్రము పొందదు.

సూర్యకాంతి అన్ని వస్తువులు కన్పించేలా చేస్తూ, అయినా అది ప్రకాశింపచేసే వస్తువుల లోప దోషాలు సూర్యకాంతికి అంటవు. అలాగే అతేంద్రియ సత్తమైన ఆత్మ ప్రపంచ జీవితానికి కారణమైన ప్రపంచ దుఃఖాలచేత అంటే కర్మబంధము చేత ప్రభావితము కాకుండానే ఉంటుంది. అవిద్యయే, అజ్ఞానమే సర్వాతీతమైన ఆత్మపై, జీవ జగత్తులనే కర్త, కర్మలనే భావము, ఆరోపింపబడినది.

మసకచీకటిలో త్రాటిపైన పాము అనబడే భావము ఆరోపింప బడినట్లే, ఈ పాము అనబడే ఆరోపణ త్రాటిపైన ఏ ప్రభావము పడనట్లే, ఆత్మపైన ఆరోపింపబడినవి కూడా ఆత్మ నిజస్వరూపాన్ని ఏ విధంగాను ప్రభావితం చేయలేవు.

నిధాగుడను పేరుగల యోగీంద్రుడు బ్రహ్మవేత్తలలో శ్రేష్టుడగు ఋభువను పేరుగల మునీశ్వరుని నమస్కరించి ముకుళిత హస్తుడై ఈ విధముగా ప్రశ్నించెను.

ఓ బ్రహ్మీభూతుడగు మహాత్మా! తాము ఏ ఉపాసన చేత ఇట్టి బ్రహ్మప్రాప్తిని పొందితిరి? అట్టి ఆత్మతత్వమును నాకు ఉపదేశించి నన్ను కృతార్థునిగా చేయవలయునని సాధరముగా అడిగెను. అట్టి పరవిద్యయును, మోక్షప్రదాయినియగు బ్రహ్మ విద్యను అనుగ్రహించవలెనని మరలమరల వేడుకొన్న మాటలు విని ఋభుమహర్షి నిదాగునితో నీవు కృతార్థుడవైతివి. సనాతనమైన బ్రహ్మవిద్యను నీకు ఉపదేశించేను సావధానముగా వినుము.

ఈ అజ్ఞానమగు భ్రమ నుండి విముక్తినొందినవారు మాత్రమే తరింప కలుగుచున్నారు. అట్టి భ్రమ 5 విధములుగా యున్నది.

**1) జీవేశ్వరులు భిన్నరూపులను భ్రమ**

సూర్యబింబమునకు ప్రతిబింబమునకు భేదము లేదని తెలుసుకొన్న మొదటి భ్రమ తొలుగును.

**2) ఆత్మయందు కర్తృత్వ గుణము కలదను భ్రమ.**

స్ఫటికమణికిన్ని దాని సంబంధమగు ఎరుపు పుష్పముచే కలిగెడు స్ఫటికయందు కల రక్తవర్ణమునకు గల తత్వమును గ్రహించిన రెండవ భ్రమ తొలుగును.

**3) శరీర త్రయముతో గూడినవాడే జీవుడను భ్రమ**

ఘటమహాకాశము యొక్క నిజరూపము తెలిసికొన్న మూడవ భ్రమ తొలుగును.

**4) జగత్కారణమగు బ్రహ్మమునకు వికారిత్వము కలదను భ్రమ.**

కనక కిరీట కుండల కంకణములు యొక్క తత్వము తెలిసికొనిన నాల్గవ భ్రమ తొలుగును.

**5) అట్టి కారణమగు బ్రహ్మముకన్న జగత్తు భిన్నమను భ్రమ**

రజ్జు సర్పదర్శనముచే 5వ భ్రమ తొలుగుచున్నది.

కావున ఓ నిఘాముడా! గురువు అనుగ్రహముచే నేను ఈ భ్రమ నివృత్తికలవాడనై బ్రహ్మకార్య స్వరూపుడనై నిత్యముక్తుడనై ఉన్నాను. నీవును ఇలాగున పంచభ్రమలను నివృత్తి చేసికొని మహావాక్యానుసంధానము చేసికొని బ్రహ్మకార్యస్వరూపుడవై సుఖవిగా యుండుము.

# XII.

ఆ ఒక్క జగన్నియామకుని, సకల జీవుల అంతరాత్మను తన ఒక్కరూపాన్నే అన్నివిధములుగా కల్పించే దాన్ని, తన ఆత్మయందే ఉన్నదని దర్శించే ప్రాజ్ఞులదే శాశ్వతమైన ఆనందము.

**ఇతరులది కాదు.**

అనాది అయిన నా అంశమే ప్రపంచంలో జీవరూపములో ఉన్నది. ప్రకృతికి సంబంధించిన జ్ఞానేంద్రియములు మనస్సు ఆరును కలిసి ఆ జీవుని విషయములవైపు ఆకర్షించుచున్నవని శ్రీగీతాచార్యుడు తెలిపెను.

ఆ పరమాత్మ అఖండము. అందు విభాగములు లేవు. విభజింప సాధ్యము కాదు.

ఒక వ్యక్తిలోని అంతఃకరణం దృష్ట్యా ఆ నిత్యసత్యజ్యోతి అంతః కరణంలో ప్రవేశించినప్పుడు ఒకడు ఆ పరమాత్మ ఈ అంతఃకరణముచే నియమితుడైనట్లు భావిస్తున్నాడు.

పాత్రలోని నీటిలో చంద్రుడు ప్రతిబింబిస్తున్నాడు. ఆ నీరు గాలిచే కదిలితే ఆ నీటిలో ప్రతిబింబించుచున్న చంద్రుడు కూడా కదలి చెల్లాచెదరైనట్లు కనబడుతుంది. అలా కోట్లకొలది చంద్రబింబాలు చెల్లాచెదరైనట్లు కనబడినప్పటికిని నిజమునకు ఆ ఆకాశంలో ప్రకాశించే ఆ అమృత స్వరూపుడైన చంద్రునకు కాని, చంద్రబింబంబాలకు కాని ఎటువంటి వికారము కలుగుటలేదు.

ఇది అజ్ఞానమందు గోచరమగు భ్రమ మాత్రమే!

ఈ మనోబుద్ధులు సుఖదుఃఖములు, జ్ఞానాజ్ఞానములు, శాంతి అశాంతులు అనే ఈ ద్వంద్వాల చేత సంక్షోభాన్ని పొంది కలతచెంది నప్పటికిని ఇందులో ప్రతిబింబించిన పరమాత్మ ఎటువంటి చలనము లేకుండా స్థిరంగా ఉంటుంది.

మనస్సులో కూడా ఇంద్రియాలను ఆకర్షిస్తున్నది. ఆత్మయొక్క అంశము జీవుడై శరీరమాద్యంతము చైతన్యవంతము చేయుచున్నది. జీవితమొసగుచున్నది. తన సాన్నిధ్యబలము చేత ఇంద్రియములను మనస్సును వ్యవహరించునట్లు చేయుచున్నవి. ఈ వ్యవహారములు ప్రకృతి జన్యమైన శరీరమునకు చెందినవి.

కాని వీటిలో చూచుట, వినుట, మొదలగు స్పర్శలు, ఆలోచించుట ఇవన్నియు జ్ఞానేంద్రియముల వలన కాదు. అంతఃకరణము వలన కాదు.

**ఇవి ఎల్లయు ఆత్మ ప్రకాశములు ఆత్మ ప్రకృతి ద్వార వ్యవహరించుచున్నది.**

అనగా ఆ చైతన్యం ప్రకృతి ద్వారా ప్రవర్తించినపుడు కలిగె శక్తులు కనుక ఆ చైతన్యం ప్రకృతిలో ప్రతిష్టింపబడినప్పుడు అది మనస్సులో సహా ఇంద్రియముల ద్వారా ప్రవర్తించుచున్నదని చెబుతున్నాడు.

ఆ ఆత్మే అంతఃకరణోపాదిగతుడైనప్పుడు ఆ పరిచ్ఛిన్న ఆత్మాంశము జీవుడు అనియు ఆదిమర్త్యుడనియు భావిస్తున్నాము.

**ఎందుకనగా అజ్ఞానము వలన విపరీత భావము వలన ఇది ఒక అంశమని ఎంచుచున్నాము.**

# XIII.

అనిత్య వస్తువులలో నిత్యవస్తువు చైతన్యవంతమైన దానిలోని చైతన్యము ఒక్కటైనా, అనేకుల కోరికలను నెరవేర్చేది, అయిన పరమాత్మను, తమ ఆత్మయందే స్థితమై ఉన్నదానినిగా ఏ ప్రాజ్ఞులు దర్శిస్తారో వారిదే శాశ్వతమైన శాంతి కాని

## ఇతరులది కాదు

**అనిత్య వస్తువులలో నిత్యవస్తువు :**

ఈ ప్రపంచము ఒక ప్రవాహము. నిరంతరాయంగా మారిపోతూ ఉండే **అభాసా**. క్షణికమైన నామ రూపాల క్రీడ అందుచేతనే దానిని సార్ధక్యంగా **అనిత్యం** అంటారు. కాని **మార్పులేనిది ఒకటి పూర్వపరంగా ఉంటే తప్ప ఏ మార్పు సాధ్యం కాదు.**

నది ఒడ్డులు, అడుగూ ఏమార్పు లేకుండా ఉంటే తప్ప ప్రవాహపు మార్పు సాధ్యం కాదుగదా! అలాగే అవికార్యం, కేవల చైతన్యమయిన పరమాత్మ ఈ చంచలమైన ప్రపంచ పరిణామాలకు శాశ్వతమైన ఆధారము.

బ్రహ్మమునకు ప్రపంచమునకు గల సంబంధం–

**సినిమా తెరకు, దానిపై కన్పించే బొమ్మలకు గల సబంధం లాంటిది.**

మొదటిది శాశ్వతం, అవికార్యం,

రెండవది క్షణికం పరిణామశీలమైనది.

**అనేకుల కోర్కెలను తీర్చునది :**

బ్రహ్మము కర్మఫలాలను జీవులకు పంచడం ద్వారా.

# XIV.

ఋషులు ఆ అనిర్వచనీయమైన పరమానందాన్నే “ఇదే అది” అని దర్శిస్తారు. దానిని నేను ఎలా తెలుసుకోగలను. అది తన కాంతితో స్వయంగా ప్రకాశిస్తుందా లేక మరొక దాని కాంతి వలన ప్రకాశిస్తుందా?

ఈ శ్లోకంలో రెండవ దానికి ఉద్దేశ్యమేమిటో స్పష్టంగా లేదు.

శ్రీ శంకరుల అభిప్రాయంలో నచికేతునివైనా కావాలి లేదా ఈ మాటలతో నచకేతునిలో ఆత్మయొక్క స్వయం ప్రకాశతను గూర్చి సందేహము కలిగించి ఆ తర్వాత శ్లోకంలో నివారించాలని యముడి ఉద్దేశ్యమయినా అయి ఉండాలి.

# XV.

**అక్కడ సూర్యుడు ప్రకాశించడు. చంద్ర తారకలు అసలే ప్రకాశించవు. మెరుపులు కూడా మెరువలేవు. ఇక ఈ అగ్ని మాటెందుకు? అది ప్రకాశిస్తుంటే ఇవన్ని దానిననుసరించి ప్రకాశిస్తవి. దాని వెలుగుతోనే సృష్టి అంతా వెలిగించబడుతుంది.**

ఓం నమో శ్రీనివాసాయ నమః

ఓం నమశ్శివాయనమః

# I.

ఈ సనాతనమైన అశ్వద్ధ వృక్షానికి వేర్లు పైకి వ్యాపించి ఉంటవి, కొమ్మలు క్రిందకు విస్తరించి ఉంటవి, ఇదే పరిశుభ్రమైనది. ఇదే బ్రహ్మము. దీనినే అమరము అనికూడా అంటారు. అన్ని లోకాలు కూడా దీనియందే ఉన్నవి. ఏదికూడా ఎవరు కూడా దీనిని అతిక్రమించలేరు.

## నిజంగా ఇదే అది

ఆ పరమాత్మ అద్వయం అయితే ఆ చైతన్యతత్వం నుండి దేహేంద్రియాలు, మనస్సు, సంకల్పాలు, బుద్ధి, ఆలోచనలు – వీటన్నిటితో కూడిన ఈ ప్రకృతి, జగత్తు ఎలా ఉద్భవించింది? దానిని రక్షించి పోశించేది ఎవరు? సృష్టికర్త అయిన భగవంతుడికి సృష్టింపబడిన ఈ జగత్తుకు ఎటువంటి సంబంధం ఉంది? జీవితంలో శ్రద్ధగా, వివేకంతో ఆలోచించే ప్రతీ విద్యార్థికి ఇటువంటి సందేహాలు సాధారణంగానే కలుగుతుంటాయి.

అశ్వములు దీని నీడలో ఉండేవి కనుక అశ్వద్ధమని పేరు వచ్చిందని కొందరు చెబుతుంటారు. కాని శ్రీశంకరుల వారు శ్వ=అనగా రేపు ఉండునది; అ+శ్వద్ధ = రేపటికి అదే విధముగా ఉండనిది; అను ఉత్పత్తి అర్థాన్ని చేసుకొని ఈ అశ్వద్ధ వృక్షం ఈ సమిష్టి జగత్తును చెప్పడానికి ఉదాహరణగా ఎన్నుకొన్నారు. సదా మార్పు చెందుతుందని, క్షణబంగురు మైనదని ఈ అశ్వద్ధ అనే పేరు సూచిస్తుంది.

ఈ అశ్వద్ధ వృక్షానికి తల్లివేరు ఊర్ధ్వంగా ఉంటే కొమ్మలు క్రిందకు ఉన్నాయి. ఇక్కడ ఈ పదాలకు కొందరు చిత్రకారులు ఈ అశ్వద్ధ వృక్షానికి వ్యాచ్యార్థానే గ్రహించి, రసాహీనమైన ఒక వికార రూపాన్ని చిత్రించి బజారులో అమ్మజూస్తున్నారు. ఆలోచించి చూస్తే నిజంగా వీరు మహిమను చూపే చిత్రాన్ని అవమానపరుస్తున్నారని చెప్పవచ్చును.

"వృక్ష" అనే పదానికి ఛేదింపబడినది అనే అర్థం ఉంది కాబట్టి ఈ వృక్షం సంసారానికే దృష్టాంతంగా ఉంది అని ఆనందగిరి భావిస్తున్నారు. నిస్సంగమైన విరక్తి పూర్తిగా ఉంటేనే మనము అనుభవించే దుఃఖ వికారాలు నశిస్తాయి. కనుక అసంగశస్త్రం చేత దీనిని ఛేదించాలి.

**ఈ సంసారము నుండి మన దృష్టిని ఆ పరమాత్మవైపు మరల్చడమే అసంగము.** అప్పుడే భావ సమానమైన ఈ సంసార వృక్షాన్ని నరికి వేయగలము.

ఈనాడు విశ్వవిద్యాలయంలో చదువుకునే మనము, చరిత్ర గ్రంథాల్లో అదృష్టవశాత్తు "వంశవృక్షము" అనే పదాన్ని మనము చూస్తూనే ఉన్నాము. ఈ వంశవృక్షానికి మూలపురుసుడు ఒకడుంటే అతని సంతానము శాఖోపశాఖలుగా పెరుగుతున్నట్లు వర్ణిస్తారు.

అదే విధంగా ఈ సంసార వృక్షానికి మూలం ఉర్ధ్వంలో ఉంది, అని అంటే పరమాత్మలో ఉంది అని అర్థము. మూలభూతమైన ఆ పరమాత్మ వల్లనే ఈ వృక్షం ప్రారంభింపబడుతుంది. ప్రపంచములోని ఈ వివిధ అనుభవాలు, వాటిని అనుభవించేవారు కూడా ఆ పరమాత్మలోనే ప్రతిష్ఠింపబడి అక్కడ నుండే తమ జీవనాన్ని, సారాన్ని కూడా పొందుతారు.

అనిత్యమైన ఈ అశ్వద్ధ వృక్షం తారతమ్యదృష్ట్యా "అవ్యయం" అని ఇచట వర్ణింపబడినది.

ఒకానొక గ్రామంలో ఒక అశ్వద్ధ వృక్షం క్రింద దాని నీడలో ఎన్నో తరాలవారు పెరిగి పెద్దవారై ఉంటారు. కనుక మానవ జీవితం దృష్ట్యా ఈ అశ్వద్ధం శాశ్వతమైనది అని చెప్పవచ్చు. అదే విధంగా ప్రపంచమున తరతరాలుగా జనసముదాయములు పుట్టి గిట్టుచుండినను ఈ ప్రపంచము మాత్రము నిత్యమని శాశ్వతమని తోచుచున్నది.

**సంసార వృక్షమునకు వేదములు ఆకులు.** వేద అంటే జ్ఞానం. ప్రపంచంలో జ్ఞానం అధికంగా ఉంటే అది చైతన్యాన్ని విరజిమ్మగలదు. బ్రహ్మాండమైన కృషి ద్వారా మహత్తరమైన విషయములను ఈనాటి ప్రపంచము సాధించింది. పూర్వికులు ఊహించి కూడా యుండజాలరు. ఒక తరంవారిలో జ్ఞానం అభివృద్ధి చెందినకొలది వారు మహత్తరమైన భవిష్యత్తును దానిలో కలిగే దివ్యతరసాధనలను స్పష్టంగా చూడగలరు. కనుక తాము కనుగొన్న ఆ గమ్యాన్ని సాధించడానికి వారు సహజంగానే ఎక్కువగా పాటుపడతారు. ఇలా జ్ఞానాన్ని ఆకులతో పోల్చడం ఆసంగతం కాదు. ప్రతీ వృక్షంలోను నీటి బిందువులు ఆకులలో ఆవిరి అవుతవి. ఈ ఆవిరి ఒక పరమైన ఒత్తిడిని కలిగించి భూమినుండి ఆహారాన్ని మరికొంత పీల్చేటట్లు వేరుకు సహాయపడుతుంది. ఒక చెట్టులో ఆకులు కోసివేస్తే ఇక ఆ చెట్టు ఎక్కువ అభివృద్ధిని తొందరగా పొందజాలదు. ఆకులు, కొమ్మలు అధికంగా పెరిగేకొద్ది చెట్టుగూడా పెద్దదిగా పెరిగి విశాలంగా వ్యాపిస్తుంది. అదేవిధంగా జ్ఞానం ఎక్కువైన కొలది జీవితం ప్రశస్తంగా, విశాలంగా ఉన్నట్లు చూస్తున్నాం కదా!

ఎవడైతే దీనిని తెలుసుకుంటున్నాడో వాడు వేదాలను తెలిసినవాడు.

ఈ అశ్వద్ధ వృక్షాన్ని గాక ఆ వృక్షానికి మూలమైన పరమాత్మను కూడా ఎవడు తెలుసుకుంటున్నాడో అతడే వేదములను సరిగా అర్థం చేసుకున్నవాడు. అతనికి గల వేదజ్ఞానమే సఫలం అవుతుంది. వేదాలు అనిత్య సత్య పరమాత్మను చెబుతున్నాయి. కేవలం శాస్త్రాభ్యాసంచేతగాని, కేవలం భక్తిచేత గాని ఆ సంపూర్ణ జ్ఞానాన్ని పొందలేమని గీత దృఢంగా నిశ్చయంగా చెబుతున్నది.

ఇహాన్ని, పరాన్ని, నిత్యాన్ని–అనిత్యాన్ని, సృష్టిని, సృష్టికర్తను తెలుసు కున్నప్పుడే ఆ జ్ఞానం పరిపూర్ణం అవుతుంది. కళ్ళకు కట్టినట్లు ఎంత స్పష్టంగా, విశదంగా ఉన్నా మిగిలిన జ్ఞానాలన్నీ ఆ సంపూర్ణతత్వము

యొక్క ఒక కోణాన్ని మాత్రమే తెలియజేస్తున్నాయి. క్షరాన్ని అక్షారాన్ని బాగా తెలిసినవాడే 'జ్ఞాని' అని పేర్కొంటున్నవి. ఇటువంటి జ్ఞానినే ఇక్కడ శ్రీకృష్ణుడు "వేదవిత్" వేదములను తెలిసినవాడు అని చెబుతున్నాడు.

ఈ సంసార వృక్షము యొక్క కొమ్మలు గుణముల చేత పోషింపబడి క్రిందకు మీదకు వ్యాపించి ఉన్నవి. మరియు వాటి (చిగుళ్ళు) విషయాలు, మరియు కర్మలు అనబడే బంధములు కలిగించు వేర్లు (ఊడలు) మానవ లోకమున క్రిందకు వ్యాపించి ఉన్నవి. ఈ సంసార వృక్ష చిత్రాన్ని మరికొంత విపులంగా చిత్రించదలచి అందులోని మరికొన్ని విషయాలను ఈ విధంగా శ్రీకృష్ణపరమాత్మ వివరిస్తున్నాడు. సాహిత్యంలో గాని, చిత్రలేఖనంలో గాని భావయుక్తమైన ఇలాంటి దృష్టాంతాన్ని మరీ వాచ్యంగా అర్థం చేసికొన గూడదు.

వేదాల శైలిలోనే ఒక గాంభీర్యత కూడి ఉంటుంది. ప్రపంచములో నుండి మనకు సులభంగా ఉండే ఒక విషయాన్ని గ్రహించి అతిసూక్ష్మమైన ఆధ్యాత్మిక సత్యాలను అభివ్యక్తపరిచేటట్లు దాన్ని కావ్యశైలిలో వ్రాసి దాని ద్వారా మతానికి సంబంధించిన సందేశాన్ని అందజేయడమే "నిగూఢత" లేక "గాంభీర్యత".

ఈ సంసారపు వృక్షానికి పైకి క్రిందకు గూడా కొమ్మలు వ్యాపించి ఉన్నవి. ప్రపంచంలోను ఒక వ్యక్తిలోను కూడా ఒక ఉన్నత పరిణితిని పొందడానికి జీవిత ప్రవాహం పైకి ప్రవహించాలి. కాని తరచుగా పాశవిక ప్రవృత్తిని సంతృప్తి పరుచుకోవడానికి ఆ ప్రవాహము ఎక్కువగా క్రిందికే ప్రవహిస్తుంది అని వ్యాసుడు చెబుతున్నాడు. ఈ భావాన్నే కొమ్మలు క్రిందకు పైకి వ్యాపించి యున్నాయి అని వాక్యం ద్వారా విశదం చేస్తున్నాడు.

గుణముల చేత వృద్ధి పొందినది, ఔన్నత్యాన్ని అందుకోవడానికి, నీచతకు దిగజారడానికి గాను మానవుని ప్రేరేపించేవ మానవునిలో ఉండే సత్వ, రజ, తమ అనబడు ఈ మూడు గుణములే.

ప్రతీ వృక్షంలోను పెద్ద పెద్ద శాఖలుగా పెరిగే చిన్నచిన్న చిగుల్లే ఉంటాయి. సంసార వృక్షానికి ఈ ఇంద్రియ విషయాలే చిగుళ్లు. ఈ చిగుళ్లు పొడచూపి రెమ్మలుగా వృద్ధిచెందును. అనురాగము వలన ఈ చిగుళ్లు బలపడి వృద్ధిపొందును. విషయములపై అభిముఖమై పరమాత్మను తిరస్కరించుచుండును.

అదఃత మూలాన-తల్లివేరు పైన ఉన్న ఆ పరమాత్మలో ఉంది. పిల్లవేర్లన్నీ అంతటా వ్యాపించి క్రిందకి అనగా మర్త్యలోకంలోకి కూడా ప్రసరిస్తున్నాయి. అంటే మానవుడు కర్మలలో ప్రవర్తించేటట్లు చేస్తున్నాయి. ఈ పిల్ల వేర్లే ప్రతీవ్యక్తిలో ఉండే వాసనలు. ఈ వాసనలే మానవుని కర్మయందు ప్రవర్తింపజేసి ఆయా కార్యాలను చేయిస్తూ బంధిస్తున్నవి. ఆ వాసనల వెంబడి మానవుడు పరిగెడుచుండును. **మానవుని పురోగతికి కాని అధోగతికి కాని ఇవే కారణములు.**

ఊడలు భూమియందు నాటుకొని, విశాలముగా వ్యాపించి వృక్షమునకు ఊత, బలము నొసగునట్లు వాసనలు - సంస్కారములు - కర్మలు - కర్మఫలములు చేరి శుభ - అశుభ, ప్రియ-అప్రియ, సుఖ-దుఃఖ, లాభ-నష్టముల రూపమున మానవుని విషయరాశియందు బంధించుచున్నవి.

ఈ సంసార వృక్షం యొక్క స్వరూపాన్ని తెలుసుకోవడం శక్యం గాదు. దాని ఆద్యంతాలు, ఆకారము ఎక్కడో తెలియదు. బహు దృఢమైన మూలంతో కూడిన ఈ సంసార వృక్షాన్ని **అసంగం** అనే శాస్త్రంతో ఛేదించి ఏ పరమాత్మ వలన అనాది అయిన సంసార ప్రవృత్తి కలిగిందో **ఆ పరమాత్మను పొందిన వెనుక మరల వారికి జన్మలేదు.** ఆ పరమాత్మను పొందే మార్గాన్ని వెతకాలి. అతనినే నేను శరణు పొందుతున్నాను.

విద్యార్థులీ సంసార వృక్ష దృష్టాంతాన్ని మరీ వాచ్యంగా గ్రహించ కుండా ఉండడానికి దానికి రూపమే లేదు అని గీతాచార్యుడు చెబుతున్నాడు.

పూర్వ శ్లోకంలో చెప్పినట్లు ఈ సంసార వృక్షం దృశ్యమానమైన ఈ సమస్త జగత్తుకు ప్రతినిధిగా నిలుస్తుంది. అనగా సమిష్టి జీవరాసుల యొక్క సంపూర్ణ వ్యవహారములు సంసారము యొక్క స్వరూపము.

వ్యక్తము గాక, జీవకళ యొక్క ప్రకాశము సూక్ష్మముగ ప్రతి రంగమున, ప్రతి వ్యవహారమున యున్నది.

శరీరమున ఇంద్రియ వ్యవహారములు, స్పర్శలు మనస్సున భావములు, ఆవేశములు, బుద్ధియందు ఆలోచనలు, ఆశయములు, సుషుప్తి యందు వ్యవహారము లేని అజ్ఞాన ప్రకాశము కలదు. **అన్ని ఉపాధులు, వాటియందు కలుగుచుండు అనుభవములు ఎల్లయు కలిసి బ్రహ్మాండమగు చున్నది.**

ఈ బ్రహ్మాండ వ్యవహారములెల్ల అశ్వద్ధ వృక్షమువలె నలువైపుల వ్యాపించియున్నవి. కనుక దీని విశాల రూపమును చూచినవారు లేరు. అనగా అరుదు. అనగా దానిని తెలియుట దుష్కరము అని గీతాచార్యుడు తెలియజేయుచున్నాడు.

**ఈ సంసార వృక్షము అవిద్య నుండి ఉద్భవిస్తుంది.** విద్య లేక జ్ఞానము కలుగగానే అది నశిస్తుంది. వాంఛారూపమైన వాసనలు ఉన్నంత కాలమే ఈ వృక్షం జీవిస్తుంది.

అశ్వద్ధ రూపమైన ఈ దృశ్య జగత్తును “అసంగం” అనే గొడ్డలితో ఛేదింపవచ్చును. విషయ జగత్తు నిర్జీవమైనది. జడమైనది. ఆ చైతన్యం దానిలో ప్రసరించడం వల్లనే దాని వలన కలిగే జీవితానుభావాలను తెలిసికొని జీవించగలుగుచున్నాము.

మోటారుకారు చక్రాలను దాని యంత్రపు క్లచ్‌తో సంబంధం కలిగెటట్లు త్రిప్పితేనే ఆ బండి కదులుతుంది. కదులుతున్న ఆ చక్రాల నుండి చలనశక్తి తీసివేస్తే ఆ చక్రాలు యధాప్రకారం కదలక మెదలక

నిశ్చలంగా నిలిచిపోతాయి. అదే విధంగా ఈ దేహమనోబుద్ధుల నుండి ఆ చైతన్యాన్ని వేరుచేస్తే వాటికుండే విషయజ్ఞానం, భావావేషం, భావనా పటిమ అన్నీ ఆగిపోతాయి.

ఇలా జడపదార్థాన్ని తృంచివేయడమే విరక్తి లేక అసంగం అవుతుంది. అసంగం అనే గొడ్డలితో ఈ సంసారవృక్షాన్ని ఛేదించమని గీతాచార్యుడు బోధిస్తున్నాడు.

ఇప్పుడు మనకున్న పరిస్థితులలో ఈ విషయాన్ని వ్యతిరేకించవచ్చు. దేహ మనోబుద్ధుల నుండి విరమించుకోవడం అంటె విషయ జగత్తు నుండి, సంకల్పం ప్రపంచం నుండి భావనాలోకం నుండి సంపూర్ణంగా విరమించుకోవడం. అప్పుడు మన బుద్ధిలో ఒక సంపూర్ణ శూన్యస్థితి ఏర్పడుతుంది. చాలా నిరుత్సాహాన్ని కలిగిస్తుంది. అలా కాకుండా ఉండడానికి అదే గుక్కలో ఇలా విరమించుకొని, దేనిని చేరితే మానవులు ఇక తిరిగిరారో ఆ పరమపదమును అన్వేషించాలి అని ఆ పరమాత్మ చెపుతున్నాడు.

ఒక వ్యక్తి తనలో ఉన్న దివ్యత్వాన్ని అందుకోవాలంటె తన మనస్సును విషయ, సంకల్ప, భావనా జగత్తు నుండి విరమింప జేసుకోవడలయును. అనగా సాధకుడు **తన చైతన్యశక్తిని వృధాబో ఉపాధుల నుండి అరికట్టవలయును.** సంకల్పములను ఆదరణములను తొలగించు కొనవలెను. భావములు ఆలోచనలు అరికట్టవలయును. అందువలన కలుగు నిర్వ్యాపారత్వమందు పరమ పదమును ధ్యానము చేయవలయును.

ఆ నిశ్చల ధ్యాన క్షణంలో ఈ అశ్వద్ధ వృక్షానికి మూలమైన ఆ పరమాత్మనే ధ్యానించాలి.

ఈ బోధనను ఇంతటితో ఆపివేసి ఇదంతా కేవలం అలంకారిక అతిశయోక్తిగానో ఆచరించడానికి సాధ్యము గాని ఉపదేశము గానో మిగిలి పోతుంది. మానవుడు ఉదారంగా జీవిస్తూ తనకు సహజమైన లోపాలను

సరిదిద్దుకొని పెరగడానికి వీలైన ఉపదేశాలను చేసే అనుభవ గ్రంథం కావడం వలన, గీత ప్రతీ ఒక సాధనలోను సాధనకు ఆచరణశక్యమైన జీవనాభివృద్ధి విధానాన్ని చూపించాలి.

ఎక్కడ నుండి పురాతనమైన ప్రవృత్తి ప్రవహించుచున్నదో అదృశ్యమైన ఆ పరమ పురుషుని శరణు వేడుచున్నాను అని చెప్పడంలోనే ఆ విధానాన్ని ఇక్కడ గీతాచార్యుడు సూచిస్తున్నాడు. బాహ్య విషయముల నుండి ఈ అంతఃకరణను వీలైనంత ఎక్కువగా మరల్చుకోగానే ఏ లక్ష్యం నుండి ప్రసరించి చైతన్యప్రవాహం దేహ మనోబుద్ధులను తమ క్షేత్రాలలో ప్రవహింపజేస్తుందో ఆ లక్ష్యం వైపు భక్తి ప్రవృత్తులతో మన బుద్ధిని మరల్చాలి. **ఈ జీవిత ప్రవృత్తిని ఆపి సమస్త ప్రవృత్తులకు మూలమైన జీవితాన్ని అన్వేషించాలి.**

ఈ పురాణపురుషుడు ఎవరు? అతనిని ఎలా తెలుసుకొన గలుగుతాము? ఎటువంటి సాధకులు లక్ష్యాన్ని చేరుకుంటారు?

1) మాన మోహములు త్యజించి

2) సంఘ దోషమును జయించి

3) ఆత్మజ్ఞానమందు నిలకడగలవాడై

4) కామ క్రోధాదులు లేక

5) సుఖ దుఃఖాది ద్వంద్వముల నుండి విముక్తులైన

**జ్ఞానులు.**

నాశరహితమైన ఆ పరమపురుషుని పరమ పదమును పొందుచున్నారు.

భారతదేశంలోని వేదాంతం జీవితం అనుసరించి ఆచరణలో పెట్టవలసిన జీవన విధానమైయున్నది. ఆ వేదాంతం చూపిన లక్ష్యాన్ని మనం చేరినప్పుడే అది మనకు కృతకృత్యమైనదిగా భావించుకుంటుంది.

కనుక మన శాస్త్రాలలో కేవలము పరమాత్మ విషయమైన చర్చలు మాత్రమే గాక దానిని పొందగలిగే బోధనా సంపద కూడా కలదు.

**I.** ఈ మాన మోహాలు రెండు తనయందు ఇతరులయందు విలువను అతిశయింపజేస్తాయి. తన ప్రాముఖ్యాన్ని గురించి విపరీతమైన విలువ కట్టడం దురాభిమానం. దీనిని నిర్వహించుకోవాలి అనగానే అది మనమీదకు అనవసరమైన ఒక బాధ్యతా భారాన్ని తెచ్చి పెడుతుంది. ఇటువంటి అనవసర బాధ్యతలను నెత్తిమీద పెట్టుకోవడం వలన జ్ఞానాన్ని అన్వేషించడానికి గాని, తనకు తాను మంచి శిక్షణ ఇచ్చుకోవడానికి గాను అవకాశం ఉండదు. సమయం చిక్కదు.

ఇక బాహ్యా ప్రపంచంలోని ఇతర విషయాల చర్చలు, మనం చేసే నిర్ణయాలలోని దోషమే మోహము. అది మనచుట్టు ఉండే సమస్యలను మనం వెంటవెంటనే ఎదుర్కొని పరిష్కరించుకోకుండ ఏదో అబద్ధపు ఊహాలోకాల్లో విహరించేటట్లు చేస్తుంది.

**II.** దేహాభిమానము కలిగి విషయ సుఖములతోనే తృప్తి పొందటం అనేది – జీవితంలో సాధించవలసిన గంభీర్య విషయముల నుండి మనలను మనమే వంచించుకుంటూ కేవలము బాహ్యామైన చర్మ భస్త్రికలో నివసించడమే అని చెప్పవచ్చును. అటువంటి అజ్ఞాని, ఆ మూర్ఖుడు విషయవాంఛలలో పూర్తిగా తగులుకొంటున్నాడు. ఈ విషయవాంఛ వాని సంఘాన్ని దృఢపరుస్తుంది. ఆ విషయాల యందు ఆసక్తి అభివృద్ధి కాగానే అతని మనోబుద్ధుల దృష్టి అంతా ఆ విషయాలపైనే కేంద్రీకరింపబడి ఉంటుంది. ఆ విషయాలకు కట్టబడి వాటి వికారాలకు, వినాశాలకు అనుగుణంగా నాట్య మాడుతూ దివ్య జీవితం అంటేనే తెలియక తన శక్తినంతా ఆ విషయ భోగాలలోనే వ్యర్థపరుస్తాడు.

**III.** మనస్సు విషయాల నుండి విరమింపజేసుకోవాలంటే దానిని, ఈ విషయాలకంటె ఉదాత్తమైనది, దివ్యమైనది అయిన మరొక తత్వంలో లగ్నం చేయాలి. అపుడే అది విషయాల నుండి మరలిపోతుంది. మానవుని మనోబుద్ధులు ఏదో ఒక విషయంలో తగుల్కొంటేనే అది జీవించగల్గుతుంది. ఏ విషయంపై ధ్యాస లేకుండా అది శూన్యంలో ఉండలేదు. కనుక ధ్యానించడానికి దానికొక భావరూపాన్ని ఇవ్వాలి అందువలన విషయాసక్తి లేకుండా చేయాలంటే **సత్సంగము – ఆత్మచింతనలోనే మనస్సు జీవించాలి.**

**IV.** కోరడం బుద్ధిచేసే పని. బుద్ధి కోరగానే మనస్సు ఆ విషయంపై ధ్యానం చేయడం ప్రారంభిస్తుంది. ఆ కోరికననుసరించి సంకల్పాలు కలుగుతాయి. కాబట్టి క్షణబంగురాలైన ఈ విషయ సుఖాలను కోరకుండా ఉండేటట్లు బుద్ధిని నియమించుకోవాలి. కోరికలు లేకపోగానే మనస్సు నిశ్చలమవుతుంది.

**V.** ఈ దేహానికి విషయాలతో సంబంధం కలుగగానే ఆ సంబంధం వల్ల కలిగే సుఖదుఃఖాలను అనుభవించేది మనస్సే. ఆ మనస్సెప్పుడయితే సుఖదుఃఖాది ద్వంద్వాలను తెలుసుకుంటుందో అప్పుడే అది దుఃఖాన్ని వదలి సుఖాన్ని అన్వేశించడం మొదలు పెడుతుంది. ఇలా సుఖాన్నన్వేశిస్తూ విషయాల వెంట పరిగెత్తే మనస్సుకు దురదృష్టవశాత్తు స్థిరం తప్పుతుంది. ఎందుకంటె నిన్నో సుఖాన్నిచ్చిన వస్తువే నేను దుఃఖాన్నిస్తుంది. కనుక అస్థిరమైన మనస్సు యొక్క ఆశలను అభిలాషలను తీరుస్తున్నామంటే మనలో ఉన్న సంస్కృతిని దైవత్వాన్ని వ్యక్తపరచుకోవడానికి కల తగిన అవకాశాలను జారవిడుచుకోవడమే అవుతుంది.

అంతఃకరణం ద్వారా అభివ్యక్తమైనప్పుడే ఆ ఆత్మ దుఃఖబోధా భారం చేత భిన్నాభిన్నమైన దుఃఖిత వ్యక్తి అవుతుంది.

**కాని**

ఆ ఆత్మనే అంతఃకరణం నుండి వేరుచేసి అసలు రూపంలో అనుభవిస్తే ఆ క్షణమే ఆత్మజ్ఞానం కలిగిన క్షణం అవుతుంది.

# II.

ప్రాణశక్తి ఉపస్థితమైయుండగా అతని నుండి యావద్విశ్వము బహిర్గతమై అతనిలోనే కంపనం చెందుతుంది. ఎత్తబడిన వజ్రాయుధం లాగా అతడు మహాభయంకరుడు. దీనిని తెలుసుకున్నవారే అమరులౌతారు.

**ప్రాణశక్తి :-** జగత్కర్తగా బ్రహ్మము

అతని వలన భయం చేతనే అగ్ని దహిస్తుంది. అతని వలని భయం చేతనే సూర్యుడు ప్రకాశిస్తాడు. అతని వలని భయం చేతనే వాయువు, ఇంద్రుడు ఐదవదైన మృత్యుదేవత కూడా తమతమ విధుల ననుసరించి పరుగులు పెడతారు.

సృష్టి అనేది ఒక కంపనం – కదలిక, గతి, ఒక శక్తి. ఇది మరొక అకంప్యము, గతిరహితము, అవికార్యము అయిన దానిలోనే అంటె నిర్గుణ బ్రహ్మంలోనే సాధ్యం. అంచేత నిరంతరాయంగా మారిపోతూ ఉండే విశ్వానికి నిర్గుణ బ్రహ్మమే ఆధారము. కనుక యావద్విశ్వము బ్రహ్మంలో కంపిస్తున్నది అని చెప్పబడినది. ఈ జగత్తు యొక్క సృష్టి, స్థితి లయలు, ఒక దివ్యనియమం పర్యవేక్షిస్తున్నదని దానిని ఎవరూ అతిక్రమించలేరని కూడా ఈ వాక్యం సూచిస్తున్నది.

**మన మానసిక చర్యలకు కూడా సాక్షి ఆ బ్రహ్మమే.**

**ఎత్తబడిన వజ్రాయుధం :** విశ్వజనీనమైన ధర్మం ఆ బ్రహ్మపు భంగిమలలో ఒకటి. ప్రతీది ఆ కఠోర శాసనానికి లోబడి ఉంటుంది. ఆ కబంధ హస్తాన్నుంచి ఏదీ తప్పించుకోలేదు. అంచేత ఆ బ్రహ్మము మహా భయంకరుడని చెప్పబడినది.

బ్రహ్మం ఒకప్పుడు దేవతలకు విజయం సంపాదించిన కథ. విజయం బ్రహ్మం వలననే అయినా దాని వలన దేవతలు పొంగిపోయారు. నిజంగా మేమే గెలిచాం. మాదే ఈ ఘనత అని అనుకున్నారు.

వీరి ఈ గర్వం బ్రహ్మం తెలుసుకున్నది. వారి ఎదుట సాక్షాత్కరించింది. కాని ఆ ఆపురూపమైన శక్తి ఏమిటో వారికి అర్థం కాలేదు.

దేవతలు అగ్నితో ఓ జాతవేదుడా! ఈ అపురూపమైన శక్తి ఏమిటో తెలుసుకో అన్నారు. అతడు ఒప్పుకున్నాడు.

అగ్ని ఆ శక్తి వద్దకు వేగంగా వెళ్ళాడు. నీవెవరివని ఆ శక్తి అతడిని అడిగింది. నేను అగ్నిని, సర్వజ్ఞుడను అని అగ్ని బదులిచ్చింది.

అయితే నీలో ఏమి శక్తి ఉన్నది? అని శక్తి అడిగింది భూమి మీద ఏదేది ఉన్నదో దానినంతటిని దహించివేయగలదు అని అగ్ని అన్నాడు.

శక్తి అతని ఎదుట ఒక గడ్డిపోచ నుంచి దీనిని కాల్చు అన్నది. అగ్ని యావచ్ఛక్తితో ప్రయత్నించాడు కాని కాల్చలేకపోయాడు. అతడు భయపడి దేవతల వద్దకు వెళ్ళి ఆ శక్తి ఏమిటో నేను తెలుసుకోలేకపోయాను అన్నాడు.

అపుడు దేవతలు వాయుదేవునితో ఓ వాయూ! ఆ అపురూపశక్తి ఏమిటో కనుక్కో అన్నారు. వాయువు అందుకు అంగీకరించాడు.

వాయువు ఆ శక్తి వద్దకు వేగంగా పోయాడు. ఆ శక్తి నీవెవరు అని అతడిని అడిగింది. నేను వాయువును గాలికి ప్రభువును అని జవాబు చెప్పాడు.

అయితే నీలో ఏమిశక్తి ఉన్నది అని అడిగింది. భూమ్మీద దేనినైనా ఎగురగొట్టగలను అన్నాడు.

అతని ఎదుట ఆ శక్తి ఒక గడ్డిపోచనుంచి దీనిని ఎగురగొట్టు అన్నది. వాయువు సర్వశక్తితో ప్రయత్నించాడు కాని దానిని కనీసం

కదిలించలేకపోయాడు. వెంటనే అతడు భయపడి దేవతల వద్దకు వెళ్ళి ఈ అపురూపమైన శక్తి ఏమిటో నేను తెలుసుకోలేకపోయాను అన్నాడు.

అప్పుడు దేవతలు ఇంద్రుడితో ఓ దేవేంద్రా ఈ అపురూపమైన శక్తి ఏమిటో మీరే వెళ్ళి తెలుసుకొని రండి అన్నారు. దేవేంద్రుడు సరేనన్నాడు. ఆ శక్తి వద్దకు త్వరత్వరగా వెళ్ళాడు. కాని ఆ శక్తి అతని ఎదుట నుండి అంతర్ధానమైనది.

ఆ స్థలంలోనే దేవేంద్రుడు హిమవంతుని కుమార్తెను చూచాడు. ఆ జగన్మాతను దేవేంద్రుడు అడిగాడు– మాతా! ఈ అపురూపమైన శక్తి ఏమిటి?

అది బ్రహ్మము. ఆ బ్రహ్మము వలననే కదా మీరు విజయము చేకూరారు. అతని వలననే కదా మీరు మహోన్నితులైనారు. అన్ని ఆ తల్లి బదులు పల్కినది. ఆ శక్తి బ్రహ్మము అని అప్పుడు దేవేంద్రుడు తెలుసుకున్నాడు.

అందుచేతనే గదా ఈ దేవతలు – అగ్ని, వాయువు, ఇంద్రుడు ఇతర దేవతలనధిగమించినది. వారే ఆ శక్తికి అత్యంత సమీపముగా వెళ్ళారు. అది బ్రహ్మము అని తెలుసుకోవడంలో వారే ప్రథములు.

అహో! మెరుపును ప్రకాశించేది బ్రహ్మమే. మనిషిని రెప్పవాల్చేటట్లు చేసేది బ్రహ్మమే. ప్రకృతి శక్తులుగా ఆ బ్రహ్మము అభివ్యక్తీకరణకు సంబంధించి చెప్పబడినది బ్రహ్మము అన్ని జీవులకూ ఆత్మగా ఆరాధింప బడినదని ప్రసిద్ధిచెందినది దానిని తద్వన్నం ధ్యానించాలి. ఇలా తెలుసుకున్న వానిని సకల జీవులు ప్రేమిస్తాయి.

తపస్సు, నిగ్రహం, నిష్టాపూర్వకమైన కర్మ ఇవి దానికి మూల భిత్తికలు. వేదాలు దాని సర్వాంగాలు సత్యం దానికి నివాస స్థానము.

## III.

ఆ బ్రహ్మమును ఇక్కడే ఈ శరీర పతనానికి పూర్వమే సాక్షాత్కరించు కోగలిగితే మానవుడు బవ బంధాల నుండి విముక్తుడవుతాడు. లేకపోతే సృష్టిలోని అనేక లోకాలలో మళ్ళీమళ్ళీ శరీర ధారణం చేయవలసి వస్తుంది.

ఇక్కడ సాక్షాత్కరించుకోనట్లయితే అంతా సర్వనాశనమే. ప్రతీ జీవిలోను ఆత్మను వివక్షించుకొంటూ ప్రజ్ఞాశాలి ఇంద్రియ జీవితాన్ని అతిక్రమించి అమరత్వాన్ని పొందుతాడు.

**ఆపైన నిజజీవితం ఉన్నది :** ఇది జీవన్ముక్తుడి విషయం. ఇతడు తప్ప మిగిలిన అందరు మాయా ప్రభావంలో అసత్యంలో జీవించుచున్నారు.

## V.

ఆ పరబ్రహ్మము మానవుడి ఆత్మ యందు అద్దంలో లాగా స్పష్టంగా పితృలోకంలో కలలో లాగా కన్పిస్తుంది. గంధర్వలోకంలో నీటిలో ప్రతిఫలనం లాగా కన్పిస్తుంది. బ్రహ్మలోకంలో వెలుగునీడల మాదిరిగా కన్పిస్తుంది.

చైతన్యపు వివిధ స్తరాలలో బ్రహ్మము అనేక విధాలుగా ఎలా సాక్షాత్కరిస్తుందో ఇక్కడ ఉపమానాల ద్వారా చెప్పబడినది. ఈ ప్రపంచంలో శరీరధారియైన వానికి తన ఆత్మలో బ్రహ్మం అద్దంలో ప్రతిరూపం కన్పించినంత సుస్పష్టంగా సాక్షాత్కరిస్తుంది.

ఈ సుస్పష్టత పితృలోకము, గంధర్వలోకము వంటి ఇతర లోకాలలో క్రమక్రమంగా తగ్గిపోతుంది. క్రమ ముక్తిని అనుసరించేవారు చేరుకునే బ్రహ్మలోకంలో మాత్రం చీకటిలో వెలుగు కన్పించినంత స్పష్టంగా సాక్షాత్కరించే మాట నిజమే. కాని ఆ బ్రహ్మలోకం అత్యంత ప్రయాస చేత తప్ప చేరలేము.

**కనుక బ్రహ్మ సాక్షాత్కారము ఆత్మలోనే సాక్షాత్కరించుకొనే ప్రయత్నము చేయవలసియున్నది.**

# VI.

ఇంద్రియాల యొక్క విభిన్న స్వరూపాన్ని వాటి విభిన్నమైన ఉత్పత్తిని వాటి ఉదయాస్తమయాలను తెలుసుకొన్న ప్రాజ్ఞుడు ఇక శోకించడు.

**విభిన్న స్వరూపము:** ఆత్మకంటె అత్యంతము విభిన్నమైన స్వరూపము.

**విభిన్నమైన ఉత్పత్తి :** ప్రతీ ఇంద్రియము ఒక్కొక్క మహా భూతము నుండి ఒక్కొక్కటిగా ఏర్పడుతుంది.

**ఉదయాస్తమయాలు :** జాగ్రదావస్తలో సుషుప్తావస్తలో మనము గమనిస్తున్నట్లుగా ఇంద్రియాలు కార్యశీలములై ఉదయిస్తూ అస్తమిస్తున్నట్లుగా ఊరికే ఉండిపోతూ ఉంటవి. పరిణామశీలాలైన ఇంద్రియాల నుండి పరిణామ రహితము శాశ్వతము అయిన ఆత్మను సులభంగా నివేదించు కోవచ్చును అని.

## -: పంచీకరణము :-

మహాభూతాల పంచీకరణము వలన కర్మలను బట్టి స్థూల శరీరము ఏర్పడుతుంది. సుఖదుఃఖములు అనుభవించుటకు ఇది స్థానమని చెప్పబడుతుంది.

పంచ ప్రాణవాయువులు మనస్సు, బుద్ధి, దశేంద్రియములతో కూడా సూక్ష్మశరీరము అపంచీకృతమైనది. సుఖదుఃఖాలు అనుభవించునది ఇదియే.

అనాదిగా ఉండే అవిద్య నిర్వచించుటకు వీలు లేదు. దీనినే కారణ శరీరము అంటారు. మూడు ఉపాధులకు అవ్యమైనది ఆత్మ.

**అజ్ఞానం వలన మనం స్థూల, సూక్ష్మ శరీరములతో తాదాత్మ్యం చెందుతున్నంత కాలము ఆత్మను ఎరుగజాలము. పునర్జన్మ సంసార బాధలు తప్పవు.**

I. మొదట ఆకాశము రెండు భాగములయి అర్ధభాగము యండ తక్కిన అర్ధభాగము నాలుగు భాగములై వాయువు, అగ్ని, జలము, పృధ్విలో చేరిపోయెను.

**ఆకాశము + వాయువుతో కూడుటచే <u>మనస్సు</u> పుట్టెను.**

**ఆకాశము + అగ్నితో కూడుటచే <u>బుద్ధి</u> పుట్టెను**

**ఆకాశము + జలముతో కూడుటచే <u>చిత్తము</u> పుట్టెను**

**ఆకాశము + పృధ్వితో కలియుటచేత <u>అహంకారము</u> పుట్టెను.**




II. వాయువు రెండు భాగములై అర్ధభాగము యుండ తక్కిన అర్ధ భాగము నాలుగు భాగములై ఆకాశము, అగ్ని, జలము, భూమితో కూడుచున్నది.

**వాయువు + ఆకాశముతో కూడుటచే <u>సమానవాయువు</u> కలిగెను**

**వాయువు + అగ్నితో చేరుటచే <u>ఉదానవాయువు</u> కలిగెను**

**వాయువు + జలముతో చేరుటచే ప్రాణవాయువు జన్మించెను.**

**వాయువు + పృధ్వితో కలియుటచే అపానవాయువు జన్మించెను.**




**III.** అగ్ని రెండు భాగములయి అర్ధభాగము యుండ తక్కిన అర్ధభాగము నాలుగు భాగములై ఆకాశము, వాయువు, జలము, పృధ్వితో కూడుచున్నది.




**అగ్ని + ఆకాశములో చేరుటచేత చెవులు పుట్టెను**

**అగ్ని + వాయువుతో చేరుటచే చర్మము పుట్టెను**

**అగ్ని + జలముతో చేరుటచే నాలుక పుట్టెను**

**అగ్ని + పృధ్వితో కలియుటచే ముక్కు పుట్టెను.**

**IV.** జలము రెండు భాగములయి ఉండ తక్కిన అర్ధభాగము నాలుగు విభాగములయి ఆకాశము, వాయువు, అగ్ని, పృధ్వితో గూడెను.




**జలము + ఆకాశముతో కూడుటచే శబ్ధము పుట్టెను**

**జలము + వాయువుతో కలియుటచే స్పర్శము కలిగెను**

**జలము + అగ్నితో కలియుటచే రూపము కలిగెను**

**జలము + పృధ్వితో కలియుటచే గంధము కలిగెను.**

**V.** భూమి రెండు భాగములయి ఉండ అర్ధభాగము నాలుగు భాగములయి ఆకాశము, వాయువు, అగ్ని, జలముతో కూడుచున్నది.



**పృధ్వీ + ఆకాశముతో కలయుటచే నోరు కలిగెను**

**పృధ్వీ + వాయువుతో కలియుటచే చేతులు జన్మించెను**

**పృధ్వీ + అగ్నితో కలియుటచే కాళ్ళు పుట్టెను**

**పృధ్వీ + జలముతో కలియుటచే శిశ్నము కలిగెను**

**పృధ్వీ**
- అస్థి
- చర్మము
- మాంసము
- నరములు
- రోమములు

**ఉదకము**
- రక్తము
- మూత్రము
- శుక్లము
- శ్లేశ్మము
- మెదడు

**అగ్ని**
- క్షుత్తు
- పిపాస
- నిద్ర
- ఆలస్యం
- సంగమం

**వాయువు**
- చలనము
- గమనము
- లజ్జ
- మదం
- తీవ్రం

**ఆకాశము** — కామం
— క్రోధం
— లోభం
— మోహం
— భయం - కలిగెను.

# VII.

ఇంద్రియముల కంటె మించినది మనస్సు.

మనస్సు కంటె అంతరము సూక్ష్మము అయినది బుద్ధి.

ఈ విషయంలో బుద్ధిని దాటిపోయింది మహత్తు (హిరణ్యగర్భుడు)

మహత్తు కంటె ఇంకా సూక్ష్మతరము అయినది అవ్యక్తము.

నిజంగా అవ్యక్తం కంటె మించినది సర్వవ్యాప్తి సర్వలక్షణ రహితము అయినది పురుషుడే. ఆ పురుషుని సాక్షాత్కరించుకోవడం చేతనే మానవుడు ముక్తుడై అమరుడవుతున్నాడు.

ఈ శ్లోకంలో ప్రతీ సాధకునికి అంతఃశత్రువైన **కోరిక**ను వేటాడ డానికి తగిన పద్ధతిని శ్రీగీతాచార్యులు అర్జునినికి ఉపదేశించుచున్నాడు.

ప్రపంచంలోని ఇతర వస్తువులతో పోల్చి చూసినప్పుడు ఇంద్రియములే దివ్యతరములయినవి. దేహంలో ఉన్న సాధనలలో కర్మేంద్రియాల కంటె జ్ఞానేంద్రియాలు సూక్ష్మమైనవి. ఈ ఇంద్రియాలు మనస్సుచేత పాలింపబడుచున్నవి. అందుచేత మనస్స ఇంద్రియాలకంటె సూక్ష్మమైనది.

ఇట్టి మనస్సు సంచరించడానికి దానికొక విశాల సామ్రాజ్యమే యున్నది. అయినప్పటికీ దానికి కూడా తగిన పరిమితులు, సరిహద్దులూ

ఉన్నాయి. ఒక జ్ఞానం నుండి మరొక జ్ఞానాన్ని చేరేటప్పుడు మనమీ మనస్సు సరిహద్దులను విస్తరింపజేస్తున్నాము. ఇలాంటి కొత్త దండయాత్రలో అంతటా బుద్ధే ముందుగా మానసిక సరిహద్దులను దాటుతుంది. అలా తన పొరుగు రాజ్యమైన నూతన జ్ఞానాన్ని జయిస్తుంది. ఈ భావంలో మనస్సు కంటె బుద్ధి అధికంగా వ్యాపిస్తుంది. కనుక అది మనసుకంటె కూడా సూక్ష్మతరమైనది.

**ఆ బుద్ధికంటె పరమమైన దానినే ఇక్కడ ఆత్మ అని శ్రీకృష్ణుడు అర్జునునకు బోధిస్తున్నాడు.**

బుద్ధిలోని భావాలను కూడా ప్రకాశింపజేసే ఆత్మ చైతన్యం బుద్ధికంటె కూడా సూక్ష్మతరం అయి ఉండాలి.

**ఆ ఆత్మకంటె పరమమైనది వేరొకటి లేదని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి.**

జ్ఞానంలో బాహ్య చరావాల నుండి తాదాత్మ్యాన్ని వదిలించు కోవడమే ధ్యానయోగ విధానము.

భ్రమ మూలమైన ఇటువంటి భావనల నుండి జాగ్రత్తగా జ్ఞానాన్ని మాత్రం ఏర్చి కూర్చుకొని ఆత్మలో ఆత్మగా జీవించడంతో మన ప్రభుత్వాలన్నీ ముగుస్తున్నవి.

ఓ అర్జునా! ఈ విధంగా నీవు బుద్ధికంటె పరమమైన ఆత్మను తెలిసికొని బుద్ధి చేతనే మనస్సును చక్కగా నిగ్రహించి, దుఃఖముచే పొంద తగనదియు కామ స్వరూపమైన **శత్రువు**ను జయింపుము అని శ్రీ గీతాచార్యుడు బోధించుచున్నాడు.

గీత సదా నిర్మాణాత్మకమైన జీవితంలోని పునర్వ్యవస్థనే బోధిస్తున్నది. కాని జీవిత సంఘటనలను ఎన్నటికి నశింపచేయమని కాని త్రోసివేయమని కాని ఎక్కడ బోధించడము లేదు.

# IX.

అతని రూపం కనుచూపు మేరలో లేదు. కన్నులతో ఎవరు అతనిని చూడలేరు. హృదయంలోనే ఉండి మనస్సును శాసించే బుద్ధియొక్క స్ఫూర్తి చేతనే అతడు ప్రకటితుడవుతున్నాడు. అతనిని తెలుసుకున్నవారు అమరులవుతారు.

మనస్సుతో సహా పంచేంద్రియాలు ఎప్పుడూ ఆత్మలో నిశ్చలంగా నిలిచిపోతాయో, ఎప్పుడు బుద్ధికూడా నిశ్చలమైపోతుందో అప్పటి స్థితినే పరమపదమంటారు.

ఆ సుస్థిరమైన ఇంద్రియ నిగ్రహమే యోగమనబడుతుంది. అప్పుడు యోగి అన్ని మనశ్చాంచల్యాల నుండి, పొరపాట్ల నుండి విముక్తుడవుతాడు.

ఎందుకంటే

**ప్రతీ జీవుడు యోగాన్ని పొందనూవచ్చు – పోగొట్టుకొనూవచ్చు.**

అంతా వాని సాధనపై ఆధారపడియున్నది.

యోగాభ్యాసం చేసేటప్పుడు యోగి మనస్సును విచ్చలవిడిగా పోనీయకుండా తైలధారలాగా ఆత్మపైనే నిలిపి ఉండేటట్లు చేయాలి.

కొందరికి వేదాంత శ్రవణము ఒక జబ్బుగా మారిపోవుచున్నది. తాత్కాలిక మనోరంజనము కొరకే వారు వినుచుందురు. ప్రతీరోజు నల్లమందు ఒకింత తినువారివలె వారు కొద్దికొద్దిగా వేదాంతమును కులాసాగా వినుచు అంతటితో తమపని పూర్తి అయినదని తలచి అనుష్టాన మందు ప్రవేశించకయుందురు.

కావున అందరు గీతాశ్రవణముచే, గీతా మననముచే పరిణిత హృదయులై, గీతా ధర్మములలో తాదాత్మ్యము నొంది ఆనందమును చూరగొనవలయును.

ఇట్టి గీతా శ్రవణేచ్ఛ పూర్వజన్మ పుణ్యము వలననే కలుగగలదు. పాపము హృదయమందున్నచో జనులకు దైవకార్యమందు ప్రీతి జనించదు. ఒకవేళ జనించినను నిలువదు. మనస్సు రాగాది కషాయుతమై మలినముగా యున్నచో దైవమందును దైవవాక్కు యందును అభిరుచి కలుగదు.

అందుచేత, తపస్సుచే పాపము నశించిన వారును, శాంత చిత్తులును రాగ రహితులగు ముముక్షువుల కొరకే ఆత్మబోధ చెప్పబడుచున్నది.

కాబట్టి పుణ్యకర్మలచేతను, నామ స్మరణము చేతను, ప్రార్థనాదుల చేతను, మొట్టమొదట పాపములను నశింపచేసుకొనవలయును. అపుడే దైవవాణి వినుటకు, ఆచరించుటకు నోచుకొనగలము.

మనోదోషములు 3 రకములుగా యున్నవి.

- **మల** -- సత్కర్మలు
- **విక్షేప** -- ధ్యానము
- **ఆవరణ** -- జ్ఞానము – వేదాంత శ్రవణము

సామాన్యముగ మనస్సు చంచలముగా చపలముగా యుండును. దానిని కోతికి పోల్చిరి. మామూలు కోతికి కాదు కల్లు త్రాగిన కోతికి. ఇంతేకాదు కల్లు త్రాగి తేలుకుట్టి, దయ్యం పట్టిన కోతికి పోల్చదొడంగిరి. కవులు దాని చపలత్వాతిశయమును చూచి అట్టి చవట మానసమును అరికట్టనిదే మనుజునకు శాంతి ఎట్లు లభింపగలదు? ప్రతీ జీవి యొక్క సహజ స్వరూపము పరమానందాత్మ అయి ఉన్నను, ఈ మనస్సు అను అడ్డు వలన అట్టి నిరతిశయానందమను భూతమగుట లేదు. కనుకనే మహనీయులందరును మనో నిగ్రహమునకు, మనస్సంయమమునకు,

మనోనాశమునకు అధిక ప్రాధాన్య మొసంగినవారై అద్దానిని **ఆత్మ సాక్షాత్కారమునకు ప్రథమ సాధనముగా పేర్కొనిరి.**

ఈ జగన్మాయమను మహాచక్రమునకు మనస్సు నడిబొడ్డు అయి ఉన్నది. దానిని పట్టుకొనినచో (నిగ్రహించినచో) ఇక ఈ మాయ ఒకింతయైనను బాధించదు అని వశిష్టులవారు శ్రీరామచంద్రులకు బోధించెను.

కావున ప్రతీ మానవుని యొక్క ప్రథమ కర్తవ్యము తన మనస్సును తాను జయించుకొనుటయే యగును.

**మనస్సనునది వాస్తవముగ ఆత్మకంటె ఎంతయో క్రింది స్థానమున ఉన్న వస్తువు.** అట్టిది అనేక జన్మలయందు వాసనలను ప్రోగుచేసికొని బలమును సంపాదించి పైన ఉన్న ఆత్మను అనగద్రొక్కివేయుచున్నది. గుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించిన చందమున ప్రవర్తించుచున్నది.

పూర్వమొక రాజుండెడివాడు అతనికి పెక్కు భూములు, తోటలు, ఏస్టేట్లు ఉండెడివి. వాటినన్నిటిని తాను స్వయముగా చూచుకొనుటకు వీలులేక ఒక ప్రతినిధిని ఆక్కార్యమునకు వినియోగించెను. ఆ ప్రతినిధియే క్రమముగ అధికారమును చేపట్టి రాజును చిన్నచూపు చూచుచు, కొంత కాలమునకు నీవెవ్వరయ్యా? అని ప్రశ్నించు స్థితికి వచ్చెను. అట్టి సందర్భమున రాజుకు రెండే మార్గములు కలవు. తన అధికారమును చలాయించి ఆ ప్రతినిధిని లోబరచుకొనుట గాని, తొలగించివేయుట గాని ఒకటి లేదా అతనికి తలయొగ్గి దాసాన దాసుడై బానిసవలె వర్తించుట రెండవది. వివేకముతో కూడిన రాజు తన హోదాను గమనించి; ఆ ప్రతినిధిని ఉద్యోగము నుండి తొలగించి సుఖముగ యుండెను.

అట్లే ఆత్మయను రాజు చిరకాలము క్రిందట మనస్సును ప్రతినిధిని జగత్ వ్యవహారమునకై వినియోగించగా, అయ్యది క్రమముగా విషయ

వాసనలచే బలపడి, క్రొవ్వెక్కి ఆత్మను బానిసచేసి వైచినది (బుద్ధిని) ఇట్టి స్థితి చాలా శోచనీయమైనది. కాని దానినెట్లయిన జయించి తమ సార్వభౌమాధికారమును నిలబెట్టుకొనవలసినదిగా జనులకు విజ్ఞప్తి చేయుటకై శ్రీకృష్ణుడు అర్జుననకు యోగాభ్యాసమును బోధించెను.

వాస్తవముగా జీవుడు స్వతంత్రుడు గాని పరతంత్రుడుగాడు. యజమానియే గాని బానిసగాడు. అధికారియేగాని నౌకరు గాడు. ఎవడు తన ఇంద్రియములను, మనంబును, జయించునో అతడు ఈ నవద్వార పురంబునకు సార్వభౌముడై విలసిల్లును మరియు జయింపబడిన ఆ ఇంద్రియములు అతనికి మిత్రులుగా వ్యవహరించుదురు.

అట్లుగాక ఎవడు మనస్సును జయింపక, ఇంద్రియములకు లోబడునో అట్టివాడు ఈ నవద్వార పురంబునకు బృత్యుడై మెలగుచు శోకాన్వితుడైయుండును. అతని ఇంద్రియములు కూడ శత్రువులుగనే వ్యవహరించుదురు.

ఓ కృష్ణా! మనస్సును నిగ్రహింపవలెనని చెప్పుచున్నావు. నా మనస్సో మహా చపలముగా యున్నది. విషయముల యందు గట్టి పట్టుదల కలిగియున్నందుచే దానిని లొంగదీయుట, గాలిని పట్టుకొనుటవలె మహా దుష్కరముగా తోచుచున్నది. అట్టి పరిస్థితులలో నా కర్తవ్యమేమి అని అర్జునుని ప్రశ్న?

శ్రీకృష్ణుడు చిరునవ్వుతో ఇట్లు ప్రత్యుత్తరమొసగెను.

ఓ అర్జునా! నిస్సందేహముగా మనస్సు చంచలమైనదే. నిగ్రహించుటకు కష్టసాధ్యమైనదే. అయినను దానిని అభ్యాస, వైరాగ్యములచే నిగ్రహింపవలెను. ప్రయత్నము చేయనివారికి మనోనిగ్రహము కష్టముగానే యుండును. కాని ప్రయత్నించువారికి సులభముగానే ఉపాయము చేత లభ్యమగుచున్నది. కావున పార్థా! ప్రయత్నము సలుపుము.

**గీతాచార్యుని ఈ ఆదేశము సోమరులకు గొడ్డలిపెట్టుగా పరిణమించినది.**

మనస్సంయమము హఠాత్తుగా ఆకసము నుండి ఊడిపడి జీవుని హృదయమందు చేరునది కాదనియు, అది ఒకరిచ్చునది ఒకరు పుచ్చుకొనునది అంతకంటే కాదనియు, వారికి వారే ప్రయత్నము, పరిశ్రమ చేసి పొంద తగినది అనియు భగవంతుడు స్పష్టీకరించెను.

అర్జునుడు శ్రీకృష్ణునకు పరమమిత్రుడు; సన్నిహితుడు, సఖుడు ప్రీతిపాత్రుడు అని భగవానుడే పలుసార్లు చెప్పియుండెను.

అట్టితరి అర్జునుడు నా మనస్సు నిలుచుట లేదు బాబో, అని విలపించుచుండ, మిత్రుడవగు ఓ అర్జునా! నీవు మహా విపత్తులో యున్నావు నేను సర్వశక్తి సంపన్నుడను. మదీయ ప్రజ్ఞాభావములచే, నీ మనస్సును ఒక్క నిమిషములో అరికట్టెదను అని శ్రీకృష్ణుడు చెప్పలేదేమి? అంతటి ఆప్తుడు కదా! ఈ కొంచెము సహాయ మాతనికి చేయలేదేమి? అభ్యాసము చేసుకోవయ్యా మహానుభావా - అని అతనిమీదనే ఏల భారముంచెను. దీనికి కారణము

1) ఎవరి ఆకలిని వారే భుజించి పోగొట్టుకొనవలయును.

2) ఎవరి బరువును వాడే దించుకొని సుఖపడవలయును.

3) ఎవరి కండ్లతో వారే చూడవలయును.

మహాత్ములు ఒకింత సహాయము చేయువారే కాని ప్రయత్నించి సాధించవలసినది ఎవరికి వారే!

కావుననే అర్జునుడు మనశ్చాంచల్యమును గురించి శ్రీకృష్ణునకు ఫిర్యాదు చేసినపుడు, అభ్యాసవైరాగ్యముల ద్వారా దానిని పోగొట్టుకొన వలెనని సమాధానమొసంగెను.

ఎవరి ఆత్మను వారే ఉద్ధరించుకొనవలయును అని భగవానుడు హెచ్చరిక చేసియున్నాడు. ముముక్షువులగువారు సద్గురువుల యొద్దకేగి – మహాత్మా! అజ్ఞానము బాధించుచున్నది. మనస్సు చంచలముగా యున్నది. దుఃఖనివారణోపాయములను సెలవిండు అని ప్రశ్నించినపుడు గురువులు నాయనలారా! ఆ అజ్ఞానమును తెచ్చుకొనినది ఎవరు? మనస్సునకు చాంచల్యమును అలవాటు చేసినది ఎవరు? అనాది కాలముచే దృశ్యవాసనలను మేపి ఆ మనస్సును చెడగొట్టినది ఎవరు? అసుర, సంపద్రూపమైన నిషిద్ధాహారము మీ ద్వారా కడుపునిండ దానికి లభించుట వలన, అది బాగుగా తినమరిగి, కొవ్వెక్కి మీపైననే తిరగబడుచున్నది.

కావున బంధనమెట్లు పోవునో మమ్ములను అడుగుటకు పూర్వము ఆ బంధనము ఎట్లు వచ్చినదో మీరే ఊహించుకొనుడు? మనస్సు చపలముగా ఉన్నదని మాతో విన్నవించుటకు మునుపు ఆ చాంపల్యమును ఎవరు కలుగజేసిరో విచారించుడు. అపుడు తన్నివారణము సులభముగా జరుగగలదు అని వచించుచున్నారు.

జీవుని అజాగ్రత్త వలన ప్రయత్న రాహిత్యము వలన ఇవన్నియు ఏర్పడినవి కావున ఇప్పుడు జాగ్రత్త వహించినచో, ప్రయత్నము నాచరించినచో అవి తొలగిపోగలవు. ఇక్కారణముననే గీతాచార్యుడు అర్జునిని ప్రశ్నకు సమాధానముగా నీకు నీవే వైరాగ్యపూరకమగు, అభ్యాసమను ప్రయత్నమును సలుపవలయును అని సెలవిచ్చును. కాబట్టి ముముక్షువులందరు భగవానుని ఆదేశ ప్రకారము వారివారి మనంబులను సుస్థిరములుగను, నిశ్చలముగను నొనర్చుటకై మహత్తర పురుష ప్రయత్నమును కావింపవలసి యున్నది.

అందుచేత అభ్యాసము, వైరాగ్యము అను రెండు ఉపాయములచే మనస్సును అరికట్టవలయునని పరమాత్మ వచించెను.

ఒకానొక కార్యమును సాధించుటకై మరల మరల నొనర్పబడు ప్రయత్నమునకే అభ్యాసమని పేరు.

అనేక జన్మలయందు మనస్సు మాయా ప్రవాహమున నెమ్మదిగా కొట్టుకొని పోవుచున్నది. ఇప్పుడు సద్గురు ఉపదేశముచే – మాయను, ప్రకృతిని, అజ్ఞానమును దిక్కరించి ప్రయత్నింపవలసి యుండుటచే ప్రవాహముకు ఎదురీదవలసి వచ్చుచున్నది. ఎన్నియో కోట్ల సంవత్సరములు జన్మలు దుష్టవాసనావలంబము నందు వినియోగింపబడినవి. ఇప్పుడు సద్వాసనాశ్రయము నందు కొలది సంవత్సరములైనను నియోగింపనక్కర లేదా? కావున అభ్యాసము ద్వారా మరల మరల మనస్సును లొంగదీయ వలయును.

కోతి, ఎలుగుబంటి, పులి మొదలగు నోరులేని జంతువులను కూడా మరల మరల నేర్పుట ద్వారా సర్కస్ యజమాని వానిని స్వాధీన పరచుకొని ఇష్టము వచ్చునట్లు ఆడించుటలేదా? ఇక ఎంతయో ప్రజ్ఞ కలిగిన మానవుడు ఎందులకు దారికిరాడు? అతని మనస్సెలా లొంగదు? **తప్పక లొంగును. కాని తధేక యత్నముతో దీక్షతో అభ్యసించుచు రావలయును.**

శిలపై రోజు చీమలు ప్రాకుచుండినచో దానిపై దారి ఏర్పడగలదు. కఠినమైన శిల్పమును గూడ అల్పమగు చీమ ఛేదింపగలిగినది దేనిచేత? నిరంతర గమనరూప ప్రయత్నము చేత దీనినే అభ్యాసమందురు. ఇట్టి అభ్యాసమునే మనోజయమునందు ఉపయోగించవలెనని భగవానుడి ఆజ్ఞ.

మనోజయోపాయములలో ఇక రెండవది వైరాగ్యము. అనగా విషయ విరక్తి. ఇది లోపించినందు వల్లనే అనేకులకు మనస్సు నిలకడలేకయున్నది. ఇంద్రియములు శబ్దస్పర్శాదుల వైపు పరిగిడుచున్నంత వరకు మనస్సునకు నిశ్చలమెట్లు కలుగును? ఇంద్రియములు విషయముల వెంట పోయినపుడు మనస్సు వానిననుసరించి పోవును. కావున

**కిటికీలు తెరిచియున్న ఇంటియందు గల ప్రమిద దీపము గాలి వలన కదులుచునేయున్నట్లు అట్టి మనస్సు నిరంతరము చపలముగానే యుండును.**

కావున విషయముల యందు గల దోషదృష్టి నుండి మనస్సును మరల్చి అంతర్ముఖమొనర్చవలయును. ఆత్మయందు చేర్చవలయును. దీనినే వైరాగ్యమందురు.

పూర్వమొకప్పుడు ఒక మహారాజునకు అంతవరకు కనివిని ఎరుగనట్టి అద్భుతమగు భావనమును నిర్మింపచేయు సంకల్పముద యించెను. లోకాదీశుడు కనుక డబ్బుకు కొదవేమి? కావలసిన ధనమును వెచ్చించి గొప్పగొప్ప శిల్పులను రప్పించి కొన్ని సంవత్సరములు తదేక దీక్షతో పని చేయించి తుట్టతుదకు అతిసుందరమైన రాజభవనమును తయారు చేయించెను. చూచినవారికి కండ్లు మిరిమిట్లు గొలుపునట్లుండెను. విశాలమైన గదులు, ధగధగ మెరయుచున్న రత్నకాంతులు, అందములు చిందుచున్న దీపప్రభలు వెయ్యేల – దేవేంద్రుని భవనమును కూడా తిరస్కరించుచున్నదా అన్నట్లుండెను ఆ ప్రాసాదము. ఒక సుదినమున గృహప్రవేశము ఏర్పాటు కాబడెను.

అప్పుడు సభామధ్యమున మహారాజు సభ్యులనందరిని ఉద్దేశించి ఇట్లు పలికెను. ఓ పుణ్యాత్ములారా! ఈ గొప్ప భవనమును ఎంతయో ధనము వెచ్చించి శ్రమచేసి నిర్మించినారు మీలో గొప్ప శిల్పులు, వాస్తు శాస్త్రవేత్తలు, భవన నిర్మాణ కుశలురు కలరని నాకు తెలుసును. కాబట్టి అట్టి వారందరును యోచించి భవనమునందేదైనా లోపమున్నచో తెలిపినచో అవి సవరించివేసెదను. దీనిని సర్వాంగసుందరముగా తీర్చిదిద్దవలెనని నా అభిప్రాయము.

రాజుయొక్క ఆ వాక్యమును విని సభ్యులు ఆశ్చర్యచకితులయిరి. అందములు చిందుచున్న ఆ కట్టడములెక్కడ? దోషములెచ్చుట! అయినను

ఆ లోకేశుని మాటను తీసివేయలేక ప్రముఖ శిల్పులు, వాస్తు నిపుణులు, ఇంజనీర్లు మరియొక పర్యాయము భవనమంతయు తిరిగి చూచి ఏ దోషము లేదని గట్టిగా చెప్పిరి. రాజు మిక్కిలి సంతసించెను.

ఇంతలో ఒకమూల నుండి ఒక సాధువుగారు లేచి నిలబడి అయ్యా మహారాజా! ఈ భవనమందు రెండు దోషములు కలవని చెప్పెను.

1) ఓ మహారాజా! ఈ భవనమును కట్టించెడివాడు ఏనాటికైనా చనిపోవును. ఇదియే మొదటి దోషము.

2) ఈ భవనము కాలగర్భమున ఏనాటికైనా శిధిలమైపోవును. ఇదియే రెండవ దోషము.

ఆ వాక్యములను వినగానే రాజుకు కనువిప్పు కలిగెను. వైరాగ్య ముదయించెను. అయ్యో! మృత్యువును మరచి, ప్రాపంచిక వైభవములనే నమ్మి పంచభూతాత్మకములగు ఈ జడపదార్థములను, బంధుజాలమును, బృత్యులను గొప్పగా తలంచి అజ్ఞానమునయుంటిని – అని తలపోయుచు సభను విరమింపజేసి ఏకాంత ప్రదేశమునకేగి శేశించిన జీవితమును భగవధ్యానమున గడిపెను.

కాబట్టి దృష్యపదార్థములన్నింటియందును – అవి ఎంతటి మహిమాతిశయముతో కూడుకొని యున్నప్పటికిని – వినాశము, మృత్యువు అను దోషములుండనే యున్నవి. నశించు పదార్థములయందున్న సౌందర్యమేపాటిది? నాశశీలమగు వస్తువు ఎంతటి ఆనందము నొసగ గలదు. ఒకవేళ యొసంగినను అది ఎంత పర్యంతముండగలదు. అనుభవించు వ్యక్తి – అనుభవింపబడు పదార్థము కొంతకాలమునకు శైధిల్యమునే పొందుచుండ ఇంక వాని సంయోగము వలన కలుగు సుఖము ఎంత చంచలమైనదో, ఎంత క్షణికమైనదో యోచించుకొనుడు మరియు అట్టి తుచ్ఛమైన సుఖములకై పరిగిడు మనుజుడెంతటి విజ్ఞానమూర్తియో

ఊహించుకొనుడు. ఈ విధముగా దృష్య పదార్థముల యందలి దోషములను చక్కగా విచారించి పూర్వమున ఉద్దాలకాది మహర్షులు, జనక, బలి, ప్రహ్లాద రాజ్య శ్రేష్టులు పరమాత్మ నాశ్రయించుట ద్వారా పరమోన్నతిని పొందియుండిరి.

ఇంతవరకును మనస్సును బయటకు పరుగెత్తకుండుటకు చేయవలసిన వైరాగ్యాది సాధన సంపత్తిని గూర్చి విచారించియుంటిమి.

**కాని అంతమాత్రముతో పని పూర్తి కాలేదు.**

బాహ్యము నుండి మరల్చిన మనస్సును అంతర్ముఖము చేయునట్టి పనిని ఇంకయు మిగిలియున్నది.

**అసలు ప్రధానమైన పని ఇదియే**

ఏలయనిన ఒకవేళ మనస్సు బహిర్ముఖము కాకుండినను ఊరక తమస్సు నందు పడియున్నచో నేమి ప్రయోజనము? ఆ విరక్తి చిత్తమును ఆత్మధ్యానము నందు ప్రవేశింపచేయవలెను.

అపుడే జీవుని కర్తవ్యము కాగలదు. పూర్తి కాగలదు. జన్మసార్ధకము కాగలదు. కావున

**విషయ విరక్తి**

**ఆత్మాసక్తి**

రెండును అవసరములే. ఇందు మొదటిది అభ్యాస వైరాగ్యముల వలన రెండవది ధ్యానము వలన సిద్ధించును.

ఒక వస్తువును గూర్చి తదేక నిష్టతో ధ్యానించినపుడు ద్యాతయొక్క చిత్తమంతయు ద్యేయాకారముగా పరిణమించిపోవును. దీనినే

**భ్రమర కీటక న్యాయమందురు.**

చిత్తము ఒక అద్దము వంటిది. అద్దము తన పురోభాగమున ఏదియుండునో దానిని తనయందు ప్రతిబింబించుకొని తద్రూపమును పొందుచుండును. అట్లే చిత్తమున్ను. అసుర సంపత్తి, దయ్యపు స్వభావము దాని ముందుంచిన చిత్తము ఆ అసుర రూపమునే పొందును.

దైవసంపత్తి సత్వగుణ స్వభావము దాని ముందుంచిన చిత్తమా సత్వరూపమునే పొందును.

కావున పారమార్థిక శ్రేయస్సుకొరకై నిత్యశుద్ధ బుద్ధముక్తిమగు హృదయము పరమాత్మనే ధ్యానించుచు అద్దానియందే ప్రతిష్టింప చేయవలయునని భగవానుడు పలికెను. కావున అట్టి దానినెట్లు శీలించ వలయునో ఇపుడు తెలుసుకొందము.




**శుచౌ దేశే :**

గృహమునందు కాని మఠమునందు కాని ధ్యానించుట కొకచోటు ఎన్నుకొని దానిని పవిత్రముగ ఉంచవలయును. అంతఃకరణ శుద్ధియే ముఖ్యము కాని – తక్కిన దానితో మనకేమి పని యని తలంచక బాహ్య పరిసరములున్ను శుద్ధముగా యుండునట్లు చూడవలయును.

మలిన ప్రదేశములందుండువారికి మలిన సంకల్పములే ఉదయించును.

కనుకనే ధ్యాన పద్ధతిని చెప్పుటకు ముందు భగవానుడు శుచౌ దేశే అని సెలవిచ్చెను. ఇల్లు కాని, వనము కాని, మఠము కాని, పర్వత గుహకాని ఏదియైనను సరియో ధ్యానమునకు యోగ్యమే అని తెలియు చున్నది. అట్లు కానిచో భగవానుడు మఠె, ఆకాశే, పాతాలే అని చెప్పి యుండెడివాడు కాని అట్లు చెప్పలేదు.

కాబట్టి గృహస్థాశ్రమము నందున్నవారు ఇండ్లలో ధ్యానము జరుగునా? అని సందేహింపక ఇంటిలో ఒక గదిని ప్రత్యేకముగా పూజార్చనా ధ్యానాధులకై నియమించి భగవంతుడు తెల్పినట్లు దానిని శుచిగా యుంచుకొనవలయును. దానిని గోమయముతో అలికి, ముగ్గులు పెట్టి, అగురుబత్తి, సాంబ్రాణి మొదలగు సుగంధ ద్రవ్యములను చేర్చుకొని, దీపారాధన గావించి అవతార పురుషులు, మహనీయుల పఠములతో నా ప్రదేశము నలంకరించి దేవమందిరముగా తయారుచేసుకొన వలయును. చంటిపిల్లలను లోనికి రానీయకూడదు.

పశువికారము కలుగజేయు శృంగార పటములను దేనిని అచట చేర్చరాదు.

కాబట్టి సాధకుడు తన పరిసరములను పునీతమొనర్చుకొని క్రమముగా ధ్యానము అభ్యసించవలయును.

**ఏకాంతము :**

ధ్యానము చేయునపుడు సాధ్యమైనంత వరకు ఒంటరిగా యుండుటయే మంచిది. సామాన్యముగ ఇద్దరు ముగ్గురు కలిసి ధ్యానము ప్రారంభించినచో వాడేమి చేయుచున్నాడోయని వీనికి, వీడేమి చేయుచున్నాడోయని వానికి "విక్షేప" దోషము కలుగును. ఏక్ నిరంజన్, దొ గడబిడ అని అందరికి తెలిసినదే. కనుకనే గీతాచార్యుడు రహస స్థితః అని హితవు పలికినాడు.

కొందరు సంధ్యావందనము చేయునప్పుడు బహిరంగ స్థలము నందు కూర్చొనుచుందురు. తాను భక్తుడనని నలుగురికి తెలుపవలెనని వారి ఉభలాటము. ఇట్టి Exibitionism ధ్యానతకు ఉండరాదు.

తాను ధ్యానించుట ఆరంభించాడని ప్రతికలలో పడవలసిన అగత్యమున్ను లేదు. మన హృదయసాక్షియైన సర్వేశ్వరునికి తెలిసిన చాలును. అతనికి మనము ఏ మూల ధ్యానించినను తెలిసికొను శక్తి ఉండనే ఉన్నది. కాబట్టి ఏకాంత ధ్యానము శ్రేయస్కరము. మిక్కిలి ఎత్తుగాను, మిక్కిలి పల్లముగా గాను లేనట్టి దర్భాసనము పరుచుకొని వానిపై జింకచర్మము గాని, పులిచర్మముగాని వేసుకొని దానిపై గుడ్డ పరిచి, మెత్తగా కదలక యుండ ఆ స్తరణముపై అనుకూలమైన ఆసనము వేసికొని కూర్చుండవలయును. తదుపరి ధ్యానము ప్రారంభింపవలయును.

అయితే కూర్చొననపుడు మాత్రము శరీరము, కంఠము, శిరస్సుప ఏమాత్రము వంగకుండ నిటారుగా యుండవలయును. ఏలయనిన బొడ్డుక్రింద మూలధారాచక్రము నందు కుండలిని శక్తి నిద్రించుచుండును. అత్తరి శరీరావయువములు నిటారుగా యున్నచో ప్రవాహము నిరాటంకముగా జరుగును. వంకరగా యున్నచో ప్రతిబంధకము కలుగవచ్చును.

ఈ ప్రకారముగా కూర్చొని, దృష్టిని నాసికాగ్రము నందు నిలిపి (భ్రూమధ్యమున, హృదయమున, సహస్రారమున గాని) నిలిపి దిక్కులు చూడక మనస్సును ఏకాగ్ర పరచి ధ్యానము ప్రారంభింపవలయును.

**హితేవాక్యే :**

కాని ప్రారంభదశలో మనస్సు ధ్యేయవస్తువగు పరమాత్మ యందు నిలవక పూర్వ వాసనాబలముచే బయటకు పరిగెత్తుచుండును. పాపము వారికి ధ్యానము చేయవలెనని యుండును కాని మనస్సే చంచలమై

వేధించుచుండును. లక్ష్యమందు నిలవక పారిపోవు చుండును. అప్పుడు సాధకుడేమి చేయవలయును.

శ్రీకృష్ణపరమాత్మ ఇట్లు సమాధానమిచ్చుచున్నాడు.

మనస్సు చంచలముగను, అస్థిరముగయున్నదై ఏయే విషయముల పైకి పరిగెత్తునో ఆయా విషయముల నుండి దృష్టి మరల్చి దానికి బుద్ధి చెప్పి మరల ఆత్మయందే యుంచవలయును.

**"లాలయేత్ చిత్త బాలకమ్"**

అనునట్లు చిత్తమను బాలకుని హితవాక్యములచే మెల్లగా లాలించి దారికి తీసుకొని రావలెను. కాని బలాత్కారము చేసినచో అయ్యది తిరగబడు అవకాశము కలదు. అట్టి మోటు పద్ధతిని ధ్యాననిష్టుడైన సాధకుడు అవలంభింపకూడదు.

సాధకుడు తన ఇంద్రియములకు, మనస్సునకు ఎంత వినయముగా చెప్పి స్వాధీనపరుచుకొనవలెనో ఉద్దాలకుడీ విధమున వర్ణించినాడు.

ఓ మనసా! ఓ ఇంద్రియములారా! మీరెచ్చటకు పరిగెత్తెదరు విషయములపైకా? చాలా పొరపాటు అయితే అది మీ తప్పుకాదు. అనేక జన్మార్జితములగు ప్రాపంచిక వాసనలచే మీకట్టి బుద్ధి కలిగినది. ఇంతకాలము వరకు మిమ్ములను ప్రేరిపించక మా బుద్ధి అవిద్యావృతమై అంధకారమున బడియున్నది. ఇప్పుడు సద్గురు కటాక్షమున జ్ఞానముదయింప అవిద్య అంతరించినది. వస్తువు యొక్క పదార్థ తత్వము గోచరించినది.

మీరంతగా అభిలాషించుచున్న పదార్థములు సత్యములు కావు. ఎల్లప్పుడుండునవి కావు. ఆనంద జనకములెన్నటికి కావు. క్షణిక పదార్థము ఆనందమెట్లు కలుగజేయగలదు? నాశశీలమగు వస్తువు నుండి నిరతిశయ

సుఖమెట్లు ఆవిర్భవింపగలదు. ఒకవేల ఆ పదార్థములు రమణీయములుగా ఉన్నావని యందురా? అది అపాతరమణీయత్వమే. కాని వాస్తవ సౌందర్యము కాదు.

పంచభూతాత్మకమై కాలక్రమమున నశించు పదార్థములయందు ఎట్టి రమణీయత్వముండునో మీరే యోచించుకొనుడు. బంగారు లేడిని చూచి సీత మోసపోయినది. ఫలితముగా శ్రీరామచంద్రునే పోగొట్టుకొనినది. కావున మీరున్ను ప్రపంచ తళుకు బెలుకులను చూసి వాటి వెంట పరిగెడితిరా మోకాటి దెబ్బలు తప్పవు.

మీ జన్మహక్కగు ఆత్మానందము అనుభవించుటకై సన్నద్ధులు కండు. దానికొరకై దూరముగ పరిగిడవలసిన అవసరము లేదు. అది మీచెంతనే యున్నది. బహిః ప్రవృత్తిని వదలి అంతర్ముఖులు కండు, మీకది కరతళామలకమై పోవును. మీ జన్మసార్థకమగును.

**కావున ఓ ఇంద్రియములారా! ఓ మనస్సా! అనేక జన్మలయందు బాధపడినది చాలును. ఇప్పటికైనను బుద్ధి తెచ్చుకొని చెంపలు వాయించుకొని భగవంతుని ఆదేశమును పాటింపుడు.**

జీవితము అత్యల్పమైనది. మృత్యువు శరీరమును కబలించుటకు పూర్వమే మీ లక్ష్యమగు పరమాత్మను చేరుకొనుడు. అన్ని విషయముల నుండి మరల్చి మనస్సును ఆత్మయందు స్థాపితము చేయవలయును.

ఇంత బోధించినను మనస్సు ఒప్పుకొన్నట్లే ఒప్పుకొని మరల తటాలున పోవును. సాధకుడు మరల దానిని పట్టితెచ్చి ఆత్మయందు చేర్చవలయును.

**ఇట్లు కొంతకాలము చేయగా చేయగా మనస్సు పాతదారులను వదిలిపెట్టి స్వాధీన పడగలదు.**

పూర్వము రామకృష్ణ పరమహంసను ఒక భక్తుడు సమీపించి అయ్యా! నా మనస్సు ధ్యానకాలములో నిశ్చలముగా యుండుటలేదు. ఏదైనా ఉపాయము సెలవిడు అని ప్రార్థింప అతడిట్లనియె–

మీ ఇంటికి ఒకరోజున ఒక కుక్క వచ్చినది అనుకొనుడు. అది చూచుటకు బాగుగా యున్నదని తలచి పిడికెడు అన్నము పెట్టినచో అది యేమి చేయును? తిని వెళ్ళి మరుసటిరోజు మరల వచ్చును. మరల ఒక పిడికెడు అన్నము పెట్టినచో; ఇక ప్రతిరోజును మీ ఇంటికి వచ్చుచుండును. ఈ ప్రకారము కొన్ని సంవత్సరములు దానిని మేపినచో అది అలవాటుపడి ఇక మీ ఇల్లు వదలనే వదలదు. కొట్టినను తిట్టినను సరికదా పోదు. దానిని వదలించుకోవలెననిన అపుడు మీరేమి చేయవలయును. ఇవ్విధముగా దానికి అన్నము పెట్టకుండ కొన్నిరోజులు వరుసగా దానిని దండించుట మొదలుపెట్టినచో అది చూచి చూచి విసుగెత్తి మరల రాకుండును.

ఆ ప్రకారముగనే అనేక జన్మల నుండి మనస్సునకు దృష్య పదార్థముల యందు మేపు లభించుచుండెను. అది అడిగినది అంతయు ఇచ్చుచుంటిమి. కోరినదంతయు కిక్కురుమనకుండ సమకూర్చుచుంటిమి. ఇవ్విధముగా శబ్ద స్పర్శాది విషయభోగములను అది బాగా తినమరిగినది. ఇకనది చెప్పిన మాట వినునా? ధ్యానమందు నిశ్చలముగ యుండమని హితవు చెప్పిన అది పాటించునా? పాటించదు. తనకు అలవాటుపడిన త్రిభువన సంసారమునే ఆశ్రయించును. ప్రాపంచిక భోగ్య వస్తువులపైననే వ్రాలుచుండును. అప్పుడేమి చేయవలయును. కుక్కబెడద తప్పించు కొనుటకు ఏమి చేసితిమో అదియె చేయవలయును. మనస్సు విషయముపై వ్రాలినపుడు దానికి ఆ విషయాహార మొసంగక, భోగముననుభవింప చేయక, వివేకమను కఱ్ఱ చేబూని ఆటనుండి తరిమివేయవలయును. అట్లు

తరిమినను పూర్వాభ్యాసమున అది మరల మరల పోవుచునే యుండును. కాని మరల మరల గెంటివేసితిమేని, కాలక్రమమున, **అభ్యాసము** చేత అచ్చోటికి వెడలకుండును.

**అప్పుడు అది స్వస్థానమగు ఆత్మయందు నిలకడ కలిగియుండును.**

అత్తరి పరమాత్మ ధ్యానము చక్కగా కుదురును.

ఇవ్విధముగా ఇంద్రియములకు హితము చెప్పవలెనన్న బుద్ధి ఎంతయో తీక్షనముగ యుండవలయును ధైర్యముతో కూడిన బుద్ధితో మనస్సును ఆత్మయందుంచవలయును.

అధైర్యమునకు, పిరికితనమునకు ఆధ్యాత్మరంగమున తావులేదు. ప్రకృతిని, అవిద్యను జయించుట సామాన్యమైన పని కాదు.

Muscles of Iron, Nerves of steel, and Digenetic Wills required to reach the destination.

ఇనుప కండరములు, ఉక్కు నరములు, గంభీర బుద్ధులు అవసరములైయున్నవి. ఉపనిషత్తులన్నియు ఇవియే ఘోషించుచున్నవి.

ఆత్మ బలహీనునిచే పొందబడదని ముండకోపనిషత్తు తెలిపినది.

ఒకానొక ధీరుడు మాత్రమే దృష్టిని అంతర్ముఖముగా మరల్చి ప్రత్యగాత్మను పొందుచున్నాడని కఠ ఉపనిషత్తు తెలుపుచున్నది. ధైర్యమును చేబట్టినచో మాయను తరిమికొట్టవచ్చును. ధైర్యమొకింత సడలినచో మాయ మనలను తరిమికొట్టును ఇదియె ఇచటగల రహస్యము.

ఒక పిల్లవానిని ఒక కోతి తరుముచుండెను. వాడు పారిపోవుచుండ ఒక పెద్దమనిషి నాయనా పారిపోవద్దు. వెన్ను చూపినచో అది నిన్ను మరింత తరుమును. దానిని ఎదుర్కొనుము. అప్పుడదియె తోక ముడుచుకొని పారిపోవును.

ప్రకృతితో మనము చేయుచున్న సంగ్రామము కూడా ఇదియే. ధైర్యము, నిర్భయత్వము, నిర్విచారత్వము ఇదియె పరమాత్మ రంగమున మూలమంత్రములు. ఇవి కలవానికే అట దారి దొరుకును. తక్కిన వారికి దొరకదు.

కావున భగవానుడు తెలిపినట్లు ధైర్యమునవలంభించి మనస్సును మెల్లిమెల్లగా స్వాధీనపరచుకొనవలయును. తొందరపడకూడదు. కంగారు పడకూడదు. కంగారు పడువాడు తన కర్తవ్యమును గూడా మరచిపోగలడు.

ఉరిత్రాటిని నెమ్మదిగా ఊడతీసుకొనవలయును. తొందరపడినచో ఉచ్చు ఇంకను బిగిసి ప్రాణాంతకముగ పరిణమించగలదు. కనుకనే గీతాచార్యుడు సాధకుని ఉద్దేశించి **శనైః శనైః** (మెల్లమెల్లగా) అని ఉపదేశించెను.

కొందరు తీవ్ర వైరాగ్యము చేత ప్రేరేపితులై అంతయును వదిలిపెట్టి ఒక్క పర్యాయము అమాంతముగా మోక్షమునకు గంతువేయవలెనని తలచి, తుదకు తన మనస్సును జయింపలేక దేహమును మాత్రము క్షోభపెట్టి ఉభయ భ్రష్టత్వము పొందుచున్నాడు.

## ఆహారము - నిద్ర :

అధికముగా తినకూడదు. తిండి లేకుండను ఉండరాదు. అధికముగ నిద్రించరాదు. నిద్రలేకుండను ఉండరాదు. ఇవ్విధముగా మధ్య మార్గము నవలంభించవలయునని **గీతాచార్యుని అభిప్రాయము**.

కడుపు మొత్తము నాలుగు భాగములుగ చేసినచో అందు రెండు భాగములు అన్నశాఖాదులతో నింపవలయును. ఒక భాగము నీటితో నింపవలయును. మిగతా పాతిక భాగము గాలియాడుట కొరకు ఖాలీగా ఉంచవలయును.

శాస్త్రములీవిధముగ సెలవిచ్చుచుండ మూడు భాగములు కాదు. నాలుగు భాగములు కూడ అన్నముతో నింపి నీళ్లు త్రాగుటకు చోటులేక

గాలి ఆడుటకు అసలే లేక త్రేపువచ్చినచో కొంత కాళీగాకాగా దానిని కూడా ఒకటిరెండు చిల్లు గారెలతో తిరిగి నింపుటకు ప్రయత్నము చేయుదురు.

ఇట్టివారికి ఎన్ని జన్మలకు ధ్యానమబ్బునో భగవంతునికే ఎరుక.

సాకార ధ్యానమందు మనుజులు తమ ఇష్టదైవముల యొక్క మూర్తిని మనస్సున నిలబెట్టి తద్రూపమునే చింత చేయుచు తచ్చరిత్రలనే భావన చేయుదురు.

నిరాకార ధ్యానమందు జనులు హృదయస్తమగు పరమాత్మను గూర్చి చింతన చేయుచు నిర్వికారత్వ, శుద్ధత్వ, నిరతిశయానందత్వములను భావించుచుందురు.

జీవుడు వాస్తవముగ ఆత్మస్వరూపుడే కనుక ఈ ప్రకారము ఆత్మ ధ్యానము లేక సాకార ధ్యానము చేయుచురాగా క్రమముగా మనస్సు అధిష్టానమందు లయింప తన సహజ స్వరూపమునే (ఆత్మ) జీవుడు పొందుచున్నాడు.

జనులకు తమ పుత్ర పౌత్రాదులను పోషించుట యందును, ప్రాపంచిక భాషల యందును, ధన ధాన్య భోగ యశస్సుల యందును ఎంత ప్రీతి కలదో దానిని గూర్చి ఎట్టి చింత గలదో అట్టి చింత శ్రీశ్రీనివాసుని యొక్క పాదారవిందములపై క్షణ కాలముండినచో ఇక యమధర్మరాజు యొక్క భీషణ గృహద్వారమున ప్రవేశింప వలసిన అగత్యముండదు.

కావున శ్రీశ్రీనివాసుని నామస్మరణముతో బాటు ఆయన బోధించిన ధర్మమును ఆచరణలో పెట్టుటయు, శ్రీశ్రీనివాసుని రూపములే యగు సమస్త ప్రాణికోట్ల యెడల దయ కలిగి యుండుటయు ఆచరింపవలయును.

## భూతదయ :

పూర్వమొక గురువుండెడివాడు. అతనియొద్ద ఒక శిష్యుడుండెడివాడు. ఒకరోజున గురువుగారు శిష్యునకు గురుభక్తిని గూర్చి, గురుమహిమను గూర్చి విశేషముగ తెలిపెను.

మరుసటి రోజున ఆశ్రమ కార్యార్థమై గురువుగారు బయటకు పోయి మిట్టమధ్యాన్నమున తిరిగివచ్చెను. తలుపులు వేసి యుండగా ఒరే నాయనా! తలుపు తీయరా! అని గురువు కేకవేసెను. లోపల నుండి శిష్యుడు స్వామి అష్టోత్తర పూజయగుచున్నది. పూర్తిచేసి వచ్చెదను అనెను.

ఒరే! కాల్లు కాలుతున్నవి. త్వరగా రారా అని మరల గురువుగారు ప్రాధేయపడిరి. కాని శిష్యుడు– స్వామి పూజ మధ్యలో ఎట్లా లేచేది అనెను.

ఎవరి పూజరా నాయనా అని గురువుగారడిగిరి. తమరి పూజయే స్వామి అని శిష్యుడు అదే రీతిలో బదులు చెప్పి, ఎట్టకేలకు తలుపు తీసెను.

అప్పుడు గురువు విష్యుని చీవాట్లు పెట్టి గురువుకి ఎండగొట్టి గురుపూజ ఏలరా అని మందలించి గురు– **గురువాక్యములను పాలించుటయే నిజమైన గురుసేవ – గురుపూజ అని తెలిపిరి.**

**కేవలము పూజలు చేయుచు కర్మలయందు కఠినత్వము, స్వార్థచింతన కలిగియుండిన అంతయు నిష్ప్రయోజనమే.**

# XII.

ఆ ఆత్మ మాటల ద్వారా కన్నుల చేత మనస్సు చేత కూడా పొందడానికి సాధ్యపడేది కాదు. అది ఉన్నది అని చెప్పె వారినుండే దానిని పొందాలి. ఇతరత్రా దాన్ని పొందడం ఎలాగా? (అనగా పొందలేము).

**వివరణ:** మనకు జ్ఞానసాధనాలైన మనస్సుకు, ఇంద్రియాలకు, ఆ ఆత్మ అతీతమైనది అవడం చేత, ఆత్మ సాక్షాత్కారం పొందిన గురువు యొక్క ఉపదేశం ద్వారానే ఆత్మ లాభం కలుగుతుందని శృతి ఉద్ఘాటిస్తున్నది.

మొదట ఆత్మ అనేది ఒకటున్నదని చెప్పే గురువు మాటలలో శ్రద్ధా విశ్వాసాలు ఉంచి ఆయన ఉపదేశాలను పాటించి, ఆచరించాలి.

ఎంతగా తర్క వితర్కాలు హేతువాదాలు చేసినా నిర్వివాదంగా అతీంద్రియమైన ఆత్మ ఉనికిని నిర్ధారించి చెప్పలేము.

ఎల్లప్పుడు ఆత్మ ఉన్నదనే ప్రతీవాదము - సమానబలము కల లేదనే వాదన్ని ఎదుర్కొంటూనే ఉంటుంది.

అందుచేత వేదాంతులు తమ సిద్ధాంతాన్ని కేవలం తర్కం మీదనే కాక, శబ్దప్రమాణం మీదనే గాక - శృతులపైన అనుభవశీలురైన ఋషులు మాటలపైన - నిలబెట్టారు.

తన వేదాంత సూత్రాలలో వ్యాసుడు ఇలాంటి శుష్క వేదాంత చర్చను కేవలం తర్కం తత్వనిర్ణయం చేయరాదంటూ కొట్టిపడేశాడు. అందుచేత ఆత్మ సాక్షాత్కారానికి ప్రథమ సోపానపటం ఏమంటే స్వయంగా ఆత్మసాక్షాత్కారం పొందిన గురువులలో విశ్వాసము.

## XIII.

ఈ రెంటిలో సత్తయే అసలు తత్వంగా సాక్షాత్కారం చేసుకోవాలి. అలా సత్తను సాక్షాత్కరించుకొన్నవారికే అసలు తత్వం ప్రత్యక్షమవుతుంది.

ఆత్మయొక్క నిజరూపాన్ని సాక్షాత్కరించుకోవడానికి మొట్టమొదట కావలసినది శ్రద్ధ - గురుపదేశం వలన ఈ శ్రద్ధ క్రమంగా ఆ స్వయం స్ఫూర్తి ద్వారా ఆత్మయొక్క ఉనికిని తెలియబరుస్తుంది. ఆపైన ఆత్మయొక్క

సత్తను గూర్చి సరియైన ధ్యానం ద్వారా దాని నిజరూపం తుదకు వెల్లడవుతుంది.

ఈ రెండు సాక్షాత్కారాలకు భేదమేమంటే మొదటిది స్వయం స్ఫూర్తి ద్వారా (సాత్విక బుద్ధి) ఆత్మయొక్క సగుణ రూపాన్ని తెలియజేస్తుంది.

రెండవ దాంట్లో ఆత్మ స్వయంగా తన నిర్గుణ స్వరూపాన్ని వెల్లడిస్తుంది.

## XIV & XV.

హృదయంలో ఉన్న సకల వాంఛలు నిర్మూలించబడినప్పుడు మరణశీలియైన మానవుడు అమరుడవుతాడు.

ఇక్కడ ఈ శరీరం ఉండగానే హృదయగ్రంధులన్నీ ఛేదింప బడతాయో అప్పుడు మర్త్యుడు అమరుడవుతాడు.

ఇంతవరకు సకల వేదాంతపు ఉపదేశ సారము.

తాబేలు తన అవయవములనన్నిటిని లోనికి ముడుచుకొన్నట్లు విషయములపై వ్యాపించి యున్న ఇంద్రియములను అచ్చట నుండి మరల్చి స్వస్థానమగు హృదయమున చేర్చవలెను. దీనినే ప్రత్యాహారమందురు. ఇంద్రియముల యొక్క శబ్ద స్పర్శాదులపై గల మక్కువను విచారణచే రహితమొనర్చి నిగ్రహింపవలయును.

ఎవరు తన ఇంద్రియములను నిగ్రహించుకొందురో అట్టివారి యొక్క ప్రజ్ఞ, ధ్యానము స్థిరముగా యుండును. ఎంతటి భౌతిక శక్తులు, విద్యా వైదుష్యము కలిగియున్నప్పటికి తన ఇంద్రియములు తనకు లోబడక యున్నచో అతడు బానిసేయగును. రాజ్యాధిపతియై యున్నను సేవకునివలె అస్వతంత్రేడే యగును.

వాసనారహితుడు కానివాడు, ఇంద్రియ నిగ్రహము లేనివాడు సర్వశక్తులు కలిగియున్నను, సర్వజ్ఞుడైనను పంజరములోని పక్షివలె నలువైపుల బంధింపబడియున్నవాడే అగునని వశిష్టులు శ్రీరామచంద్రున కుపదేశించెను.

ఈ ప్రపంచమున ఎచ్చట వెతికినను పంచభూతములు తప్ప అన్యమేమియు కానరాదు కదా!

పాతాల లోకములో గాని, భూలోకములో గాని, ఎల్లెడల భూమి, జలము, మొదలగు పంచభూతములే కాని ఆరవ వస్తువులేదు, అట్టిచో ప్రజ్ఞావంతుడు వాని ఎడల ఏల ఆసక్తి కలిగియుండవలయును? అని వశిష్ట వచనము.

ఈనాడు రమణీయముగాయున్న పుష్పమాల రేపటికి వాడిపోవు చున్నది. ఎల్లుండికి కృళ్ళిపోవుచున్నది. నేడు ఎంతయో ఆకర్షణీయముగా యున్న భోజనము రేపటికి పాచిపోవుచున్నది. ఈనాడు మహా సుందరముగా యున్నట్టి స్త్రీయొక్క, పురుషునియొక్క శరీరము నలుబది యేండ్ల తరువాత ముడుతలు పడి కృషించిపోవుచున్నది. ఇట్లు ప్రపంచములోని ప్రతీ పదార్థమున్ను కొంతకాలమునకు పూర్తిగా మారిపోవుచున్నది. ఈ ప్రకారముగా దృశ్యమంతయు పరిణామశీలమైయున్నది.

ఇట్టి చంచల పదార్థమును నమ్మి వానినుండి ఆనందమును అభిలాషించువారును చివరకు ఆశాభంగము పొందగలరు, పొందుచున్నారు కూడా. ఏలయనిన నశ్వరమగు వస్తువుల నుండి కలుగు సుఖమున్ను నశ్వరముగనే యుండును. చపల వస్తువుల నుండి కలుగు ఆనందమున్ను చపలముగనే యుండును. ఈ ప్రకారముగ వస్తువులోగల దృశ్యమంతయు విచారించినచో ఇక ఇంద్రియములు వానిపైబడి పరిగెత్తవని శ్రీ గీతాచార్యుడు అర్జునునకు బోధించుచున్నాడు.

పూర్వమొక రేవు పట్టణములో సముద్ర తీరమందు అనేక నావలు లంగరు వేసి నిలకడగా యుండెను. అందొక నావయొక్క తెరచాప యొక్క కొనపై ఒక కాకి వచ్చి వ్రాలెను. అది యేదియో ఒక ఆలోచనలో నుండి కదలక యుండెను. ఇంతలో నావ సముద్రములోనికి బయలుదేరెను. వేగముగా కొన్ని మైళ్ళు పోయెను. కాకి మాత్రము టెక్కముపైననే యుండెను. తీర, నావ సముద్ర మధ్యమునకు బోవ కాకి ఎగిరిపోయెను. కాని ఎంత దూరము ఎగిరినను ఎక్కడను చెట్టుగాని, పుట్టగాని, నేలగాని లేనందుచేతను, చుట్టును జలమయమై యుండుటచేతను విహ్వలచిత్తయై మరల మరల ఆ టెక్కముపైననే వ్రాలుచుండెను. ఈ ప్రకారముగ ఎన్ని పర్యాయములు ఎగిరినను ఆధారము లేకుండుట వలన తిరిగి తిరిగి ఆ కట్టనే ఆశ్రయించు చుండెను. అదే ప్రకారముగ బాహ్యవస్తువుల యందలి దోషములను మరల మరల విచారించుట ద్వారా, ఇంద్రియములకచట ఆశ్రయము లేకుండా చేసినచో మనస్సు, ఇంద్రియములు, తప్పక వెనుతిరిగి తమ స్వస్థానమగు ఆత్మను ఆశ్రయించగలవు. ఇంద్రియ నిగ్రహమునకిదియే సరియైన ఉపాయము. దీనినే **నౌకాగ్ర కాక న్యాయమని** యందురు. జనకుడు, ఉద్దాలకుడు మొదలగు మహానుభావులు ఈ విధముగా తత్త్వవిచారణ జరిపి ఇంద్రియ జయమును పొందగలిగిరి.

వాసనాక్షయము, తత్వజ్ఞానమను రెండును పరస్పర మొకదానిచే నొకటి పోషింపబడుచుండును. తత్వజ్ఞానము యొక్క సహాయముచే వాసనలు సన్నగిల్లుచుండును. వాసనలు క్షీణించినకొలది తత్వజ్ఞానము వికాసము నొందుచుండును. కావున రెంటిని ఏకకాలమందు అభ్యాసము చేయవలయును.

ఇట్టి బ్రాహ్మీస్థితిని అంత్యకాలము వరకును కాపాడుకొనుచునే యుండవలయును. ఏలయనిని మాయ బలీనమైనది. అది ఓడిపోయినట్లు

నటించి అమాంతముగా నొక సమయమున విరుచుకపడును. అది నివురు కప్పిన నిప్పువలె యుండును. సాధకుడు బహు జాగ్రత్తగా యుండ వలయును.

ఈ బ్రహ్మీస్థితిని అంత్యకాలము వరకు కూడా ఎవరు కలిగి యుందురో అట్టివారు నిర్వాణరూపకమగు మోక్షమును పొందుదురు.

పూర్వము మహ్మదీయులలో అహ్మదు అను మత గురువుండెను. అతనికి అనేకమంది శిష్యులు కలరు. జీవితకాలమందు పెక్కు సాధనలు చేసిన మహాత్ముడాతడు. ఇట్లుండ ఒకప్పుడు అతనికి అంత్యకాలము సమీపించినది. కన్నులు మూతబడపోవుచుండెను. పడక చుట్టును చేరి శిష్యులు సపర్యలు చేయసాగిరి. ఆ సమయమున గురువుగారి నోటినుండి ఏదియో ఒక శబ్దము వచ్చుచున్నట్లనిపించెను. బాగుగా ఆలకింప– అంది "అభీ నహీ" అనగా ఇప్పుడే కాదు అను పదములు వినిపించెను.

శిష్యులు దాని అర్థమేమని అడుగగా, భక్తులారా నాకు అంత్యకాలము సమీపించినది కదాని తెలుసుకొని సైతాను (మాయ) నా దగ్గరకు వచ్చి అయ్యా! నేను ఇంతవరకును అనేక మందిని వారి జీవితములో ఏదో ఒక సమయములో బుట్టలో వేచితిని. నీవొక్కడవే నా బుట్టలో పడక తప్పించుకొంటివి. ఓహో ఎంత గట్టివాడవయ్యా అని పలుకగా నేను అభీ నహీ అని బదులిచ్చితిని.

అనగా నేను నిన్నింక జయించినట్లు చెప్పుకోలేదు. ఏలయనిన ఇంకను ఒకటి రెండు శ్వాసలు బాకీయున్నవి. ఈ లోపల నేను అజాగ్రత్తగా యున్నచో తక్షణమే నీవు నన్ను మోసగించగలవు. నిన్ను నమ్మరాదు అని దానితో చెప్పితిని అని పలికి గురువు నిర్వాణము పొందెను. **కావున సాదకుడు చివర వరకు కూడా జాగ్రత్తగా యుండవలయును.**

శంకరులవారు ఈ సందర్భమున ఈ విధముగా చెప్పెను.

మేడ మెట్లలోని పైఎట్టుపై బంతి పడినది. ఒక్క మెట్టు జారినది అంతమాత్రమే అనుకొనుటకు వీలులేదు. ఏలయనిన ఆ బంతి అచట నుండి ఇంకొక మెట్టు జారును. అట్లే క్రమక్రమముగా జారి తుట్టతుదకు ఆ క్రింది మెట్టుకు వచ్చును. ఇవ్విధముననే పరమాత్మ రూపలక్ష్యము నుండి మనస్సు ఒకింత బహిర్ముఖమైనచో క్రమక్రమముగా అది ఆత్మస్థితి నుండి దిగజారిపోవును.

**కావున లక్ష్యము నుండి మనస్సును మరల్చరాదు అని శంకరులు హెచ్చరించిరి.**

పిల్లలు ఇండ్లలో పరమపదసోపానపటము అను ఆటను గవ్వలతో ఆడుచుందురు కదా! అందులో కొన్ని నిచ్చెనలు, కొన్ని పాములుండును. నిచ్చెన వచ్చినప్పుడు పైకి ఎక్కును. పాము వచ్చినప్పుడు క్రిందకు పోవును. ఎంతయో ప్రయాసపడి ఒకడు నిచ్చెన్లు ఎక్కిఎక్కి 99వ స్థానమునకు వచ్చెను. 100వ స్థానమున పాము కలదు. అమాంతముగా దాని నోటిలోబడి 1వ స్థానమునకు వచ్చి చేరెను. అట్లే యుండును చివరి కాలములో సాధనయందు అజాగ్రత్తగా యుండువారి స్థితి.

అందుచేతనే శ్రీకృష్ణ పరమాత్మ అంత్యకాలము వరకును జాగ్రత్తగా యుండవలెనని సాధకులను హెచ్చరించినాడు.

ఈ దేహము, పుత్ర మిత్ర సతీ సుతులు, సేవకులు, గుఱ్ఱములు, ఎద్దులు మున్నగువన్నియు నాయొక్క సుఖములకు సాధనములనియు తలంచి ఈ మాంసమీమాంసయందే తన అమూల్యమైన మానవ జీవితమును భ్రష్టమొనర్చుచున్నాడు. అజ్ఞానుల ప్రవృత్తులు ఈ లోకము నందెట్లున్నవనగా

1) దాన ధర్మము లొసంగక లోబి డబ్బును కూడబెట్టుచున్నాడు.
**- వానిని జూచి డబ్బు నవ్వుచున్నది.**

2) ఇది నా భూమి యని మనుజుడు గొప్ప చెప్పుకొనుచున్నాడు.
**- వానిని జూచి భూమి నవ్వినది.**

3) దృష్య విషయములపై వ్యామోహము కలిగి మనుజుడు వాని వెంట పరిగిడుచున్నాడు.
**- వానిని జూచి ఇంద్రియములు నవ్వుచున్నవి.**

4) మరణ రహితమగు పరమాత్ముని సేవింపక దేహమే తానని మానవుడు మురిసిపోవుచున్నాడు.
**- వానిని జూచి మృత్యువు నవ్వుచున్నాడు.**

జీవుడనేక జన్మలయందు తిరుగాడి పుణ్యపరిపాకముచే ఒకానొక జన్మమందు మానవుడై పుట్టి సద్గురు కటాక్షమును బడసి గురుపదేశము చేత, ఏ కాలమందును బద్ధుడు కానని, తాను నిత్య శుద్ధబద్ధుమగు ఆత్మయే యని ఎరుగగల్గును.

తక్షణమే అజ్ఞానగ్రంధి విచ్ఛిన్నమై సర్వసంశయములు పటాపంచలై పోగా కర్మబంధనము నిర్మూలనము అగును. ఇదియే కైవల్యము, నిర్వాణము. ఇట్టి స్థితియందు మానవునకు కలుగు ఆనందము వర్ణనాతీతము.

ఆత్మసాక్షాత్కారమగు అట్టి దివ్యానుభూతియే ప్రతీ జీవి యొక్క పరమలక్ష్యము.

అట్టి లక్ష్యమును కార్యాన్వితమొనర్చుటకే పవిత్రమగు మానవజన్మ ఏర్పడినది.

దానిని తెలుసుకొనుటకు మొట్టమొదట అనుభవజ్ఞులగు మహాత్ములను వినయవిధేయతలతో సమీపించి, వారికి సాష్టాంగ ప్రణామ

మాచరించి, వారికి సేవాశు(శ్రూశలు గావించి భక్తితో వారిని ప్రశ్నించి పరమార్థ విషయములను తెలుసుకొనవలయును.

అట్లు సవినయముగా ప్రశ్నించిన మీదట మహాత్ములు వారికి తత్వమును బోధించెదరు. దానిచే అతని అజ్ఞానము శమించిపోగలదు. అతనిలోని దివ్యశక్తి వికసింపగలదు.

ఈ శరీరముండగనే రాగద్వేషాదులను జయించినవాడే యోగి అనబడునని శ్రీ గీతాచార్యుడు వచించెను. అవి ఈ విధముగా యున్నవి.

| | |
|---|---|
| **రాగము** | **మదము** |
| **ద్వేషము** | **మత్సరము** |
| **కామము** | **ఈర్ష్య** |
| **క్రోధము** | **అసూయ** |
| **లోభము** | **డంబము** |
| **మోహము** | **దర్పము** |
| | **అహంకారము** |

**రాగము :** రాగమనగా పరస్త్రీ విషయమున కలిగెడు చిత్తవృత్తి. పుత్ర-మిత్ర-బాతృ బంధు సంసారముతో గూడ మడిసెను.

**ద్వేషము :** ఒకప్పుడు ఉపకారము చేయగా వానికి అపకారము చేయవలెననిడి ప్రవృత్తి.

**కామము :** ఇండ్లు, తోటలు, నాణ్యములు, ధాన్యములు, ధనములు, పశువులు, స్త్రీలు మొదలగునవి ఎక్కువగా సంపాదింపవలెననెడి ప్రవృత్తి.

**క్రోధము :** క్రోధమనగా తాను చేయుచున్నట్టి పనులకు విఘ్నము చేయువానిపై ఉగ్రముగా కలిగెడు ప్రవృత్తి.

**మోహము :** పుత్రకళత్ర ధనాదుల యందు మక్కుటపు ప్రేమ కలిగి యుక్తాయుక్తముల నెరుగని ప్రవృత్తి.

**మదము :** సకల సంపదలు కలిగి గర్వించి నేనేమి చేసినను చెల్లును అని ఆలోచన చేసెడి చిత్త ప్రవృత్తి.

**మత్సరము :** ఇతరులకు తనకంటె క్కువగు విద్యయు, ఐశ్వర్యము, చక్కదనము, భోగములు, యశస్సు, పరాక్రమమును చూచి యోర్వజాల కుండెడి ప్రవృత్తి.

**ఈర్ష్య :** నాకు వచ్చిన కష్టములు ఇతరులకు రావలెననెడి ప్రవృత్తి.

**అసూయ :** తనకు కల్గిన సుఖములు ఇతరులకు కలుగకూడవనెడి ప్రవృత్తి.

**డంభము :** తాను చేసిన పనులు పరులెరిగి మెచ్చవలెననెడి ప్రవృత్తి.

**దర్పము :** నేను సర్వ విభవముల యందును సమర్ధుడను. నాకు సాటి ఎవరు లేరనెడి ప్రవృత్తి.

**అహంకారము :** నేను పట్టిన పట్టును తుదముట్టింపక నట్టనడుమ విడిచిపెట్టువాడను కాను అని ఇతరులను వధియించు చిత్త ప్రవృత్తి.

**లోభము :** తనకు లభించిన పదార్థమును ఇతరులకు ఇవ్వకూడదను ప్రవృత్తి.

కాబట్టి ఇంద్రయములను గుఱ్ఱములయొక్క కళ్ళెమును, అర్జునిని వలె శ్రీకృష్ణపరమాత్మకు వశము చేసి కర్మలను గావించిన అవి బంధహేతువులు గాక మోక్షహేతువులే యగుచున్నవి.

## XVI.

హృదయానికి నూటొక్క నాడులున్నవి. వాటిలో ఒకటి మూర్ధ్వం వైపు వ్యాపించియున్నది. దాని ద్వారా పైకిపోయిన మానవుడు అమరత్వాన్ని పొందుతాడు. ఇతర నాడులు ఇతర విధాలుగా ఉత్క్రమణానికి దారి తీస్తవి.

**వివరణ :** వాటిలో ఒకటి : యోగులు చెప్పే సుషుమ్నా నాడి.

**మానవుడు అమరత్వాన్ని పొందుతాడు :**

నిర్గుణ సాక్షాత్కారం చేసుకోలేక సగుణ బ్రహ్మ సాక్షాత్కారాన్ని పొందినవారు సుషుమ్నా మార్గం ద్వారా సూర్యమండలానికి పోయి అక్కడ నుండి వివిధ లోకాలకు పోయి చివరకు బ్రహ్మలోకాన్ని చేరి కల్పాంతం వరకు అక్కడే ఉండి అపుడు బ్రహ్మతో సహా పరబ్రహ్మంలో లీనమవుతారు. మరణానంతరము ఆత్మయొక్క ఈ ప్రయాణమే క్రమముక్తి.

కాని నిర్గుణ బ్రహ్మ సాక్షాత్కారము పొందినవారు ఎక్కడికి పోరు. అతడు ఈ శరీరంలో ఉండగానే ఈ సకల సృష్టి, ప్రపంచ తంత్రము కూడా అసత్తయిపోతుంది.

జీవన్ముక్తుడు దేహాన్ని వదలగానే ఘటాకాశము అనంతాకాశంలో కలిసినట్లుగా పరమాత్మలో లీనమైపోతాడు.

**ఇతర నాడులు :** ఆత్మ ఇతర నాడుల ద్వారా నిష్క్రమించినపుడు అది తన కోరికలు కర్మలననుసరించి ఈ ప్రపంచంలో వివిధ శరీరాలతో పునర్జన్మ పొందుతుంది.

# XVII.

అంతర్యామియైన పురుషుడు బొటనవ్రేలంత వాడు సర్వధా ప్రాణుల హృదయాలలో నివసిస్తుంటాడు. శరీరం నుండి అతనిని గడ్డి నుండి లోపలి పోచను వేరుచేసినట్లు వేరుచేయాలి. అతడే పరిశుద్ధుడు అమరుడూ అని తెలుసుకోవాలి. అవును పరిశుద్ధుడు అమరుడు.

మానవుడు తనలో ఉన్న శుద్ధ చైతన్యాన్ని దేహభావము నుండి నిరంతర విచారణ ద్వారా, ధ్యానం ద్వారా వేర్పరుచుకోవాలి.

**ఇదియే మోక్షసాధనము**

**ఇదియే మోక్షము.**

# మోక్షము

మోక్షమనగా విడుదల బంధము నుండి విడుదల. దుఃఖ చూషిష్టమగు సంసారబంధము నుండి విడుదల – విముక్తి పొందటుయే మోక్షము. పుట్టుక చావుల నుండి తప్పించుకొనుటయే మోక్షము. అవిచ్ఛిన్న ఆత్మానందానుభూతిని బడయుటయే మోక్షము. స్వస్వరూపమందు నిలకడ కలిగియుండుటయే మోక్షము. దేహభారమును, మనోభారమును, జీవభారమును వదలించుకొనుటయే మోక్షము. భారరహితమగు ఆత్మ యందు నిలకడ కలిగియుండుటయే మోక్షము.

అనాది కాలము నుండి జీవుడు సంసారబంధమున తగుల్కొని అజ్ఞాన శృంఖలములచే బద్ధుడై తాను దేహమని భ్రమించుచు నానా యాతనలను అనుభవించుచు జనన మరణరూప సంసార చక్రమందు పరిభ్రమించుచున్నాడు. వాస్తవముగ అతడు

బద్ధుడు కాడు – ముక్తుడు.

మాంసమయుడు కాడు – మంత్రమయుడు

మృణ్మయరూపుడు కాడు – చిన్మయమూర్తి

**పోతపోసిన సచ్చిదానంద విగ్రహమే మానవుడు.** ఈ సత్యమును ఉపనిషత్తులు పనిగట్టికొని పదేపదే ఘోషించుచున్నవి.

నేను కృషించినవాడను, అతి దుఃఖవంతుడను, బద్ధుడను, రెండు చేతులు రెండు కాళ్ళు గలవాడను. ఇంతమాత్రమే నా స్వరూపము అని తలంచువాడు తుదనుసారము వర్తించువాడు బంధింపబడుచున్నాడు.

నేను దుఃఖవంతుడను గాను, నాకు వాస్తవముగా దేహము లేదు. ఆత్మకు బంధమేల? ఎచట అని తలంచువాడు ఆ ప్రకారముగా వర్తించు వాడు ముక్తిని బడుయుచున్నాడు.

రజ్జు సర్పభ్రాంతి నుండి బయటపడినప్పుడే స్వస్వరూపమైన ఆత్మను మానవుడు తెలిసికొనును. జనులీ సత్యమును గుర్తెరిగి సత్యాన్వేషణను శీఘ్రముగా ప్రారంభించవలెను. దుఃఖ నివారణకు వేరొక మార్గము లేదు.

**అవకాశములన్నియు హస్తగతవ్తైయున్న ఇట్టి అమూల్య అవకాశమును పోగొట్టుకొనుట దౌర్భాగ్యమే యగును.**

ఉదయము నిద్రలేచినది మొదలు పరుండువరకును ఆ పరమాత్మను గూర్చియే లెస్సగా చింతన చేయవలయును అని శాస్త్రము లాదేశించుచున్నవి.

ఎందుకనగా ఓ జనులారా! మృత్యువు దూరముగా యున్నదని భ్రమింపకుడు. అది చేరువలోనే యున్నది. ఎప్పుడు వచ్చునో ఎవరికి తెలియును. కావున త్వరపడుడు. విజ్ఞానమును సముపార్జింపుడు. మరచిన మీ దివ్య స్వరూపమును తిరిగి జ్ఞప్తికి తెచ్చుకొనుడు. మహాత్ముల నాశ్రయించుడు. సాధనమొనర్చి కడతేరుడు. బంధనము నుండి విడుదల పొందడు. మీ స్వస్వరూపమగు ఆత్మను బడయుటయే మోక్షమని ఎరుగడు.

ఈ దేహము, పుత్ర మిత్ర సతీ సుతులు, సేవకులు, గుఱ్ఱములు, మున్నగు వన్నియు నాయొక్క సుఖములకు సాధనములని తలచి, ఈ మాంసమీమాంసయందే తన అమూల్యమైన జీవనమును భ్రష్టమొనర్చు కొనుచున్నాడు.

వర్షాకాలము 4 నెలలు బయటకుపోయి కూలి నాలి చేసుకొనుటకు అవకాశముండదు. కాబట్టి ఆ 4 నెలలు చక్కగా ఇంటియొద్దనే యుండి భుజించుటకు గాను మిగతా 8 నెలలు బాగుగా కష్టపడవలెను.

రాత్రి హాయిగా భుజించి విశ్రాంతి నొందుటకై పగలంతయు శ్రమింపవలయును. వార్ధక్యమున నిశ్చింతగా బ్రతుకవలెనన్న బాల్య యౌవనములందు చెమటోడ్చి పని చేయవలయును.

ఆ ప్రకారముగానే పరలోక శాంతి సుఖములకు ఇక్కడే తీవ్ర కృషి సల్పవలెను.

దానిని తెలుసుకొనుటకు మొట్టమొదట అనుభవజ్ఞులగు మహాత్ములను వినయవిధేయతలో సమీపించి వారికి సాష్టాంగ ప్రణామ మాచరించి, వారికి సేవ శుశ్రూశాదుల గావించి, భక్తితో వారిని ప్రశ్నించి పారమార్ధ విషయములను తెలిసికొనవలయును.

అట్లు సవినయముగా ప్రశ్నించిన మీదట మహాత్ములు వారికి తత్వమును బోధించెదరు. దానిచే అతని అజ్ఞానము నశించిపోగలదు. అతనిలోని దివ్యశక్తి వికసింపగలదు.

ఎవరి తల పెద్దలయొద్ద, భగవంతుని యొద్ద వంగునో వారియొద్ద ప్రపంచమంతయు తలవంచును.

సాష్టాంగ ప్రణామమాచరించుచు, పరి ప్రశ్నించుచు, సేవించుచు బ్రహ్మజ్ఞులైన జ్ఞానుల వద్ద జ్ఞానమును తెలిసికొనుము.

కాబట్టి సాధకుడు సంసార తరుణోపాయమగు ఆత్మజ్ఞానమును బడయవలయును. శ్రద్ధ అన్నిటికంటె ముఖ్యము.

శ్రద్ధగలవాడు, ఇంద్రియ నిగ్రహము గలవాడు, జ్ఞానాసక్తి గలవాడు జ్ఞానమును పొందుచున్నాడు. జ్ఞానమును పొందిన తరువాత త్వరగతిని శాంతిని పొందుచున్నాడు.

ఎవడు జ్ఞానశూన్యుడై, శుద్ధారహితుడై, సంశయాత్ముడై యుండునో వాడు నశించును. సంశయము గలవానికి ఇహము లేదు, పరము లేదు, సుఖము లేదు.

అర్జునా! యజ్ఞశేషమైన అమృతమును భుజించెడివారు నిత్యమైన బ్రహ్మమును బడయుదురు. యజ్ఞకర్మ లాచరించనివానికి ఈ లోకమే లేదు. ఇక పరలోకమెక్కడిది.

దీనినిబట్టి నిష్కామ కర్మాదులచే ముందుగ చిత్తశుద్ధిని పొందని వారికి జ్ఞానముదయించదని మరియొక విధముగా శ్రీకృష్ణ భగవానుడు అర్జునునకు తెలిపెను.

**జ్ఞాన భూమిలో నిష్కామకర్మలను విత్తనములను జల్లి భక్తియను నాగలిచే దున్నినచో పండు పంటయే "మోక్షము".**

మోక్షము ఆకాశమున లేదు, పాతాళమున లేదు, భూతళమున లేదు. ఆత్మజ్ఞానముతో కూడిన నిర్మలచిత్తమే మోక్షమని శ్రీ వశిష్టులవారు బోధించిరి.

దైవము గాని, గురువుగాని, మహాత్ములు గాని తనకు మోక్షము సంపాదించిపెట్టెదనని ఎవరైనను అనుకొన్నచో అది భ్రమయే యగును.

మోక్షముగాని, జ్ఞానానుభవముగాని "పరిమిట్ల"వలె ఒకరు ఇచ్చునది మరియొకరు పుచ్చుకొనునది కాని కానేకాదు. **అది పెద్దల సహాయముచే, ఈశ్వరానుగ్రహముచే తనయందు తాను తయారుచేసుకొను వస్తువు.**

అట్టి మోక్షమును గూర్చి తీవ్రకాంక్ష కలిగియుండుటయే ముముక్షత్వమనియు, అట్టివానిని ముముక్షువులనియు అందురు.

చతుర్విద సాధనలలో ముముక్షుత్వము అగ్రతాంబూలమును బడిసియున్నది.

ఒక చేపను తీసికొని వెళ్ళి సింహాసనముపై కూర్చొండబెట్టి వింజామరలు వీచుచు రాజమర్యాదలు చేయుచున్నప్పటికి ఆ చేపకు కించిత్తైనను తృప్తికలుగదు. తన స్వస్థానమైన నీటియందు వదలినపుడే అది పరిపూర్ణ తృప్తిని పొందగలదు.

అట్లే జీవుడు తన నిజస్వరూపుడైన పరమాత్మను వదలి ఈ దృష్య ప్రపంచమునబడి నానా యాతనలను పొందుచున్నాడు. అట్టివాడు తిరిగి తన స్వస్థానమగు ఆత్మయందు చేరినపుడే పూర్ణశాంతిని బొందగలడు.

# మోక్షము యొక్క స్వరూపము

మోక్షస్థితి యందు–

**జీవుడు – శివుడుగా మారును.**

**నరుడు – నారాయణుడై భాసిల్లును**

**భక్తుడు – భగవంతుడై విలసిల్లును.**

**మానవుడు – మాధవుడుగా పరిణమించును.**

అదియొక అపూర్వ ఆనందస్థితి. దుఃఖము లవలేషమైనను అచ్చోట కాన్పించదు. ప్రపంచములోని అన్ని లాభములకంటెను గోవు లాభకరమైన స్థితియని యద్దానిని శ్రీశ్రీ తాతార్యుడు పేర్కొనెను.

అచ్చోటి జనులకు కలుగు ఆనందము వర్ణనాతీతము. కావున అట్టి స్థితియందు జీవత్వము అదృశ్యమై బ్రహ్మత్వమే శేశించును.

ఆనందసాగరమే యగు అట్టి దివ్యానుభూతి కొరకై మహనీయు లెందరో తమ భౌతిక సంపదలను విడిచి, రాజ్యాదులను కూడా తిరస్కరించి అఖండ వైరాగ్యమును చేబట్టి, అమోఘమగు కృషి సలిపి తుదకు విజయము గాంచిరి.

**అట్టి బ్రహ్మానందముతో భౌతిక సుఖములు పోల్చతగినవి కావు.** ఒకటి నిత్యమైనది మరియొకటి అనిత్యమైనది.

బింబసుఖము చెంత ప్రతిబింబ సుఖమేపాటిది?

జాగృతుని చెంత స్వప్న వస్తువునకేమైనా విలువయుండునా?

కనుకనే శ్రీ శంకరులవారు ఈ విధముగా వర్ణించియున్నారు.

ఆ బ్రహ్మానంద సముద్రము యొక్క ఒకానొక లవలేషముతో సమానమైన కొద్ది సుఖమును పొంది ఇంద్రాదులు ఎంతయో సంతుష్టి పొందుచున్నారు. మునీశ్వరులు తమ చిత్తములను, అట్టి పరబ్రహ్మమునందే అయింపచేసి పరమానందమును బడయుచున్నారు.

# దివ్య సౌందర్యము

ప్రపంచములో సుందరమైన వస్తువు జనులకు ఆనందమును గొలుపును. చక్కని పుష్పము ఆహ్లాదమును కలుగజేయును. అట్లే సుందర భవనము, సుందర చిత్రము, సుందరదేహము, జనుల హృదయసీమల యందు ఆనందము యొక్క సంచారమునకు హేతు భూతములగుచున్నవి.

ప్రపంచములో అతి రమణీయమైన పదార్థములెన్నియో గలవు. కొంతకాలము స్థిరముగా యుండు పదార్థములున్ను ఎన్నియో గలవు. అవన్నియు ఎట్టకేలకు నశించిపోవుట వలన చింతనే అవి కలుగజేయు చున్నవి. అందువలన వానిని శాశ్వతానందము కొరకు ఆశ్రయించ వలదని శ్రీ వశిష్ట మహర్షి శ్రీరామచంద్రులకు బోధించును.

ఈమధ్య ఒక జ్యోతిష్కుని వద్ద ఒకడు తన చేయి చూపించుకొనెను. అతడాతని చేతిని పరిశీలించి నాయనా! నీ ధనరేఖ అద్భుతముగా యున్నది. ఈ వాక్యము వినగానే ఆ వ్యక్తి పరమానందము చెందెను. తర్వాత జ్యోతిష్కుడు నీ విద్యారేఖ ఇంకా పొడుగుగా యున్నది. కావున నీవు గొప్పగొప్ప డిగ్రీలను పొందెదవు.

నీ కీర్తిరేఖ ఆ రెండిటికంటేను పొడుగుగా యున్నది. కావున నీవు లోకములో గొప్ప కీర్తిని పొందెదవు. అని చెప్పుచుండగా యువకుని మనస్సు ఆనందముతో చిందులు త్రొక్కసాగెను.

తదుపరి ఆ దైవజ్ఞుడు నాయనా! అన్ని రేఖలు నీకు పొడుగుగానే యున్నవి. కాని ఆయువు రేఖ మాత్రము పొట్టిగా యున్నది. దానితో అతని మనస్సు అత్యంత వ్యాకులమునొందెను. అతడు క్షుబ్ధుడై అచ్చోటు విడిచెను.

కావున ఎంత ధనముండిననేమి, ఎంత కీర్తియుండిన నేమి, ఎన్ని డిగ్రీలు సంపాదించిననేమి? ఎత సంతానముండిననేమి? ఆయువురేఖే తక్కువగా యున్నప్పుడు ఎన్ని రేఖలుండి మాత్రము ఏమి ప్రయోజనము.

అట్లే ప్రపంచ వస్తువులు ఎంత సుందరముగా యుండినను అవి అశాశ్వతములు. కాబట్టి వాని సౌందర్యమునకు ఏమాత్రము విలువ లేదు. పూర్వము బుద్ధుడీ విధముగానే విచారించి, తన రాజ్యము యొక్కయు, పరిజనము యొక్కయు, సతీ సతుల యొక్కయు, లావణ్యమును గొప్పగ తలంపక వాటి కన్నింటికంటెను సుందరమైనట్టి, బ్రహ్మానందకరమైనట్టి నిర్వాణ పదవిని గూర్చి అన్వేషించి ధన్యుడాయెను.

మోక్షరూపకమగు ఆ పరమాత్మ కేవలం స్వయంజ్యోతి యనియు ఎరుగవలయును. జాగృత, స్వప్న, సుషుప్తులు మూడింటియందును ఆ ఆత్మ సర్వసాక్షియై దృష్యమునంతయును ప్రకాశింపజేయుచు నిర్వికారమై చెన్నొందుచున్నది.

# ఆత్మజ్యోతి

## ఆత్మయొక్కటియే ప్రపంచములో ఆరని దీపము.

ప్రమిదలోని దీపము నూనె లేనిచో ఆరిపోవును. కరెంటు లేనిచో ఎలక్ట్రిక్ లైటు ఆరిపోవును. బ్యాటరీ లేనిచో టార్చిలైటు ఆరిపోవును. లోకమునంతకు వెలుగునిచ్చు సూర్యునకు నూనెతో పనిలేకున్నను రాత్రింబగల్లు వెలుగుచునే యున్నను, ఒకానొక సమయమున అతడును విలయమునొందును. అదియే ప్రళయకాలము.

ఆ ప్రళయమున సూర్యుడేమి, చంద్రుడేమి, నక్షత్రములేమి, సమస్త బ్రహ్మాండమున్ను విలీనమైపోవును. అట్టిచో ఇక ఆరని దీపమేది? సృష్టికాలమున, స్థితికాలమున, ప్రళయ కాలమున గూడా అస్థిత్వమును నిలదొక్కుకొని ఆరకుండా ప్రకాశించు దీపమేదైనాయున్నదా అనిన కలదని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. మహర్షులు వక్కాణించుచున్నారు.

**అదియే ఆత్మ అదియే పరబ్రహ్మము.**

సర్వజీవుల హృదయాంతరాళములందు వెలుగొందు దివ్యజ్యోతి యును అదియె. బాహ్యాంత్యరములందును సమానముగా వ్యాపించియున్న జ్యోతి అదియె.

**ప్రళయకాలమందు చెక్కు చెదరకయే నిలిచి యుండును.**

సూర్యుడుగాని చంద్రుడు గాని వెయ్యేల ఏ పదార్థముగాని పరమాత్మను ప్రకాశింపజేయలేవు. ఒకరి ప్రకాశముతో ఆత్మకు నిమిత్తము లేదు. అది స్వయంప్రకాశము. స్వయంజ్యోతి, సర్వసాక్షి.

**అది అన్నిటిని ప్రకాశింపజేయును గాని మరియొక దానిచే అది ప్రకాశింపబడదు.**

కావున అది సత్యమై, శివమై సుందరమై సర్వలోకారాధ్యమై వెలుగొందుచున్నది. కావున అది సత్యమై, శివమై, సుందరమై, సర్వలోకారాధ్యమై వెలుగుచున్నది.

ఈ ప్రపంచమున కల సమస్త పదార్థమున గల సమస్త పదార్థములను మనుజుడు దేనివలన తెలిసికోగలుగుచున్నాడు? సూర్య ప్రకాశము వలన, చంద్ర ప్రకాశము వలన, దీప ప్రకాశము వలన.

ఆ ప్రకాశములు లేనిచో అంధకార బంధురమైన చోట నున్న వస్తువుల నతడు తెలిసికొనజాలడు కదా!

అయితే ఆ సూర్యచంద్రాదులను దేనివలన తెలిసికొనుచున్నాడు? నేత్రములచే. నేత్రములేనివానికి సూర్యచంద్రాదులు ఉన్నను లేనివారితో సమానమగును. ఆ నేత్రమును దేని వలన తెలిసికొనుచున్నాడు? గ్రుడ్డివాడు లోకమున దేని సహాయముచే వ్యవహరింపబడుచున్నాడు.

అనగా నేత్రమును తెలిసికొనునది, నేత్రమును ప్రకాశింప జేయునది, నేత్రము లేకున్నను వ్యవహరించునది– బుద్ధియని తేలినది. అయితే ఆ బుద్ధిని తెలుసుకొనునది ఏది? దానిని గూడా ప్రకాశింప జేయునది ఏది? **అదియే ఆత్మ!**

ఏ కాలమందును ఆరక, స్వయంప్రకాశమై బాసిల్లు ఆత్మ జీవుని హృదయకుహరమునందే యున్నది. దానినెరుగగల్గువారు ధన్యులు, కృతకృత్యులు అని శ్రీకృష్ణపరమాత్మ తెల్పిరి.

రాత్రి నిదురపోవునపుడు స్వప్నమున మనుజుడు పదార్థముల నన్నిటిని చూడగలుగుచున్నాడు. జాగృతావస్థలోని సూర్యుడచట లేడు మరియే ప్రకాశముచే అవి యన్నియు వెలుగొందుచున్నవి.

గాఢ నిద్రనుండి మేల్కొని నేను హాయిగా నిద్రపోయినాను అని ఆ హాయిని ఎట్లు వర్ణింపగలుగుచున్నాడు.

త్రికాలములను సాక్షిగా తన ఆత్మ ఎరుగగల్గుచున్నది కాబట్టియే ఇట్టి అనుభూతి జీవునకు సాధ్యమగుచున్నది.

ఈ ప్రకారముగా ఆత్మయను జ్యోతి త్రికాల, త్రివావస్థల యందును ఏకరూపముగా, అవిచ్ఛిన్నముగా వెలుగుచున్నది.

**అదియే తానని నిరంతరము భావము చేయవలయును.**

అట్టి ఆనంద ధామమును బడయుటకై జీవుడు శక్తివంచన లేకుండ ప్రయత్నము చేయవలయును.

మానవుడు జన్మించినది క్షణికముల కొరకు కాదు. శాశ్వత సుఖము కొరకు.

దానవుడగుటకు కాదు – దేవుడగుటకు.

పశుత్వము నొందుటకు కాదు – పశుపతిగా మారుటకొరకు.

అట్టిచో ఎండమావులవంటి ఈ క్షణిక సుఖములందే జీవిత మంతయు ఏల ఆహుతి చేయనేల?

సున్నపు ముద్దలను జూచి వెన్నముద్దలని పరిగిడుట విజ్ఞుడు చేయవలసిన పని కాదు.

తినుట, త్రాగుట, గంతులు వేయుట ఇదియేనా మానవత్వము?

వాస్తవముగా సుఖము బాహ్యమున లేదు. పదార్థములందు సుఖమున్నదనుకొనుట వట్టి భ్రమయేయగును.

నిజముగా సుఖము పదార్థమునందేయున్నచో అది అందరికి అన్ని వేళలయందును సుఖకరముగా తోచవలయును. కాని వాస్తవమున అట్లు లేదు. ఒకే వస్తువు కొందరికి ప్రీతికరముగను, మరికొందరికి అప్రీతికరముగను, ఒక్కనికే ఒక కాలమున సుఖవంతముగను, మరియొక కాలమున జుగుప్సాకరముగ తోచుచున్నది.

వస్తువునందే ఒకవేళ ఆనందమున్నచో ఇట్లెన్నటికి సంభవించ కూడదు.

భోజనమునకు పూర్వము ఎంతయో రుచికరముగ తోచిన గారెలు పాయసము, కడుపునిండ భుజించిన తరువాత, ఇక తినబుద్ధి గాక, ఎవ్వరైనను బలవంతముగా వడ్డించినచో విషప్రాయముగా భావించి పారవేయుదురు. కడుపునిండితే గారెలు చేదు అను ఆర్యోక్తి సత్యమే.

చేదుతనము గారెలలో లేదు. కమ్మదనము అంతకంటెను లేదు. వారివారి ఆకలి, మనస్తత్వము ఆయా రుచులను కల్పించుచున్నవి. కాబట్టి సుఖము బాహ్యపదార్థమునందు లేదు. జీవుని **అవిద్యయే** ఆ ప్రకారముగా వస్తువు సుఖభ్రాంతిని కలుగజేయుచున్నది.

ఒక కుక్క ఎచటనో ఒక ఎముకను సంపాదించి దానిని కొరుకు చుండును. ఎముక గట్టిగా యున్నందును విరుగలేదు. కాని బలవంతముగా కొరుకుట వలన ఒక పన్ను ఊడిపోగా దాని నోటిగుండా నెత్తురు ఎముకపైకి కారుచుండెను.

అమాయకమగు ఆ కుక్క ఎముకలోనుండే రక్తము కారుచున్నదని తలంచి తన భాగ్యము పండినదని ఊహించి నిర్విరామముగా ఆ నెత్తురును నాకసాగెను. అట్టిదే అజ్ఞాన పరిస్థితి.

జీవుడు పదార్థములననుభవించుచు ఆత్మ సుఖమే ఆ పదార్థమందు ప్రతిబింబించుచున్నదని యెరుగక ఆహా భోగవస్తువులు ఎంత ఆనందకరములు అని తలంచి మురిసిపోవుదురు. ఇదియే అవిద్యా ప్రభావము.

బ్రహ్మమును తెలిసికొనువాడు బ్రహ్మమేయగును. అను వాక్యమును సదా జ్ఞప్తికి యుంచుకొని బ్రహ్మజ్ఞాన సముపార్జన ద్వారా సాక్షాత్ బ్రహ్మరూపులే అయి జనులు తమ జీవితములను సార్ధకమొనర్చు కొనవలయును.

## మోక్షప్రాప్తికై ఎప్పుడు ప్రయత్నించవలయును.

ఋషులు బోధించిన మహోన్నతమగు అట్టి మోక్షస్థితిని బడయుటకై జనులు శీఘ్రముగా ప్రయత్నించవలయును. ఏ మాత్రము విలంబనము చేయరాదు.

సామాన్యముగ వార్దక్యములో ఎక్కువమంది మనస్సు స్వతః దైవకార్యములయందు ప్రీతి కొనుచుండును.

ఏలయనగా ప్రపంచములోని భోగ్యవస్తువుల జాలమంతయును అనుభవించి, అనుభవించి, విసుగు జనింప, వాని నుండి మరలి దైవము వైపునకు వారు తిరుగుదురు.

దృష్యపదార్థములు యందు, దారాపుత్రులయందు, ధన ధాన్య ఆరామ క్షేత్రములయందు ఏమో సుఖము గలదని, శాంతి గలదని భ్రమించి పరిగిడినవారికి ఎదురుదెబ్బలు తగులగా వాని నుండి చల్లగా మరలుదురు.

ఈ ప్రకారమున వార్దక్యమున దైవాన్వేషణ చేయుట అసలు చేయని దాని కంటెను నయమే అయినను అది మోక్షప్రాప్తికి సరిపోదు.

1) ఏలనన ఇంద్రియములన్నియు శక్తిని కోల్పోయి, దుర్భలములై, భగవధ్యానమునకు, దైవచింతనకు, తీవ్రతర సాధనలకు ఉపయోగపడదు.

విస్తరి నిండ పంచభక్ష్య పరమాన్నములు వడ్డించి రాక్షసులకు పెట్టి వారు తినగా మిగిలిన పదార్థములను, ఎంగిలి విస్తరాకులను దేవతలకు సమర్పించినట్లుగా యుండును - వార్ధక్యమున ధ్యానము ప్రారంభించుట.

ఈ శరీరమును విస్తరిలోగల జవసత్వమును, బలవీర్యాదులను బాల్య యౌవనకాలములో కామ క్రోదాధి రాక్షసులకు సమర్పించి, వారు పీల్చి పిప్పిచేసిన మీదట, అనిర్వీర్య దేహమును భగవంతునకర్పించినచో ఎట్లుండును. అయితే దీని యర్థము వార్దక్యంలో దైవచింతన చేయరాదని కాదు. కాని అది సరిపోదు.

2) మరియు జీవితము క్షణబంగురము కనుక వార్దక్యము రాక పూర్వమే కొందరికి అది అంతము కావచ్చును. అపుడు జీవుడు సాధించునది ఏముండును. అమూల్యమగు మానవ జీవితము నిష్ఫలమైనట్లే కదా.

దేవా! నీ పాదపద్మములందు నా మనస్సును రాజహంస ఇప్పుడే ప్రవేశించుగాక! ఏలయనిన ప్రాణప్రయాణ సమయమున కఫ వాత పిత్తములచే కంఠము విరుద్ధము గాగా నిన్ను గూర్చిన స్మరణ అపుడు సంభవించదు. కావున శరీరము ఆరోగ్యముగా యున్నప్పుడే, ఇంద్రియములు వికలములు కాకమునుపే, యౌవనము క్షీణింపక మునుపే, పరిస్థితులు అనుకూలముగా ఉన్నప్పుడే, జీవిత లక్ష్యమగు పరమాత్మ సాక్షాత్కారమునకై యత్నమాచరింపవలయును.

ఓ అర్జునా! మనస్సును ఇతర విషయములపై జొరనీయక, అభ్యాసయోగమునవలంభించి, పరమాత్మను మరల మరల చింతన చేయుచుండినచో మనుజుడు దివ్యమగు ఆ పరమ పురుషుని తప్పక పొందగలడు.

జీవితమంతయు ఏ విద్య నభ్యసించుదురో అదియే సంస్కార రూపమున ఏర్పడి అంత్యకాలమున అక్కరకువచ్చును. జీవితములో ఒక్క పర్యాయమైనను దైవచింతన చేయక యుండినవానికి తుది ఘడియలందు దైవస్మరణ కలగదు. కావుననే గీతాచార్యుడు– ఎల్లవేళల యందు తనని విస్మరించక, ధ్యానము చేయవలెనని ఆదేశించెను.

గాంధీ మహాత్మునకు దేహ వియోగ సమయమున “హేరామ్” అను రామనామ స్మరణ ఎట్లు కలిగెను? జీవితకాలమున సమయము దొరికినప్పుడల్లా “రఘుపతి రాఘవ రాజారామ్, పతీత పావన సీతారామ్” అను నామమును స్మరించుచుండుట వలన.

ఎన్నియో జన్మలు ఇప్పటికి గడిచినవి. అజాగ్రత్తగా యున్నచో ఇంకను ఎన్నియో జన్మలు రానున్నవి. ఈ అనంత జీవితము ఒక పెద్ద గొలుసువలెయున్నది. ఒక్కొక్క జన్మ ఒక్కొక్క రింగు వంటిది. వెనుకటి జన్మలు దాటిపోయినవి కావున మనము వానిని ఏమియును చేయలేము. రానున్న జన్మములు మాత్రము ఇపుడు మనచేతిలో యున్నవి. వానిని అంతమొనర్చుటకు తగిన శక్తిసామర్ధ్యములు మానవునకు గలవు.

శమదమాది సంపత్తును అలవర్చుకొని, వైరాగ్యము, భక్తియను దైవగుణములను పెంపొందించుకొని క్రమముగా జ్ఞానాగ్నిని రగుల్కొల్పినచో కర్మ కట్టెలన్నియు దగ్ధము కాగా, ఇక భవిష్య జన్మలకు విరామము కలిగి జన్మరాహిత్యము సిద్ధించగలదు.

# సుదీర్ఘ ప్రయాణము

ఒక పెద్ద ప్రయాణము ప్రతీవానికిన్ని వేచియున్నది. జీవిత కాలములో రైళ్ళమీద, బస్సుల మీద, విమానముల మీద చేయు ప్రయాణము చిన్నది. జీవితాంతమున చేయు ప్రయాణము అతిపెద్దది. ఆ ప్రయాణమును ఎవరు తప్పించుకొనలేరు. **అది జరిగి తీరును.** అజ్ఞాన వశమున జీవుడు దానిని మరచి లోకమున ప్రవర్తించుచున్నాడు.

అన్నియును జ్ఞాపకముంచుకొనును కాని తనకొక దీర్ఘ ప్రయాణమున్నదను మాట మాత్రము మరచి ప్రమాదమున పడుచున్నాడు.

మందుల కంపెనీవారు ప్రతీ మందు సీసాపై Date of Expiry వ్రాయుదురు. కాని మనకు అది కనబడుటలేదు. **దీనినే బ్రహ్మవ్రాత విధి లిఖితము** అందురు.

ఓ రామచంద్రా! మరల పుట్టకుండ చేసుకును మహానుభావులెవరో, అట్టి ఉత్తమ శీలసంపన్నులు మాత్రమే ఈ ప్రపంచమున పుట్టినవారిక్రింద జమ. తక్కినవారు వ్యర్థజీవితులే యగుదురు అని వశిష్టులవారు శ్రీరామచంద్రునకుపదేశించెను.

విద్యార్థి సంవత్సర కాలము బాగుగా చదివినచో పరిక్షా సమయమున చక్కగా వ్రాయగలడు. సంవత్సరము పొడగున సోమరియై తిరుగువాడు సరిగ్గా పరిక్షా సమయమున చదివినను ఏమి వ్రాయగలడు? ఎట్లు కృతార్థుడు కాగలడు?

తన చిత్తమును తానే బాగుగా చేసుకొనవలయును. అది ఒక్క రోజులో అగు పనికాదు. అనేక జన్మార్జిత ఘనీభూత పాపవాసనము గల చిత్తము సద్వాసనామయము కావలసియున్నచో, భగవన్ముఖమై చక్కగా ధ్యానము చేయు సమర్థతను పొందవలసియున్నచో జీవిత కాలమంతయు తీవ్రతర ప్రయత్నము ఆవశ్యకమైయున్నది.

# క్షణిక జీవితము

ఆ కాలుని నోటిలో చప్పరింపవేయబడుటకు గాను ప్రాణికోట్లు వేగముగా ప్రవేశించుచున్నవి. కావున ఇటువంటి ప్రమాదకర పరిస్థితి యందున్నప్పటికి మనుజుడు అజ్ఞాన వశమున తన జీవితము యొక్క క్షణికత్వమును గుర్తింపక పాంచభౌతిక శరీరమందు శాశ్వతత్వమును ఆరోపించుకొనుచు, ఎదుట కన్పించుచున్న తళుకు బెళుకులతో గూడియున్న విషయములను చూచి హర్షాన్వితుడగుచున్నాడు, సుందర భోజనము, సుందర శరీరము, సుందర భవనము ఇదియే గొప్పగా తలచినవాడై వానికొరకు రాత్రింబవళ్ళు విరామము లేక యత్నించును. తుట్టతుదకు అన్నిటిని వదిలివైచి కన్ను మూయుచున్నాడు.

| కప్ప | పురుగు | పాము |
|---|---|---|
| \| | \| | \| |
| జీవుడు | విషయము | కాలుడు |

మాయా వశమున జగచ్చక్రమంతయు నిరంతరము పరిభ్రమించు చున్నదనియు, ఆ చక్రమును తిప్పువాడు తానేననియు, తన్నాశ్రయించిన వానికి ఆ కాలచక్రము కాని, కర్మచక్రముగాని ఏ మాత్రము బాధింపదని శ్రీకృష్ణపరమాత్మ సెలవిచ్చియున్నారు.

కాబట్టి ఆ కాలచక్రమును గూర్చి ఎవరు భీతిల్లక, ఆ కాలచక్రము యొక్క అధినాయకుడై, కాలకాలుడై, యున్న పరమాత్మను ఆశ్రయించు వారు జనన మరణ రూప ప్రవాహమును తప్పించుకొని బంధవిముక్తులై శాశ్వత కైవల్యమును పొందుదురు.

సంవత్సర ప్రారంభమున జనులు గత సంవత్సర అభ్యున్నతిని ఒక పర్యాయము సింహావలోకనము చేసి నూతన సంవత్సరమునకు కార్యక్రమమును నిర్ణయించుకొనవలెను. ఈ సంవత్సరలములో

1) ప్రతీ దినము నియమము తప్పక ఒక అధ్యాయము గీతాపారయణము చేయుదురు.

2) కనీసము ఒక గంటయైనను ఉదయమ్ము, రాత్రి పరమాత్ముని ధ్యానము చేసెదను.

3) సాత్త్విక మితాహారమునే భుజించెదను.

4) మనస్సునందు ఏలాంటి దోషములు, వికారములు ఉదయించ కొనకుండ ప్రయత్నించుకొందును. ఒకవేళ ఉదయించినచో వాటిని జ్ఞాన విచారణా బలముచే తొలగించుకొనిదను.

అని ఈ ప్రకారము సాధకుడు కొన్ని నియమములను ఏర్పాటు చేసికొని దృఢచిత్తుడై పట్టుదలతో వానిని సాధించుటకై యత్నశీలుడు కావలెనే కాని వానిచే పరాభూతుడు ఎన్నటికిని కాకూడదు.

పూర్వమొక చిన్న పక్షి సముద్రము నందు కొట్టుకుపోయిన తన గ్రుడ్లను తిరిగి తెచ్చుటకై సముద్ర జలమునంతను పుక్కిలించి అవతల పారవేయ నిశ్చయించినదై ఒక్కొక్క బిందువును నోటితో పీల్చి ఊసివేయ ఆరంభించినదట.

**ఆహా ఏమి వజ్ర సంకల్పము**

కార్యసిద్ధికై ఆ పక్షి అవలంబించిన ధీరత్వము, పట్టుదల మానవునకు ఎంతైనా అవసరమైయున్నది.

**Not Failure But Low Aim is Crime**

**తస్మాత్ జాగ్రత్త జాగ్రత్త**

ఒకానొక తుమ్మెద కమల సరోవరమందలి కమలమున ప్రవేశించి మకరందమును ఆస్వాదించుచుండెను. సాయంత్రము ఆరుగంటలైనది.

సూర్యభగవానుడు అస్తమించెను. కమలము ముడుచుకొనెను. తుమ్మెద కమలములో చిక్కుకొనిపోయెను. బయటకు వెడలుటకు దారిలేదు. ఆ పుష్పములోనే తిరుగుచు తనలో తానిట్లనుకొనెను.

ఇంకొద్దిసేపటిలో రాత్రి గడచిపోవును. సూర్యుడు ఉదయించును. కమలము వికసించును. అప్పుడు నేను బయటకు ఎగిరిపోయెదను. ఈ ప్రకారముగా తుమ్మెద తనలో తాను భావి కాలమును గూర్చి చింతించుచుండ, ఒక ఏనుగు కొలనులో ప్రవేశించి తొండముతో ఆ కమలమును పెకిలించి కాలిక్రింద వేసి త్రొక్కి నాశనము చేసెను. తుమ్మెద చనిపోయెను.

ఏనుగు వచ్చునని తుమ్మెద కలలోనైనా ఊహించలేదు. అది గాలిలో మేడలు కట్టసాగినది. కాని ఒకతృటిలో పరిస్థితి తారుమారైనది. తుదకు తుమ్మెద ప్రాణము కూడా దక్కించుకొనలేకపోయెను.

**లోకస్థితి ఇట్లే యుండును.**

వినాశము, మృత్యువు అను దుష్టరాక్షసుడు జ్ఞాపకము రానంత వరకే ఈ ప్రపంచమందలి వస్తువులు, భోగములన్నియు రుచించును. అవి జ్ఞాపకమునకు వచ్చెనా ఇవి అన్నియు చప్పబడిపోవును అని వశిష్టులు శ్రీరామచంద్రుల వారికి బోధించిరి.

## XVIII.

ఇలా యముడి వద్ద యోగనిధి అంతటిని సమగ్రంగా ఉపదేశము పొంది నచకేతుడు అన్ని మాలిన్యాల నుండి క్షాళితుడై మృత్యురహితుడై బ్రహ్మప్రాప్తి పొందాడు.

అంతరాత్మను ఇలా తెలుసుకున్న వారెవరైనా కూడా అలాగే బ్రహ్మప్రాప్తిని నొందుతారు.

ఆ శివకేశవుల కటాక్షము వలన సకల జీవకోట్లు తరించుదురు గాక

ఆ వీరభద్రుని అనుగ్రహము వలన సకల ప్రాణులు తరించుదురు గాక.

ఓం సహనాభవతు । సహనౌ భునక్తు । సహవీర్యం కరవావహై । తేజస్వినావధీ తమస్తు । మావిద్విశావహై

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః

**ఓం పరబ్రహ్మేనమః**

**ఓం నమో శ్రీనివాసాయనమః**

**ఓం నమశ్శివాయ నమః**

**ఓం నమో వీరభద్రాయనమః**

**ఓం సకల దేవతాయనమః**

# ఆత్మ సాక్షాత్కారము





వేలమంది మనుష్యులలో ఏ ఒక్కడో సిద్ధికొరకు యత్నించును. అలా యత్నించెడి వేలమందిలో ఎవడో ఒకడు నన్ను యదార్థముగా తెలిసికొనుచున్నాడు అని స్వయముగా శ్రీ గీతాచార్యుడే అర్జునునకు గీతయందు బోధించిరి.

స్వయముగా ఈశ్వరుడే వచ్చి నీకేమి కావలయును, నేను కావలయునా లేక పేరు ప్రతిష్ఠలు, ఆయురారోగ్య భోగభాగ్యములు కలిగి, కళత్ర-పుత్ర, పౌత్రులతోడి నూరేండ్ల సుఖజీవనము కావలెనా అని అడిగిన- కోటికెవడో ఒకడు తప్ప అందరును రెండవ వరమునే మరియే విచారణ లేకుండ పరమాసక్తితో ప్రార్థింతురు.

ఆహా! ఇదియే కదా మానవుని అజ్ఞానము. ఇది అంతయు అవిద్యా ప్రభావము. నారాయణుడు సృష్టిలో ఇంద్రియములను లోపభూయిష్టముగా సృష్టించెను. ఆ మాయా ప్రభావము చేత మానవుడు చర్మ చక్షువులకు కనిపించు, ఇంద్రియభోగములలోనే సర్వము కలదని, అదియే తన గమ్యమని తలంచి, చివరకు భ్రష్టుడై జనన మరణ చక్రములలో బడి పతనమగు చున్నాడు. ఇదియే ఇంద్రియ జీవనము, దాని పర్యవసానము.

**డా॥ గన్ను వెంకటేశ్వర్లు**
M.D.